ప్రతులు వలయువారు (అడ్వాన్సుతో) :

**చల్లా కృష్ణమూర్తిశాస్త్రి**

విజ్ఞానభవనము

మట్లపాలెము, దొడ్డిపట్లపోష్టు

వయా: పాలకొల్లు, ప॥గో॥ జిల్లా.

వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానము



ఓమ్

శ్రీ మ ద్భ గ వ ద్గీ తా వి జ్ఞా న మం డ లి

# వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానము

కర్త :

అనుశ్రుత వైజ్ఞానిక

**చల్లా కృష్ణమూర్తి శాస్త్రి**

ఓమ్.

అనుశ్రుత్యుపనామక

విజ్ఞాన లక్ష్మీనారాయణాంతర్గత

శ్రీమత్ భగవద్గీతా విజ్ఞానమండలి

# వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానము

[ అంతరంగ పరీక్షాత్మక కర్మయోగవిజ్ఞానాంతర్గతము. ]




కర్త:

అనుశ్రుతవైజ్ఞానిక

చల్లా కృష్ణమూర్తి శాస్త్రి.





ప్రథమముద్రణము. 1000 ప్రతులు.

ఖరక్షీరాబ్ధిద్వాదశి.

1951

ఓం నమః పురుషోత్తమాయ
గురు వేమధుసూదనాయ.

# నివేదనము



అభిరూప శేఖరులారా !

శ్రీమద్గురుమధుసూదన దివ్యకృపాలబ్ధవిజ్ఞాన వివృతి రూపముగ, నారచించిన 'అనుశ్రుతి'యను విజ్ఞాన లక్ష్మీశ్రీ నారాయణీయ - ప్రస్థానమీమాంసా విభాగమందలి శ్రీమద్భగవద్గీతా విజ్ఞానమందు - అంతరంగ పరీక్షకుజెందిన కర్మ యోగ విజ్ఞానాంతర్గతమీ 'వర్ణాశ్రమ సంస్కారవిజ్ఞానము.' ఇంతటితో గీతావిజ్ఞానము నాల్గు సంపుటములు వెలువడినట్ల యినది. ఇక జ్ఞానభక్తి బుద్ధియోగ విజ్ఞానములు వెలువడ వలసియున్నను, పాఠకులకు వీనియందలి యాదరణముంజూచి ప్రకటింతుమనియున్నది. మఱియు మొదటి సంపుటమగు గీతావిజ్ఞానమందు ఆయోగముల సంక్షిప్తరూపములుండ నే యున్నవిగదా! అందువలన నంతగా దొందరయు లేదు. కనుక 'వేదవిజ్ఞాన' ''ఈశావాస్యవిజ్ఞాన'' 'బ్రహ్మవిజ్ఞానాదులగు నితర గ్రంథములను క్రమముగా బ్రచురింప నెంచియున్నాను. పాఠకుల యాదరణమువలన నా పని యచిరకాలముననే సిద్ధింప గలదు. కానిండు, నా గ్రంథములయన్నిటి మాటయెటులు న్నను,... ఈకాలమున...ఒక్కమాటలో - చిరంతన ప్రకృతి విశిష్టప్రచలిత - మానవత్వాధార - మనూదితధర్మముం బరి

వర్తన మొందించి నూత్నకృత్రిమమను ధర్మగ్రహణమున సమానవత్వమును సాధింపగోరు నీకాలమున—

## ప్రస్తుతగ్రంథము.

గత శతాబ్దులందలి యాచరణభావనలను సూచించు నొక చరిత్రగనైన యుపకరింపవచ్చునన్నదే లక్ష్యముగా గాని సంధానింపబడినదనిమాత్రము మనవి. ఇదెంతవరకుఁ గృతార్థుడనైతినో పాఠకలోకము నిర్ణయింపవలయును,

ఇక:— "అజ్ఞానజనితములగు మతములందలి యాచార భేదముల సంఘర్షణవలన నేనాడైనను ఈనాడైనను సాంఘిక విప్లవములు దాపురించినవి దాపురించుచున్నవేగాని సహజ ప్రకృతి విజ్ఞానసిద్ధములగు వర్ణాశ్రమ సంస్కారాదులవలన నేనాడును నేసంఘర్షణయు లేదనియే తోచునపుడీనాడీయంశ ముంగూర్చి యింత ఘర్షణమేల ? అందుకేగదా ! నేడు జాతి మతకుల విచక్షణలేని సంఘనిర్మితి వాంఛింపబడుచున్నది" అను సంశయాళువులకు—

స్వార్థలోలుపమై నీతినియమములను వదలుకొని య కాండతాండము సల్పుచున్న సంఘమునకు ఇక మిగిలినజాతి మతకులమర్యాదలుమాత్రమే కాక దోషారోపణసేయుట కాధారములుగ నుపయోగపడునదేమున్నది ? ఎందేని నీతి నియమరహితమగు స్వార్థము సంఘవిప్లవసంఘర్షణ హేతు

వగునుగాని జాతిసుల విచక్షణ కాదని ప్రకృతింజూచి యించుక యోచించినను పొడకట్టగలదని మనవి.

"బభూవబుద్ధిస్తు హరీశ్వరస్య
యదీదృశీరాఘవధర్మపత్నీ
ఇమాయథాగాత్రసరాజభార్యా
సుజాతమస్యేతిహిసాధుబుద్ధేః"

మఱి:— "తస్మాచ్ఛాస్త్రంప్రమాణంతే" అన్నం తనే శాస్త్రదాస్యమోయనియు. "బ్రాహ్మణోస్యముఖ" మన్నంతనే ఇదియంతయు బ్రాహ్మణిజమోయనియు నాక్రోశించువారితో మాకేమియు వాదములేదన్నను, ఆయీ యాక్రోశములకెల్ల సుసిశ్చితములగు నీమూలకారణములుమూటిని ముఖ్యముగా నిదానించిత్యజింప వలసియున్నదనిమాత్రము సూచించెదము.

(1) ఆర్యజాతి ఎటనుండియో వచ్చినదికాని యీ భారతవర్షము తదీయమూల నివాసస్థానముకాదు.

(2) ఇంచుమించు అయిదువేలవత్సరములకు బూర్వమితిహాసము (History) లేదు.

(3) జగత్తు క్రమవికాసము - జౌన్నత్యమునందుచున్నది.

ఈవిషసిద్ధాంతలతలకు అజ్ఞానమో-మతిభ్రమయో-వుత్సితాభిసంధియో మఱేమియో కారణముగానిందు, ఇవి పుట్టినది మాత్రము పాశ్చాత్యవిద్వాంసుల మేధస్సీమలో; కాల

ప్రభావమనుడు - దైవవశముననుడు - ఎట్లో యివికొందరు భారతీయ విద్వాంసుల నచ్చుబాటునొంది క్రమముగ జన సామాన్యమునందును బ్రసరించి యెల్లయెడల నావరించి తమ ప్రభావము నగపఱచుచున్నవి. ఇందుకు ఫలములుగ——

మొదటిసిద్ధాంతమునలన: ఈభూమిపై మమత్వమోడి నది. నామమాత్రదేశభక్తి ప్రచారము, స్వార్థసిద్ధిసాధన ముగా బరిణమించినదేగాని "ఈదేశము మన పూర్వజుల పవిత్రపితృభూమి"యను సర్వోచ్చభావమున కవకాశము లేకుండజేసినది.

"ఆసింధోఃసింధు పర్యన్తాయస్యభారతభూమికా
పితృభూః పుణ్యభూశ్చైవ- సవై హిందురితిస్మృతః"

రెండవసిద్ధాంతమువలన: — వేదస్మృతీతిహాస పురాణాదులన్నియు మొన్నమొన్న పుట్టిన కవికల్పనామాత్రము లను సంకుచితభావనలు కలుగగా, పూర్వుల విశాలభూత జ్ఞాన గుణగౌరవభావనా తేజఃపటిమ నిష్ప్రభము వ్యర్థమునై పోయినది.

మూడవసిద్ధాంతమువలన:— ప్రాచీనకాలమునందలి జ్ఞానవిజ్ఞానములు సభ్యతాసంస్కృతులు-సదాచారధర్మములు ఆచారవిచారములు-బుద్ధివివేకములు-శౌర్యవీర్యములు - త్యాగతపస్సులు-మొదలగు భావప్రభావములన్నిటిపై నవిశ్వాస

పూర్వాక నిరసనభావమేర్పడినది వేయేల ? నేటి యౌన్నత్యము కాళిదాస భవభూతులనాఁడులేదు ? నాటి సభ్యతాద్యున్నతులు వ్యాసాదులనాడులేవు, ఆనాటి యుచ్చస్థితి వాల్మీకినాఁడు లేదు. ఇట్లే అప్పటి నాగరకత వేదఋషులకాలమునందును లేదని యంగీకరింపవలసియున్నది. ఇంతకు నైదు వేలసంవత్సరములకు బూర్వము సృష్టివికాసమే లేదనికదా పెద్దలనబడువారి తలలకెక్కిన సిద్ధాంతము ? ఇక భారతీయుల కాలమానమును వారెట్లు విశ్వసింతురు ? కానిండు.

ఈ మూఁడు భ్రమలవలన మొత్తముగ భారతీయులకు సిద్ధించినవి ? అన్నిరంగములందును పరముఖాపేక్షిత్వము-పరానుకరణ పరాయణత్వము. స్వాతంత్ర్యము సిద్ధించినది బాహ్యమునకుమాత్రమే. అంతరంగమున పారతంత్ర్యమే పాదుకొన్నది. విచారణచేయుతలంపు మొలకెత్తకున్నదికాని, ఆహారములలో-విహారములలో-ఆచారములలో-వ్యవహారములలో-వేషములలో భాషలలో రాజ్యాంగ నిర్మితిలో పరిపాలనాపద్ధతులలో-మనకు అనుసరణీయమార్గములు లేకపోయినవా ? అవి యప్రియములా ? కాదు-ఉపన్యాసవేదికలందు కావలసి సన్నిస్తోత్రవాగాడంబరములు. మఱి యీ విదేశీయానుకరణ ప్రయాసము వేల ? హృదయాంతస్థలమునందు తద్విశ్వాసములేదు. నేటి నాగరకతనుమించిన నాగరకత పూర్వములేదనియే విశ్వాసము. ఈ యాత్మవిస్మృతివలన నే

అంతరంగములు పరతంత్రతా పారవశ్యములుకాగా ప్రతి యొక చిన్నవిషయమునకును పరముఖాపేక్ష - పరానుకరణము తప్పని సరియైనవి. అందువలన క్రొంగ్రొత్తగావచ్చిన స్వాతంత్ర్యమగుటచే మనకింకను పరిపాలనాదక్షత బాగుగా నలవడవలసియున్నదను కించిజ్ఞతకు దలయొగ్గుచున్నాము. ఇది నిజమా ?

సమదృష్టి-సమవర్తనలకు భేదమెరుంగలేక సమవర్తనమే సమదృష్టియను కువాదగర్తమునంబడి తలకు దిమ్మెవట్టగా, అధికార్యనధికారి వివేకరాహిత్యమున నాయపనిందకు దలయొగ్గవలసివచ్చెగాని- 'అందరకు నన్నియునుగార్యము' లన్నది మున్నెన్నడును లేదు. నేడునుకాదు. ముందునుజెల్లదు. ధర్మముచే, పాలకుడు పాలితుడుకాగా, నట్టి-పాలితపాలకపాలితప్రజ సుఖించునన్నది త్రికాలాబాధ్యమగు సత్యము, దైశికసుభిక్ష దుర్భిక్షస్థితిగతులు పాలకనిర్ణీత ధర్మము ననుగమించునవి కనుకనే "రాజాకాలస్యకారణ"మనుట చరితార్థమగుచున్నది. అన్నియెడలను "ధర్మోరక్షతిరక్షితః" అన్నది యదార్థమే. పాలకునిచేత యథాధికారముగ ధర్మమునకు బంపకముందును. అది సరిగానున్నపుడేసిద్ధి. "స్వేస్వేకర్మణ్యభిరతః సంసిద్ధింలభతేనరః". స్వకర్మ స్వధర్మమునే యనుసరించును. అదియే అధికారమును యోగ్యతను సిద్ధముచేసి పెట్టును. "జాత్యాయుర్భోగము" లందధికారము ప్ర

కృతి దీకాని మనది కాదు. కృత్రిమము పిన్ననకారిదైన పాలకు నిత్తో తనంతనదియే శమించును. తద్వివేకమునకు-కర్తవ్య మునకు శాస్త్రము శరణ్యము. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ". శాస్త్రము బుద్ధిగమ్యమే. 'బుద్ధౌశరణమన్విచ్ఛ' అని కలదుగదా! కాని, ఏబుద్ధి? వ్యవసాయాత్మికాబుద్ధిరేకేహ", అన్నది కాని, 'బహుశాఖాహ్యానంతాశ్చబుద్ధయో వ్యవసాయినాం" అన్నదికాదు. తత్ఫలితములను గుర్తింపనేరక నిత్యమును బ్రతిక్రియాన్వేషణము ననే అనేక శతాబ్దులుగ 'ప్రతీకారంవ్యాధేః సుఖమితి" న్యాయముగొని కాలక్షేపమునేయున భాగతీయులే ఇందుకు జాలినంత యుదాహరణభూతులు. భారతీ యాదర్శానుసారము—

"సక్తేంద్రియణిమనసా నియమ్యారభతేర్జున
కర్మేంద్రియైః కర్మయోగమసక్తస్సవిశిష్యతే"

అను శ్లోకమున కుదాహరణ భూతులువలయుంగాని,

"కర్మేంద్రియాణి సంయమ్యయ ఆస్తేమనసాస్మరన్
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్సఉచ్యతే"

అనుటకు దగిన కోటిలోనివారుగారు, సరియే. విజ్ఞులకింతటితో జాలును. ఆ యీ హేయోపాదేయచర్చ ప్రథమ సంపుటారంభము నందొకవిధమున జేయబడినది. ఇంకను విస్తరముంగోరు జిజ్ఞాసువులు అస్మత్సంగ్రథిత "శ్రీమజ్జగద్గురు భారత"మను గ్రంథము నరయుదురుగాక! ఇక స్థిర ప్రతినివిష్టచిత్తులు దురారాధ్యులన్నది ప్రసిద్ధమేకదా! వారికి

వారిదేగాని యే విచారణయు గొఱుగాదు. బహుశాఖలుగల యీ యనంతబుద్ధులు విచిత్ర చేష్టాచరిత్రులు. ఇందు మొదటి తరగతివారు కొందరు:—నా గ్రంథములందలి శంకాసమాధానముల పట్టులందు 'శంక' యన్నదిమాత్రమే క్రిందుమీదు లేమియు నెఱుంగకయే ఈ గ్రంథము శాంకరభాష్య విరుద్ధమని నిరూపింబోయి తమ శంకరభక్తిని వెల్లడించుకొనుచు శంకరచండాల సంవాదమువలన 'సవర్ణా సవర్ణా శ్రమాచార ధర్మాః' అను సిద్ధాంతమునకుదిగి తమ సమబుద్ధివర్తనలం జాటుకొన్నారట. వారినేమనగలము? స్వయంద్రుధ ప్రజ్ఞులు-ఏకోవశిష్టు కేవలశివులుగదా వారు? వారికీవర్ణాది జంజాట మేల?

రెండవతరగతి వారుకొందరు :—గీతయ దధ్యాయములు అందలియోగములు నెక్కడికక్కడినే యుండగా మరల నీయోగోపనిషద్భాగములేల? అనుకొన్నారట. అట్టివారు నా గ్రంథములను మరల జదువవలయునందుము.

మూడవతరగతివారు కొందరు:— "జ్ఞానా దేవతుకైవల్యం" అన్నది పాటించుకొని 'కర్మణైవహిసంసిద్ధి'యనుచో 'సంసిద్ధి'యన జ్ఞానసిద్ధిగాభావించి, 'దూరేణహ్యవరంకర్మ బుద్ధియోగాత్' అనుటలో బుద్ధియోగమన జ్ఞానయోగమే (కర్మసన్న్యాసమే) యనుకొని జ్ఞానకర్మపార్థక్యము స్థిరమని యెంచి యదె (పాక్షికసత్యమునే) పూర్ణసత్యముగా సంగీకరించి "శేషంకోపోనపూరయేత్" అనుటను చరితార్థము

గాంచిరట! 'కృపణాః ఫలహేతవః' అనుటను వివేకించి అనరకర్మకు బుద్ధియోగమునకును భేదమేమో పర్యాలోచింప వలయునందుము.

నాల్గవతరగతివారు కొందరు:- ద్వైతాద్వైత విశిష్టాద్వైతభాష్యంలందు దేనినో యొకదాంగొని దానిపైనున్న టీకలతోగూడ నాంధ్రీకరించి న్యాయవేదాంతాది దర్శనములందు దేనికో స్థాపకులో రత్నాకరులో యని పేరొందినవారు ఇది యెందుకుంగొరుగానిదని నిర్హేతుక జాయానకట్వాక్షు వీక్షణములతో దూషణలకు దిగినారట! కాని, యది యాచకో యాచకశ్శత్రు న్యాయముంబట్టి సహేతుకమేయని అనుకొని యట్టిభావము నాకు లేకుండుటచే మతపక్షపాతుల కెవ్వరికేనిదికొరగానిదేయని సమాధానపడి యానందించి, వారు, ఋషులందెవ్వరుగాని, శ్రీకృష్ణ కృష్ణద్వైపాయనులుగాని ఏమతశాఖకును జెందినవారుగారని యెఱుంగవలయునందుము. ఇంతకు మొత్తముగా నొకటే విన్నపము.

> "సంత్యేవాన్యయుగేష్వ పిక్షితితలే సూయాధరాః దుర్భగాః
> కావార్తాత్రికలౌయుగేపున, రతఃకింత్తైః పురోభాగిభిః
> యేవాకేపిమనస్వినఃపరసుణై రేవోత్సుకాసంతిచేత్;
> తేషామేషమ మోద్యమోబహుతరంస్యా దేవహర్షావహః॥"
>
> "అస్త్యైరనుల్లిఖిత పూర్వమిదంబ్రువాణో
> నూనంస్మృతేర్విషయతాం విదుషామువేయాం
> హాస్యైకకారణగ వేషణయా.నవార్థ
> తత్త్వావమర్శ పరితోషసమీహయా,వా॥"

యదృచ్ఛగా నాయొక్క యుపన్యాసమాలించి నా ప్రథమ గ్రంథముద్రణమును విని నాటినుండియు నవ్యాజ ప్రేమభక్తి వత్సలతలు పెనగొన నన్ను నా గ్రంథములను నాదరించు పూనికమెయిం బెక్కురు చందాదారులను జేర్పించుటేకాక, నా వ్రాసిన వ్రాయబోవు గ్రంథముల నవరతము బ్రకటించుట కనువగుమార్గము లరయుటయే తమ పరమావధిగా స్వీకరించి శ్రమించుచున్న - భీమడోలు వాస్తవ్యులు బ్రహ్మశ్రీలు లంక గోపాలకృష్ణమూర్తి - కొచ్చెర్లకోట వెంకటజోగిరాజుగారలకు కృతజ్ఞతావందనము లర్పించుకొనుచు వారికి వారివంశమువారికి నిత్యాధికజ్ఞానైశ్వర్యము లొసంగి సుఖముగ మనుపగోరి శ్రీ మద్భగవద్గీతాధిదేవతం బ్రార్థించుచున్నాను.

ఇట్లే కేవలమొక యుపన్యాస శ్రవణమాత్రమున అవ్యాజ ప్రేమపూర్వకముగా నాపుస్తకములన్నిటిని దమ తంపెనీతరఫున బ్రచారము చేయింప వాగ్దానమొనరించిన వెంకటరామా అండుకో ప్రొప్రయిటర్లు భాషోద్ధారకులునగు బ్రహ్మశ్రీ యీదర వెంకటరావుగారికి వినయవినమిత శిరస్కుడనై వందనపూర్వకముగ చిరాయురారోగ్యము లీయ గోరి బ్రహ్మణ్య దేవుడగు గోవిందుం బ్రార్థించుచున్నాను.

గ్రంథమునందు ముద్రణదోషములించుక దొరలినవి సూక్ష్మదృష్టిగల పాఠకులు దిద్దికొనగలరని శుద్ధాశుద్ధ పత్రిక

చేర్చలేదు. ఈశ్రమను పాఠకులను క్షమింపగోరెదను. ముద్రాణాలయపు బనికి గొత్తవారయ్యునీమాత్రము జాగ్రత్తతో నీగ్రంథమును ముద్రించియిచ్చిన భారతీ ముద్రణాలయాధికారి వైశ్యశిఖామణి శ్రీయుత లక్కింశెట్టి చలపతి రావుగారిని కృతజ్ఞతాపూర్వకముగ నితోభివృద్ధి నందగోరి యాశీర్వదించుచు నా యీ నివేదన మింతటితో ముగించుకొనుచున్నాను.

ఇట్లు,

అనుశ్రుత వైజ్ఞానికుడు.

గ్రంథకర్త.

మట్లపాలెము,

ఖర క్షీరాబ్ధిద్వాదశి.

10—111—951



# విషయసూచిక

# ఓమ్.

నమః పురుషోత్తమాయ.

# వర్ణాశ్రమసంస్కారవిజ్ఞానము

## —*వర్ణవ్యవస్థ*—

వైదికకర్మయోగమే వాస్తవిక కర్మయోగము, ఏలయన:-- అభ్యుదయనిశ్శ్రేయసములకును కర్మత్వము దీనికే జెందినది.- అనగా:-- శాస్త్రము మనకు— ఏకర్మలను వర్ణ ధర్మానుసారము కర్తవ్యములుగ విధించెనో యవి యుభయ లోక హితసాధకములును గ్రాహ్యములు నగును. అందుకు వెలియైనవి త్యాజ్యములు. అట్లుభయలోక సుఖములను గాంక్షించు భారతీయునకు వివిధములగు శాస్త్రసిద్ధకర్మలు కర్తవ్యములు. ఈవిషయికమగు విమర్శ మున్ను కొంత సేయబడినది. ముందు కొంత సేయబడును. ప్రస్తుతము చాలవరకు మన మౌలిక శ్రద్ధకు విఘాతకముగ క్షోభ హేతువుగ నున్న వర్ణాశ్రమవ్యవస్థం గూర్చి తెలిసికొందము.

## జిజ్ఞాస.

"అమృతంసహితాన్నై మనుష్యాః" అన్నట్లు మానుష్యులందలి యమృతభావ నియంత్రణార్థము వర్ణాశ్రమవ్యవస్థా మార్గము నిర్మింపబడినదని పూర్వప్రకరణోపసంహారమున

(బ్రహ్మకర్మ) నిరూపింపబడినది. మానవసమాజము శాస్త్ర సిద్ధ కర్మమార్గప్రవృత్తమగుట కీవర్ణాశ్రమవ్యవస్థ యొకటే ముఖ్యసాధనము. తదనుగమనమేకర్మరక్ష. తాత్త్విక దృష్టిం జూచినచో వర్ణాశ్రమధర్మము పేరే వైదిక కర్మయోగము. రెంటికి నన్యోన్యాశ్రయ సంబంధము.

వేదస్వాధ్యాయపరిత్యాగమున, ఆచారము విడచుట వలన, సోమరితనమువలన, అన్నదోషమున, పాశ్చాత్య సంసర్గమున, భౌతికజడవాద సమాదరణమున ప్రభుత్వదోష మున, ఇంక నెన్నో యదృష్టకారణములవలన ఆర్యసంతతి నేడు ధర్మ–కర్తవ్యకర్మ–వర్ణాశ్రమమార్గముల మౌలికస్వరూ పము, ఉదాత్తాదర్శము, మరచిపోయినది– మరచుచున్నదని యంగీకరింపవచ్చును. నిజముగ ప్రకృతిసిద్ధమగు భారతీ యార్షధర్మము, సంతమతమూల కానార్షమత వాదము నాశ్ర యించి నేడు తన యీధర్మక్షేత్రమున విప్లవము దెచ్చి పెట్టినది. మరియు – పాశ్చాత్య వైజ్ఞానికశిక్ష భారతీయ నవయువకులహృదయమున భారతీయ సంస్కృతికి విరుద్ధ మగు నవీనవిచారస్రోతస్సు బుట్టించినందున, హేతువాదము పైరుకొన్నది. దానితో " శాస్త్రము చెప్పినదికనుక నమ్మ వలయును, చేయవలయును" అను ధర్మకర్మల కేవలయుక్తో గాన మరణ్యరోదన మైపోయినది. ఎందుకుపోదు? దానికితో డుగ సంతమతవాదము లార్షధర్మమును, తత్ప్రతిపాదక వేద శాస్త్రమును తుంగలో ద్రొక్కియుంచినవి కదా!

ధర్మరక్షణభారము మతవాదుల బుజముల నున్నది. సనాతనధర్మములగు ధర్మోపదేశక విద్వాంసు లుదాసీనులైరి. ఈరెండును ధర్మశైథిల్యమునకు ముఖ్యకారణములు. నవీన యువకులు హేతువుంగోరుదురు; తత్సమాధాన మెట్లున్నను, మనయాచార్యులు, పండితులు, "యువకులు పాశ్చాత్యశిక్షణ వలన నాస్తికులైపోయి" రనియు "వారికిశాస్త్రశ్రద్ధపోయె" ననియు, నిశ్చయించుకొని వారిని రోతగా జూచెదరు; నిజమే, నవయువకులు ధర్మమన్నంతనే యసహ్యముగా జూతు రనుకొందము. కారణము? వారుభారతీయ సాహిత్యముకంటె పాశ్చాత్యసాహిత్యమే తాత్త్వికమైనదని పోల్చి చూచి తెలిసికొనిరా? మరి మన సాహిత్యపు గొప్పతనమేమో వారికి నచ్చజెప్పకయే వారిని జూచి రోతపడుట మనకు దగునా? ఇది ప్రమాణభక్తియుగము కాదు. హేతుయుగము. నవయువకులు నేర్చినది నిజమో, అబద్ధమో, మంచియో, చెడ్డయో, హేతుపురస్సరముగ తర్కాధారమున నేర్చిరి. మనవా రన్ననో కేవలవచనములపై నాధారపడుదురు. అట్టిచో వారెట్లువీరికికట్టుపడుదురు? కనుక మనవారుకూడ మౌలిక తత్త్వాన్వేషణకు బూనుకొనవలయును, అటుగాక నట్టిమాటలతో కాలముగడుపుచో పరిణామము? చూచుచున్నాము. ఇంకను చూతుము. తాత్త్వికదృష్టితో ధర్మస్వరూపమును వారియెదుట బెట్టితిమా, వారెంతయో గౌరవింతురు వారును చదివినవారే మంచిచెడ్డల నెరుంగగల తెలివితేటలు గలవారే. దృష్టిని మార్చుటే కేవల మావశ్యకము.

ఇదియెట్లు- ఎప్పుడుకాగలదు? విజ్ఞానదృష్టితో వైదిక సాహిత్యాధ్యయనాధ్యాపనము, ఆ తత్త్వముల ప్రచారము, గావింపవలయును. లోకసంగ్రహదృష్టితో సాగుచున్న యే సంతమతముతోడను విరోధింపబనిలేదు. ఏసాంప్రదాయమునకు జెందక వేదసిద్ధమగు నార్షధర్మము విస్తరింపవలయును. ప్రస్తుత దేశస్థితిగతులు ప్రజల మనోవృత్తులు ననుకూలములుగ నుండకపోవచ్చును. కాలాంతరమున నన్నియు జక్కబడును. ఓపికబట్టి పనిసేయవలయును.

ఇక నట్టి యప్రియసత్యరూప వర్ణవ్యవస్థను వివరించుటకుం బ్రయత్నింతుము. ఈ సనాతనవ్యవస్థ నేడనేక తర్కకుతర్కముల కాశ్రయభూమిగ నున్నది. ఒక క్షణికవిజ్ఞానవాదిదృష్టిలో నిది గుణకర్మలు మూలముగ గలదియు, నొక నిత్యవిజ్ఞానవాది దృష్టిలో బ్రకృతివిశిష్టమును, జన్మమూలకము నై యున్నది. ఇక నొక రాష్ట్రవాదిదృష్టిలో నిద్యది దేశోన్నతివిఘాతకముగ, నొక విద్వాంసున కిది యుభయలోక కల్యాణకారిగ దోచును. ఒకపరిణామవాది దీనిని 'సాది' యని దీని సనాతనరూపమును మార్పగోరును. ఒకవివేకి యిది 'యనాది' కనుక నెల్లప్పుడు నిట్లే యుండవలయు నని యెంచును. ఒక బుద్ధివాది తన బుద్ధివైభవమున నిది బ్రాహ్మణుల స్వార్థలీల యని తలచును. ఒకబుద్ధియోగి "చాతుర్వర్ణ్యం మయాసృష్టం" అన్న భగద్వచనముంబట్టి "యిది యీశ్వరీయవ్యవస్థ" యనును. ఇట్టి యెన్నో వాదములు

నిన్న జిజ్ఞాసువుమనస్సు క్షోభనొందుట సహజము. ఈక్షోభ నివృత్తికి ప్రకరణ మారంభింపబడినది. దోషదృష్టితో నైన దీని నొకమారు చూచినచో మనభ్రాంతుల ననుమానింపనైన వీలగునందుము.

మహర్షుల దృష్టిలో వర్ణాశ్రమవ్యవస్థ కర్మవిభాగమునకు మూలము. దానికి కర్తృవిభాగము మూలము. అనగా; కర్తనుబట్టి కర్మయు, వర్ణమునుబట్టి కర్మయు, విభక్తమయ్యె నని తాత్పర్యము. త్రిగుణాత్మకవిశ్వ మందలి త్రిగుణ భావాపన్న మనుష్యుల ప్రకృతి యెన్నడు సమానముగ నుండ దని మున్నే (యోగసంతి ప్రకరణమున) తెలిసికొంటిమి. అందువలన నందరు సమానకర్మాధికారులు కాజాల రని తేలును. కర్తృభిన్నత కర్మభిన్నతకు మూల. మనుకొంటిమి గదా! ఆ భిన్నత మొత్తమ్ముపై ప్రకృతిసిద్ధమే యైయున్నది. దానిని సువ్యవస్థితముగావించుటకే వర్ణాశ్రమ వ్యవస్థ బ్రహ్మప్రజాపతివలన నావిర్భవించెను.

మనము, మానవసమాజ కర్మమీమాంస సేయు సాగుచో ననేకవిరుద్ధభావము లెదుర్కొనును. చూడుడు:— ప్రకృతిభేదము, శక్తిభేదసాపేక్షములగు శిశు, బాల, తరుణ, యువ, ప్రౌఢ, వృద్ధభేదభిన్న వైయుక్తికకర్మలు, మనుష్య, స్త్రీ- పితృ- భ్రాతృ- మాతృ-భగిని-పతి- పత్న్యాదికర్మలు; వివాహాది, కర్మలు, సామాజిక, స్వామి- భృత్య- రాజాది కర్మలు, ఇవియన్నియు నొక దానితో నొకటి సంబంధము

లేనివి, కాని, పరస్పరవిరుద్ధములగు నీ యన్నికర్మల సమన్వ యమునను, మానవసమాజమునకు జెందిన వైయక్తిక, కౌటుంబిక, సమాజికాదుల కాధార మగు నొక మహాకర్మ సంపన్న మగుచున్న దని నిర్వివాదముగ నంగీకరింతుము. ఉద్దేశ్యముమహాకర్మ. దాని గర్భమందీపరస్పరవిరుద్ధములగు నవాంతరకర్మ లిమిడియున్నవి. కనుకనే వీనికన్నిటికి నొకే వ్యక్తి యధికారికాజాల డని యంగీకరింపకయు దప్పదు; ఈ యవాంతరకర్మల యాధారమున మనకు మానవసమాజమును విభజించి యాయా కర్మవిశేషములందు నియంత్రితము గావించుట తప్పనిసరి యగును;

ఇట్లు కర్మవిభాగమున గర్మలనువిభజించి యొకేసమ యమున, మానవసమాజము, తనముఖ్యోద్దేశ్యరూప మహా కర్మ సంసిద్ధియందు సఫలతనొందగలుగుచున్నది. సమాజ సాపేక్షయు, సమాజానుబంధినియు నగు వర్ణవ్యవస్థయిదే. "ఒకసమయమందనేకవ్యక్తులు తమతమ యాధికారికకర్మలం గావింపుచు, మహాకర్మ, లేక విశ్వకర్మయొక్క స్వరూప సంపాదనమున నేవ్యవస్థచే సమర్థులగుదురో! అది యే చాతు ర్వర్ణ్యవ్యవస్థ" యని నిష్కర్ష.

విశ్వకర్మ విశ్వప్రతిష్ఠ. కర్మప్రతిష్ఠ మానవసమాజ ప్రతిష్ఠ. అవాంతరకర్మలను తమతమ స్వాభావిక జన్మజాత యోగ్యతానుసారము తమతమ భాగములుగ గొని, మనుష్య లోకేకాలమందు సులభముగనే యా ప్రతిష్ఠాలక్షణ మహా

కర్మభారము వహింప సమర్థు లయ్యెదరు. అటుగాక:— "అందరు నన్నికర్మల కధికారులు, అన్నికర్మలు చేయ వచ్చును" అనుప్రాకృతిక విశృంఖలవృత్తి నాశ్రయించుచో నేయవాంతరకర్మయు సిద్ధింపదు. ఏలయన:— గుణ త్రయ సమన్వయమున నాయవాంతరకర్మలకు బ్రథమ మధ్య మోత్తమా ద్యనేక శ్రేణీవిభాగములున్నవి. అధికార మర్యాదం బాటింపకున్నచో యోగ్యతలేకున్నను నందరు నుత్తమశ్రేణికర్మలయందే ప్రవర్తింపగోరుదురు. అందు వలన "అయినవారికాకు కానివారికి కంచము" చరితార్థత నొంది యవాంతరకర్మలు వికృతినొందగా మన యుద్దేశ్యమగు నా మహాకర్మ చెడును గనుక నా దుష్ఫలిత మనుభవింపకుండ నధికారియోగ్యతననుసరించి కర్మనియంత్రణ మాచరించుట శిష్టజనకర్తవ్య మగును. విశ్వశాంతి కింతకంటె నేమైన యుపాయము లేదని ముందుముందు గ్రహింపగలము.

సామాజికకర్తవ్యములే గాక మనుజునకు గొన్ని వైయక్తిక కర్మలుగూడ మిగిలియుండును. వీని సంపాదనము వైయక్తిక పురుషార్థ మందురు. ఈపురుషార్థనే ఆయువునకు మహాకర్మ. విశ్వకర్మ (మహాకర్మ) గర్భమందువలె నీ మహా కర్మయందును, పరస్పరవిరుద్ధములగు నవాంతరకర్మల సమా వేశముండును. ఎందుకన:— క్రత్వర్థసమన్వయమున బురు షార్థకర్మస్వరూప నిర్మాణ మగునుకదా! ఒకేవ్యక్తి యొకే సమయమున నాలన్యోన్యవిరుద్ధకర్మాచరణ సమర్థుడు

గాజాలము. భోజన, శయన, ఆసన, భ్రమణ, పఠన, పారన, దైవచింతనాది విభిన్నకర్మల్కైమనకు గాలవిభాగ ముండ వలయునుగదా! ఈకాలవిభాగ సాపేక్షవ్యవస్థయే, "ఆశ్రమ వ్యవస్థ, యందురు." వర్ణవ్యవస్థానంతరము దానిం జూతము

ప్రకృతము చెప్పదలచిన దేమన:—వ్యక్తిభేదము వర్ణ వ్యవస్థకును, వ్యక్తిజీవనసమయభేద మాశ్రమవ్యవస్థకును మూలాధారములు. వర్ణవ్యవస్థ సమాజమునకును; ఆశ్రమవ్యవస్థవ్యక్తికిని కల్యాణకారకములు, ప్రతిష్ఠలు నగును. ఆశ్రమ వ్యవస్థయందు వ్యవస్థితవ్యక్తియే, వర్ణవ్యవస్థ కనుగామి కానే ర్చును. ఎట్లన:— వ్యక్తిప్రతిష్ఠయే సమాజప్రతిష్ఠకు మూలము కనుక నదిలేని నాడంతయు జెడుగే యగును గదా! ఈవిధముగ నాశ్రమధర్మానుకూలముగ దనవైయక్తిక జీవ నము సఫలముగావించుకొను పురుషపుంగవుడు వర్ణధర్మాను సార మధికారసిద్ధసమాజకర్మప్రవృత్తుడై వైయక్తిక పురు షార్థసాఫల్యము నొందనుగలడు. సమాజవ్యవస్థనుగూడ సుపరిష్కృతాభ్యుదయనిశ్శ్రేయసజననిం గావించుకొనను గలడు.

ఇంతవరకు ననుకొన్నదానింబట్టి కొంతవరకు మన కీనిశ్చయ మేర్పడవచ్చును:— "భారతీయశాస్త్రలు సమా జము-వ్యక్తి- అనునీరెంటిబాగునుగోరి యీవ్యవస్థల నేర్పర చిరి. ఇవిరెండును బుద్ధికల్పనాఫలములే." కాని; ఈకల్ప నకు మూలమేమి? యని తథ్యాంశము నన్వేషణసేయ

బూనుచో మన మీనిశ్చయమును మార్చుకొని "ఈవ్యవస్థల మూలస్రోతస్సు ఆధిదైవిక ప్రాకృతిక క్షేత్రమునుండియే వెలువడినది. ఇయ్యది అనాదినిధనయు నిత్యప్రకృతినియమ ధారయు నైయున్నది. తదాధారముననే ప్రకృతిరహస్య వేత్తలగు మహర్షులీవ్యవస్థ నావిష్కారము గావించిరి. అది యాదిమనువు స్వాయంభూ బ్రహ్మభగవానుని కృపచే ప్రస్ఫుటిత మయ్యెను" అని అంగీకరింపవలసివచ్చును.

# బ్రహ్మ - వర్ణవ్యవస్థ.

గీతాకాలమీమాంసయందు దేవయుగ వివరణము గావింపబడినది. అందు దేవయుగమున కాదిప్రవర్తకుడు, వైదికార్షధర్మ మూలప్రతిష్ఠాపకుడు, వేద-లోక-ప్రజాధర్మ భేదభిన్న సృష్టిచతుష్టయీ వ్యవస్థాపకుడు, స్వాయంభూ బ్రహ్మ భగవానుడే యీ భారతవర్షమునకు జగద్గురుత్వ ప్రదానము గావించియున్నట్లు గ్రహించి యుందుము. ప్రకృతిసిద్ధ నిత్య, వర్ణవ్యవస్థానుసార మీ మానవవర్ణవ్యవస్థయూ బ్రహ్మప్రజా పతివలననే యావిర్భవించెను. వేదమునకువలె దీనికి నతడే మొదటి (సంప్రదాయ) ప్రవర్తకుడు. దూరదర్శి, సర్వద్రష్ట ఆదిదేవుడు నగు నతడు మానవసమాజకళ్యాణము ప్రకృతి సిద్ధ నియమాధారమున ప్రవర్తించుటవలననే యగునని యెరుంగును. అటుగాక తన సహజానృతభావ కాల్పనికవ్యవస్థల యాధారమున ముందుకు సాగ ప్రయాసపడు సమాజ మెన్న

డును చిరస్థాయి కాజాలదు. తద్దోషనివారణార్థము స్థిరప్రా కృతిక ధర్మానుగమన నే తగినపని. కేవల మిది యుద్దేశించి యే బ్రహ్మ, ప్రాకృతి కాపౌరుషేయ సత్యావాఙ్మయ వేద తత్త్వాధారమున బ్రతిష్ఠితమైన వర్ణధర్మానుసారముగ నే వేద గ్రంథ, సంప్రదాయ ప్రచారము గావించి ఈవర్ణధర్మాధార మునే తన దివ్యప్రజలకొరకు వర్ణవ్యవస్థ నేర్పాటుగావిం చెను. భారతీయవర్ణవ్యవస్థ దానికి బ్రతికృతియే. కనుక నేదిసిని గూడ నిత్యము, జన్మసిద్ధము గనే యంగీకరించిరి.

వర్ణవ్యవస్థా ప్రవర్తకుడగు నీ స్వాయంభూ బ్రహ్మయే అటనట నాదిమను నామమునను బ్రసిద్ధుడయ్యెను. దైనయుగ కాలీనములగు- దేవతా-అసుర-పితృ-గంధర్వ-యక్ష-రాక్షస పిశాచ-మనుష్య-పంచజన పంచచర్షణి-పంచక్షితి-పంచకృష్టి మొదలుగాగల సమాజము లన్నియు నీ యాదిమనుశాసము నకు లోబడినవే. ధర్మసామ్రాట్టు, సర్వశాస్త్ర మను వీవర్ణవ్య వస్థ నేల యనసరమనుకొనెను? అనుదాని కిప్పటికే సమాధాన మీయబడినను దీనినే మరియొకదృష్టితో దృష్టాంతపురస్సర ముగ సమన్వయము గావింతము.

## యజ్ఞము - వర్ణవ్యవస్థ.

మనయాధ్యాత్మికకర్మ (1) మానస (2) వాచిక (3) ప్రాణభేదమున మూడువిధములు. ఇవివరుసగ (1) ఇచ్ఛా

(2) శబ్దము (3) చేష్టయనబడును. ఈమూటికిని శరీరబల మాధారము. శరీరబలమనగా:-పాంచభౌతిక-చిత్య-శరీరపిండ మందుండు నగ్నిబలమే. ఇది యెంత యధికముగ నున్న శరీర మంత స్వస్థముగ సబలముగ నుండును. అప్పుడు ఆమూడు కర్మలు జక్కగా సాగును. కనుకనే యాధ్యాత్మికకర్మ కగ్ని ప్రతిష్ఠ యని యెందురు. ఇంతేకాదు అధిభూతాధిదైవ తాధియజ్ఞము లను మూడుసంస్థలకు గూడ ప్రతిష్ఠ యీ యగ్నితత్త్వమే. అధికరణ భేదమున నొకయగ్నియే పైవిధమున నాల్గుభేదము లగును. శ్రుతియు:-"చతుర్ధావిహితోహ వాఅగ్రేఽగ్నిరాస"అనియెనుగదా!

యజ్ఞకర్తయగు యజమానునకు తన యజ్ఞేతికర్తవ్యతా సంపాదనకొరకు, లేదా, యజ్ఞాతిశయోత్పాదనకొరకు ఈ నాలుగగ్నుల పరస్పర సమ్మిశ్రణ గావింపవలసి యుండును. యజ్ఞవేదికతూర్పున నున్న నలుచదరపు టాహవనీయకుండమం దగ్నిమంథనక్రియచే నుత్పతిల్లిన యజ్ఞియము ప్రజ్వలితమగు నాహవనీయ నామకాగ్నియుండును. ఇందు పురోడాశాది యజ్ఞియద్రవ్యములు మంత్రపూర్వకముగ దత్తద్దేవతోద్దేశముగ నాహుతి గావింపబడును. గనుక నిది యాహవనీయ మన దగును. ఇదే నైధాగ్నియు మొదటిదగు "నాభెయాజ్ఞికాగ్నియు" నైయున్నది. దీనితో యజమానశరీరాగ్నికి అగ్న్యాధానకర్మచే సంధానము గావింపబడును. అట్లు సంహితమగు యజమానశరీరాగ్నియే రెండవదగు "నా

ధ్యాత్మికాగ్ని" యగును. ప్రాదేశమిత సమిధలు*హవిర్ద్రవ్యము, ఆజ్యము, దర్భలు, పవిత్రీకృతాపస్సు, వేది, కుండము, జుహూ, ఉపభృత్తు మొదలగు సర్వపార్థివయజ్ఞీయ ద్రవ్యసమష్టియే మూడవదగు "నాధిభౌతికాగ్ని". సౌర-దివ్య-గాయత్రీమాత్రికమును వేద త్రయీప్రతికృతి రూపమునగు ఋక్సామయజుర్మంత్రసమష్టియే, వాగగ్నిరూపమగు నాల్గవ "మాధిదైవికాగ్ని". అగ్న్యాధానద్వారమున యజమానుని యాధ్యాత్మికాగ్నికి వైధాధియాజ్ఞికాగ్నిసంధానము గావించిన పిదప సందేసమిదాదిలక్షణాధిభౌతికాగ్నికి సంధానము గావించుచు యజమానుని మనఃప్రాణవాఙ్మయ కర్మాత్మ, మంత్రరూపాధిదైవికాగ్నితో యుక్తము గావింపబడును. ఇదే యజ్ఞకర్మ స్వరూప నిష్పత్తి. అనగా చతురగ్నిసమన్వయమే యజ్ఞరూపము. దీనితో యజమానాత్మయొక్క మానస, వాచిక ప్రాణభావములయోగము కుదుర్చబడును. కాగా యజ్ఞకర్మ యజమానాత్మసీమాబద్ధమై "యావద్విత్తం తావదాత్మా" యన్నట్లు యజమానవిత్తము(భోగ్యము)అగును. ఇక:-యజ్ఞకర్మతో యజమానాత్మ యొక్కయీ మూడుభావములకు-యోగములకు-యోగము కుదుర్చుటెట్లు? అన్నది చూతము.

---

* యజమానశరీరలక్షణ ప్రాణాగ్ని ప్రాదేశమిత (10½ అంగుళములు) స్థానవ్యాప్తిగలది. కనుక ప్రాదేశమిత సమిదాహుతిచే యజమానుని ప్రాదేశమితప్రాణాగ్ని ప్రజ్వలితము గావింపబడును.

పూర్వోక్త యజ్ఞకర్మాగ్నిపర్వ చతుష్టయ మందొ
క్కొక్కటియు మనఃప్రాణవాఙ్మయము. "తస్యవా ఏతస్యాగ్నేః
వాగేవోపనిషత్" అన్నట్లు అగ్ని స్వరూపముగ వాఙ్మయము
వాక్కు- ప్రాణము- శ్రోవనీయసమనస్సు- ఇవి యవినాభావ
ములు. కనుక నీ నాలుగగ్నులును మనః ప్రాణవాఙ్మయములు.
మనఃప్రాణ వాఙ్మయమగు నాత్మయొక్క యీ వ్యాప
కత్వాధారముననే 'ఈశావాస్యమిదంసర్వం' అను వ్యవ
హార మేర్పడినది* సరే చెప్పదలచిన దేమన:- మనఃప్రాణ
వాఙ్మయములగు నాలు గగ్నులతో యజమానుని మనః
ప్రాణ వాగ్భానములకు సమన్వయము కుదుర్పవలయును.
ఇది మహాకర్మ. ఇది యజ్ఞస్వరూపము. ఇక సమన్వయ
మెట్లు? దానికి సజాతీయానుబంధసాపేక్ష కావలయును.
అప్పుడు సమన్వయము కుదురును. అయ్యది యజమాను
డొక్కడే సంపాదన జేయజాలినంత సాధారణ కర్మకాదు.

అందుకు దక్షిణాక్రీతులగు ఋత్విక్సహాయము గొన
వలయును. వారు నాల్గుపనులకు నలువురు. బ్రహ్మ-అధ్వర్యుడు
హోత-ఉద్గాత అనువారు వరింపబడుదురు. ఇందు యజ
మానుడు(1) బ్రహ్మద్వారా నాలుగగ్నులయొక్క మనఃకలా

---

* విజ్ఞానదృష్టిచే నింద్రియసత్తయు నింద్రియాభావము చేతన-జడభావ విభాజకములుగ నంగీకరింపబడినది. అన్నిటియందును మనః ప్రాణమయాత్మ యవిశేషరూపమున నున్నది కనుకనే 'శృణోతుగ్రావాణః' "ఓషధే! త్రాయస్వ స్వధితే మైనంహింసీః" ఇత్యాది శ్రౌతవ్యవహారము వెలసియున్నది.

సమన్వయమునందును. (2)అధ్వర్యునిద్వారా, నాల్గుప్రాణకళల సమన్వయమందును. (3) అధ్వర్యుడు, హోత, ఉద్గాతయను మూడురికర్మలచే నాల్గువాక్కళల సమన్వయమందును, సమర్థుడగును. అధ్వర్యుడు యజుర్వేదమునను హోత ఋగ్వేదమునను ఉద్గాత సామవేదమునను బ్రహ్మతనమానస వ్యాపారమునను, ఆధిదైవిక తత్త్వసంగ్రహము గావించి నాతత్త్వములతో యజమానుని యాధ్యాత్మిక తత్త్వములం గ్రంథిబంధనము గావించివైతురు. యజమానుని మహారంభయజ్ఞకర్మసిద్ధి యిదియే. యజ్ఞకర్మ యొకటే. తదుచిత ఫలభోక్త యజమానుడు నొకడే కాని, యీ యొక కర్మ సిద్ధికొరకు కర్తృవిభాగముద్వారా అనేక కర్తల సహాయము గావలసియుండును గదా!

ఈస్థితియే వర్ణవ్యవస్థనుగూర్చియు దెలియవలయును. కర్తృవిభాగమున గర్మవిభాగముం గావింప నెంచిన మనుభగవానుడు సమాజరక్షణార్థము ఈప్రాకృతికవ్యవస్థకు బీజము నాటెను. 'మానవ సమాజమొకవ్యక్తి' యనుకొని దానికి ముఖ-బాహూ-ఉదర-పాద- భేదకల్పనంబట్టి యీ వ్యవస్థ నేర్పాటుగావించెను. ఇట్లు నాల్గువర్ణములను, వానియందుజన్మానుగత బ్రహ్మక్షత్రాది వీర్యచతుష్టయాధానము, తత్తద్వీర్యరక్షణార్థ మాయానియమవిశేష విధానములు, గావించి నియమోల్లంఘునగావించినచో దృఢతమ దండపాశనియంత్రణ మేర్పరచెను. ఈమహాకర్మ యొకవర్ణమునకు-నొకవ్యక్తికి

నుపకారకముకాదు. సంపూర్ణసమాజమునకు, నొక మహదా త్మకు, నుపకారకము. అందరకు సహయోగనే. ఇందు వ్యక్తి గత కామభావమునకు దావులేదు. సమాజలాభముననే యున్ని వర్ణములు సంతుష్టములు. యజ్ఞసంచాలకులగు ఋత్విజులు తమ పారిశ్రామికరూప దక్షిణాద్రవ్యమున గృతకృత్యు లగునట్లు సమాజకర్మసంచాలకములగు నీవర్ణము లందును, సమాజమునకు జెందు లోకవైభవ మాంశికరూపమున విభ క్తముకాగా నదియే వీని కృతకృత్యత యగును.

ఇట్లు ప్రజాపతిచే నుద్భావితమును బ్రకృతిసిద్ధము నగు నీవర్ణవ్యవస్థ-భారతీయసమాజము నెట్టి యభ్యుదయోచ్చ శిఖర ప్రతిష్ఠితము గావించెనో చెప్ప నక్కరలేదు. భార తీయసమాజము, సాహిత్యము, సంస్కృతి, కళాకౌశలము, వాణిజ్యము, సభ్యత,-ఏతద్దేశీయ-పరదేశీయ-శత్రు ప్రాజశాస నానుశాసనముల ప్రబలత రాక్రమణలను సహింపుచు నేటి వరకుగూడ నేదోయొక రూపమున తనరూపమును నిలుపుకొన జాలినంతసురక్షిత పాషాణదుర్గమును నిర్మించెను. పాశ్చాత్య సభ్యతా ఝంఝూవాతమున బడి నేడు మనదేశీయులే యగు కొందరు శిక్షిత-శిష్ట-సంభ్రాంత-మహానుభావులును తదను గాములగు ముగ్ధజనము నీవ్యవస్థ యనుపాదేయము నప్రా కృతికము నని చెప్పసాహసింపుచు ఆర్షసభ్యతానాశమునకు గటిబద్ధు లగుచుంట యార్యజాతికొక 'పరమదౌర్భాగ్య ఘటన' యందుము. ఈయభినివిష్ట బుద్ధివాదులం గాదనువాడె

న్వాడు? దీనికి ప్రత్యుత్తరము వర్ణధర్మాపవాదకుడగు నాజగదీశ్వరుని నిశితదండప్రహారముపై నాధార పడియున్నది.

సామాజిక వర్ణవ్యవస్థకు మూలము ప్రకృతిసిద్ధనిత్య వర్ణవ్యవస్థ కనుక నదియు ప్రకృతిసిద్ధము, జన్మసిద్ధము, నిత్యము నని యీవరకే చెప్ప బడినది. ఈవిషయమున:—నావర్ణవ్యవస్థ యెట్టిది? ప్రాకృతికాధిదైవిక మండలమందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లెవ రెవరు? వారి పను లేవి? యను ప్రశ్న లుదయించుట స్వాభావికము గనుక క్రమముగ వీనింగూర్చి చూతము.

## వర్ణనిరుక్తి.

“ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః, తస్యజ్ఞానముపదేశో ఽవ్యతిరేకశ్చార్థే ఽనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణస్య అనపేక్షత్వాత్” (పూ. మీ. 1/5) అను దార్శనికసిద్ధాంతానుసారము శబ్దార్థముల కౌత్పత్తికసంబంధము కలదు. అర్థము (పదార్థము) వాచ్యము, శబ్దము (నామము) వాచకము. ఈరెంటికిని పార్వతీపరమేశ్వరులకువలె తాదాత్మ్యసంబంధము. రెండు నొకమారే పుట్టునుగాని వేర్వేరుగ బుట్టవు. వీనికి సదా సమకాలికసంబంధమే యుండును. రెంటికిని మూలమొకవాక్తత్త్వమే. అయ్యది ‘ఆంభృణీ’–‘సరస్వతీ’ యను రెండు వివర్తములొంది అర్థ–శబ్ద–సృష్టిమూల ప్రవర్తక మైనది (1) ఆంభృణీవాక్కునుండి యర్థబ్రహ్మలక్షణ

పరబ్రహ్మవికాసమును, (2) సరస్వతీవాక్కునుండి శబ్దబ్రహ్మవికాసము నయ్యెను. కలావిభాగ-సంస్థాక్రమములు రెంటను సమానము. ఒకదాని నెరింగిన రెండవదియు గతార్థమగును.

> ద్వేవిద్యే వేదితవ్యే శబ్దబ్రహ్మ పరంచయత్
> శాబ్దేబ్రహ్మణినిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి.
>
> (బ్రహ్మబిందూపనిషత్)

ప్రస్తుతము శబ్దబ్రహ్మ వివర్తముం జూతము. ఆనంద విజ్ఞానఘన మనోమయ ప్రాణగర్భితవాక్కే సృష్టి (శబ్దార్థసృష్టికి) మూలము. సృష్టిమూలవాక్కునం దానందవిజ్ఞానములు గర్భమైయుండును. మనఃప్రాణవాక్కులకు బ్రధానత యుండును. కనుకనే సృష్టిసాక్షి ప్రజాపతి మనఃప్రాణవాఙ్మయుడనిరి. ఆత్మవివర్తములగు మనఃప్రాణవాక్కులు మూడు నొక ప్రాణతత్త్వముయొక్క వికసితరూపములే. అదియే సృష్టిదశయందు మూడురూపముల బరిణతినొందును. కారణాత్మకమగు నీ ప్రాణతత్త్వమునే ఋషియందురు. మౌలికమగు నీ ఋషిప్రాణమునుండి పితృప్రాణమును, అందలి (పితృప్రాణమందలి) భృగుభాగమునుండి (భార్గవాపోభాగము నుండి) యసురప్రాణమును, భార్గవ వాయుభాగమునుండి గంధర్వప్రాణమును, ఇట్లే యాపితృప్రాణాంగిరోభాగము నుండి దేవప్రాణమును వికాసముగాంచెను. ఇక నీ దేవాసుర ప్రాణ సమన్వయమున చరాచర విశ్వము ప్రాదుర్భవించెను.

శంక:—"అన్నమయం హి సోమ్య! మనః ఆపోమయః ప్రాణః, తేజోమయీవాక్" అను ఛాందోగ్యశ్రుతి మనః ప్రాణవాక్కు లను నీయాత్మకళలు మూటికి క్రమముగ నన్న-ఆపః-తేజస్సు లనునవి వేర్వేర యుపాదానకారణము లన్నదిగదా! ఇచ్చట మనోవాక్కులకు ప్రాణమునుండి యుత్పత్తి నంగీకరించుట యుచితమా?" యన్నచో

సమాధానము:—ఒకవిశేషకారణమున బ్రాణతత్త్వ సర్వారంభకత్వము నిర్వివాద మనవచ్చును. ఎట్లన:—తేజో జలాన్నములు భూతమాత్రలు లేక భూతదేవతలు. వీనికి ప్రాణమునుండియే వికాసము. ఆ యసత్ప్రాణమే (ఋషిప్రాణమే) తేజోమయమై 'వా' క్కనియు, ఆపోమయమై 'ప్రాణ' మనియు అన్నమయమై 'మన' స్సనియు ననబడును. ఈవిషయము చాలచోట్ల విస్తరింపబడినది. ఈదృష్టితోదప్పక మూల ఋషిప్రాణమును తూలరూప మనఃప్రాణవాక్కుల కారంభక మని యంగీకరింప గలము. దీనినే ముఖ్యప్రాణము, ఉద్గీథ ప్రాణము, ఆత్మప్రాణము అత్మ అని యనేకనామములం బిలుతురు. ఇక:—

తేజోమయమైన యిది వాగవస్థనొందులోపల నవాంతరములేడు రూపము లొందును. ఇవి యాధ్యాత్మికములగు (1) తైజసప్రాణము, (2) వాయువు, (3) శ్వాస, (4) నాదము. (5) శ్రుతి, (6) స్వరము, (7) వర్ణము అనునామములొందును.

(1) పాంచభౌతిక శరీరపిండమున వస్తిగుహాసంలగ్నమై యొక త్రికాస్థిప్రాణ మున్నది. చయనపరిభాషలో దానినే 'పుచ్ఛం ప్రతిష్ఠా' యందురు. ఈ ప్రతిష్ఠాప్రాణ గ్రంథిబంధనముననే శరీరపిండము వంగక సరిగా నిక్కి నిలబడును. ఉదాహరణ:— వృద్ధావస్థయందీ ప్రాణము మూర్ఛిత మగును కనుక శరీరము నిలువబడజాలక (ప్రతిష్ఠాశూన్యమై) వంగి దండము నాధారముగ గొనవలసివచ్చును. ఈ ప్రాణము మేరుదండము ద్వారా వితతమగును. 'బ్రహ్మగ్రంథి'-ఉపాసనము అను నిత్యాదులు కూడ దీనినామములు. ఈ మూల ప్రాణము బ్రహ్మగ్రంథిస్థానమున దన ప్రకృతియందు దాను స్వంతనవరకు దీనిని తైజసప్రాణము లేదా ప్రాణము అందురు ఇది మొదటియవస్థ.

(2) మనస్సునుండి కామన యుదయించును. తత్పూర్తి వ్యాపారముపై నున్నది. అందువు కామాగ్ని మూలాధారము. చివరకు మానస కామనయొక్క యాఘాతము మొట్టమొదట నీ కామాగ్నిపై దగులును. అందునలన నది క్షుబ్ధమగును. అదియు తేజోమయము. ఇటు త్రికాస్థిప్రాణమును తేజోమయము. ఈ సజాతీయతనలన నదియు క్షుబ్ధమై యూర్ధ్వసంచారము గావింప మొదలిడును. ఈ స్థితిలో దానిని వాయు వందురు. ఇది రెండవయవస్థ.

(3) ఫలప్రాప్తి లేనిచో కామన శాంతింపదు, అంతవరకు వ్యాపారము సాగుచుండును. గనుక గామాగ్ని

మరింత క్షోభనొందగా నాక్షోభ ప్రభావ మావాయువుపై బడకుండదు. ఆయాఘాత ప్రత్యాఘాతములచే నది మూర్ఛితమై 'శ్వాస' యను నవస్థనొందును. ఇది మూడవయవస్థ. ఇట్టు ధారావాహిక వాయువు సంతానధారనుండి విచ్యుతమై త్రుటితావస్థం బరిణతమగుచు, నొకవిశేష విధమగు 'రవ'ముగా మారి యదే 'శ్వాస' యనబడును. కొలిమి తిత్తినుండి వెలువడుధ్వని స్వరూపమే శ్వాసరూపమని యంగీకరించిరి.

(4) రవాత్మకశ్వాస పైకిబోయిపోయి శిరోగుహం జేరును. గుడి, గుహ మొదలగువానియందు బొబ్బపెట్టిన నది యాస్థానమునం దెదురుతిరిగి ప్రతిధ్వనించునట్లా శ్వాసవాయువు శిరోగుహాంగా వావృతాకాశముంజేరి యాహతమై యొక ప్రతిధ్వనిగ బరిణత మగును. ఇది నాల్గవదగు నాదావస్థ.

(5) సింహాదివన్యపశువుల నాదము పర్వతకందరములందు నలుదెసల వ్యాపించిన ట్లీనాదాత్మక వాయువు శిరోగుహయందు వ్యాప్తమగును. వ్యాప్తమగు నీస్థితిపేరే యైదవదగు 'శ్రుతి' యను నవస్థ. ఇదే స్వరముద్వారా వర్ణములకు మూలమగును. నాదముయొక్క యాభ్యంతరరూపమే, శ్రుతి. ఒకసంగీతజ్ఞుడు స్వరసంధానమునకు మొదట తనమనసున నస్ఫుటరూపమున గొణుగుకొనుటయే శ్రుతి.

(6) పిమ్మట నీశ్రుతి పర్వతకందరవ్యాప్త నినాదము కాలాంతరమున బాహ్యాకాశవ్యాప్త మగునట్లు బహిర్వ్యాప్తము కాగా స్వరసంజ్ఞక మగును. గాయకులు దీనినాలాప మందురు. శ్రుత్యనంతరము వెలువడునిది యాారవ యవస్థ.

(7) ఆలాపలక్షణ స్వరమున కురః కంఠ శిరః స్థానములతో సంపర్క ముండును. ఈ మూడుస్థానములను శిక్షాచార్యులు తమపరిభాషలో క్రమముగ వాగ్యజ్ఞమునకు ప్రాత ర్మాధ్యందిన సాయం సవనము లందురు. ఈ స్థానత్రయ్యాఘాత ప్రత్యాఘాతములం బడిన కాయాగ్ని మిశ్రిత ప్రాణతత్త్వము 'వర్ణ' రూప పరిణతి గాంచును, ఇది యేడవ యవస్థ. ఈ ప్రాణసప్తక విజ్ఞానము నాచార్యు లిట్లు చెప్పుదురు:—

"అథ వాచోవృత్తింవ్యాఖ్యాస్యామః వాయుం ప్రకృతి మాచార్యాః వాయురూర్ధ్వగః 'శ్వాసో' భవతి, శ్వాసో 'నాద' ఇతి శాకటాయనః వాయురస్మిన్ కాయే, మూర్ఛతి, సఖలు 'రవ' విశేషం ప్రతిపన్నః 'శ్వసితి' ర్భరతి, సశ్వసితః శిరః ప్రతిపన్నః ఆకాశ మద్వారకం 'నదతి' ర్భవతి తస్యేదానీం నదతే ర్జిహ్వాగ్రే కోప్యమాణస్య వ్యక్తయః ప్రాదుర్భవన్తి వర్ణానామ్. (ఋక్తంత్రము)

ఇంచుమించుగ నీఋక్తంత్ర సిద్ధాంతముంబోలు వర్ణోత్పత్తిక్రమనే శిక్షాగ్రంథములందును బ్రతిపాదింపబడినది.

పాణిని:—

"ఆత్మాబుద్ధ్యాసమేత్యర్థాన్ మనోయుంక్తేవివక్షయా
మనః కాయాగ్నిమాహన్తి సప్రేరయతి మారుతమ్॥

మారుతస్తూరసిచరన్ మందంజనయతిస్వరమ్
ప్రాతఃసవనయోగంతం ఛందోగాయత్రి మాశ్రితమ్
కంఠే మాధ్యందినయుగమ్ మధ్యమంత్రైష్టుభానుగమ్
తారంతార్తీయసవనమ్, శీర్షణ్యంజాగతానుగమ్
సోదీర్ణోమూర్ధ్న్యభిహతో వక్త్రమాపద్యమారుతః
వర్ణాన్ జనయతేతేషాం విభాగః పంచధాస్మృతః
స్వరతఃకాలతఃస్థానాత్ ప్రయత్నానుప్రదానతః
ఇతివర్ణవిదఃప్రాహుః నిపుణంతన్నిబోధత!

ప్రాణతత్త్వము శక్తివిశేషము కనుక సమూర్త మగుటచే మూర్తద్రవ్యాశ్రయము లేకుండ నేపనియు గావింపజాలదు. వాఙ్మయక మూర్తపదార్థము నాలంబనముగా గొనియే, యీ యేడవస్థల నొందును. దానింబట్టియే ఋక్తంత్రము ప్రాణముయొక్క వృత్తులనక 'అథవాచో వృత్తిం వ్యాఖ్యాస్యామః' అనియెను. దీనింబట్టి మనమీ యేడువివర్తములను వాగ్వివర్తములు, ప్రాణవివర్తములు ననవచ్చును. ఇందు ప్రస్తుతము మొదటిదగు ప్రాణవివర్తమును, చివరినగు స్వరవర్ణ వివర్తములను జూతము. ఏలయన:— వర్ణవ్యవస్థకు బ్రధానముగ ప్రాణస్వరవర్ణ వివర్తములతోడనే సంబంధముగలదు.

వాక్ప్రయోగము (శబ్దప్రయోగము) (1) వర్ణము (2) అక్షరము (3) పదము (4) వాక్యము నని నాలుగువిధములు. ఇందు బూర్వపూర్వ ముత్తరోత్తరమునకు గారణమగును. ఇది సామాన్యనియమము. ఒక్కొక్కప్పుడు అ-

ఇ–ఉ ఇత్యాది స్వరాత్మకవర్ణము లక్షరములుగను గ, గా, హ, హి, న, ఇత్యాద్యక్షరములు పదములుగను. కిమ్–కథమ్–ఇత్యాది పదములు వాక్యములుగను వ్యవహరింపబడు విషయ మాయా ప్రస్థానాంతరములం బట్టిసమన్వయించుటే న్యాయసంగతమగును. అయినను పూర్వోక్తనిష్కమను సామాన్యవ్యవస్థగ నెంచనగు.

పైజెప్పిన నాల్గింటియందును మొదటి వర్ణము జాతము. ఇది స్వరము–వ్యంజనము నని రెండుభాగములననచ్చును. ఇందు స్వరాత్మకవర్ణమే యక్షరము. దానితో గూడిన వ్యంజనవర్ణము స్వరసంయోగమువల్లనే యక్షర మనబడును. కనుకనే, 'స్వరోఽక్షరమ్' 'సహాద్యైర్వ్యంజనైః' 'ఉత్తరైశ్చావసితైః' అని శుక్లయజుః ప్రాతిశాఖ్య నిర్ణయించెను. ఇందువలన వర్ణము-అక్షరము వేర్వేరు వస్తుతత్త్వములగును. రెండునొక్కటైనచో వ్యంజనము నక్షర మనవలయును. అదియు వర్ణమేకదా! మరియు:— వ్యంజనయుక్తస్వర మొకయక్షర మనరు. చివరకు అక్షర–వర్ణములు వేరని ఫలితార్థ మగును. ''దుష్టశ్శబ్దస్స్వరతో వర్ణతో వా'' యను నాప్తవచనము నిదే చెప్పుచున్నది. 'వాగిత్యేకమక్షరమ్' 'అక్షరమితి త్ర్యక్షరమ్ – ఏకాక్షరాన్వై వాక్' ఇత్యాది శ్రుతులు నిదే స్పష్టీకరించెను. కనుక వర్ణశబ్దము వ్యంజన మట్లు స్వరమును వచించునదైనను, ముఖ్యముగా వ్యంజనపరమే యనియు స్వరము నక్షరమందు రనియు దేలును. ఈ రెండే

కాక స్ఫోట మను నింకొక తత్త్వమున్నది. వర్ణమునకు (వ్యంజనమునకు) స్వర మాలంబనము, సర్వాలంబనము స్ఫోటము. ఇది మనోమూర్తియగు నవ్యయునకు, స్వరము ప్రాణమూర్తియగు నక్షరునకు, వర్ణమువాఙ్మూర్తియగు క్షరునకు ప్రతినిధులు. పరబ్రహ్మవివర్తము లవ్యయాక్షర క్షరములు మూడు. శబ్దబ్రహ్మవివర్తములు స్ఫోట-స్వర వర్ణములు మూడు. ఈ రెండువివర్తములును సమాన ధారాప్రవాహితములు.

మనోమూర్తి యవ్యయుడు జ్ఞానమునకు, ప్రాణ, మయు డక్షరుడు క్రియకు, వాఙ్మయుడు క్షరుడ ర్థమునకు ప్రధానులు. మనఃప్రాణగర్భిత వాక్తత్త్వమే అవ్యయాక్షర క్షర సమష్టిలక్షణ పరబ్రహ్మకు వికాసకారణము. అదే స్ఫోట-స్వర-వర్ణ సమష్టిలక్షణ శబ్దబ్రహ్మవికాస కారణము నైయున్నది. అనగా:— శబ్దబ్రహ్మ పరబ్రహ్మలు రెండు నొకే (మనఃప్రాణగర్భిత) వాక్తత్త్వ వివర్తము లని తేలినది. శబ్దార్థ తాదాత్మ్య మౌలిక రహస్య మిదే. అవ్యయుడు, తత్సమస్ఫోటము అమృతప్రధానములు. అక్షరుడు తనవ్యక్తిగత రూపమున నమృతప్రధానుడును, క్షరుని తన గర్భ మందు బెట్టుకొని మృత్యుమయుడు నగును. కనుక తత్సమస్వరము దనంత తానమృతప్రధానమును క్షరస్థానీయ వర్ణములం దనగర్భమం దుంచుకొని మృత్యుమయము నగును. ఇక క్షరుడు మృత్యుప్రధాను డగుటచే తత్సమవర్ణ

మును మృత్యుప్రధాననే. మరియు, అవ్యయుడు స్ఫోటము సర్వాలంబనములు. అక్షరుడు క్షరప్రపంచాధారము. ఇటు స్వరము వర్ణమున కాధారము. అక్షరతత్త్వము లేకుండ క్షరతత్త్వము వికసింపజాలదు. అట్లే స్వరసహాయము లేకుండ వర్ణోచ్చారణ మసంభవము.

ఆ యవ్యయుడే తన 'హృద్యభావ' మున నక్షరుడుగ నాయక్షరుడే తన బలప్రధాన మృత్యుభాగమున క్షరుడుగ నై యుండుటచే 'సర్వము నవ్యయుడే' యన్నట్లగును. అతని క్షరరూపమందు దృష్టియుంచి యతడే వర్ణసృష్టికి గర్త యనుకొనవచ్చును. గాని, విశుద్ధమగు నవ్యయదృష్టిం బట్టి యకర్త యనియు జెప్పనగును. ఈ క్షరవిశిష్టరూప విశుద్ధ రూపములు రెంటికిజెందిన కర్తృత్వ—అకర్తృత్వము లను రెండు విరుద్ధభావములనుస్పష్టపరచుచు భగవంతుడిట్లు చెప్పెను:—

> "చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః
> తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్." గీత॥

ఇందలి గుణకర్మభావ మీమాంస పిమ్మట జూచుకొందము. ప్రస్తుత విషయము వర్ణనిరుక్తి గదా!

వరణార్థక వృఞ్ ధాతువునుండియు, ప్రేరణార్థక వర్ణ ధాతువునుండియు (వృఞ్ వరణే. స్వాది; వర్ణవరణే. వ.) వర్ణశబ్దము నిష్పన్న మగును. ఈరెండర్థములు నీవర్ణవ్యవస్థతో సమన్వయింపనచ్చును. ఎట్లన:—'వర్ణ'సృష్టి సంప

రణము గావించును. ఆత్మప్రేరణ కాలంబనము నగును. మొదట సంవరణదృష్టింజూతము:—— మాయోపాధిక మగు నాత్మ- (బ్రహ్మ) తత్త్వము, సృష్ట-ప్రవిష్ట-ప్రవివిక్తము లను మూడురూపములొందును. ప్రత్యక్షదృష్ట పాంచభౌతికవిశ్వము దాని సృష్టరూపము. ఇది యాబ్రహ్మ నావృతము గావించును. ఈవిశ్వమందు హృ-ద-య- రూపమున నుండి తన నియతిచే విశ్వధర్మసంచాలన గావించు (సృష్టి) నిమిత్తకార ణాంతర్యామి యాబ్రహ్మకు బ్రవిష్టరూపము ఇక విశ్వసీమ కంతర్బాహ్యములం దసంగరూపమున నాలంబనమై (విశ్వ) కారణకార్యభావ వర్జితమై యుండు వ్యాపక తత్త్వము ప్రవివిక్తరూపము. ఇంతవరకు మనము పరబ్రహ్మ యను కొన్న విశ్వాత్మయొక్కటే యిట్లుమూడు రూపములం బరిణమించుచున్నది.

ఈమూడును క్రమముగ నవ్యయాక్షరక్షరములకు జెందినవి. ఆత్మయొక్క క్షరరూప మీభౌతికవిశ్వమున కుపాదానమై సృష్టబ్రహ్మ యగును. అక్షరరూపము విశ్వనియంతయైప్రవిష్టబ్రహ్మ యగును. అవ్యయు డసంగుడై ప్రవివిక్త బ్రహ్మ యగును. ఇం దవ్యయుడు జ్ఞానజ్యోతికి, అక్షరుడు క్రియాశక్తికి, క్షరు డర్థశక్తికి, ప్రధాను లని మున్నే యెరింగితిమి. ఇం దర్థరూపమే జ్ఞానక్రియా సంవరణము గావింపుచు సృష్టరూప పరిణతి నొందుచున్నది. ఈ సృష్టరూపముచే "నాహంప్రకాశః సర్వస్య యోగ

మాయా సమావృతః" అన్నట్లాత్మనికాస మావృత మగు చున్నది. కనుక నీ సంవరణభావముంబట్టి సృష్టరూప క్షర పురుషుని వర్ణరూపి యందుము. ఇదే పిమ్మట నాల్గుభాగ ములై చాతుర్వర్ణ్యభావ ప్రేరకమగును. కాగా:— నీప్రేరణభావముంబట్టి ఇదే ప్రేరణార్థక 'వర్ణ' ధాతువునుండి వర్ణశబ్ద నిష్పత్తికిని హేతువై యుండును. పరబ్రహ్మవివ ర్తమందు సృష్టక్షర ప్రపంచము తన సంవరణ-ప్రేరణధర్మ ములచే వర్ణమైనట్లు శబ్దబ్రహ్మవివర్త మందును, క్షరస్థానీయ వ్యంజన ప్రపంచము తన బాహ్యరూపమున శబ్దప్రపంచ సంవరణ- ప్రేరణాలం గావింపుచు 'వర్ణ' నామము నొంది యున్నది, పరబ్రహ్మయొక్క సృష్టి రూపము క్షరము, శబ్దబ్రహ్మయొక్క సృష్టరూపము వర్ణము. పరబ్రహ్మయందు, అవ్యయాక్షర క్షరులలో కేవల సృష్టక్షర బ్రహ్మయే దృష్టివిషయ మగుచు, అవ్యయా క్షరులు నిగూఢముగ నుండునట్లు శబ్దబ్రహ్మవివర్తమందు స్ఫోటస్వరములు నిగూఢములుగను వర్ణసమామ్నాయము దృష్టి కాలంబనము నగుచున్నది. అనగా:— సంవరణ- ప్రేరణ ధర్మములచేత నే పరబ్రహ్మయొక్క క్షరభాగమును శబ్దబ్రహ్మవ్యంజనభాగమును, వర్ణమనబడుచున్నది. ఇది వర్ణశబ్దమునకు సామాన్య నిరుక్తి. విశేషనిరుక్తి బిమ్మట చూతము,

# భ్రష్టమూల లేక వర్ణమూల వర్ణవ్యవస్థ

విశ్వమంతయు శబ్దము - అర్థము అని రెండుభాగ
ములు. "క్షరఃసర్వాణిభూతాని" యన్న ట్లీరెండును క్షర
ప్రధానములు కనుక వర్ణాత్మకములు. ఈదృష్టితో విశ్వ
మొక వర్ణాత్మక వస్తుతత్త్వ మందుము. విశ్వమం దీవర్ణ
కృత (క్షర - వ్యంజనకృత) వర్ణవ్యవస్థ సువ్యవస్థితముగ
నున్న సంతవరకు శబ్దార్థసమష్టిరూప విశ్వస్వరూపము
సురక్షితమై యుండును. ఏవర్ణ మేగుణకర్మల ద్వారా
యేస్థానమందు ప్రతిష్ఠితమై యున్నదో యావర్ణ మా
స్థాన- గుణ- కర్మ యుక్తమై తన స్వరూప వికాసము
నకు గారణమగును. ఏ వర్ణ ముల స్థానములు
భ్రష్టము లగునో, తమ, స్థాన-కరణ-ప్రయత్నాది వ్యవ
స్థలను విడచిపెట్టునో, వాని వాగ్బ్రహ్మ తన వాస్తవిక
రూపమును బోగొట్టుకొనును. ఇదేవిధముగ:—అర్థబ్రహ్మ
వివర్తమునకు జెందిన వర్ణములును, స్వస్వధర్మపరిత్యాగ
మున స్వరూపనాశ మొందును. వర్ణతత్త్వమే పదార్థసంగ్రా
హకము. ఇదే పదార్థ స్వరూపమునకు రక్షాదుర్గమువలె
సంవరణముగానించి రక్షించును. సంవరణభావ మొకవిధ
మగు సీమ, ఛందము. అదే వర్ణస్వరూప రక్షకము. ఆ హద్దు
మీరిన పదార్థము తన యస్తిత్వము బోగొట్టుకొను ననుటకు
సందేహములేదు. ఏలయన:— "స్వేస్వేకర్మ ణ్యభిరతః

సంసిద్ధిం లభతేనరః" యనుదానికి మూలము "స్వే స్వే వర్ణే ఽభిరతః సంసిద్ధిం లభతేనరః" అని యేర్పడును.

శబ్దాత్మక వర్ణనిరుక్తిం గొంతతడ వటుంచి యర్థాత్మక వర్ణభావము జూతము. 'వాఙ్మయుడగు క్షరపురుషుడు వర్ణమునకుమూల ప్రతిష్ఠ' అని చెప్పిన విషయము పాఠకులు మరచియుండరు. క్షరమూలవర్ణసృష్టి కవ్యయుడే పరంపరగ ప్రవర్తకుడనియు జివరకు జెప్పితిమి. సదసల్లక్షణుడగు నతడు బ్రహ్మకర్మ (జ్ఞానక్రియా) మయుడనియు నెరింగితిమి. (బ్రహ్మకర్మపరీక్ష) (1) ఆనందవిజ్ఞాన (అంతర్) మనోమయాన్వయుడు బ్రహ్మాన్వయుడు (2) (బహిః) మనః ప్రాణవాఙ్మయుడగు నతడే కర్మాన్వయుడు. (1) బ్రహ్మాన్వయుడు ముముక్షావృత్తిచే ముక్తిసాక్షి (2) కర్మాన్వయుడు సిసృక్షావృత్తిచే సృష్టిసాక్షి. (1) బ్రహ్మమయావ్యయమనస్సు జ్ఞానఘనము.

దీని జ్ఞానస్రోతస్సు కర్మవ్యయభాగస్థ మనస్సున బ్రవహింపగా నీ జ్ఞానధర్మసమావేశమున జ్ఞానమయుడు సృష్టిసాక్షియునగు కర్మావ్యయమనస్సున సృష్టికామన యుదయించుటయు, దానివలన ప్రాణమునందు క్షోభపుట్టును. విక్షేపాత్మకమగు నాక్షోభనే తప స్సందురు. అందువలన మూడవదగు వాక్తత్త్వము క్షుబ్ధ మగును. ఈ వాక్ క్షోభను శ్రమకర్మ యందురు. ఇట్లు కామ తపః శ్రమల సమన్వయమున సృష్టిధార సాగుచున్నది. "సోఽకామయత- "సతప

స్తప్త్వా" 'సోఽశ్రామ్యత్' అనిశ్రుతి. ఈ మూడువ్యాపారములందును అవ్యయాక్షర క్షరులు నిమిత్తము లగుదురు. (1) కామవికాసము మనఃప్రధానుడగు నవ్యయునుండియు (2) తపస్సంచాలనము ప్రాణప్రధానుడగు నక్షరునుండియు (3) శ్రమవ్యాపారము వాక్ప్రధాన క్షరునుండియు నగును. కారణనేమన:— కర్మాన్వయుని జ్ఞానమయ మనోభాగము స్వయముగ కర్మాన్వయునకును, క్రియామయప్రాణభాగమక్షరునకును, అర్థమయ వాగ్భాగము క్షరునకును బ్రతిష్ఠ లగును. (1) స్ఫోటస్థానీయుడు మనోమయుడు, కామసముద్రుడు నగు నవ్యయుడు సృష్టి కాలంబనకారణము. (2) స్వరస్థానీయుడు. ప్రాణమయుడు తపోమూర్తి అక్షరుడు నిమిత్తకారణము. (3) వర్ణస్థానీయుడు, వాఙ్మయుడు శ్రమప్రవర్తకుడు క్షరు డుపాదానకారణము. ఉపాదానసత్తచే గార్యసత్త యుదయించును. కనుకనే యుపాదానకారణమును, తదుదితకార్యమును, అభిన్నసత్తాకము లనిరి. ఈదృష్టితో వాఙ్మయ క్షరరూపోపాదాన కారణమున జనించిన కార్యరూప మగునీ విశ్వముంగూడ వాఙ్మయము, క్షరరూపము నందుము.

సృష్టిసాక్షియగు, మనఃప్రాణవాఙ్మయ కర్మాత్మ తన మనోరూపముంబట్టి భారూపుడు సత్యసంకల్పుడును, ప్రాణరూపముంబట్టి సర్వకర్మయుడును వాగ్భాగముంబట్టి యాకాశాత్మయు నైయున్నాడు. ఆకాశమే వాక్కు అందురు.

అది యింద్రతత్త్వము. అదే వికాసలక్షణాకాశము. ఈ విషయ మిప్పుడేస్పష్టమగును. కర్మాత్మయొక్క యీ త్రికల రూపముంగూర్చి శ్రుతిం జూడుడు:——

"మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః (ఛాందో॰)

అర్థప్రపంచము రూపమునకు, శబ్దప్రపంచమునామమునకు ప్రధానములు. ఈరెంటికిని మూలప్రతిష్ఠ వాగ్రూపాకాశమే. "అకాశోవై నామరూపయో ర్నిర్వహితా" (ఛాందో॰). "ఆకాశఏవ సర్వేషాంభూతానాం ఏకాయతన" మన్న బృహదారణ్యకోక్తింబట్టి ఆకాశాత్మికవాక్కే భూతములకెల్ల మహాలంబనము. ఇదే విశ్వరూపమున బరిణతి నొందుచు, అర్థబ్రహ్మలక్షణమహాపురుషునకును, శబ్దబ్రహ్మలక్షణ ఛందః పురుషునకును ఆయతన (శరీర) మై యున్నది.

భూతజనని లేదా విశ్వజనని యగు వాగ్దేవి మనః ప్రాణములతో నిత్యయుక్త యనుకొంటిమి. మనస్సునందలి ప్రాణము 'హిత' యనియు ప్రాణ మందలి వాక్కు 'ఉపహిత' యనియు నందురు. (శత : 6-1-2.) హితప్రాణము తనకు మూలభూత మగు క్షరనామక బహిరంగ ప్రకృతి యొక్క అన్న - అన్నాదభావ యుక్తమై సౌమ్య- ఆగ్నేయ భేదమున రెండుభాగము లగును. ఈ హితప్రాణ ద్వైవిధ్యమున దీని యందలి యుపహితవాక్కు కూడ సౌమ్య - ఆగ్నేయ భేదమున రెండువిధము లగును. ఈరెండును పార

స్ఫురిక గర్భభావమున రెండు విభిన్నరూపములు గలది యగును. / (1) ఆగ్నేయీవాగ్గర్భితా సౌమ్యావాక్కు 'సరస్వతి' (2) సౌమ్యావాగ్గర్భితా ఆగ్నేయీవాక్ "ఆంభృణీ" యందురు. / మొదటి దానివలన శబ్దబ్రహ్మయొక్కయు, రెండవదానివలన పరబ్రహ్మయను సర్వబ్రహ్మయొక్కయు వికాస మయ్యెనని మున్ను వర్ణనిరుక్తియం దనుకొంటిమి.

ఆగ్నేయీవాక్కు అమృతాకాశము. ఇదే యింద్రుడు- దేవసృష్టి దీనినుండియే యైనది. సౌమ్యావాక్కు మర్త్యాకాశము. ఇదే యింద్రపత్ని. దీని నుండియే భూతసృష్టి యైనది. ఆత్మ, తన వాగ్ద్వయికి జెందిన దేవ భూత భిన్నైకత ప్రజాద్వయిచే ప్రజాపతి యగుచున్నది. దేవసృష్టిప్రవృత్తి యమృతావాగ్లక్షణముగల యింద్రునుండియే యైనను భౌతికమర్త్యజగత్తైన నీ దేవసృష్టికి బ్రతిష్ఠ మర్త్యవాగ్లక్షణముగల యింద్రపత్నియే యగును. ఇంతేకాక భూతసృష్టిగర్భమందలి గంధర్వ పశుమనుష్యాది సర్వసృష్టులకును నదియే ప్రతిష్ఠయైనది. చూడుడు:——

"వాచం దేవా ఉపజీవన్తి విశ్వే వాచం గంధర్వాః పశవో మనుష్యాః వాచీమా విశ్వా భువనాన్యర్పితా సా నో హవం జుషతా మింద్రపత్నీ.

తై॥ బ్రా॥

ఇంతవరకు సృష్టిసంచాలిక యగు వాక్కు అగ్ని - సోమ - ధర్మద్వయయుక్త యని తేలినది.

అగ్నితత్త్వ మూష్మము, సోమతత్త్వము స్పర్శము, ప్రధానముగ గలవి. (1) వికాస మూష్మమునకు జెందినది. ఇదే తేజమునకు స్వాభావికధర్మము. ఇదే యగ్నికి మూలప్రతిష్ఠ. (2) సంకోచము స్పర్శసంబంధము గలది. ఇదే స్నేహమునకు స్వాభావికధర్మము. ఇదే సోమమునకు మూలప్రతిష్ఠ. వాగ్దేవియొక్క స్పర్శోష్మలక్షణ లేదా, సంకోచవికాసలక్షణ సౌమ్యాగ్నేయసంబంధ తారతమ్యమున నొకటే యగు అకారమునుండి యనేకవర్ణముల వికాసము కల్గినది. [వైదిక పథ్యాస్వస్తి (వర్ణమాత్రికా) సంబంధముగల 288 వర్ణములుగ] ఈ మహీదాసవాక్యముం చూడుడు:—ఐ. ఆర. "అకారోవై సర్వావాక్ సైషా స్పర్శోష్మభిః వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి" ఈ స్పర్శోష్మభావనే యర్థసృష్టికి విభాజకమైనది. మర్త్య వాగ్రూప మర్త్యాకాశము బలగ్రంథులచే మొదట వాయురూపమున బరిణమించును. (అవికృతపరిణామవాదము) క్రమముగ వాయువునుండి తేజము తేజమునుండి జలము, జలమునుండి పృథివి పుట్టును. ఇందు బూర్వపూర్వము సూక్ష్మము. ఉత్తరోత్తరము స్థూలము. సర్వస్థూలము పృథివి. సర్వసూక్ష్మ మాకాశము. దానికంటె హితప్రాణము సూక్ష్మము. దానికంటె మనస్సుసూక్ష్మము. దాని స్థూలావస్థప్రాణము. దానిస్థూలావస్థ వాక్కు. దాని స్థూలావస్థ పంచభూతవర్గము. సుసూక్ష్మమనస్సు, సూక్ష్మప్రాణము

ఈ రెండును గలసి మూలకారణలక్షణము అవికృతము-సగునాత్మ. స్థూలవ్యాక్రపంచ మీ కారణాత్మయొక్క కార్యము. ఇంతకును ఆత్మనుండి అనగా మనోమయము సౌమ్య ప్రాణమునుండి మొదట వాగ్వికాసము కాగా నావాక్కు నుండి బలగ్రంథుల తారతమ్యమున భూతవర్గ వికాసము కలిగె నని తెలిసినది. ఈ క్రమికసృష్టిధారంజెప్పు నీశ్రుతిం జూడుడు:—

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః ఆకాశా ద్వాయుః వాయోరగ్నిః, అగ్నే రాపః అద్భ్యః పృథివీ తై॥ ఉప॥

మనస్సు జ్ఞానశక్తియు ప్రాణము క్రియాశక్తియు పంచభూతాత్మిక యగు వాక్కు అర్థశక్తియు గలవి. ఈ మూటి సమష్టియు విశ్వము. ఈమూటి వివర్తములం జనిం చిన ప్రజలును, ఈమూటిసమష్టియే. కనుక ప్రజావర్గము తన స్వరూప రక్షకొరకీమూటిని సంతత మపేక్షించు నని "యత్ సప్తాన్నాని మేధయా తపసాఽజనయ త్పితా" ఇత్యాది శ్రుతిచే స్పష్టమే,

ప్రతిమనుజుడు నెప్పుడు నేదో యెఱుంగ గోరుచుం డును. యథాశక్తిగ నెఱుంగుచు నుండును, ఇది మొదటిది మానసమగు జ్ఞానాన్నము. ఏదోయొకటి చేయ గోరును. ఇది రెండవది ప్రాణరూప క్రియాన్నము. మూడవదగు అర్థాన్నము. పంచభూతములంబట్టి యైదు భాగములు. (1) శబ్ద మాకాశాన్నము. (2) శ్వాసప్రశ్వాసలువాయ్వ

న్నము (3) ప్రకాశము తేజోఽన్నము. (4) జలాన్నము (5) మృణ్మయ గోధూమాది లక్షణ మగు నోషధి వనస్పత్యన్నమును బ్రసిద్ధములే. ప్రాకృతికములగు నీ యేడన్నములనుండి (1) జ్ఞాన (2) క్రియా (3) శబ్ద (4) శ్వాస ప్రశ్వాస (5) తేజము లనునైదు ప్రజాపతినుండి లభించునవి. మిగిలిన రెంటి (జలము, మన్ను) కొరకును ప్రజలు తాము గూడ గొంత ప్రయాస పడవలయును. ఇంతకును జెప్పబూనినది విశ్వః సర్వ మవ్యయపురుషుని మనఃప్రాణ వాఙ్మయ కర్మ భావ వికాసమే అనియే.

విద్యాకర్మమయ మగు నవ్యయాత్మయొక్క మనః ప్రాణవాఙ్మయ మగు నీకర్మరూపమే తదీయ ముగ్ధావస్థ యందు సత్త యందురు. సత్తయం దీమూడుకళలు నున్న వన్నను ఈ మూటి మొత్తము సత్త యన్న నొకటే. ["మనఃప్రాణ- వాచాం సంఘాతః సత్తా" యని సత్తా నిర్వచనము.] సత్తకు పరమందు తదభిన్న మగు చిత్తున్నది. ఇదే విజ్ఞానము. ఇక సర్వాంతరతమ మానందము. ఈ మూటిసమష్టియు,సచ్చిదానందబ్రహ్మ, బ్రహ్మయొక్క యీ మూడురూపము లందును సత్యలక్షణ సత్తారూపమే విశ్వప్రజకు బ్రధానోపాస్యము. తదుపాసన చే జిత్ప్రాప్తియు, జిద్వికాసమున నానందవికాసము నగును కనుకనే ఆనంద- చిత్- అను నీప్రాకృతిక క్రమమును మార్చి యుపాసనా దృష్టితో బ్రహ్మకు సచ్చిదానందము

లను క్రమ ముంచజడినది. సత్తను గ్రహించినచో మూడును గృహీతము లగును. సర్వానుభూత మగు అస్తి తత్త్వమే బ్రహ్మయొక్క సాక్షాద్దర్శనము ఈశ్రుతి యీ సత్త్వోపలబ్ధిం జెప్పుచున్నది, చూడుడు:—

(1) నైవవాచా నమనసా ప్రాప్తుంశక్యో నచక్షుసా
అస్తీతి బ్రువతో௨న్యత్ర కథం తదుపలభ్యతే (కఠ)

(2) అసన్నేవసభవతి అసద్బ్రహ్మేతి వేదచేత్
అస్తిబ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతోవిదుః తై॥

(3) అస్తీత్యేవోపలబ్ధవ్యః తత్త్వభావేన చోభయోః
అస్తీత్యేవోలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి (కఠో)

సత్తాబ్రహ్మయొక్క మనఃప్రాణవాక్కులు మూట వరుసకు మూడుగాని తత్త్వతః ఒకటే, భాతింబట్టి మూడు గాని, సత్తంబట్టి యొకటే.సత్తారస మొకటే బలచితితార తమ్యమున నీ మూడుభాతులుగ బరిణమించి యగుపడు చున్నది. ఇదేవిధముగ నానంద – చిత్ – సత్తులు పర మార్థమున నొకటే. ఏది 'యున్నదో' (అస్తి) అదే యెఱుంగబడును. ఉపలబ్ధియే జ్ఞానము. జ్ఞానమేచిత్తు. 'ఘట మున్నది.' యను సత్త్వోపలబ్ధియే జ్ఞానము. లేదా చిత్తు. అయ్యది సత్తకు జెందినది. జ్ఞాన మొకవిధ మగు తృప్తి. తృప్తియేరసము. రసమేయానందము. చివరకు మూడు నొకటే.

సృష్టిపూర్వము బ్రహ్మ యేకాకిగ నుండి తన్ను వైభవశాలి యన నెంచక వైభవకామనచే తన బ్రహ్మ

రూపమును బ్రహ్మ-కర్మ యను రెండుభాగములుగ బరి
ణతము గావించెను. (1) ఆనంద విజ్ఞాన మనోరూపమున
బ్రహ్మమూర్తియు, (2) మనః- ప్రాణ- వాగ్రూపమున
గర్మమూర్తియు నయ్యెను. కాని వైభవప్రాప్తి లేదు.
కారణమేమన:-- బ్రహ్మకర్మల (జ్ఞాన-క్రియల) సంసృష్టిగా
కున్నచో సృష్టివైభవ మసంభవము. కనుక తన బ్రహ్మ
భావము నాధారముగ జేసి కర్మభావమున సృష్టివితాన
కామన వెల్లడి. గావించెను ఈ యిచ్ఛాపూర్తికొరకతనికి
బ్రహ్మాధారమున ననగా ఆనంద, విజ్ఞాన, అంతర్మనో
మయ బ్రహ్మభాగాధారమున నున్న కర్మభాగమును జ్ఞాన
(మనస్సు) క్రియా (ప్రాణము) అర్థ (వాక్కు) అను
మూడుభాగములుగ విభజింప వలసి వచ్చెను. ఈమూటి
వలనను గామనాపూర్తి కాకపోగా మృతభావము నుత్ప
న్నము గావించెను. ఈనాల్గింటివలనను పని జరుగలేదు.
చివరకు ధర్మతత్త్వము నావిర్భూతము గావించెను. (1) జ్ఞాన
మయ మనస్సు లేదా మనోమయజ్ఞానభావము "దివ్యభావ"
మనియు (2) క్రియామయ ప్రాణము లేదా ప్రాణమయ
క్రియాభావము "వీరభావమనియు" (3) అర్థమయీవాక్కు.
లేదా, వాఙ్మయ మగు నర్థభావము "పశుభావ మనియు"
(4) అర్థముయొక్క యుచ్ఛిష్టభాగము "మృతభావమనియు"
నందురు. ఈనాల్గుభావములే క్రమముగ బ్రహ్మ- క్షత్ర-
విట్- శూద్ర- భావములకు బ్రవర్తకము లయ్యెను.

ఈ విషయ మిపుడే స్పష్టము కాగలదు:—

(1) జ్ఞానశక్తి దివ్యభావము, ఇదే బ్రహ్మవీర్యము. దీనినుండి ప్రాకృతిక బ్రాహ్మణవర్ణవికాసమును (2) క్రియాశక్తి, వీరభావ మిదే క్షత్రవీర్యము. దీనినుండి ప్రాకృతికక్షత్రియవర్ణ వికాసమును (3) అర్థశక్తి పశుభావ మిదే విడ్వీర్యము దీనినుండియే ప్రాకృతిక వైశ్యవర్ణ వికాసమును (4) ఉచ్ఛిష్ట భాగము మృతభావ మిదే శూద్ర వీర్యము దీనినుండి ప్రాకృతికశూద్రవర్ణ వికాసమునయ్యెను. ఈ ప్రాకృతిక వర్ణ చతుష్టయ స్వరూపరక్ష యైదవదగు ధర్మతత్త్వముచే నగుచున్నది. వైభవకాముక ప్రజాపతి సర్గాంతమున దీని నుత్పన్నము గావించెనుగదా!

పూర్వము వర్ణనిరుక్తియందు పరబ్రహ్మయొక్క క్షరవివర్తము తన సృష్టిరూపముచే సంవరణముగావింపుచు బ్రేరణమగుచు 'వర్ణ' మనబడుచున్న దని యంటిమి. ఏల యన:— ఈచెప్పిన వర్ణసృష్టి యీ మనః ప్రాణ గర్భిత వాఙ్మయ క్షరవర్ణమునుండి నైనది. కనుకనే యీచాతుర్వర్ణ్యమును మనము 'వర్ణకృతవర్ణసృష్టి' (క్షరకృతవర్ణ సృష్టి) యనవచ్చును. వర్ణ (క్షర) మునుండి యుత్పన్నమగు వర్ణసృష్టియే ప్రజావర్గస్వరూపములను సంవరణముగావించి యుంచినది. క్షరాత్మకవర్ణమునం దేధర్మముకలదో, ఆ సంవరణధర్మ మే యీవర్ణసృష్టికిం గలదు. కనుక నీవ్యవస్థను

గూడ 'వర్ణవ్యవస్థ' యనదగును. ఈ వర్ణకృతవర్ణసృష్టిని యాజ్ఞవల్క్యుడు విశదీకరింపుచున్నాడు. చూడుడు:—

(1) బ్రహ్మవా ఇద మగ్ర ఆసీత్ – ఏకమేవ (తదేకంసన్నవ్యభవత్) తచ్ఛ్రేయోరూప మత్యసృజత క్షత్రం – యాన్యేతాని దేవత్రా క్షత్రాణి – ఇంద్రో వరుణః సోమో, రుద్రః, పర్జన్యో, యమో మృత్యు – రీశానః – ఇతి. తస్మాత్ క్షత్రాత్ పరం నాస్తి; తస్మాద్బ్రాహ్మణః క్షత్రియమధస్తా దుపాస్తే రాజసూయే క్షత్ర ఏవ తద్యశోదధాతి సైషా క్షత్రస్య యోనిః యద్బ్రహ్మ తస్మాద్యద్యపి రాజా పరమతాం గచ్ఛతి, బ్రహ్మైవాంతతః ఉపనిశ్రియతి స్వాంయోనిం, య ఉ ఏనంహినస్తి స్వాం సయోని మృచ్ఛతి స పాపీయాన్ భవతి, శ్రేయాంసం హింస్త్వా.

ఇది ప్రత్యక్షదృష్ట వర్ణప్రపంచము. చాతుర్వర్ణ్యము (సృష్టికి) పూర్వము ఒక బ్రహ్మరూపముగనే యుండెను. అనగా మన మిప్పుడు నానారూపములుగ విశ్వమందుజూచు బ్రాహ్మణక్షత్రియాది భేదభిన్న రూపములు, లేక, సృష్టిపూర్వము బ్రహ్మమొకడే యుండెను. అందువలన సృష్టిసమర్థత లేక యా లోపపూర్తికొరకు శ్రేయోధిక మగు క్షత్రరూపమును సృజించెను. నేడది (లోకమందు వేదమందును) ఇంద్ర – వరుణ – సోమ – రుద్ర – పర్జన్య– యమ– మృత్యు– ఈశాన నామ యుగళం ప్రసిద్ధమైయున్నది. బ్రహ్మమొక్క యీరూపము బ్రహ్మకంటెను శ్రేష్ఠము. క్షత్రముకంటె నుత్కృష్టరూప మేదియులేదు కనుకనే రాజసూయమునందు క్షత్రియుని (సింహాసనస్థుని).

బ్రాహ్మణుడు క్రిందనుండి (యాశీర్వచనరూపముగ) ఉపా సించుచున్నాడు. (అట్లుకావించు) బ్రాహ్మణుడు(మూర్ధాభి షిక్తుడగు) క్షత్రియరాజునందు యశోరూప వీర్యము నాధా నము గావించును. బ్రహ్మ క్షత్రమునకు యోని (ఉత్పత్తి స్థానము - నిర్గమద్వారము) కనుక రా జెంత శ్రేష్ఠుడైన నగుగాక (రాజనీతితో - ధర్మనీతిసమన్వయము సేయుటకు) స్వయోని నాశ్రయించును. రాజ్యవైభవమదమున (నట్లు సేయక) యతనిని హింసించిన (అవమానము - తిరస్కారము ఉపేక్ష - గావించిన) నతడు తనమూలోచ్ఛేదము గావించు కొనును. మేలు చేసినవానికి గీడొనరించువాని వలె నా క్షత్రియుడు పాపియగును.

(2) స నైవవ్యభవత్ సవిశమసృజత యా న్యేతానిదేవజాతాని గణశ ఆఖ్యాయన్తే - వసవో - రుద్రా - ఆదిత్యా - విశ్వేదేవాః - మరుత - ఇతి:—

అతడు (బ్రహ్మ) క్షత్రము నుత్పన్నము గావించి నంతటితో వైభవశాలిగాలేదు, (ఆ లోపపూర్తికి మరల) విట్=విశమును (అనగా వైశ్య ప్రజలను) సృష్టించెను. ఆ దేవవిట్ప్రజ దేవతలనుండి పుట్టుటచే దేవజాతము లందురు. ఆ యా గణజాతములను గణదేవత లందురు వారు వసువులు (8) రుద్రులు (11) ఆదిత్యులు (12) విశ్వేదేవతలు (33) మరుత్తులు (7) లేదా (49) అని ప్రసిద్ధులు.

(3) స నైవ వ్యభవత్ స శౌద్రంవర్ణ మసృజత పూషణం ఇయం వైపూషా - ఇయం హీదంసర్వం పుష్యతి; దయదింకిం

అంతటితో నతడుతృప్తి నొందక 'పూష' యను శూద్రవర్ణమును సృజించెను. [పృథివియే పూష.] ఈ సర్వము నిదియే పోషించు చున్నది.

(4) స నైవ వ్యభవత్ తచ్ఛ్రేయోరూప మస్పృజత - ధర్మం తదేతత్ క్షత్రస్యక్షత్రం యద్ధర్మః తస్మా ద్ధర్మాత్పరం నాస్తి అథో బలీయాన్ బలీయాంస మాశంసతే ధర్మేణ; యథారాజ్ఞా ఏవమ్ యో వై సధర్మసః, సత్యం వైతత్] తస్మాత్ సత్యంవదంత మాహుః; 'ధర్మం వదతి' ఇతి; ధర్మంవావదంతం 'సత్యం వదతి' ఇతి, ఏతద్ధ్యే వైత దుభయంభవతి

అయినను అతడు (బ్రహ్మ) తృప్తినొందక యీ యన్నిటికంటె శ్రేయోరూప మగు ధర్మమును సృజించెను. అవి క్షత్రియునకు క్షత్రము. దానికంటె శ్రేష్ఠమయినది లేదు. ధర్మముచే దుర్బలుడు (అధర్మికుడు) బలవంతుని (రాజునవలె) లోంగదీయ గలడు. ధర్మము - సత్యము నొకటే కనుకనే ధర్మవాది 'సత్యవాది' యనియు సత్యవాది 'ధర్మ వాది' యనియు జెప్పుదురు. అట్లు ఒకటే ఈయుభయమును.

[5] తదేతత్ బ్రహ్మ క్షత్రం - విట్ - శూద్రః తదగ్ని నైవ దేవేషు బ్రహ్మాభవత్ బ్రాహ్మణో మనుష్యేషు క్షత్రియేణ క్షత్రియః వైశ్యేన వైశ్యః శూద్రేణ శూద్రః తస్మాదగ్నా వేవ దేవేషు లోక మిచ్ఛన్తే బ్రాహ్మణేషు మనుష్యేషు ఏతాభ్యాం హి రూపాభ్యా బ్రహ్మా భవత్

(బ్రహ్మవలన బుట్టిన పూర్వోక్త దేవతలే క్రమముగ ప్రాకృతిక నిత్య) బ్రహ్మ - క్షత్ర - విట్ - శూద్ర

నామక చతుర్వర్ణములు (తక్కిన మూడువర్ణములను విక
సింపజేసిన బ్రహ్మ స్వరూపముగ) ప్రాకృతిక దేవవర్ణము
లందు అగ్నిరూపముస బ్రాహ్మణు డయ్యెను. అనగా
ప్రకృతియం దగ్నిజాతీయ ప్రాణదేవతలను బ్రాహ్మణు
లందురు. ఇక తద్వికృతిరూప మనుష్యసంప్రదాయము
నందే మనుష్యులయం దుపాదాన ద్రవ్యరూప శుక్రశోణి
తము లందు జన్మకాలము నుండియు నగ్నికి ప్రధానతకలదో
-యా మనుష్యులు బ్రాహ్మణులందురు. ఇదే విధమున క్షత్ర
ఇంద్రాది దేవతల ప్రవేశమున నా బ్రహ్మ క్షత్రియు
డయ్యెను. విశ్వేదేవతా ప్రాధాన్యమున వైశ్యు డయ్యెను. పూష
యను శూద్ర దేవతాసమావేశమున శూద్రు డయ్యెను.
ఇట్లు ప్రాకృతికచతుర్వర్ణము లే మనుష్యుల జన్మకాలము
నుండియు తత్తచ్ఛుక్రములం దుండుచు. మనుష్యసంబంధి
చాతుర్వర్ణ్య కారణములయ్యెను. ఎట్లన:— అగ్నియే దేవ
సంప్రదాయమున బ్రహ్మ. ఇక నగ్నివీర్యప్రధాన మను
ష్యుడే మనుష్య సంప్రదాయము నందు బ్రాహ్మణుడు.
కనుకనే దేవలోక (స్వర్గలోక)ముం గోరు దేవతలందు
దేవలోకాధిష్ఠాత యగు నగ్నిదేవతయెడల భక్తి
జూపుదురు. మనుష్యు లందును, (అగ్నిసములును, దేవలోక
ప్రాప్తి కుపాయము జూపువారు నగు) బ్రాహ్మణవర్ణమను
ష్యులం దాత్మార్పణ సేయుట జూచుచున్నాము. ఏల

డున:— దేవతలందగ్నిరూపముననుఁ, మనుష్యులందు బ్రాహ్మణరూపముననుఁ, సాక్షాద్బ్రహ్మయే యున్నాఁడు. ఆయుభయరూపుఁడగు బ్రహ్మ కేవలము దేవలోకాధిష్ఠాతకదా!

(6) అథయోహ వా అస్మాల్లోకాత్, స్వంలోకమదృష్ట్వా ప్రైతి. సఏన మవిదితో నభునక్తి, యథా వేదోవా అననూక్తోఽన్యద్వా కర్మాకృతం, యదిహ వా అప్యనేవంవిత్ మహత్పుణ్యం కర్మకరోతి, తద్ధాస్యాన్తతః క్షీయత ఏవ। ఆత్మానమేవ లోకముపాసీత। సయ ఆత్మానమేవ లోకముపాస్తే నహాస్య కర్మక్షీయతే। అస్మాద్ధ్యేవాత్మనో యద్యత్కామయతే, తత్తత్సృజతే........"తద్వాఏతద్వేదితం విహాంసితమ్."

(బృహ. ఉ: 1 1-11) (శత. 14.)

ఇక (ప్రాకృతిక వర్ణవ్యవస్థామూలక పూర్వోక్త వర్ణవ్యవస్థ నుపేక్షించుచు) ఎవఁడు (తనబుద్ధివాదాభిమానియై) తన యాత్మలోకమును (వర్ణానుకూలాత్మధర్మ - కర్మలను) గుర్తింపక (తన యిచ్చవచ్చినట్లు వర్తించి) చచ్చునో, వాఁడు దీని (వర్ణధర్మము) నెరుగనందున (ఏతత్సుఖమును) అనుభవింప జాలఁడు. ఒకఁడు వేదోక్తముగాని కర్మంజేసియో చేయకయో యుండుగాక యేమైన వేదోక్తమగు నీధర్మమెఱుంగఁడు గనుక, నట్టి అనేకవంవిత్ ఇది యిట్లని యెరుగనివాఁడు (వర్ణధర్మముంబాటింపక) యితరపుణ్యము లెన్నైన జేయుగాక చివరకు నష్టమేపొందును. తనలోకమునే యుపాసింపవలయును. వర్ణోచితధర్మమునే పాటింపవలయును.) అట్లుపాసించువాని కర్మక్షీణింపదు. (అతఁడు నష్టము నొందఁడు.)

అందువలన నతడేదికోరిన నదిసృజించుకొన గలడు. ఆ యీవివిధవిషయము మీమాంసచేయబడినది.

ఇట్లు (1) ప్రాకృతికము, (2) వైకృతికము నని వర్ణ సృష్టి రెండువిధములు. ప్రాకృతికమగు దైవసృష్టియందును చాతుర్వర్ణ్య మున్నది. ఇక "దేవేభ్యశ్చ జగత్సర్వం చరంస్థా ణ్వనుపూర్వశః" అను మనూక్తింబట్టి వర్ణధర్మానుగాము లగు ప్రాకృతిక ప్రాణదేవతలనుండి పుట్టిన వైకృతిక ప్రజా వర్గమందును చాతుర్వర్ణ్య మున్నది. దీనికి నియామకము సత్యాత్మక ధర్మసూత్ర మున్నది. మరియు, వర్ణవిభాగ మూలమగు నీవర్ణసృష్టికిని, వర్ణములను స్వస్వకర్మ నియంత్రి తములుగ రక్షించు సత్యాత్మక ధర్మసూత్రమునకును, ఆనందవిజ్ఞానగర్భిత మనఃప్రాణమయ వాఙ్మూర్తియగు బ్రహ్మ తోడనే సంబంధముగలదని పూర్వోదాహృత శ్రుతివలన దేలినది గాని మానవకల్పన కిందేమియు సంబంధ మున్నట్లు కనుపింపదు. భారతీయ వర్ణవ్యవస్థా ధర్మముల, ప్రాకృతి కత్వ, నిత్యత్వ- శాశ్వతత్వములకు హేతువిదే; శ్రుతిస్మృతు లీహేతువులనే యుపబృంహణము గావింపుచున్నవి. శ్రుత్యుక్త వర్ణసృష్టి తాత్త్వికస్వరూప మతురార్థమెరింగి నంతమాత్రమున సమన్వయము కాజాలదు. కనుక దాని తాత్త్వికార్థ దిగ్దర్శనము గావించుట యప్రాసంగికముకా దను కొనియెదము.

పూర్వశ్రుతి, యే బ్రహ్మతత్త్వమును సృష్టికి బూర్వము ఏకాకి యని, నానా ప్రపంచమును జేసెల బ్రహ్మ మయ మనుచు, నందుండియితరములగు మూడువర్ణముల వికాసము నైనదని చూపెనో, యా బ్రహ్మ యెవరు? తత్తాత్త్వికస్వరూపమేమి? అందుండి మొదటక్షత్రమునకు యోనియగు నే బ్రహ్మవర్ణ (బ్రాహ్మణవర్ణాత్మక దేవతల) వికాసము జరిగెను? బ్రాహ్మణ దేవత యింతవరకును శ్రుత మగుటచే నాజిజ్ఞాసయుత్లేయున్నది. కనుక నీవిషయమును గూర్చి ముందు విచారింతము. బ్రహ్మసుగతయు, బ్రాహ్మణ వర్ణసంబంధినియు, నగు నీ దేవజిజ్ఞాసా శాంతికొరకు పాఠకుల ధ్యానము వాగగ్నిసంస్కా కాకర్షించెదము.

పూర్వోక్త శ్రుతివచన పౌర్వాపర్య విచారణవలన వర్ణసృష్టికి మూలప్రవర్తక మగు బ్రహ్మపదార్థము వాగగ్నియే యని నిర్ణయమగును ఆవాగగ్ని యం దందు, సత్యాగ్ని- బ్రహ్మాగ్ని- సార్వయాజుషాగ్ని యను వివిధ నామముల వర్ణింపబడినది.|వర్ణమూలభూత బ్రహ్మ, సత్య మూర్తియగునగ్నియే. యీరహస్యమునే సంకేతదృష్టితో వ్యక్తీకరించుటకు శ్రుతి "తదగ్నినైవ దేవేషు బ్రహ్మాఽభవత్" అనియెను.|మరియు, ఈ మూలాగ్ని ('తస్యవాఏతస్యాగ్నే ర్వాగేవోపనిషత్')కు పనిషత్తు వాక్కు గనుక మనము వాగ్బ్రహ్మను వాగగ్ని యనవచ్చును. ఈవాక్తత్త్వము పాఠకులకు సుపరిచితమగు మనఃప్రాణగర్భిత వాఙ్మ

యకర్మాత్మ, లేక, కర్మాన్వయుఁడే; మనోమయాత్ముఁడే ప్రాణమయాక్షరుని నిమిత్తకారణముగను వాఙ్మయాక్షరు నుపాదానకారణముగను గొని వర్ణసృష్టికి బ్రవర్తకుఁడగు నని యింతవరకు జెప్పబడినది గదా! క్షరతత్త్వము కర్మాన్వయ వాగ్భాగానుగృహీతము కనుక దానిని వాఙ్మయమన నచ్చును. ఈవాగ్వికాసమే యగ్నిబ్రహ్మ యగుటచే దీనిని వాగ్బ్రహ్మ యనవచ్చును, వివరము శ్రుతియందలి బ్రహ్మ శబ్దము క్షరబ్రహ్మ యని ఫలితార్థము.

ఏవిశేషణములేకుండ బ్రయోగింపబడిన బ్రహ్మ శబ్దము కొన్నియపవాదస్థలములందప్ప సామాన్యముగ క్షర పురుష వాచకమే యగునని యాత్మపరీక్షా ప్రకరణమున జెప్పబడినది. "బ్రహ్మణోహి ప్రతిష్ఠాహమ్" "బ్రహ్మ క్షరసముద్భవమ్" ఇత్యాది గీతావచన పఠిత నిరుపాధిక బ్రహ్మశబ్ద మీపరిభాషంబట్టి క్షరపరక మని యంగీకారము. అక్షరునుండి బ్రహ్మయుద్భవ మనునీ స్థితియందేవిశేషణము లేక శ్రుత్యుక్తమైన బ్రహ్మశబ్దము క్షరపరక మనుకొన వచ్చును. క్షరబ్రహ్మయే వ్యంజనస్థానీయ వర్ణసృష్టికి బ్రభవము; అవ్యయాక్షరులు క్రమముగ స్ఫోటస్వరస్థానీయు లగుటచే వర్ణసృష్టిమర్యాదకు బహిర్భూతులు. క్షరపురుషుడు కర్మాన్వయ వాగ్భాగముం గ్రహించియే వర్ణసృష్టికి బ్రవర్తకు డగును గదా! ఈసృష్టితో నవ్యయుడు. వర్ణసృష్టికి గర్తయనియు, క్షర ప్రధానదృష్టితో నకర్తయనియు,

నందుము. ఇంతకు, ప్రకృతము వర్ణసృష్టిప్రతిపాదక మగుని శ్రుతియం దందుకు మూలముగా నెంచు బ్రహ్మ వర్ణధర్మా వచ్చిన్ను డగు క్షరుడే కాగలడు. కనుక నా బ్రహ్మశబ్ద ముచే వాఙ్మయ క్షరపురుషునే గ్రహింపదగు నని తేలినది.

అవ్యయాక్షరక్షరమూర్తి యగు షోడశీపురుష విచా రణ సేయునపుడు జ్ఞానమయా వ్యయ- క్రియామ యాక్ష రులకంటె క్షరతత్త్వ మర్థమయు మందుము. కాని భౌతిక విశ్వము నెదుటబెట్టుకొని క్షర బ్రహ్మ స్వరూపవిచారణ సేయుచున్నపు డాక్షరునే జ్ఞానమయుడందుము. ఏలయన :— అవ్యయుని యానందవిజ్ఞాన మనోమయ విద్యాభాగము జ్ఞానా త్మయు మనః ప్రాణవాఙ్మయ కర్మభాగము కర్మాత్మయు నైయున్నది. జ్ఞానాత్మయందు రసము కర్మాత్మయందు బలమును ప్రధానములు. ఇక ప్రత్యేకము కర్మాత్మ యందు మనోభాగము ప్రాణవాక్కులకంటె రసప్రధానము కనుక కర్మాత్మను జెందిన కర్మరూపియగు నీమనోమ యావ్య యుని జ్ఞానప్రధాను డనియు ప్రాణమ యాక్షరుని క్రియా ప్రధాను డనియు, వాఙ్మయక్షరు నర్థప్రధాను డనియు, నందుము కాని, పాంచభౌతికము సర్వథా బలప్రధానము నగు విశ్వముకంటె తన్మూలభూత వాఙ్మయక్షర బ్రహ్మ బ్రహ్మ(జ్ఞానము) అగుచున్నాడు. ఈదృష్టితో నర్థమూర్తి యగు క్షరుని జ్ఞానప్రధాను డనుకొందుము; విశ్వమందు

ప్రవాహిత మగు జ్ఞానధారకు నిమిత్త మీ క్షరబ్రహ్మయే
గనుక విశ్వమున కిదే జ్ఞానాత్మ యనబడును.

ఇక నవ్యయాక్షర వివర్తములను వదలి కేవలము,
జ్ఞానమూర్తియగు క్షరబ్రహ్మనే యాధారముగ గొని వర్ణ
సృష్టి విచారణ గావింపవలసి యున్నది. వాగగ్నిమూర్తి
క్షరబ్రహ్మ బ్రహ్మ విశ్వసృష్టికిబూర్వము జ్ఞానలక్షణముగల
యత డేకాకిగనుండి తన బహుత్వకామనాపూర్తికొరకు విశ్వ
యోని గా నెంచెను కాని, క్రియార్థముల సహాయోగము
లేకుండ నెట్లు? కేవలజ్ఞానమున విశ్వవైభవము సిద్ధింపదు.
జ్ఞాని తన జ్ఞానవైభవ ప్రసారార్థము క్రియార్థములను
మృతభావమును నూతగా గొనవలయును; మొత్తముపై
జ్ఞానక్రియార్థ మృతభావములను సువ్యవస్థితములుగ నుంచు
టకు నియతిలక్షణ ధర్మము ననుగమింపవలయును. ఇట్లు
జ్ఞానమయ బ్రహ్మ, క్రియామయ క్షత్రము, అర్థమయవిశము,
మృతరూపశూద్రము, నియతిరూపధర్మము, నను యీకారణ
పంచక సమన్వయముననే జ్ఞాని సమృద్ధుడుకాగలడు, మన
మా క్షరబ్రహ్మ యంశలము; ఆకారణమునకు కార్యము
లము; కార్య ధర్మములంబట్టి కారణధర్మము లనుమానింప
బడును. మన కాకారణపంచక మపేక్షింపవలయు నన్నచో
మూలకారణరూప జ్ఞానమూర్తి యా క్షరబ్రహ్మయు నీ
సాధనపంచక యుక్తుడై వర్ణసృష్టిలక్షణ సమృద్ధి కుపభోక్త
యగు ననవచ్చును కదా!

బ్రహ్మస్వరూపవిచారణ ముగిసినది. / ఇక బ్రహ్మ యేయే శక్తుల సహయోగమున బ్రాహ్మణవర్ణసృష్టి ప్రవర్తక మగు నన్నది చూతము :—(1) సోముడు (2) సవిత (3) మిత్రుడు (4) బృహస్పతి (5) బ్రహ్మణస్పతి (6) సరస్వతి యను నీ యార్వురి సహయోగమున సప్తమూర్తియై వాగ్బ్రహ్మ బ్రాహ్మణవర్ణ మూలప్రతిష్ఠ యగును; ఇందు వాగగ్ని ముఖ్యము. తక్కి-యారు ప్రాణములును గౌణములు. ఈ యేడ్వురు ప్రాకృతిక ప్రాణదేవతలను, వీని ధర్మములం దెలిసికొనుట యనవసర ప్రసంగము కాదు.

(1) వాగగ్ని :—ప్రతిష్ఠ దీనిముఖ్యధర్మము, అందువలన ధృతిక్షమాది గుణవికాసము, సాంసారిక విపత్సహనము అసురభావనాశనశక్తి, నియమపాలనాదార్ఢ్యము, అనన్యభావమున గర్మయందు ప్రవృత్తి, ఆయుస్స్వరూపరక్ష యజ్ఞకర్మ ప్రవృత్తి; ఇవికలవారియం దగ్నిధర్మసమావేశము పుట్టుకనుండియు నుండును. మరియు, వర్చస్సు అను తపోలక్షణ తేజ మొకటి యీ బ్రహ్మాగ్నిముఖ్యధర్మము. దృష్టికిసర్వథా శాంతము, కాని యంతర్జగత్తున మహాప్రదీప్త బలవత్తర వీర్యము, ఇదేవర్చస్సు. బ్రాహ్మణవర్ణ ముఖ్యధనమిదియే. అగ్రధర్మానవచ్ఛిన్నమగు నాయీ ప్రాణాగ్నిముఖ్యధర్మముల గొన్నిటి నీవచనములు చెప్పును.

"వీర్యంవా అగ్నిః అగ్నిరుసర్వేషాం పాప్మనా మపహన్తా"
అగ్నిర్వై దేవానాం వ్రతపతిః అగ్నిరేవ బ్రహ్మ తపోవా అగ్నిః

"అగ్నిర్వా ఆయుష్మా నాయుషశ్శ్రేష్ఠే"

(2) సోమః:— సర్వత్ర శుద్ధిగావించు టితనిముఖ్య ధర్మము. ఆచారవ్యవహారశుద్ధి- శారీరకమలశుద్ధి, మతిశుద్ధి, దివ్యభావానుసంధానము, మనః శ్రోత్ర రక్షణ, బ్రాహ్మణ వృత్తి ప్రతిష్ఠాపన, శాంతవృత్తి నిచ్చుట, వర్చస్సు దృఢ ముగనుంచుట, యశః ప్రాణవృద్ధిసేయుట, ఇత్యాదులు. పుట్టుక నుండియు సౌమ్యప్రాణ ప్రాధాన్యముగలవారియం దీధర్మ ములు సహజముగ వికసించును. ఈవిషయమును నీవచ నములం జూడుడు.

"సోమోవై పవమానః సోమః పవతే జనితామతీనాం" దిశః శ్రోత్రే మనశ్చంద్రేణ "సోమోవై బ్రాహ్మణః సౌమ్యోహిబ్రాహ్మణః "ఏషవై బ్రాహ్మణానాం సభాసాహస్సఖా, యత్ సోమోరాజా" "సోమో స్మాకం బ్రాహ్మణానాంరాజా" "యశోవై సోమోరాజా"

(3) సవితా :—ఆత్మ-బుద్ధి-మనస్సు-ఇంద్రియవర్గము మొదలగు నాధ్యాత్మికపర్వములను తనవిద్యుద్రూపమున ప్రేరితములుగ జేసి వానికి విద్యుత్సమ స్ఫూర్తి గలిగించుట, దానశక్తి ప్రేరణము, వేదధర్మప్రవృత్తిగల్గించుట, మనో బుద్ధ్యాదులకు వానిసహజప్రేరణయందు ప్రకాశప్రదానము, యకృత్స్వరూపరక్ష, రాష్ట్రపతికి సలహానొసంగు శక్తి నిచ్చుట యజ్ఞవృత్తిప్రేరణము, ఇత్యాదు లీసూదిత్యమండలస్థ ప్రాణ విశేషమగు సవితృదేవత ధర్మములు, జన్మతః ఇయ్యదికల

వారి కీధర్మములు సహజముగ వికసించును. ఈవచనములం జూచుడు:—

"సవితావై దేవానాం ప్రసవితా విద్యుదేవసవితా దాతార మద్య సవితావిదేయ, యోనోహస్తాయ ప్రసువాతియజ్ఞమ్ వేదాఏవసవితా అహ రేవసవితా - యకృత్ సవితా - సవితారాష్ట్రం రాష్ట్రపతిః - యజ్ఞఏవ సవితా"

(4) మిత్రః:—ఆధ్యాత్మిక ప్రాణాగ్నియొక్క యుగ్ర భావమును శాంతముగావించునట్టియు, ఇష్టశ్రేయములకు మనోబుద్ధుల ననుగతములుగావించునట్టియు, సత్యనిష్ఠతోస సాగించునట్టియు, భూతమాత్రమున నవ్యాజప్రేమగల్గించు నట్టియు, అధిదైవికరూపమున బూర్వకపాలమందును, ఆధ్యాత్మిక రూపమున శరీరముయొక్క ఆగ్నేయ దక్షిణభాగ మందు నుండునట్టియు ప్రాణవిశేషము మిత్ర దేవత. ఎవని శుక్రమం దీప్రాణప్రాధాన్య ముండునో యతడీవృత్తుల కధి కారియగును. ఈవచనములు గమనింపుడు:—

'సర్వస్యహ్యేవ మిత్రోమిత్రమ్' 'అథయత్రైతత్ ప్రతితరామిః స తీశ్చినార్చిః సంశామ్యతో భవతి, తర్హిహ్యైష భవతిమిత్రం' 'తంయత్ ఘోరసంస్పర్శంసంతం మిత్రకృ త్యేవోపాసతే, తదస్య మైత్రంరూపం 'మిత్రేణైవయజ్ఞస్య స్విష్టంశమయతి' 'మిత్రఃసత్యానాం సువతే' 'మైత్రో వైదక్షిణః'.

(1) బృహస్పతిః:— వాణీయం దోజోబలాధానము గావించి దానిని సబలముగావించుట, విజ్ఞానచక్షువును ఉన

దివ్యబలమున దివ్యదృష్టియుతము జేయుట శరీరకాంతిలక్ష ణము గల 'ద్యుమ్న' మను తేజోవిశేషస్వరూపము గాసా డుట, తన సహజబ్రహ్మశక్తిచే నాధ్యాత్మిక మనోబుద్ధీం ద్రియాది పరికరములను శాసించుట, శరీర మందలి 'యంగిరా' తత్త్వమునురక్షించుట. బ్రహ్మరంధ్రమునం దుండు బ్రహ్మవర్చస్సు నాదానముసేయుట యనుధర్మ ములుగల ప్రాణవిశేషము, బృహస్పతిదేవత. శుక్రమందీ ప్రాణప్రాధాన్యము గలవాని కీధర్మములును విశేషించి వాగ్బలమును వికాసమునొందియుండును. ఈ నిదర్శనములం జూడుడు:—

వాగ్వైబృహతీ తస్యాఏషపతిః తస్మాద్బృహస్పతిః బృహ స్పతిః

'(ఏషైనాం) వాచాం (సువతే)' యత్ చక్షుః (విజ్ఞానం), 'సబృహస్పతిః' 'ద్యుమ్నం హిబృహస్పతిః' 'బ్రహ్మవై దేవానాంబృహ స్పతిః బృహస్పతిర్వాఅంగిరసో దేవానాం బ్రహ్మ సః (బృహస్పతిః- ప్రజాపతిం) అబ్రవీత్, క్రౌంచంసామ్నఃవృణే బ్రహ్మవర్చసమితి ఏషావా ఊర్ధ్వాబృహస్పతే ర్దిక్.

(6) బ్రహ్మణస్పతిః:— బృహస్పతి కితడు మూల ప్రతిష్ఠ బృహస్పతి (వాక్పతి) సూర్యసంస్థకు పైన, పార మేష్ఠ్య జగత్తునకు క్రిందను, రెంటి సంధియందు నితని స్థానము. 'బృహస్పతిః పూర్వేషా ముత్తమోభవతి, ఇంద్ర ఉత్తరేషాం ప్రథమః' అన్నట్లు సత్యం, తపః, జనః, మహః, యను నీ నాలుగుపూర్వలోకముల యంతమున బృహస్పతి

సత్తయు, స్వః, భువః, భూః, అను మూడు ఉత్తరలోక ముల కారంభమున స్వర్లోకాధిష్ఠాతయు, మఘవా నామకుడు నగు ఇంద్రసత్తయు నంగీకరింపబడినది. ఈ బృహస్పతి. సుప్రసిద్ధ బృహస్పతిగ్రహము కంటెను; లుబ్ధకబంధు వను నాక్షత్రిక బృహస్పతికంటెను, వేరగుతత్త్వము. ఆయీ బృహస్పతి సూర్యునకు పైన మహర్లోక కాంతి మసీమయుం డుండు వాఙ్మయప్రాణము, దీనివలననే ప్రాకృతికము నిత్యము నాధిదైవికము నగు వాజపేయ యజ్ఞస్వరూపము నిష్పన్న మగును. కనుకనే యీయజ్ఞమును బృహస్పతిసవన మందురు. ఈ బృహస్పతికిపైన పారమేష్ఠ్య జనల్లోకమున సౌమ్యప్రాణ మూర్తి బ్రహ్మణస్పతి యుండును. ఈతని సౌమ్యధర్మముం గొనియే బృహస్పతి యొక్క స్వరూపము సురక్షిత మగు చున్నది. కనుకనే 'బృహస్పతే బ్రహ్మణస్పతే' యని శ్రుతి యీరెంటి యేకత్వము వాకొన్నది. కాని రెండును వేర్వేరు తత్త్వములు, | ఈ బ్రాహ్మణస్పతి నామక సౌమ్యప్రాణము నుండియే గంగాజల మావిర్భవించెను. | ఆ యీవిషయము మరొకచో రూపింతము. శరీర మందలి దూషితభాగములం బోగొట్టి శరీరమును నిర్మలముగా నుంచుట యీ ప్రాణము యొక్క ముఖ్యధర్మము. | అంతరాత్మను జెందిన పవిత్రవిచారణ లీ బ్రహ్మణస్పతియను గ్రహముపై నాధారపడి యున్నవి. | ఈ ఋఙ్మంత్రముం జూడుడు:—

" పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే,! ప్రభుర్గాత్రాణి పర్యేషి

విశ్వతః అత ప్రతనూ స్త్వతదామో అశ్నుతే శుక్రాసఇ ద్వహాంతః తత్సమాశత ”

(7) సరస్వతి:—ఇదియుండుటచే వాణికి మాధుర్యము, గంభీరనినాదము వజ్రిసమప్రభావము లభించును, అందువలన శ్రోతలు లొంగుదురు; సర్వధా వాక్తత్వోపకారక మీపాణవిశేషము; ఏతత్ప్రాధాన్యము శుక్రమందున్నచో వాణీనాథు డగును; ఈవచనములంజూడుడు:—

“ వాగ్వైసరస్వతీ పావీరవీ ” ‘ సరస్వతీవాచ మదధాత్ ’ ‘ అథ యద్ స్ఫూర్జయన్ వాచమివవదన్ దహతి తదస్యసాఖస్వతంరూపమ్ ’ ‘ సా (వాక్) ఊర్ధ్వోదాతనోత్ యథా పాంథాగాసంతతా—ఏవం (సరస్వతీ—వాక్) “. సరస్వతీతి తద్వితీయం వజ్రిరూపమ్ ”

సంక్షేపముగ:—(1) ప్రతిష్ఠాసమర్పక ప్రాణముఅగ్ని (2) ఆచారవ్యవహార పవిత్రతాసంపాదక ప్రాణము సోమము (3) మనోబుద్ధీంద్రియాదుల దివ్యభావప్రేరక ప్రాణము సవిత (4) భూతమాత్రమునం దవ్యాజసౌహార్దకారక మగు ప్రాణము మిత్రము (5) వాక్తత్త్వపరిమార్జక ప్రాణము బృహస్పతి (6) అంతర్జగత్పవిత్రకారక ప్రాణము బ్రహ్మణస్పతి (7) వాక్కునందు బ్రహ్మవీర్యము నాధానముగావించు ప్రాణము సరస్వతి అగ్నిగర్భితము, అగ్నిచే బరిగృహీతము నగు నీప్రాణసప్తక సమిష్టియే శ్రుత్యుక్త బ్రహ్మతత్త్వము, అనగా:—‘ బ్రహ్మవాఇద మగ్ర ఆసీత్ ’. అను బ్రహ్మశబ్దమీ యేడుప్రాణముల కుపలక్షణమనుకొన్నను సరియే, ఎందు

కన, నీ యేడే బ్రహ్మవీర్య ప్రవర్తకములై బ్రాహ్మణవర్ణమునకు బ్రతిష్ఠలగును; ఇట్లు సప్తప్రాణమూర్తియు, బ్రాహ్మణవర్ణ సంపాదకుడు నగు నీ బ్రహ్మ వైభవప్రసారముకొరకు దన కంటెను శ్రేష్ఠమగు క్షత్రదేవత నుత్పత్తి చేసెను.

బ్రహ్మవీర్యసంపాదక మగు నీక్షరరూప వాగగ్నిని-సార్వయాజుష మంటిమి, కారణము? దీనికి యజుర్వేద సంబంధము కలదు. యజస్సునందు యత్ — జూ అని రెండు భాగములు. యత్ = ప్రాణత్త్వము, జూ = వాక్తత్త్వము. వాక్కు-ఆకాశము. ఇదేయింద్రుడు; ప్రాణమువాయువు. ఆకాశవాయ్వాత్మక వాక్ప్రాణసమష్టి యజ్జూ; ఇది పరోక్ష భాషచే 'యజుః' అయినది, ఈ యజు, వయః - పురుషుడు; ఋక్ — సామములు రెండును వయోనాధములు ఛందము లును. ఈరెంటినే వాగ్రూపేంద్రుని హరులనిరి. "ఋక్సా మేవై ఇంద్రస్యహరీ" ఇదే త్రయీవాక్కు, సత్యవాక్కు, క్షరబ్రహ్మ, వర్ణత్రయీమూలప్రవర్తకము; (1) ఋక్కు:- పార్థివాగ్నిప్రధానము అర్థశక్తిసంచాలకము వైశ్యవర్ణ ప్రవర్తకము (2) యజుస్సు:— అంతరిక్ష్యవాయుప్రధానము క్షత్రియవర్ణజనకము, క్రియాశక్తిప్రవర్తకము (3)సామము దివ్యఆదిత్యప్రధానము. బ్రాహ్మణవర్ణప్రతిష్ఠ. జ్ఞానశక్తి సంచాలకము. ఈ వేదనామాత్మక ప్రాకృతికవర్ణరహస్యమునకు దిత్తిరిదగు నీవాక్యముం జూడుడు.

"ఋగ్భ్యఖ్యజాతం వైశ్యంవర్ణమాహుః యజుర్వేదంక్షత్రియస్యాహుర్యోనిమ్ సామవేదో బ్రాహ్మణానాం ప్రసూతిః పూర్వే పూర్వేభ్యో వచఏతదూచుః"

"తచ్ఛ్రేయోరూప మత్యసృజతక్షత్రమ్" అను వాక్యస్థ శ్రేయోరూప మను నంశమునం దొకశంక:—

"తేనార్హతి బ్రహ్మణాస్పర్ధితుంకః ? "జ్ఞానీత్వాత్మైవమేమతమ్" సర్వంకర్మాఖిలంపార్థ! జ్ఞానేపరిసమాప్యతే సర్వంజ్ఞానప్లవేనైవ వృజినంసంతరిష్యసి నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే తమేవవిదిత్వాతిమృత్యుమేతి వర్ణానాం బ్రాహ్మణోగురుః న తేషు బ్రాహ్మణాఃస్మృతాః ఉత్పత్తిరేవవిప్రస్యమూర్తిః ధర్మస్యశాశ్వతీ ఈశ్వరః సర్వభూతానాం ధర్మకోశస్యగుప్తయే.

ఇత్యాదులెన్నో శ్రౌతస్మార్తవచనములు జ్ఞానక్రియార్థశక్తు లాదు జ్ఞానమునకును, వరుసగజ్ఞానక్రియార్థశక్తిప్రధానులగు బ్రాహ్మణక్షత్రియవైశ్యులందు బ్రాహ్మణవర్ణమునకును శ్రేష్ఠత, జ్యేష్ఠతకల దని సమర్థించుచుండగా నీశ్రుతి, బ్రహ్మ తనకంటె శ్రేష్ఠుడగు క్షత్రియ దేవతల బుట్టించె నని చెప్పుట పొసగు టెట్లు ?

సమాధానము :—యథార్థమే, నాల్గు వర్ణములలో బ్రాహ్మణవర్ణమంత జ్యేష్ఠము, శ్రేష్ఠము నగుటనిజమే, కాని:- ఒకవిశేష హేతు వున్నందున నే శ్రుతియట్లుచెప్పెను. బ్రహ్మ యొక్క యాగోపృతనము క్షత్రవీర్యముపైననే యాధార పడియున్నది. బ్రహ్మనికాసమున కాధారమదియే; విశ్వ

స్వరూపసత్తా కర్మప్రధానము, అది (కర్మ) క్రియాత్మకమగు క్షత్రమే; క్రియాసహయోగముననే జ్ఞానమునకు వికాసము. క్రియామయ క్షత్రవిరహిత జ్ఞానము నిర్వికల్పకమై తిరోహితమగును. అనగా నది విశ్వసీమ కావలి వస్తువగును. ఈదృష్టితో వ్యావహారికజగత్తునందు క్షత్రము శ్రేయోరూప మనవచ్చును. ఇంద్ర–వరుణ–సోమ–రుద్ర–పర్జన్య–యమ–మృత్యు–ఈశానులను ప్రాణదేవతాసమష్టియే క్షత్రతత్త్వము; ఈ 8 ప్రాణదేవతలచే పూర్వోక్త బ్రహ్మసత్తాకాధారమున విశ్వకర్మసంచాలన స్వరూపరక్షలును, జ్ఞానవికాసము నగుచున్నది. (1) ఇంద్రాత్మకవికాసము (2) వరుణాత్మక సంకోచము, (3) సోమాత్మక పవిత్రత (4) రుద్రాత్మక దండవిధానము (5) పర్జన్యాత్మక వర్షణకర్మ (6) యమాత్మకనియమనము (7) మృత్యులక్షణమగు నవసానము (8) ఈశానాత్మక ప్రభుత్వము అను నీ యెనిమిది క్షత్రధర్మములే విశ్వస్వరూప రక్షకములు; దీనికి బ్రవర్తకులగు నీ యెన్మిది ప్రాణదేవతలే ప్రాకృతిక క్షత్రియదేవతలు వీని ప్రాధాన్యముగల వీర్యము నంబుట్టిన మనుష్యులు క్షత్రియులు. కర్మమయవిశ్వమునందు బ్రాహ్మణునికంటె క్షత్రియుడు శ్రేయోరూపుడు కనుకనే రాజసూయమందు సింహాసనస్థ క్షత్రియునకు గ్రిందనుండి బ్రాహ్మణు డాశీర్వదించును; నిజముగ గర్మమయవిశ్వమందు క్షత్రముకంటె నుత్కృష్టవర్ణ మేదియు లేదు.

శ్రుతి యిట్లు బ్రహ్మకంటె క్షత్రము శ్రేయోరూప మన్నను, తన బ్రహ్మలక్ష్యము న్విడువలేదు. కనుకనే, "సింహాసనస్థుని క్షత్రియుని బ్రాహ్మణుడు క్రిందనుండి యాశీర్వదించును. అయినను బ్రాహ్మణుడే జ్యేష్ఠుడు శ్రేష్ఠుడు నగును. రాజునందు యశఃప్రాణాధానము సేయును. బ్రాహ్మణుడే క్షత్రియునికి యోని (మూలకారణము, ప్రవేశనిర్గమ స్థానము, ప్రభవప్రతిష్ఠాపరాయణము) యోని నిగూఢ భావాత్మిక యయ్యును బీజాత్మిక. ప్రత్యక్షము కాదు. వృక్షమే ప్రత్యక్షము కాని వృక్షస్థానీయక్షత్రియుడు చివరకు యోనిస్థానీయబీజమునాశ్రయింప వలసియుండును. జ్ఞానము(బ్రహ్మ)లేక, క్రియాప్రవృత్తి(క్షత్రము)సర్వథా అసంభవము. భౌతికవిశ్వసమృద్ధి చరమశిఖరమునుంజేరిన క్షత్రియునకైనను తనకుయోని, మూలప్రతిష్ఠ, స్వరూపరక్షా సాధనము, బ్రాహ్మణుడే యనునది మరువకూడదు. అతనిని రక్షించుకొనుటయందే తనరక్షణ యిమిడియున్నదని గుర్తింపవలయును" అన్నది. ఈవిషయమును మైత్రావరుణగ్రహ ప్రతిపాదిక యగు మరొకశ్రుతి స్పష్టపరచెను. వేదవిజ్ఞానమునం దీవిషయము జూడుడు. ప్రస్తుతము కొంచెము:—

క్రతువు మిత్రము. దక్షుడు వరుణుడు. ఇచ్ఛ క్రతువు, తత్కార్యరూపము దక్షుడు, "జ్ఞానజన్యాభవేదిచ్ఛా" యన్నట్లు ఇచ్ఛజ్ఞానమునకు జెందినది. ఇచ్ఛ యొక్క యవ్యవహితోత్తర కాలమందే కృతి (యత్న)

వికాసము కల్గును. అందువలన గర్మజమగును. కర్మసిద్ధి దక్షత. ఇచ్ఛాధిష్ఠానము మిత్ర బ్రహ్మ. కర్మకారంభకము వరుణాక్షత్రము. బ్రహ్మఅభిగన్త; క్షత్రముకర్త; పథప్రదర్శక బ్రహ్మ పురోధ; పథానుగామిక్షత్రమురాజు; రాజు కర్మమూర్తి; బ్రహ్మజ్ఞానమూర్తి; రెండును వేర్వేరగుచో సమృద్ధినష్టిదగును. తన స్వరూపరక్షకొరకు క్షత్రము బ్రహ్మ నపేక్షించును. తన వికాసముకొరకు బ్రహ్మ క్షత్రము నాశ్రయించును. అటుకానినా డేమగునో శ్రుతియేమన్నదో చూతము:— బ్రహ్మ, క్షత్రానుగామి కాకున్నచో దాని వికసన మణగి యుండును; గాని, దానిస్వరూపమునకు హాని యుండదు. ఇక క్షత్రము బ్రహ్మానుగామి కాకున్నచో దాని స్వరూపమే నష్టమగును. కనుక నే బ్రాహ్మణ పురోధ నెదుటబెట్టుకొని యతని యనుమతింగొనియే క్షత్రియుడు రాష్ట్రసంచాలనము సేయుట కర్తవ్యము." (శత: 4-1-4 చూడుడు.)

బ్రహ్మయొక్క యీ ప్రాకృతికవ్యాప్తి కెవడు విరోధ మాచరింపగలడు? (తేనార్హతి బ్రహ్మణాస్పర్ధితుం కః) కాని; శాసకములగు బ్రహ్మ - క్షత్రబలములు రెండును నేడు వంచితములై శాసిత మగు విట్శూ ర్యానుగాములగుచు నరక్షితము లగుచుండుట ఖేదవిషయము. విట్శౌర్యముగూడ, కర్తయగు క్షత్రవీర్యమును, అభిగంతయగు బ్రహ్మవీర్యమును ఊతగొనకుండ తన స్వాభావి కార్యసిద్ధి సాఫల్యము

నొందజాలవని మనవసందుట మంచిది. కానింకు, ప్రకృత మీసందర్భమున నుపసంహార మేమనగా:— "సప్తప్రాణా త్మక దివ్య భావప్రధాన బ్రహ్మ స్వవికాసార్థము వీరభావ ప్రధానాష్ట ప్రాణాత్మక క్షత్రతత్త్వ ముత్పన్నము గావించెను. సప్తప్రాణసమష్టి ప్రాకృతిక బ్రాహ్మణవర్ణము అష్ట ప్రాణసమష్టి ప్రాకృతిక క్షత్రవర్ణము. ఈరెండువర్ణములును మానవులందలి బ్రాహ్మణక్షత్రియ వర్ణముల కారంభక ములు" అనియే.

(2) క్షత్రమువలనను బ్రహ్మయనుకొన్నపని సాగ లేదు. కారణము? భౌతికపదార్థ సహాయోగములేనిచో కేవలజ్ఞాన - కర్మ లేమియు చేయజాలవు. ఈరెంటికి నర్థము లేని వికాస ముండదుకదా! జ్ఞానకర్మ భావములం దనయం దుంచుకొని స్వస్వరూపమున బ్రకటమగు చున్నను గుప్త మగు మూడవ పశుభావము విడ్వీర్యము. వసు రుద్రాదిత్య విశ్వేదేవ మరుద్గణముల రూపమున దాని వికాస మయ్యెను. 'యదపశ్యత్తస్మాత్పశుః' అన్నట్లు ఇంద్రియదృష్టపదార్థము పశువు. జ్ఞానక్రియ లింద్రియాతీతములు. లింద్రియదృష్టము భౌతిక మగు నొకయర్థప్రపంచమే గదా! కనుక నర్థభావ మును తద్రూపవిడ్వీర్యమును పశుభావ మన వచ్చును. దీనినే:—

మరొకవిధమున జూతము:— వైదిక పరిభాషయందు భోగ్యవస్తువును పశు వనిరి. జ్ఞానము భోక్త; కర్మ భోగ

సాధనము. అర్థము భోగ్యము. కనుక భోగ్యరూపార్థప్రధాన విడ్వీర్యము జ్ఞాన - కర్మలకు భోగ్య మగును. కనుక దీనిని పశుభావ మనవచ్చును. పైనుదహరించిన దేవతాసమష్టి యగు నీనిట్టత్త్వము ప్రాకృతికవైశ్యవర్ణము. జన్మత ఏతద్వీర్యప్రధానము వైశ్యవర్ణము.

(3) అర్థశక్తివికాసము పూష యనుపేరనొప్పు పార్థివప్రాణమునకు జెందినది. అది యాత్మప్రతిష్ఠాశూన్య మగుటచే మృతభావ మందురు, అంభః - మరీచిః - మరః - ఆపః - అను నీనాల్గుజాతుల జలములును క్రమముగ పరమేష్ఠి సూర్య - పృథివీ - చంద్రమా - యను నాల్గులోకములకు జెందినవి. పృథివ్యుపాదానభూత మూర్ఛిత, మరణధర్మాన చ్ఛిన్న జలము మరః అందురు. పుష్టిప్రవర్తకమై దీనికిజెందిన పార్థివప్రాణము మృతభావ మందురు. బాహ్యజగత్సృష్టి మృతభావనే. అర్థప్రపంచపుష్టికాధార మీపూషా ప్రాణము. ఇదే ప్రకృతియందలి మృతభావప్రధాన మగు శూద్ర వర్ణము. ఏతత్ చ్ఛుక్రజనితము శూద్రవర్ణము.

(4) ఈవిధముగ తనవైభవప్రసారార్థము వ్యంజన స్థానీయము వాఙ్మయము నగు క్షరబ్రహ్మ క్రమముగ దివ్య, - వీర, - పశు, - మృతభావ ప్రవర్తకములగు బ్రహ్మ క్షత్ర - విట్ - శూద్ర - వీర్యచతుష్టయముగ విభక్తమై బ్రహ్మ - క్షత్రియ - వైశ్య - శూద్రు లను నాలుగువర్ణ ములుగ బరిణతినొందెను. కాని: ఇంక నొకలోప మున్నే

యున్నది. ఏమన ఈ నాల్గువర్ణములును పరస్పరమిళితములు గాక, కర్తవ్యసాంకర్యములేక తమ తమ క్షేత్రములం దక్కగా నిల్చి పరస్పరసహయోగమున నుండవలయును, ఇందుల కొకనియతిదండ మావశ్యకముగ దోచెను. చివర కతడు సర్వశ్రేష్ఠమగు ధర్మతత్త్వముంబుట్టించి యాస్వధర్మ లక్షణ మర్యాదాసూత్రమున నీనాల్గిటిని నియంత్రితములం గావించెను.

ఘటపట – సూర్యచంద్ర – పశుపక్షి మనుష్యాది పదార్థములు పరస్పరభిన్నము లెందువలన? వీని నామరూప కర్మలు విభక్తము లెందువలన? సమాధానము:— స్వభావము; ఘటత్వ పటత్వాదులే వీనినిభిన్నములుగ జేసెను. ఈ 'స్వభావ' మే వీనికి స్వరూపరక్ష – ఇదేధర్మపదార్థము వర్ణములం దీ'స్వ'భావలక్షణ స్వస్వధర్మ మేనాడు తొలగెనో యానాడు ధర్మభ్రష్ట వర్ణస్వరూప ముచ్ఛిన్నమగును. ఏమన:— ధర్మమే ధర్మికి మూలప్రతిష్ఠ. తత్త్యాగము ధర్మి స్వరూప నాశము. "ధర్మఏవ హతో హన్తి ధర్మోరక్షతి రక్షితః".

చతుర్వర్ణస్వరూప సంపాదక ప్రాణదేవతలు భిన్నులు. కనుక నానాల్గింటిధర్మములు భిన్నము లని యంగీకరింపవల యును. వానివలన నుత్పన్నులగు వర్ణప్రజయు సమానధర్మ ముగలది కాజాలదు. ధర్మభేదమే విభిన్నధర్ములకు మూల ప్రతిష్ఠ. నే డీప్రాకృతిక ధర్మభేదముంగూర్చి యెన్నోకుతర్క

ములు బహులు దేరుచున్నవి. వీని మౌలికరహస్యము క్రమ
ముగా జూపెదము. ప్రస్తుతము:—

"చాతుర్వర్ణ్యధర్మము వైదికము, వేదముసత్యము, సత్యమయీ వేదవాక్కు-బ్రహ్మ. అదియే నాల్గువర్ణము లయ్యెను, కనుక వీనిని సత్యమర్యాదను బహిర్భూతము లన గలమా? నాల్గింటియందును బ్రహ్మశ్రేయోరూపము. అట్టి సర్వశ్రేయోరూప బ్రహ్మనుగూడ నియంత్రితము గావించు నియతిలక్షణ సత్యధర్మము శ్రేయ మనుటను సందేహమేల?" అని మాత్రమేయందుము.

(5) ఏకాకియగు బ్రహ్మ తన వైభవకామనాచరితార్థతకొరకు చాతుర్వర్ణ్యముగ, వర్ణధర్మముగ బరిణతినొందెను. క్షరబ్రహ్మ యక్షరసముద్భవ మని మున్ననుకొంటిమి. క్షరాక్షరము లొకే ప్రకృతియొక్క రెండు వివర్తములు. అమృతప్రధాన ప్రకృతి యక్షరము. మృత్యుప్రధాన ప్రకృతి క్షరము. ఈవిధముగ "అంతరంమృత్యోరమృతం, మృత్యావమృతమాహితః" అన్నట్లు ఈ రెండు నవినాభూతములు. 'యదక్షరం పంచవిధం సమేతి' యన్నట్లు అక్షర తత్త్వమునకు బ్రహ్మ - విష్ణు - ఇంద్ర - అగ్ని - సోమ నామక పంచపర్వములు. ఇందు మొదటిమూడును హృద్యాక్షరములు. చివరిరెండును పృష్ఠ్యాక్షరములు. మొదటి మూటిసమష్టియు నంతర్యామి; తక్కినరెంటి సమష్టియు సూత్రాత్మ. మన యీ అక్షరబ్రహ్మ హృద్యమగు నంతర్యామి

సహాయమున సత్త్వాత్మక ధర్మసృష్టి ప్రవర్తకమును, పృథ్వ్యమగు సూత్రాత్మసహాయమున వర్ణసృష్టి కారంభకము నగును. ధర్మము - ధర్మి యను నీరెండు ప్రాకృతిక సృష్టుల నుండియే క్రమముగ బార్థివవర్ణములును, వర్ణధర్మసృష్టు లును వికాసముజరుగును. అనగా:— తదీయ ప్రాకృతిక బ్రహ్మవీర్య ప్రధాన బ్రాహ్మణ దేవతలనుండి బ్రాహ్మణ వర్ణముయొక్కయు. క్షత్రవీర్య ప్రధానక్షత్రియ దేవతలనుండి క్షత్రియవర్ణముయొక్కయు విడ్వీర్య ప్రధాన వైశ్య దేవతల నుండి వైశ్యవర్ణముయొక్కయు, శూద్ర దేవతనుండి శూద్ర వర్ణముయొక్కయు. వికాసమయ్యె నని తాత్పర్యము. కను కనే శ్రుతి "క్షత్రియేణక్షత్రియః వైశ్యేన వైశ్యః శూద్రే ణశూద్రః" యున్నది,

(6) స్వవర్ణధర్మానుగామిగాక యుత్పథమున బోవు వర్ణ మేమగును? ఆరవకండిక సమాధాన మిచ్చుచున్నది. "వర్ణధర్మమే స్వధర్మము, అగ్ని తన తాపలక్షణధర్మ భిన్నము కానట్లు ధర్మియగు నాత్మ. స్వధర్మభిన్నము కాదు. అట్టి యాత్మలక్షణధర్మ మెఱుగని వ్యక్తి పరలోకమున నాత్మసుఖవంచితు డగును" అని యాత్మధర్మావశ్యకర్త వ్యతం జెప్పి "ఒక బ్రాహ్మణుడు స్వధర్మసిద్ధ స్వాధ్యాయ నాధ్యాపన, వేదప్రచార, వేదగుప్తి, జ్ఞానప్రసారాదికర్మల నజ్ఞానవశమున బరిత్యజించిసామయిక ప్రవాహమునంబడి లోకసేవ - కృషికర్మాదులందు నిమగ్నుడైనచో లోకదృష్టి

కతనికర్మ యొంతయుత్తమ మయ్యును వర్ణధర్మమర్యాదా చ్యుత మగుటచే నది యతనికి శోభనీయజాలదు, సరిగదా పతన హేతు వగును. [కనుక ఆత్మలోకరూప స్వస్వవర్ణధామాను గమనము వర్ణముల కవశ్యకర్తవ్యము.] భౌతికము లగు నానవశ్యకతల పూర్తినర్థించి స్వధర్మత్యాగము కూడనిపని. స్వధర్మమునందు నియతరూపముగ ప్రతిష్ఠితమగు వర్ణము నకు కౌటుంబిక, సామాజిక, రాష్ట్రీయాద్యావశ్యకతలు వాని యంతే నవే పూర్ణములగు ననుటలో సందేహములేదు'' అని యాదేశించుచున్నది. ఇదే. వర్ణమూల (క్షరబ్రహ్మ కృత) వర్ణసృష్టిసంక్షేపము.

## అదితి - దితిమూలక
## వర్ణావర్ణసృష్టి

ఈవర్ణసృష్టిని మరొకదృష్టితో జూతము:— మన వర్ణవ్యవస్థ పృథివీలోకమునకు జెందినది కనుక దీనికి సంబం ధించిన ఈవిచారణయే మన కుపయోగకరముగ నుండును.

"ఇయంవై అదితిః" "ఇయంవై దితిః" ఇత్యాది శ్రౌతవచనానుసారము పృథివిని దితి యనియు నదితి యనియు నందురు. ఈరెండు నొకచో నెన్నకు నుండని పరస్పర విరోధిభావములు గదా! ఒక పృథివినే యదితి - దితియను టెట్లు ?'' అన్నచో సమాధానముకొరకు కశ్యపప్రజాపతిం జూతము:— పురాణానుసారము కశ్యపునకు:- అదితి, దితి,

కద్రూ, వినత, సంజ్ఞా, దను, కాలాది త్రయోదశభార్యలు కలరు. దక్షునికన్య లరువది మందిలో నీపదమూవురిం గశ్యపు నకిచ్చెను. ఈ పౌరాణికవచనములం జూడుడు.

శ్లో॥ దక్షస్తుషష్టికన్యాస్తు సప్తవింశతిమిందవే
దదౌసదశధర్మాయ కశ్యపాయ త్రిమోదశ,

శ్లో॥ ద్వేచైవాంగిరసేప్రాదాత్ ద్వేకృశాశ్వాయధీమతే
ద్వేచైవభృగుపుత్రాయ చతస్రోఽరిష్టనేమినే

ఇందు ప్రకృతము అదితి — దితియనువారే యభి ప్రేతలు. కశ్యపప్రజాపతి రేతస్సేకమున దితియందు దైత్యులను 99 గురు అసురులు అదితియందు ఆదిత్యులను 33 దేవతలును జన్మించిరి. కనుక నదితి దేవమాత, దితిదైత్య జనని యందురు.

ఆదిత్యాంజజ్ఞిరేదేవా స్త్రయ స్త్రింశదరిందమ!
ఆదిత్యాఃవసవోరుద్రాః అశ్వినాచపరంతప!

క్రాంతివృత్తమను తన నియతదీర్ఘవృత్తముపై భూపిండము సూర్యుంగేంద్రముగ జేసికొని యతనినలువైపులం బరిక్రమించుచున్నది. దాని యీక్రాంతిగతిని సాంవత్సరిక గతి యందురు. ఆభూమిపిండమున సౌర ప్రవర్గ్య తేజమంత ర్యామ సంబంధమున బ్రవేశించి భూమికి జెందినవస్తువై పోవును. గాని, సూర్యసమసామ్ముఖ్యమును వీడదు. అట్టి యీతేజము నదితియందురు. ఏలయన:—— ఈ పార్థివతేజో మండలమునందు సౌర తేజ మఖండరూపమున వచ్చుచుండును గనుక దీని నదితియనుట తగును. దీనికి విరుద్ధము, ఛాయా

(తమో) మయము నగు పార్థివమండలము సౌర ప్రకాశవిచ్ఛే దముచే దితి యనబడును. అదితిమండలస్థ పార్థివప్రాణాగ్ని తేజః ప్రధాన దేవవర్గముఖస్థానీయమై దేవదూత యని పేరొందెను. పార్థివయజ్ఞియ దేవతలు తమ సాంవత్సరిక యజ్ఞసిద్ధికొరకీయగ్నిని తమ దూతగ, హోతగ, జేసి కొందురని "అగ్నిందూతంవృణీమహే" 'అగ్నిమీడేపురో హితమ్‌హోతారం' ఇత్యాదిమంత్రవర్ణములచే స్పష్టము. దితిమండలస్థ మగు నా పార్థివప్రాణాగ్నియే తమోమయమై తమః ప్రధానాసురవర్గమునకు ముఖస్థానీయమై యసురదూత యనబడుచున్నది. దేవదూత అగ్ని, అగ్నియనియు, అసుర దూతయగునగ్ని 'సహరక్షా' యనియు వ్యవహారము.

పార్థివప్రాణాగ్నివ్యాప్తి యుండునంతవరకు పృథివీ (మహిమాపృథివీ) సత్త యంగీకరింపబడినది. భూపిండము కేంద్రముగావించుకొని దానిప్రాణాగ్ని, మండలాకారమున బరిణతి నొందగా నావృత్తమే పృథివియైయున్నది. దీనికే పైనజెప్పినట్లు అదితి - దితి యనిరెండుభాగములు. ఇవి పరస్పరవిరుద్ధము లయ్యు నొకదానిరూపములే యగుటచే నాపృథివినే యదితి - దితి యందురు.

అదితి మండలోపలక్షిత తేజోమయీపృథివియందలి దేవదూతలక్షణ ప్రాణాగ్నివ్యాప్తి యిరువదియొకటవ యహ ర్గణపర్యంతము కలదు. దీనికి త్రివృత్ - పంచదశ ఏకవింశ స్తోమములందు, ఘన - తరల - విరళావస్థా లక్షణములు

గల, అగ్ని - వాయు - ఆదిత్యులను మూడు రూపము
లుండును. (1) ఘనావస్థనొందిన వాగాగ్ని (అగ్ని) త్రివృత్
స్తోమ స్థానీయము, పార్థివము (2) తరళావస్థ నొందిన
ప్రాణాగ్ని (వాయువు) పంచదశస్తోమస్థానీయము. అంత
రిక్ష్యము (3) విరళావస్థ నొందిన ప్రాణాగ్ని (ఆదిత్యుడు)
ఏకవింశ స్తోమస్థానీయము దివ్యము. ఇట్లు 33 అహర్గణాత్మక
పార్థివ వషట్కారముయొక్క 21వ అహర్గణమువరకు వ్యాప్త
మగు తేజోమయీ అదితిమండలాత్మికయగు నాకేమహాపృథివి
యందు స్తోమభేద సహకృత మగు నగ్నిత్రయీభేదమున
మూడులోకముల సత్త యేర్పడుచున్నది. ఈమహాపృథివికి
జెందిన త్రివృత్ప్రదేశముపృథివి. వైదికపరిభాషయందు
పృథివిని మాత యందురు. కనుక ఈదృష్టితో నదితిని మాత
యనవచ్చును, మహాపృథివియొక్క పంచదశప్రదేశ మంత
రిక్షము, కనుక నదితినంతరిక్ష మనియు ననవచ్చును. మహా
పృథివియొక్క యేకవింశప్రదేశము ద్యులోకము. వైదిక
పరిభాషలో దీనిని పిత యందురు. ఈదృష్టితోనదితిని పిత
యనియు ననవచ్చును. ఈ మూటి రససమ్మిశ్రణమున
పార్థివప్రజ లుత్పన్ను లగుదురు. మరియు 33 గురు దేవత
లదితిగర్భమున బుట్టుదురు. కనుక నదితిని పుత్రశబ్దమున
బిలువవచ్చును. ఇట్లంతయు నదితియే యనవచ్చును. ఈ
యదితిపృథ్వియొక్క సర్వవ్యాప్తి నీమంత్రమునం జూడుడు:-

"అదితిర్ద్యౌ, రదితిరంతరిక్ష, మదితిర్మాతా, సపితా సపుత్రః,
విశ్వేదేవా అదితిః పంచజనా అదితిః జాతమదితి ర్జనిత్వమ్."

ఈయదితియే త్రివృత్ స్తోమమందున్న యగ్నింబట్టి ప్రాతస్సవనమునకును పంచదశస్తోమమందున్న వాయువుం బట్టి మాధ్యందిన సవనమునకును ఏకవింశస్తోమ మందున్న యాదిత్యుంబట్టి సాయంసవనమునకును అధిష్ఠాత్రియగుచు ప్రాతరాది సాయంవరకు సామ్రాజ్యమునేలించును. ఒక యహస్సు మూడుసవనములుగ విభక్తమగుచున్నది. ఇక ప్రాతస్సవనమందున్న యదితిపుత్రస్థానీయ ప్రాణాగ్ని బ్రహ్మయు, మాధ్యందినసవనమందున్న వాయుగర్భితేంద్రుడు క్షత్రమును సాయంసవనమందున్న విశ్వేదేవాత్మ కాదిత్యుడు విట్టు నైనారు. బ్రహ్మవీర్యము బ్రాహ్మణ భావము, క్షత్రవీర్యము క్షత్రియభావము విడ్వీర్యము వైశ్య భావము నైయున్నవి.

పార్థివతేజోయుక్త ప్రాతఃకాలీన సౌరతేజము జ్ఞాన శక్తి ప్రధానమై బ్రాహ్మణుడుగ, మాధ్యాహ్నికసౌరతేజము క్రియాశక్తి ప్రధానమై క్షత్రియుడుగ సాయంకాలీన సౌరతేజ మర్థశక్తిప్రధానమై వైశ్యుడుగనున్నది. ప్రాతః సవనీ యాగ్ని దేవత యష్టాక్షరగాయత్రీ ఛందోఛందితమై గాయత్రముగ మాధ్యందిన సవనీయ వాయుగర్భిత మరుత్వాన్నామ కేంద్ర దేవత యేకాదశాక్షర త్రిష్టుచ్ఛందో ఛందితమై త్రైష్టుభముగ సాయంసవనీ యాదిత్యగర్భిత విశ్వే దేవత ద్వాదశాక్షర జగతీఛందో ఛందితమై జాగతముగ నొప్పును. ఇందు (1) గాయత్రాగ్నిబ్రాహ్మణుడు (2) త్రైష్టుభేంద్రుడు క్షత్రియుడు (3) జాగతవిశ్వేదేవత వైశ్యుడు.

ప్రాతఃకాల బ్రాహ్మసౌర తేజము వర్ధిష్ణువు. మాధ్యాహ్నిక క్షత్రసౌర తేజము వృద్ధింగతము. సాయంకాలిక విట్ సౌర తేజము క్షయిష్ణువు. బ్రహ్మ - విట్టుల - స్థితులుసమానము. మధ్యనున్న క్షత్రము రెంటిని శాసించును. కనుక నే శ్రుతి 'తస్మాత్ క్షత్రాత్ పరంనాస్తి' అనియెను. మధ్యనున్న క్షత్రబలము పైకెక్కియున్నది. బ్రహ్మ - విడ్బలములు. పూర్వపశ్చిమ క్షితిజములందు సమాన ధరాతలమునం దున్నవి. కనుక నే "కోమటిబ్రాహ్మలోక" టందురు. ఈయిరువురి సమన్వయము ప్రాకృతికము. కాని క్షత్రియుడెన్నడు నీజంటం గలియడు. వర్ధిష్ణువునతడుసగకుగొనును గాని, క్షయిష్ణువు నేమియు లెక్కసేయడు. కనుకకోమటి రాజుం జూడ వెరచును. రాజైనైన బైకీటులోనివా డనుకొంటిమికదా!

పార్థివతేజోయుక్త సౌరేంద్రతత్త్వము (మఘవా - ఇంద్రుడు) గాయత్రి - సావిత్రి - సరస్వతి యను మూడు ప్రణాళికలంబట్టి క్రమముగ బ్రహ్మ - క్షత్ర విడ్వీర్యములకు బ్రతిష్ఠయగును. (1) ప్రాతస్సవనీయ, పార్థివ, ప్రాణాగ్ని ప్రధానగాయత్రి ప్రణాళీబహిర్గత సౌర తేజము బ్రహ్మ. (2) మాధ్యందినసవనీయ, ఆంతరిక్ష్య, వాయుగర్భి తేంద్ర ప్రధాన సావిత్రి ప్రణాళినుండి యాగతమగు సౌర తేజము క్షత్రము. (3) సాయంసవనీయ, దివ్య. ఆదిత్యగర్భిత విశ్వేదేవ ప్రధాన సారస్వత ప్రణాళినుండి వచ్చిన సౌర తేజముఃవిట్. ఇట్లు:—

గాయత్ర్యాగ్ని, త్రైష్టుభేంద్రుడు, జాగతవిశ్వేదేవత ఈమూడు సఛందస్కప్రాణదేవతలే యదితిపృథివీ గర్భమందున్న ప్రకృతిమండలమందలి బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యవర్ణములు ఇవి క్రమముగ జ్ఞానక్రియార్థప్రధానములు.

పూర్వముజెప్పిన సవనములందు సారస్వతప్రణాళికి జెందిన సాయంసవనము తేజః–తమః భేదమున రెండుభాగము లగును. సాయంసమయమున నించుక వెలుతురుండు భాగ మొకటియు వెల్తురేమియు నుండని దొకటియు నుండు నని యనుభవసిద్ధమే గదా! అందు వెలుతురున్న భాగము దెండ లేకున్నను, భూభాచే ప్రతిఫలితమగు సౌరతేజ చ్ఛాయా మయ ప్రకాశ ముండును. దీనిని తేజోమయ సాయం సవన మందురు. అది యంతరించిన పిదప నంధకారము రాలేదుగాని యుపక్రమించె నన్నస్థితిని తమోమయసాయం సవన మందురు. ఈరెంటిలో (1) తేజోమయసాయంసవనము విడ్వీర్యముగలది. (2) తమోమయ సాయంసవనము పూషా ప్రాణాత్మక శూద్రవీర్యముగలది. తేజోమయసాయంసవనము నందు తేజఃప్రధాన విశ్వేదేవవికాసముండును. గనుక పార్థివపూషాప్రాణ వికాసావసరములభింపదు. అదియంత రించిన పిమ్మట కడమదాని స్వరూపము వెల్లడియగును. సాయంసవనీయ తమఃప్రణాళినుండి వచ్చిన పూషాప్రాణమే శూద్రసృష్టికి బ్రవర్తకమగును. ఇట్లదితిమండలాత్మక మగు కేవలాహఃకాలమందె ప్రాత ర్మాధ్యందిన తేజోమయ సాయం

సవనభేదమున నగ్ని - ఇంద్ర - విశ్వేదేవ - పూషాప్రాణ ములవలన నాల్గువర్ణముల ప్రతిష్ఠయు సిద్ధించును.

ఇంతటితో నదితిమూలక వర్ణభావవిచారము సంగ్రహించితిమి. ఇక క్రమప్రాప్తమగు దితిమూల కావర్ణసృష్టిం గూర్చి తెలిసికొందుము. సౌరతేజమునకు జెందని పృథివ్యర్ధముం దితి మండలమనుకొంటిమి కదా! తమోభావతారతమ్యమున నిదియు నాల్గుభాగము లగును. వర్ణము దేవభావమునకు జెందినది. తమోఽతిశయమున దేవప్రాణము వికాసములేక యనుద్బుద్ధముగ నుండునప్పుడు అవర్ణసృష్టి యుందుము. దితిగత తమోమయప్రాణము నుండియే, అంత్యజ, అత్యావసాయీ, దస్యు - మ్లేచ్ఛ ప్రజల యాత్మ సంపన్నమై యుండుటచే వీరి నవర్ణప్రజలని యంగీకరించిరి.

ఇందు:— (1) బ్రాహ్మణవర్ణము - అంత్యజావర్ణము (2) క్షత్రియవర్ణము - అంత్యావసాయ్యవర్ణము (3) వైశ్య వర్ణము - దస్యు అవర్ణము, (5) శూద్రవర్ణము - మ్లేచ్ఛ అవర్ణము. ఇవి జంటలు. ఈయుగ్మభావ తాత్పర్యమేమనగా:— "వర్ణసృష్టియందు దే శ్రేణివిభాగక్రమముకలదో అవర్ణసృష్టియందు నదేక్రమము. ఉత్తరోత్తరవర్ణముల కంటె పూర్వపూర్వవర్ణములు శ్రేష్ఠములు. అవర్ణములందు నిదేవిధము" అనియే.

బ్రాహ్మణక్షత్రియవైశ్యుల యాత్మకు తేజస్సంబంధము ప్రత్యక్షమే కనుక వీనిని వర్ణములందురు. శూద్ర

తేజము తమోభావయుక్తమును అఛందస్కము కనుకదీని నవరవర్ణ మందురు. మరియు నిది యవరకోటికి జెందిన పృథివియొక్క పూషాప్రాణప్రణాళికి జెందిన దగుటచే నవర వర్ణ మనదగును.

పూషాప్రాణము దేవతకనుక దేవతయు దేవతయు స్పృశించుకొనుట వలన నష్టమేమియు లేదు. కనుక నవర వర్ణాత్మక సచ్ఛూద్రులను స్పృశ్యశూద్రులందురు. తక్షాయ స్కారగోపనాపితాదు లిందుజేర్చుదురు. "శూద్రాణామనిరవ సితానాం" అన్నట్లు వీరినసిరవసిత (అబహిష్కృత ) శూద్రులనిరి.

దితిమండ లాసురభావమునకు జెందిన యంత్యజాదులు నల్గురు అవరవర్ణీయులు నస్పృశ్యులు, నిరవసితులు. (బహి ష్కృతులు). ఇంతకు, పృథివియొక్క యదితి - దితిభాగము లనుండి వర్ణావర్ణసృష్టివికాస మేర్పడిన దని ఫలితార్థము.

దైవాసురసంపద్విభేదమే విశ్వరూపలక్షణము. అంతట నన్నిటియందు నీరెంటిసామ్రాజ్యము కలదు. ఒకచో నొక దానికి వికాసము మరొకదానికి తిరోభావము. వేరొకచో నొకదానితిరోభావము వేరొకదాని వికాసము. "గుణదోష మయంసర్వం స్రష్టాసృజతి కౌతకీ"

అదితిసంబధి వర్ణసృష్టిం దెలియునెడ పూర్వము "విశ్వమునందలి బ్రహ్మ - క్షత్ర - విడ్వీర్యములు క్రమ ముగ గాయత్రీ - త్రిష్టుప్ - జగతీ ఛందస్సులకు జెందిన

వనియు; నవి, ప్రాత ర్మధ్యాహ్న సాయంకాలములందు, గాయత్రీ సావిత్రీ సరస్వతీ యనబడుననియు నెరింగితిమి. కాని, సవనత్రయ సంబంధముగల యీగాయత్ర్యాది తత్త్వముల స్వరూపమేమి? సంగ్రహముగా నిదికూడజూతము:—

సూర్యబింబమునుండి నలువైపుల బ్రసరింపుచు మనవైపున కరుదెంచు తేజము సావిత్రి. అనగా సౌర తేజమన్నంతనే సావిత్రి కాదు; సవితనుండి వ్యాప్తినొందునది సావిత్రి. సవితాప్రాణమున్నచో సావిత్రీసంబంధ ముండును. ప్రవర్తకపిండమాత్రము సవిత. అందుండి వెడలు ప్రేరకప్రాణము సావిత్రి. ఈపరిభాషననుసరించి యంతటను సవితా-సావిత్రీ స్థితియుండును. చూడుడు.

1 మనః సవితా వాక్ సావిత్రీ.
2 ప్రాణః సవితా అన్నం సావిత్రీ.

ఇట్లు:—1 వేదాః - ఛందాంసి; 2 యజ్ఞః - దక్షిణా; 3 అగ్ని - పృథివీ; 4 వాయుః - అంతరిక్షం; 5 ఆదిత్యః - ద్యౌః; 6 చంద్రమా - నక్షత్రాణి; 7 అహః - రాత్రిః; 8 ఉష్ణం - శీతం; 9 అభ్రం - వర్షం; 10 విద్యుత్ - స్తనయిత్నుః; చూడుడు:— "తముపసంగృహ్య ప ప్రచ్ఛ అధీహిభోః, కఃసవితా? కాసావిత్రీ? ఇతి మనఏవసవితా వాక్ సావిత్రీ యత్ర హ్యేవమనః తద్ (తత్ర వాక్, యత్రవై వాక్ తన్మనః, ఇత్యేతేద్వేయోనీ- ఏకంమిథునం అగ్నిరేవ సవితా పృథివీసావిత్రీ, యత్ర హ్యేవాగ్ని స్తత్ పృథివీ,

యత్ర వై పృథివీ తదగ్నిరిత్యేతే ద్వే యోనీ, ఏకంమిథునమ్,
ఇత్యాది (గోపథము పూర్వార్ధమ్యావిద్యా)

ఈ పరిభాషననుసరించి అగ్నినుండి వెడలు తేజము
సావిత్రి, దీపార్చిసవిత, దానిప్రకాశముసావిత్రి; గురువు
సవిత – తదుపదేశలక్షణ వాక్యసావిత్రి. సవితనుండి వెడలి
సరిగావచ్చు తేజము – ప్రకాశము – ప్రాణము – ప్రేరణయే
సావిత్రి.

ఇదే సౌర తేజము ఒకానొకవస్తువుచే ప్రత్యాహతమై
ప్రతిఫలనము నొందుపపుడు దానిని సావిత్రియనక గాయత్రి
యందురు. అనగా:— వచ్చుచున్న సౌర తేజము మగు
సావిత్రి భూమిచే ప్రత్యాహతమై తిరిగి సూర్యునివంకకు
బోవునపుడు గాయత్రియగును. ప్రాతస్సవనీయ పార్థివాగ్ని
ఈ గాయత్రి తేజోయుక్తముగ నుండును గనుక పృథివిని,
పార్థివాగ్నిని, గాయత్రి యందురు. అని "యావై సా
గాయత్రీ – ఆసీత్, ఇయంవై సాపృథివీ" ఇత్యాది శ్రుతు
లచే స్పష్టము. మరియు పృథివి (చిత్యభూపిండము) యొక్క
స్వరూపము ఆపః, ఫేన – మృత్ – సికతా – శర్కరా –
అశ్మా – అయః – హిరణ్యాః అను నీయెనిమిది భాగములు
గలది. ఇట్లే అష్టాక్షరచ్ఛందమును గాయత్రీయందురు.
కనుక అష్టావయవపృథివిని గాయత్రీయనవచ్చును. (శత.
6–1–1–15) మరియు:— అగ్నిజ్యేష్ఠులగు అష్టవసుగణ సంబం

ధమునను బృథివి యష్టాక్షర యగుచు గాయత్రీ యనబడు చున్నది.

ఇదేవిధముగ సాయంసవనీయ ప్రతిఫలితమగు నా సౌర తేజనే గాయత్రి యనబడక సరస్వతియని వ్యవహరింప బడును. కారణము స్పష్టమే. యెట్లన:— ప్రాతఃసవనీయ గాయత్రిలోకము పృథివీలోకము. మాధ్యందిన సవనీయ సావిత్రిలోక మంతరిక్షలోకము. సాయంసవనీయ సారస్వత లోకము ద్యులోకము. 'అస్తివై చతుర్థో దేవలోక ఆపః'' అను కౌషీతకీ వచనముంబట్టి నాలవదగు నాపోలోకము; ఇదే సరస్వాన్నామక పారమేష్ఠ్యసముద్రము. రాత్రియం దీసము ద్రమునకు జెందిన సౌమ్యప్రాణ ప్రధానత యుండును. కనుక రాత్రిని 'సౌమ్యా' యందురు. ఈసముద్రమునకు జెందినద గుటచేతనే పరమేష్ఠినీవాక్కును సరస్వతి యందు రని వర్ణ నిరుక్తియం దనుకొంటిమి. నాలవలోకము నధివసించు నీసర్వతితోతృతీయలోకస్థ ప్రతిఫలిత సౌర తేజస్సంబంధముం డుట ప్రకృతిసిద్ధము కనుకసాయంకాలీన తేజముం గాయత్రి యనక సరస్వతి యందురు.

అగ్ని గాయత్రమును, తన ప్రతిఫలధర్మముచే సర్వధా శాంతమునగుటచే నదే సాక్షాత్తుగ బ్రహ్మ. అనగా:గాయత్రీ- లేక గాయత్రాగ్ని బ్రహ్మవీర్యమునకు బ్రతిష్ఠయు, వేదమా తయు, బ్రాహ్మణమూలధనము నై యున్నది. సర్వధాశాంత మును,వికాసలక్షణశాంతరూపత్వమునను త్తరోత్తరవర్ధిష్ణువగు

నీ బ్రహ్మవీర్యమే, యితరవీర్యా - వీర్య; వర్ణావర్ణములకు మూలము వని "సర్వం బ్రహ్మస్వంభుంక్తే; "" సర్వం బ్రాహ్మమిదంజగత్' ఇత్యాది స్మృతివచనములు స్పష్టముచేయును. ఇక మాధ్యాహ్నికసావిత్రి తేజ ముగ్రము. ఇదే క్షత్రము; క్షత్రియవర్ణమూలధనము; సాయంకాలీన సారస్వత తేజము సంకోచలక్షణ సోమసంబంధమున నుత్తరోత్తరక్షయిష్ణువు. ఇదే విడ్వీర్యము. వైశ్యులమూలధనము; రాత్రికిజెందిన తమోభావాపన్న తేజము శూద్రవర్ణప్రతిష్ఠ.

పై నాలుగువర్ణములందును వైశ్యునకు సాయంకాలీన క్షయిష్ణు సారస్వత తేజస్సంబంధ ముండుటచేతనే ప్రజయందురు, ఈ యాధారముననే శ్రుతులు విట్ - ప్రజాశబ్దము లభిన్నార్థము లన్నవి. ఈ విశముపై అన్నాద్యభావమున క్షత్ర - బ్రహ్మ వీర్యముల శాస నానుశాసనము లుండును.

పృథివియం దగ్నియు, నంతరిక్షమునందు, వాయువు, మరుత్వాన్నామక ఇంద్రుడు, చంద్రుడును, ద్యులోకమున సూర్యుడు నధిపతులు. పూర్వోక్త సవితా సావిత్రీ పరిభాషం బట్టి అగ్ని - చంద్ర - సూర్యులు – ముువ్వురును, సాక్షాత్తుగ తేజస్సావిత్రులు. సావిత్రి తేజమే క్షత్రియవర్ణమున కాత్మ యగుచున్నది. కనుక నార్యావర్తమందలి క్షత్రియవంశములు అగ్ని - సూర్య-చంద్ర భేదమున మూడుగా శాస్త్రములందు విభక్తము లైనవి, (1) వివస్వాన్మనువంశజులు, సూర్య వంశీయులు. వీరి స్థానమ సర్వోచ్చము (2) మనుపుత్రియగు

నిలయొక్క వంశమువారు చంద్రవంశీయులు, వీరిస్థానము మధ్యమము. ఇందు, పురు - అను - ద్రహ్యు - తుర్వసు - యదువులను పంచశాఖలు ప్రధానములు, ఈశాఖాపంచక నే వైదికేతిహాసమున పంచజన నామ ప్రసిద్ధము. ఇందు పురు - యదువులు భారతవర్షమందే యుండిరి. తక్కినమూడువంశములను మహారాజుమాంధాత యూనాను దేశమునకు వెడలగొట్టెను. వారందు స్వధర్మచ్యుతులై యవన వంశ ప్రవర్తకులైరి. (3) పామార, పరిహార, సోలంకి, చౌహాన్ మొదలగు వంశము లగ్నివంశములు. వీనిస్థానము మూడవది. ఆయీ విషయముగీతాపరిచయమున నైతిహాసికసందర్భసంగతియం దుదహరింపబడినది.

ఇంతకు:- సవన భేదభిన్నమగు నీ తేజోవిభాగముచే చెప్పదలచిన దేమన:- "పృథివియొక్క సంవత్సరాత్మ కాదితి భాగమునుండి వర్ణసృష్టియు, దితిభాగమునుండి యవర్ణ సృష్టియు నైనది. వర్ణసృష్టి కారంభకులగు అగ్ని - ఇంద్ర - విశ్వే దేవులు ముప్వురు క్రమముగ గాయత్రి - త్రిష్టుప్ - జగతీ - ఛందములచే ఛందితులగుచు సచ్ఛందస్కులు, మర్యాదితులు నియమితేచ్ఛాచార విహారపరాయణులు నైయున్నారు. నాలవదగు శూద్రవర్ణము సర్వతంత్రస్వతంత్ర ప్రాజాపత్యానుష్టుప్ ఛందస్సుచే ఛందితమగుచు, నామ మాత్ర పరచ్ఛందానువర్తియగుచున్నది. అవర్ణశూద్రులే ఛందమునకు జెందక స్వాచ్ఛందులు. అమర్యాదితులు యథే

చ్ఛాచారవిహారపగాణులై యున్నారు " అనియే. ఈ వర్ణవిజ్ఞానమును శ్రుతియిట్లువచించెను. " (1) గాయత్ర్యా బ్రాహ్మణం నిరవర్తయత్ (2) త్రిష్టుభా రాజన్యం (3) జగత్యా వైశ్యమ్ (4) న కేనచిచ్ఛందసా శూద్రం నిరవర్త యత్"

" జాయమానో వై జాయతే సర్వాభ్యో ఏతాభ్యో ఏవ దేతాభ్య" " దేవేభ్యశ్చ జగత్సర్వం చరంస్థాణ్వాను పూర్వశః" ఇత్యాది శ్రౌతస్మార్త ప్రమాణముల ననుసరించి నాల్గువర్ణములుగా విభక్తములైన దేవాత్మక * ప్రాణదేవతలవలనను ఇట్లే నాలుగువరవర్ణములుగ విభక్తములైన దేవతాత్మక ప్రాణరూ పాసుర దేవతలవలనను విశ్వాత్మక కార్యస్వరూప సంపాదన జరుగుచున్నది. " కారణగుణాః కార్యగుణా నారభన్తే " యను న్యాయమున విశ్వమునందలి జడ - చేతనములగు సర్వవిధ పదార్థములందును చాతుర్వర్ణ్యవ్యవస్థ నంగీకరింప సిద్ధమగుదుము. సృష్టిస్వరూప మీ ప్రాకృతికవర్ణవ్యవస్థపై నాధారపడియున్నది. ముందు చేతన సృష్టిం జూతము.

ఏచేతనప్రాణుల యాత్మయందు బుట్టుకనుండియు గాయత్రి - (బ్రహ్మ) ప్రాణమునకు బ్రధానతయుండునో అవి

---

* దేవశబ్దము కేవలము సౌరులగు 33 గురు దేవతలకు వాచకము దేవతాశబ్దము, దేవాసురగంధర్వాది సర్వప్రాణములను జెప్పును కనుకనే 33 గురు వర్ణదేవతలను దేవాత్మక ప్రాణదేవతలనియు 99 గురు అవర్ణులగు అసురులను) దేవతలనియునంటిమి. ఈ విషయము అష్టవిధ దేవతా నిరూపణ మను నిబంధమున నిరూపితము.

యితర ప్రాణములెల్లనున్నను తద్వాదన్యాయమున బ్రాహ్మ ణుడందుము. ఇట్లే యింద్రాదిక్షత్ర దేవతా ప్రధానతగల యాత్మ క్షత్రియుడనియు, వసురుద్రాదిత్యాది విడ్దేవతా ప్రధానతగల యాత్మ వైశ్యుడనియు, పూషాప్రాణప్రధా నతగల యాత్మ శూద్రుడనియు, నందుము.

(1) అగ్నిప్రధానదేవత బ్రాహ్మణునకాత్మ. అగ్ని తత్త్వమష్టాక్షరగాయత్రీ ఛందము నెప్పుడు గూడియుండును. ఒక్కొకసంవత్సరమున (బృథివియొక్క యొక్కొక్క సాంవ త్సరికపరిక్రమమున) నొక్కొక యగ్నిమాత్రయొక్క స్వరూపనిష్పత్తి యగుచుండును. ఈ క్రమమున నెనిమిదివర్ష ముల కగ్నిబ్రహ్మ పూర్ణమగును. అప్పుడు బ్రాహ్మణునందు ఛందోలక్షణ మర్యాదాసూత్రవికాసము కల్గుచుండును. దానినే ప్రాకృతిక యజ్ఞోపవీత మందురు,

(2) ఇంద్రప్రధానదేవత క్షత్రియునియాత్మ. ఇంద్ర తత్త్వము ఏకాదశాక్షర త్రిష్టుప్ఛందముతో నెప్పుడును గూడియుండును. ఈదృష్టితో11 వ వత్సరమున, క్షత్రియ బాలునకు యజ్ఞోపవీతసంస్కారవిధానము వెలసినది.

(3) ఆదిత్యప్రధానదేవత వైశ్యునకాత్మ. ఆదిత్య తత్త్వమునిత్యముద్వాదశాక్షర జగతీఛందోయుక్తము; కనుక వైశ్యుడు 12వ సంవత్సరమున యజ్ఞోపవీతాధికారి యగును; (4) శూద్రున కఛందస్క పూషాప్రాణముతో సంబంధము. కనుక నతడు యజ్ఞమర్యాదకు జెందడు. యజ్ఞమునకు సంవ

త్సర మండలముతో సంబంధము లేదా సంవత్సరమండలము
పేరే యజ్ఞమనుడు. సంవత్సరమునదితీమండలముగా నెరింగి
తిమి. అందు గాయత్ర్యాగ్ని త్రైష్టుభ ఇంద్రుడు, జాగతా
దిత్యుడు నను నీమూడు ప్రాణదేవతల సామ్రాజ్యమేకలదు.
నాలవదగు పూషాప్రాణము భూపిండమునకు జెందినదై-
యజ్ఞాత్మ కాదితిమండలము కంటెను, మహాపృథివ్యాత్మక
సంవత్సర యజ్ఞమండలము కంటెను, బహిర్భూతమైయున్నది.
కనుక నది ప్రధానముగ గల శూద్రుడును ప్రకృతిచేతనే
యజ్ఞమం దనధికృతుడు. కాబట్టి యజ్ఞోపవీత సంస్కారాధి
కారికాడు. సంస్కారవిజ్ఞానమం దీవిషయము చూతము.

పూర్వము మనకి ప్రాణవాఙ్మూర్తి, సత్త్వలక్షణ కర్మా
న్వయునే లేదా:—తదనుగృహీత క్షర బ్రహ్మనే వర్ణసృష్టికి
ప్రవర్తకు డంటిమి. ఆ వర్ణసృష్టితో నీఛందోభావములను
సమన్వయము గావించినచో:—"జ్ఞానమయ మనస్సే బ్రహ్మ;
క్రియామయ ప్రాణమే క్షత్రము. అర్థమయీవాక్కే విట్టు.
ప్రవర్గ్యలక్షణ మృతభాగమే శూద్రము. ఈనాల్గింటిమూల
మాక్షరతత్త్వమే; జ్ఞానముసాక్షాత్తుగ బ్రహ్మ. "తద్ జ్ఞానం
బ్రహ్మసంజ్ఞితమ్" అర్థక్రియా దీతరభావములకు జ్ఞాన
మందే పరిసమాప్తి. 'సర్వంకర్మాఖిలంపార్థ! జ్ఞానేపరిసమా
ప్యతే'. జ్ఞానమే, అర్థక్రియోచ్ఛిష్టరూప విశ్వప్రభవము. అదే
ప్రతిష్ఠా పరాయణము. కర్మగావించుట క్షత్ర-విట్ వీర్యముల
వంతు; భోక్త కేవలము బ్రహ్మయే." అనితెలును.

అంతర్యామియుడే మనస్సుచే బ్రహ్మవీర్యమునకు, ప్రాణముచే క్షత్రవీర్యమునకు, వాక్కుచే వీడ్వీర్యమునకు, ప్రతిష్ఠయై యున్నాడు. మనః ప్రాణవాక్సమష్టి, సత్తలేక యస్తిత్వము. ఇదే యంతర్యామి బ్రహ్మమెుక్క యమృతరూపము, మనసునుండిపుట్టిన రూపములయెుక్కయు, ప్రాణమునుండి పుట్టిన కర్మలయెుక్కయు, వాక్కునుండిపుట్టిన నామములయెుక్కయు, సమష్టిమర్త్యరూపము. ఈమర్త్యభాగ మమృతముతో నవినాభూతము; అమృతభాగము వర్ణరూపము; ఈ స్థితిలో అస్తిలక్షణామృతాన్వయము కభావమెుక్కడ ? కనుక ప్రపంచమున వర్ణవ్యవస్థలేని పదార్థమేది ? అన్నియు నస్తియుక్తములే. సృష్ట్యారంభమున కేవలము బ్రహ్మరూపమున నున్న నాయెుకవర్ణమే సృష్టిదశయందు దన స్వాభావిక కర్మయెుక్క మహిమచే చాతుర్వర్ణ్యరూపమున బరిణత మయ్యెను. ఈ వ్యాసవచనముజూడుడు:—

"నవిశేషోస్తివర్ణానాం సర్వంబ్రాహ్మమిదంజగత్"
బ్రహ్మణాపూర్వసృష్టంహి, కర్మభిర్వర్ణతాంగతమ్"

( భార. శాం. 188-10 ) కొందరుకల్పనారసికు లీశ్లోకాధారమున వర్ణవ్యవస్థను కర్మమూలకత్వ మాపాదింప సిద్ధపడుచున్నారు. ఈవ్యవస్థ నిజముగ గర్మమూలమే; కాని, యాకర్మ మనదికా దనియు, అన్యయేశ్వరుని దనియు, వారు మఱచియున్నారు; కర్మాన్వయుడే యీ వ్యవస్థకు ప్రవర్తకుడు. అతని కిదికర్మమూలక మయ్యు మన కిది జన్మమూల

కము. కానిండు, జన్మమూల-కర్మమూల ప్రశ్నను ముందు చూతము. ప్రకృతము చెప్పదలచినది:—"సత్తాలక్షణకర్మ మూర్తి యన్యయబ్రహ్మయే, క్షరావచ్ఛేదమున, వర్ణము లకు ప్రభవము; కనుక సమష్టిగను, వ్యష్టిగను గూడ చరా చరములన్నిటియందును, ఈవ్యవస్థ వ్యాప్తమగు చున్న" దనియే.

ప్రతివస్తువునందును, (1) ప్రతిష్ఠ బ్రహ్మ ('బ్రహ్మ వై సర్వస్యజగతః ప్రతిష్ఠా'); (2) క్రియ (ఆదాన-విసర్గా త్మకము) క్షత్రము; (3) అర్థము (పై రెంటిచే గుప్తమగు పదార్థతత్త్వము) విట్ - (4) బహిరంగధర్మము (ఆశ్రి తము-ఆదానముగావించు ప్రవర్గ్యభాగము. రూపనామ సంఖ్యా-పరత్వా పరత్వగురుత్వాదిక్వాది) శూద్రము, అను ధర్మము లనివార్యము లగుటచే చాతుర్వర్ణ్యము లేని పదా ర్థమున కస్తిత్వమే యుండజాలదు.

మనుష్యులందు :—బ్రహ్మభావముగలవాడు బ్రాహ్మణుడు (2) క్షత్రభావముగలవాడు క్షత్రియుడు, (3) విడ్భా వోపేతుడు వైశ్యుడు (4) పూషాయుక్తుడు శూద్రుడు.

బ్రాహ్మణునందు :—(1) జ్ఞానయుక్తమస్తకము బ్రాహ్మణుడు (2) క్రియాయుక్తభుజ, భుజాంతరములు క్షత్రి యుడు (3) భుక్తసంపత్తికధిష్ఠాత అర్థశక్తియుతమగు నుదరము వైశ్యుడు, (4) సేవాభావపరాయణములగు పాదములు శూద్రుడు.

మస్తకమందు:—(1) అగ్నియను వాగింద్రియము బ్రాహ్మణుడు. (2) వాయువను ప్రాణేంద్రియము (ముఖ్య) క్షత్రియుడు (3) ఆదిత్యుడను చక్షురింద్రియము వైశ్యుడు (4) సోముడను శ్రోత్రేంద్రియము శూద్రుడు ఇందు చెప్పుటకొకడు చేయుటకొకడు చూచుటకొకడు వినుటకొకడు మాత్రనే యనియెరుంగ నలయును.

వాక్యనందు:—(1) సర్వాలంబన బ్రహ్మస్థానీయ స్ఫోటము బ్రాహ్మణుడు (2) స్వరము క్షత్రియుడు (3) స్వరయుక్తవర్ణము వైశ్యుడు (4) శుద్ధవ్యంజనము శూద్రుడు.

ఒక అంగుళి (వ్రేలి)యందు:—(1). కదల్ప నిచ్ఛబ్రాహ్మణుడు (జ్ఞానము) (2) కదల్చుట క్షత్రియుడు (క్రియ) అందలి యస్థ్యాదికము (అర్థము) వైశ్యుడు (4) లోమ, సంఖ్యా, పరత్వాగురుత్వాదులు, బహిరంగధర్మములు శూద్రుడు. ఇత్యాదిగ నంతటను వర్ణవ్యవస్థ ముందుముందు జూడగలరు.

సర్పములం దీవ్యవస్థ సర్వదష్టవిజ్ఞానీ యాధ్యాయమున, సుశ్రుతు డంగీకరించెను. ఇంతకును (1) భూపిండసంబద్ధ, సూర్యసమ్ముఖ తేజోమయ్యాదితి,అగ్నీంద్రాదిత్య పూషా ప్రాణాత్మక, జ్ఞాన క్రియార్థ ప్రవర్గ్యభావములచే బ్రహ్మక్షత్రవిట్చూద్రభావ ప్రవర్తికయగుచు, వర్ణసృష్టికిని, (2) సూర్య

నిసద్ధత మోహమయీదిత్రి, తారతమ్యమున చతుర్ధావిభక్త తమోహమఃసుభానములచే నవర్ణసృష్టికి బ్రవర్తికలై యున్నారనియు ఈ రెంటుసృష్టులు దరతమభేదమున సంతట వ్యాప్తములై యున్న వనియు నీప్రకరణనిష్కర్ష.

## స్పృశ్యాస్పృశ్యవివేకము

వర్ణసృష్టియందు పరస్పరస్పృశ్యవ్యవహారము శాస్త్రసమ్మత మని వెనుక ననుకొంటిమి. | అవర్ణు లస్పృశ్యులని చెప్పబనిలేదు. నేడీవిషయమున నెంతయో కోలాహలము జరుగుచుండుట ప్రత్యక్షమే. ఇయ్యది (అస్పృశ్యత) హిందూజాతికి కళంక మని కొందరివాదము. దానికి మూలము వైదికతత్త్వము నెరుంగమి. | ఇప్పట్టున "దంద్రమ్యమాణాః పరియంతిమూఢాః అంధేనైవ నీయమానా యథాంధాః" అనుకఠవచనము జ్ఞప్తికివచ్చుచున్నది. . ఇయ్యది కళంక మనుకొనుటయే కళంక మని యాస్తికులందురు.

నాల్గువర్ణములందును మనుష్యత సమానధర్మము. ఇక ప్రాకృతిక ప్రాణదేవతలను జెందిన బ్రాహ్మణత్వాది విశేషధర్మములు నాల్గువర్ణములకును నియతములు. సమానధర్మముచే సామాన్యస్వరూపము, విశేషధర్మముచే విశేషరూపములును రక్షితము లగుట న్యాయ్యము. సామాన్యము విశేషమునకు బాధక మగునెడ సపవాదమర్యాదా ప్రాబల్యమున విశేషమునే రక్షింపవలెను.

అవర్ణస్పర్శచే వర్ణముల కేహానియు బ్రత్యక్షమున దోచనిమాట నిజము. కాని, ప్రత్యక్షముగ నగపడని సూక్ష్మకీటాణు సంక్రమణసిద్ధాంతము సర్వమాన్య మగును గదా! అంతర్జగత్తునకు జెందిన యీదోషముకూడ కేవల బాహ్యప్రత్యక్ష దృష్టిబలమున నూరక ద్రోసివేయ వలను పడదు. ఏదో యొకానొక విరోధభావమున శాస్త్ర మీనిర్ణయముగావించె ననజాలము.

బుద్ధివాదులు :—"శాస్త్రములు బ్రాహ్మణకల్పితములు. అందు పదేపదే వారిశ్రేష్ఠతనే జెప్పికొని" రనుటయు నంతవిలువగల మాటకాదు. ఏలయన :—వారు (బుద్ధివాదులు) శాస్త్రస్వరూపజ్ఞానసంపర్క మెరుగరు. పోనిండు, శాస్త్ర మెవరోనిర్మించినదే యుందము. అప్పుడును కలహావసరము లేదు. "శాస్త్రము ప్రమాణభూత" మను నీసిద్ధాంత పక్షముంగొనియే విచారణసేయవచ్చును. సేయగలరు. వారు తమ యుపాసనాకాండను శాస్త్రప్రామాణ్యాధారముననే సురక్షితముగావించుకొనగలరు. "శూద్రులకు దేవాలయ ప్రవేశముకావలె" ననువారిపట్టుదల శాస్త్రనిష్ఠలేనిచో వ్యర్థము. ఏలయన :—దేవాలయప్రవేశము, దేవమూర్తి దర్శనము, మొదలగునవన్నియు శాస్త్రప్రమాణముపై నాధారపడియున్నవి. ఈస్థితిలో నికవారు "మాకుశాస్త్ర మను నొకవస్తువుతో బనియేలేదు దానిని నేమంగీకరింప" మనవలెను. అప్పుడు వారియాందోళలకు నాక్షేపణలకు విలువ

యెట్లు? ఏలయన నవ్వియు శాస్త్రనిష్ఠను సంబంధించినవి గదా! ఇక "వర్ణము, ధర్మము, శాస్త్రము మొదలగున వేవియు లేవు. స్పర్శ - సహభోజనాదుల వ్యాహతముగ నాచరింప నగు" ననుకొన్నచో శాస్త్ర మేమనును? "దేవాలయమునందు మహాత్త్వ మంగీకరింతురా? లేనిచో మీ యుద్యమము వ్యర్థముగదా! దానిం జెప్పిన దెవరు? వర్ణ విభాగముం జెప్పినదియు వారే, వారి ననుగుణ, తదనుగమన మున నిర్ణయించుకొనుడు. ఉచ్ఛృంఖలము, పతన హేతువు నగు మార్గమొకవైపునను, సువ్యవస్థితము, నభ్యుదయ ప్రశస్తమునగు మార్గమొకవైపునను న్నవి. మీ చిత్తము వచ్చిన చొప్పున బొందు" ప్రశస్తపథమున బోదురా? అందు సమీకరణసిద్ధాంతముంబట్టి యస్పృశ్యతా సమర్థనము లభించును :—

## సమీకరణ సిద్ధాంతము

ప్రాణ దేవతల ప్రధానధర్మము సమీకరణము. శీతోష్ణజలముల కలయిక యందు దుష్ణజలము తనయుష్ణముం బోగొట్టుకొనుటకాని శీతజల మంతగా నుష్ణతం జెందదు. సంస్కారములచే సంస్కృతవర్ణప్రజల యంతర్జగత్తునందు ప్రాణ దేవత లుతర్క్యానుసంబంధమున నుండును; అసంస్కృతావర్ణ ప్రజయందు దేవప్రాణ మసలే యుండదు. ఈస్థితిలో నీ యుభయ స్పర్శచే నవర్ణమందు దేవప్రాణసంక్రాంతి యుండనచ్చునా;

కాని తమః ప్రధానమగు నట్టి యుచ్చాటన ప్రాణమంత ర్యామ మగుటకుదగిన బీజములేనందున నది యుట నుపకారకము కాజాలదు; ఇక ఫలితము? వర్ణప్రజ కపకారము మాత్రనే యగును. ఈ సాంకర్యదోషనిరోధముకొరకే స్పృశ్యాస్పృశ్యవివేకము కావలయును.

కొందరు సంశోధకులు :—"ఇదియంతయు పౌరాణిక కాలమునకు జెందినవాదము. ఆనాడు బ్రాహ్మణాధిపత్య ముండినది. వారిస్వార్థసిద్ధికీయమానుషకల్పన జేసిరి. వేదమునందు – వేదకాలమున నీపట్టింపులే"దందురు. "పురాణములు, స్మృతులును వేదార్థమునే యుపబృంహణము గావించుచున్నవి. తదర్థమునే యనుగమించుచున్నవి కాని కొంచమైన తద్విరుద్ధముగ వాకొనవు. వీనికి మూలములు శ్రుతియందు సురక్షితములు" అను నీవిషయము వారుచక్కగా నెరింగినచో నిట్లు వక్కాణింపజాలరు. పాపము! వారుస్పర్శదాక బోనేల? కొన్నివిశేషస్థలములం దవర్ణులతో సంభాషణగూడ శ్రుతినిషేధించినది. అందువలన గూడ దేవప్రాణము త్క్రాంత మగునట. చూడుడు :—జ్యోతిష్టోమయజ్ఞదీక్షితయజమాని మానవసంస్థనుండి దేవసంస్థలోనికివచ్చి దేవతయగును. అతని కీయాదేశము :—

"తన్నసర్వఇ వాభిప్రపద్యతే - బ్రాహ్మణోవైవ - రాజన్యోవా - వైశ్యోవా, తేహియజ్ఞియాఃసవై నసర్వేణైవసంవదేత - దేవాన్ వాఏష ఉపావర్తతే, యోదీక్షతే - సదేవానామేకోభవతి - నవై దేవాఃసర్వేణ

సంవదన్తే (అపితు) బ్రాహ్మణేననైవ, రాజన్యేనవా, వైశ్యేనవా, తేహి యజ్ఞియాః తస్మాద్యద్యేనం, శూద్రేణసంవాదోవిందేత్ - ఏతేషామేనైకం, బ్రూయాత్ ఇమమితివిచక్ష్వ - ఇమమితిచక్ష్వ - ఏషఉతత్ర దీక్షిత స్యోపచారః॥

ఈవిధానము సచ్ఛూద్రసఖ జెందినది. యజ్ఞేతర సామాన్యవ్యవహారములం దతడు వ్యవహార్యుడు కాని యజ్ఞ కాలమునం దితనికి బహిష్కారమే. ఇకనవర్ణుల నిరవసిత భావము సార్వకాలిక మగుట సిద్ధమే. ఇట్లే కచో దీక్షిత యజమానున కనర్ణులను, తత్సమములగు నితరపదార్థములను జూడరాదను నాదేశమున్నది. ఏలయన :—దృష్టిసూత్రము వలనగూడ (దేవ)ప్రాణమన్యమునందు సంక్రమించుచుండును. చూడుడు:—

(1) అసతోవా ఏషసంభూతః యచ్ఛూద్రః (తైబ్రా)
(2) అనృతం, స్త్రీ, శూద్రః, శ్వా - కృష్ణః శకునిః - (కాకః) తాని నప్రేక్షేత (శత)

ఇక "ముఖమస్తీతివక్తవ్యం దశహస్తాహరీతకీ" యను చౌకసామెత నాశ్రయించినవారికి జెప్పవలసినదిలేదు. కొందరు "బ్రాహ్మణభాగము వేదముకాదు. మూలసంహిత యే వేదము; అం దీజాతిపంక్తిభేదములును, స్పృశ్యా స్పృశ్యకలహములు లేవు" అందురు; వారికొరకభ్యుపగమ వాద మీనరకే యాశ్రయించితిమి; చూడుడు:—

"అగ్నయేత్వా జుష్టంప్రోక్షా మ్యగ్నీషోమాభ్యాం త్వా జుష్టం ప్రోక్షామి - దైవ్యాయకర్మణే శుంధధ్వం - దేవయజ్యాయై యద్వో శుద్ధాః - పరాజఘ్నురిదం, వస్తచ్ఛుంధామి, (యజుస్సం॥)

యజ్ఞమందు :—(1) శూర్పము (2) అగ్నిహోత్ర హవణి (3) స్ఫ్య - (4) కపాలము (5) శమ్యా - (6) కృష్ణాజినము (7) ఉలూఖలము (8) ముసలము (9) దృషత్ (10) ఉపలము అనుపదియజ్ఞపాత్రలుండును; ఉపయోగమునకు దెచ్చుటకుముందుగ శుద్ధికొఱకు వీనికి ప్రోక్షణకర్మ సేయబడును; ఈమంత్ర మాకర్మయందు వినియోగింపబడును; ఈపాత్రలనిర్మాత తక్షుడు. అతడు సచ్ఛూద్రుడు. కాని, దివ్యయజ్ఞియప్రాణహీనుడు; అతనిస్పర్శచే పాత్రలందు శూద్రసంబంధి యశుచిభావము సంక్రమించును. శోధింపకవాడు కొన్నచో నది యజ్ఞస్వరూపము౦ బాడుసేయును; కనుక మంత్ర - మం త పూతజలముల చే ప్రోక్షణరూప శోధనగావింపవలయును; బ్రాహ్మణమే స్వయముగ నీమంత్రమునకిట్లు వ్యాఖ్యానించెను.

"అథయజ్ఞ పాత్రాణి ప్రోక్షతి । యదో౽శుద్ధః పరాజఘ్నురిదం వస్తుచ్ఛన్ధామితి, తద్య దేవైషామత్ర - అశుద్ధస్తక్షావా, అన్యోవాఅమేధ్యః కశ్చిత్ పరాహన్తి, తదేవైషామేతదద్భిః మేధ్యంకరోతి" (శత)

శ్రీమహీధరుడిట్లు స్పష్టీకరించెను :—

"అశుద్ధా - నీచజాతయస్తక్షాదయః. వఃయుష్మాకం సంబంధి- తదంగం పరాజఘ్నుః - పరాహతం కృతవన్తః - ఛేదనతక్షణాదికాలే - స్వకీయహస్తస్పర్శరూపం అశుచిత్వంచక్రుః -

తదిదంవః - యుష్మాకం, అంగం. శుంధామి ప్రోక్షణేన శుద్ధంరోమి."

జడములగు పాత్రములకే శూద్రస్పర్శచే శుచిభావ సంబంధసిద్ధి యగుననుచో చేతనసంబంధి స్పృశ్యాస్పృశ్య భావముల గుణదోషములను వేరుగ జెప్పనలయునా ?| అస్పృశ్యత యొకవిజ్ఞానసిద్ధపథము.| అవివేకులగు జాత్యోపజీవులేమనుకొన్న నెట్లువర్తించిన నాయాఫలములుతప్పవు.

## బలానుగామి - వర్ణవ్యవస్థ

రస - బలాత్మక (సర్వబలవిశిష్టరసమూర్తి) పరాత్పరుడే, తన యొక ప్రదేశమున మాయాబలసీమితుడై యవ్యయు డనబడును. ఈయవ్యయుడే (1) మనోమయజ్ఞాన బలమున (2) ప్రాణమయకర్మబలమున (3) వాఙ్మయార్థబల మున (4) ప్రవర్గ్యరూపశరీరబలమున గ్రమముగ (1) బ్రాహ్మణ (2) క్షత్రియ (3) వైశ్య (4) శూద్ర - వర్ణములకు బ్రభవ మగుచున్నాడు; ఈనాల్గుబలములం దుత్తరోత్తరముకంటె బూర్వపూర్వము గరీయసము.

శరీరబలము శూద్రబలము. రాత్రింబవళ్లు శరీచింతాని మగ్నతమైనుండుట, శరీకవిన్యాసమందే కాలము సద్వినియోగముసేయుట శూద్రధర్మము. కేవల మిదియే ప్రధానమగుచో జ్ఞానబలము (బుద్ధిబలము) శిథిలమైపోవును; కనుకనే జ్ఞానబలానుగామియగు బ్రాహ్మణవర్ణమునకు "శరీరాయాసః

పరిత్యజేత్" అని యాచార్యులాదేశించిరి. శరీరమందలసట బుట్టించు శ్రమకర్మలెల్ల జ్ఞానబలానుగామి బ్రాహ్మణున కహితకరము లని తాత్పర్యము.

శరీరబలోపలక్షిత శూద్రబలముకంటె నర్థబలోపలక్షిత వైశ్యబలము శ్రేష్ఠము. అర్థబలసంపన్నుడగు వైశ్యుడు పెక్కురు శరీరబలానుగాముల ననుచరులంగావించుకొనగలడు. శరీరచింత ముఖ్యముగ బెట్టుకొని వైశ్యునాశ్రయించు బ్రాహ్మణుని బ్రాహ్మణ్య మభిభూతమై యర్థబలశాసనము నకు లొంగుటతథ్యము.

అర్థబలోపలక్షిత వైశ్యునికంటె గర్మబలోపలక్షిత (శాసనబలాపరపర్యాయక) క్షత్రియబలము శ్రేష్ఠము. గ్రామాధిపతి కనుచరుడగువానికి గూడ నర్థబలవిశిష్టునిపై శాసనాధికారమున్నట్లు మనము చూచుచున్నాము. ఇక జ్ఞాన లక్షణ బ్రహ్మబలముంజూతము.

క్షత్ర - విట్ - శూద్రబలములు మూడును సోపకరణములు సోపాధికములు నై యున్నవి. ఇవి భౌతికార్థప్రపంచమునకు బ్రధానతనిచ్చునవి. శస్త్ర - సేనా - దుర్గ - కోశాదులు క్షత్రియునకు, అనుచరులు ప్రాసాదములు అన్న - మణి - ముక్తాదులు, వైశ్యునకు; దుగ్ధ - ఘృత - పుష్టికరౌషధి - వనస్పతులు, దార్ఢ్య - అహమహమికాదులు శూద్రునకును బహిరంగబలములు, ఇట్లీబలతత్త్వత్రయము బహి

రంగ సాధనాపేక్షచే సాపేక్షికము, పరాశ్రితమునై యు న్నదికదా!

ఇక బ్రహ్మబలమన్ననో యుపాధిశూన్యమై అనగా బహిరంగోపకరణములను (నైయక్తికస్వార్థదృష్టితో) అపే క్షింపక ముఖ్యముగ నంతర్బలము ననుగమింపుచు, క్షత్రియ బలముకంటె శ్రేష్ఠమై సర్వశ్రేష్ఠ మగుచున్నది. భౌతిక ప్రపంచభారము సమాజముపై వేయక, నిఃస్వార్థభావమున (లోకకల్యాణహేతువే) విశుద్ధవిద్యాసంగమున బ్రవృత్త మగుచు, నిస్స్పృహావృత్తిచే సర్వమూర్ధన్యమగు నీబలము నెదుట సార్వభౌమక్షాత్రముగూడ నతమస్తకమై వర్తించును అన్నదోషమున, ఆలస్యమున, అసత్పరిగ్రహమున, భౌతికా సక్తిచే, అణగిమణగియున్న నేటి బ్రహ్మబలశేషమైనను అట నట, అపుడపుడు 'ధిగ్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలం' యని తన పూర్వగౌరవస్మరణము గావించు చుండక పోలేదు.

శరీర, ధన, ఐశ్వర్య, విద్యాబలములకంటె తపోబల మను నైదవదొకటి యపూర్వమగుబల మున్నది. అయ్యది విద్యాబలమునుగూడ శాసించును. సిద్ధిప్రకరణమున దీనిని దేవబల మందురు. విద్యాబలానుగామియగు బ్రాహ్మణుడు ఇతరవర్ణములను సుహృద్భావమున జూడనేర్చుంగాని వారికి నిగ్రహానుగ్రహ సమర్థుడుకాజాలడు. తపస్వి బ్రాహ్మణుడైన నో, బలప్రయోగమున వారిని సత్పథమందు నిల్పగలడు అభిశాపమున దండింపనుగలడు.

భారతవర్షమున నెంతవరకు దపోబలాధిష్ఠాత బ్రాహ్మణుడుండెనో, అంతవరకు నెవడు నుత్పథగామి గాసాహసింప లేదు. సాహసించెనా? వానిముఖమర్దనమయ్యెడిది. నేడా తపోబలముక్షీణించెను. అంతవరకేల? విద్యాబలమే యస్త్రప్రాయమయినది. కనుకనే యన్నివర్ణములు నుచ్ఛృంఖలములైనవి. నేటి విద్వాంసు లాతపోబలసంచయము సేయజాలనంతవరకు, ప్రస్తుతయుగవేగమున వృద్ధినొందునవివేకతయు నమర్యాదయు, నేవిధమునను నిగ్రహింపబడజాలవు. కేవల శబ్దనిష్ఠాయుగమూనాడు నీనాడునుగూడ గాదు. నమ్మెడన్నంతమాత్రమున నేటివరకు నెవడునునమ్మలేదు. ముందునంతే "నమ్మనిచో శిక్ష!" యనునాదేశనే నేటివరకు మర్యాదరక్షణ గావించినది. ఇందుసాధనము కేవలము తపోబలమునకు జెందిన వాగ్వీర్యమొకటియే.

పైజెప్పినబలములైదింటిని గ్రమముగ విజ్ఞానదృష్టితో (1) స్వాయంభువ (2) పారమేష్ఠ్య (3) సౌర (4) పార్థివ (5) భౌమబలము లందుము. ఏలయన:— పాంచభౌతిక, పంచపర్వవిశ్వమునకు, బ్రధానరూపమున స్వయంభూ – పరమేష్ఠి – సూర్య, – చంద్ర – పృథివి–అనునీ యైదుపర్వములు గదా! ఇందుజంద్రుడుపృథివి కుపగ్రహము గనుక నన్నలక్షణ (సోమలక్షణ) చంద్రుని అన్నాదలక్షణ (అగ్నిలక్షణ) పృథివియందేయంతర్భూతునిగ నెంచిరి. కాగా, చివరకు: మిగిలిన స్వాయంభు – పరమేష్ఠి, సూర్య – పృథివి – యనునీ

నాల్గులోకము లగును, ఇందు పృథివికి (1) చిత్య - (2) చితేని ధేయ భేదమున రెండురూపములు. ఇందు (1) చిత్యపృథివి పిండపృథివి దీనినే భూమి - భూ అందురు, (2) చితేనిధేయ పృథివి మహాపృథివి. దీనినేపూర్వము సంవత్సరయజ్ఞాత్మిక యగు 'నదితి' పృథివి యంటిమి. ఈదృష్టితో జివరకు స్వాయం భూ, - పరమేష్ఠి, - సూర్య - పృథివి - భూమి - యనుపంచ పర్వములగును; వీసయందే భూః - భువః - స్వః - మహః - జనత్ - తపః - సత్యం" యను ప్రాజాపత్యవ్యాహృతిసప్తక మంతర్భావమును నొందును. (1) భూః=భూమి (2) భువః=పృథివి (3) స్వః=సూర్యుడు (4) మహః, జనత్=పరమేష్ఠి (5) తపః, సత్యం=స్వాయంభూ:

(1) తపస్సత్యమూర్తియగు స్వాయంభుయొక్క బలమే సత్యగర్భితమగు తపోబలము (2) జనత్, మహోమూర్తి యగు పరమేష్ఠియొక్క ప్రాతిస్వికబలమే. సారస్వ - తౌప నిషద - విద్యాబలము ఇప్పట్టున నీశ్లోకముం జూడుడు:—

> "సిద్ధాంతమూపనిషదం, శుద్ధాంతంపరమేష్ఠినః
> శోణాధరమహంకించిత్ వీణాధరముపాస్మహే॥"
>
> (లఘుపాకాశకి)

(3) 'స్వః' మూర్తియగు సూర్యుని ప్రాతిస్వికబలమే లక్ష్మ్యనుగతము, ఇంద్రక్షత్రానుగతము నగు నైశ్వర్యబలము (4) భువః - మూర్తియగు పృథివియొక్క ప్రాతిస్వికబలమే, విష్ణుపత్నియగు లక్ష్మీదృష్టిచే ధనబలము. (5) భూఃమూర్తి

యగు భూమియొక్క ప్రాతిస్వికబలనే పోషకమగు పూషా ప్రాణ దృష్టిచే శరీరబలము. వీనియందు మొదటిదగు స్వాయంభువ తపోబలము వర్ణాతీతయు కనుక సర్వవ్యాపకము. నాల్గువర్ణములం దెవడైన స్వాతిశయమున తపస్వికావచ్చును. (ధర్మ వ్యాధాదులు). తక్కిననాల్గుబలములును క్రమముగ వర్ణ సృష్టికి ప్రవర్తకములు. వీనిం జక్కగ నుపాసించిన భారతీయసమాజ మభ్యుదయచరమసీమం జేరగలదను విషయము ముందు స్పష్టకాగలదు. బలానుగామినియగు ప్రాకృతికవర్ణవ్యవస్థ కియ్యది సంక్షిప్తనిదర్శనము.

ఈచెప్పినపంచబలముల యవాంతరసూక్ష్మవిభాగము లంగూర్చి విచారించుచో పదిబలములు కాగలవని యీక్రింది వచనములవలన స్పష్టముకాగలదు.

(1) తపస్వి - బ్రాహ్మణ - క్షత్ర - వైశ్య - శూద్రా - తినిర్బలాః షోఢావిభక్తాః పురుషాః యేషాందశవిధంబలమ్॥

(2) విద్యా - చాభిజనం - మిత్రం - బుద్ధిః - సత్వంచ - సంపదః - తపః - సహాయా - వీర్యాణి - దైవంచ - దశమంబలమ్॥

(3) విద్యాబుద్ధీ - బ్రాహ్మణానాం - తపః - సత్యే - తపస్వినాం దైవంవీర్యం - క్షత్రియాణాం - సహాయాః సంపదోవిశామ్॥

(4) శూద్రస్యాభిజనోమిత్రం - బలమిత్థంద్విధాద్విధా ఇత్థందశబలానీహ - సంశిలోకేషుభిన్నవత్॥



# సమాజానుబంధి - వర్ణవ్యవస్థ

పంచపశువిజ్ఞానానుసారము మనుష్యుడునొకపశువు. ఆరణ్య - గ్రామ్యభేదమున పశువులు రెండువిధములు. గుంపులుగనుండక యొంటరిగనుండగోరునవి యుండునవి యారణ్యపశువులు. (సింహశార్దూలాదులు) గుంపులుగజేరి యుండగోరునవి, యుండునవి, గ్రామ్యపశువులు. (మృగసృగాలాదులు). ఇందు గ్రామశబ్దము సమూహవాచకము. మనుష్యుడను శ్రేష్ఠపశువుగూడ "ఏకాకీనరమతేతద్వితీయమైచ్ఛత్ పతిశ్చ - పత్నీచ "- అన్నట్లు సంఘప్రియపశువు. పత్నీ - సంతా - నానుచర - బంధు - బాంధవ- సమాజాది పరిగ్రహముగొనియే యితనిమానవత్వము వికసిత మగును. కనుక సామాజికప్రాణి నారణ్యపశువనక గ్రామ్యపశువందురు. ఈ పరిభాషంబట్టి:—

మనుష్యు డొకసామాజికప్రాణి - గ్రామ్యపశువు. తన పరివారసహయోగమున దానొకసుసంఘటిత సమాజము నిర్మించి జీవనయాపనగావించుట మనుష్యునిస్వాభావికవృత్తి. కారణమేమన:— మనుష్యోత్పాదకద్రవ్య మనేకతత్త్వసమన్వితము. చూడుడు:— ఋషి - పితృ - దేవ - గంధ - ర్వాసుర - పశ్వాది యావత్ప్రాణప్రత్యంశలను స్వీకరించి తానొకగ్రామమూర్తియై మనుజుడుత్పన్నుడయ్యెను. సుఖదుఃఖ, పుణ్యపాప, సత్యానృత, సదసత్ - జ్యోతిస్తమ - దైవాసురాది సర్వద్వంద్వభావములు నితని కుపలాలకములై

యుండుచుండును. ఈ గ్రామభావమువలననే మనుష్యుడనుసీ నరుని దేవగ్రామమనిరని ("నరో వై దేవానాం గ్రామః) శ్రుతి చెప్పును. నరశబ్దము గ్రామ (సమూహ) భావగర్భితము. ప్రజాశబ్దము జనసమూహవాచకముగా నిరూపితము. ఈ కారణమువలననే శ్రుతి ప్రజా - నర - శబ్దముల సమాన వ్యాప్తిని లక్ష్యముగా జేసికొని ప్రజను నర యన్నట్లు ("ప్రజా వై నర,") గోపథశ్రుతివలన దెల్లము. ఈ ప్రాణ సమూహోపాదానతవలన మనుష్యుడొక సామాజిక ప్రాణి యందుము.

మనుజుడుజీవింపవలెను. సుఖముగా కాలయాపన గావింపవలయును శాంతితో. కాని, యీసుఖశాంతులు సామాజికధర్మసంబద్ధములు. సామాజిక శాంతి వైయక్తిక శాంతికి మూలము. కుటుంబము, సమాజము, రాష్ట్రము, ఈయన్నియు సమాజమునకే భిన్నభిన్నరూపములు. ఈ మూటియందును గ్రమముగ దహరోత్తరసంబంధముకలదు. వ్యక్తులు కుటుంబాత్మకసమాజగర్భమునను, అన్యావి దేశాచారానుబంధి సమాజలక్షణ సమాజములగర్భమందును, ప్రతిష్ఠితములు. అట్టివివిధసమాజసమష్టియే రాష్ట్రము. ఆర్ష దృష్టికిరాష్ట్రమే ముఖ్యసమాజము.

నేటి యుదారులు కొందరు విశ్వమంతయు రాష్ట్ర మనుకొని విశ్వశాంతికి సుఖస్వప్నములం గల్పించుచు తదాధారమున విశ్వమానవ సమాజశాంత్యుపాయములకై ప్రయ

శ్చించుచున్నారు. కాని, భారతీయదృష్టి యీవిశ్వభావనతో విరోధించును, దానికి, తనధర్మము వర్ణవ్యవస్థ, ఆశ్రమవ్యవస్థ యును సుఖశాంతులు, కృష్ణమృగము స్వచ్ఛందముగ జరించురాష్ట్రముకొరకేయని, నియమము. ఈసీమితదృష్టితో భారతవర్షమే మనముఖ్యరాష్ట్రము. ఇందలి వర్ణధర్మాను యాయినియగు ఆస్తికప్రజయే, మనసమాజము, ఈరాష్ట్ర ధర్మరక్షణయే నాటిరాష్ట్రవాదులగు మహర్షుల లక్ష్యము.

మనము మనస్వభావవినాశకారణమగు తృష్ణకువశపడి పోదగు వ్యాపకులము గానలెసని గోరము. మనకున్నదెల్ల నితరులకర్పించి దరిద్రనారాయణులముకాదగు నుదారతమన కక్కరలేదు. భారతీయధర్మస్వరూప వికృతిగావించివేయు సుఖశాంతులు మనకువలదు. ఇతరరాష్ట్రములును సుఖింప వలయుననియేకోరెదము. కాని పరవశతమెయి నందుకు మనము బలికాజాలము. పరగ్లానిహేతుభూతులముగాకుండ, మన ప్రాసమణుమాత్రము సహింపక, మనరాష్ట్ర ప్రకృతి రక్షణగావించుకొనుటే మనకువిశ్వశాంతి. ఈభారతీయ రాష్ట్రలక్షణ సమాజమును లక్ష్యముగాగొని మనము సమా జానుబంధియగు నీవర్ణవ్యవస్థను విచారింపవలసియున్నది.

రాష్ట్రలక్షణసమాజమునకు దన యోగక్షేమావసర ముగ కర్తవ్యకర్మరక్షణసేయవలయు నన్నచో నాపని సమాజమందలి వ్యక్తులదేయగును. రాష్ట్రసమృద్ధికరకర్మ లెన్నోకావలెను. ఒకటియు లోపింపజేయరాదు. మనపూర్వు

లట్టికర్మలను నాల్గుతరగతులుగ విభజించి యాకర్మభేదముం బట్టి ప్రజలనుగూడ నాల్గుతరగతులుగ భాగించిరి. తక్కినయ వాంతరకర్మలన్నియు నీనాల్గువిధముల కర్మలందు నంతర్భావ ములని ముందుముందెరుంగగలరు. రాష్ట్రీయసమాజకర్మా నుష్ఠానమునకు మూలమందు జ్ఞానబలము ప్రతిష్ఠితమైయున్న ప్పుడే ఆయనుష్ఠానము సఫలమగును. ఈవిధముగ నెవ్వడైనను మంచిచెడ్డకర్మల జ్ఞానములేకుండ ప్రవర్తింపజాలడు కనుక నన్నికర్మలు జ్ఞానపూర్వకములే యనుకొనవచ్చును. కాని అజ్ఞానముగర్భమందుగల్గి ( "అజ్ఞానేనావృతంజ్ఞానం తేనము హ్యంతిజంతవః") మోహలక్షణము నొంది కర్మస్వరూప విఘాతకమగునట్టి యవ్యవస్థితజ్ఞానము ప్రస్తుతమభిప్రేతము కాదు. మరేమన:— జ్ఞానకర్మలురెంటికిని సమానక్షేత్ర మును నిర్మించి మన మారెంటియందును సాంకర్య ముత్పన్నముసేయగోరము. ద్రష్టా - దృశ్యభావభేదము వలె రెంటిని భిన్నక్షేత్రములందు మర్యాదితములు గావించు ద్రష్టస్థానీయజ్ఞానముద్వారా, దృశ్యస్థానీయ కర్మసంచాల నము గావింపగోరుదుము. జ్ఞానమునకొకస్వతంత్ర శ్రేణి:— కర్మకొరకొకస్వతంత్ర క్షేత్రము.. ఈశ్రేణివిభాగనమే భార తీయసమాజముయొక్క సర్వోత్కృష్టపద్ధతి.

యుద్ధ, శస్త్రనిర్మాణ, శిల్ప - కళా - కృషి - వాణి జ్యాది సమాజోపయోగి కర్మలకెల్ల మూలమందు జ్ఞానము ప్రతిష్ఠితము. దానివల్లనే సర్వసంచాలనము సాగుచున్న

దనుట నిర్వివాదాంశము. సమాజముయొక్క యాజ్ఞానశక్తి యొక్క బల - పరిష్కారముంబట్టి దాని ప్రగతి యుండును. జ్ఞానము స్వతంత్రాస్తిత్వముగల యొకపదార్థము. దాని యనుష్ఠాన మొకకర్మ. తన్యక్తి కర్మకాలమందు గావించుట యసంభవము. — — —

జ్ఞానోదయము కర్మవల్లనే యగును. జ్ఞానోదయకారణ భూత విద్యాధ్యయన, ఏకాంతచింతనాదులు కర్మవిశేషములే యగును. కాని, యీ జ్ఞానోపయిక కర్మలు తమస్వరూప వికాసమునకు శాంతము నిరాపదమునగు వాతావరణము నపేక్షించును. కనుక తన యీ జ్ఞానశక్తియున్నతికొరకు దన్నుండి కేవల మీశక్తినుపాసించు నొకవిభాగము నియతము గావించుట సమాజమునకవశ్యకర్తవ్యమగును.

జ్ఞానలక్షణకర్మదీక్షితమగు నీసమాజాంగకర్తవ్య మేమన:- ఐహలౌకిక పారలౌకికతత్త్వములను శాంతభావమున నన్వేషించుచు జ్ఞానమునువికసింపజేయుట, సమాజమునందావు రించు నవిద్యాదిదోషముల నాజ్ఞనముచేదొలగించుచు, దానిని జ్ఞానసహకృతాభ్యుదయనిశ్శ్రేయసమూలక శాస్త్రీయ కర్తవ్య కర్మలందు యథాధికారముగ బ్రవృత్తముగావించుట. — 'జ్ఞానశక్త్యుపాసకమగు నీయవాంతరవిభాగమును బ్రాహ్మణ' శబ్దమునబిలుతురు.

జ్ఞానచర్య సహజముగ నర్థప్రపంచవిరోధిని, జ్ఞానార్థ ముల రెంటి నొకవ్యక్తి సంగ్రహించుటకష్టము. అందువలనను

కాని కనన్యతలేక రెంటియందు నపూర్ణుడగును. కనుక జ్ఞాన బలోపాసకుడగు బ్రాహ్మణు డర్థసంగ్రాహకరహితుడై యుండదగును. అతడు నొక పారివారికవ్యక్తియే. కుటుంబసంచాలకుడే కనుక నక్కరకొలది యర్థమున పేక్షించును. ఈ భార మర్థసంగ్రహశీలముగల యవాంతరవిభాగములు వహింపవలయును. బ్రాహ్మణుడును కొలదియవసరములు గలవాడును లోభమోహ - రాగద్వేషాదిరహితుడును, సర్వభూతహితరతుడు యదృచ్ఛాలాభసంతుష్టుడు గావలయును అప్పుడే యతనిజ్ఞానోపాసన సఫలముకాగలదు. అతనియవసరములను ప్రత్యుపకారవాంఛలేని ప్రణతభావమున సమాజము పూర్తిగావించితీరును.

తమోగుణప్రధానమగు విశ్వమందు రాగద్వేషములుండవనుట యసంభవము. భౌతికసంపత్తిగోరుట మనుష్యమాత్రునకు స్వాభావికము. రాష్ట్రములొకదానినిమించి యొకటి సమృద్ధినందవలయునని కోరుచు నహర్నిశలు పరస్వత్వములం గృధ్రదృష్టిం జూచుచుండును. అరక్షితమగు రాష్ట్రము దుర్బలమగును. సురక్షితము, సబలమునగు నన్యరాష్ట్రము దానిం దనపొట్టంబెట్టికొనును. ప్రతిరాష్ట్రము నీవిధిమగు బహిరంగపుటాక్రమణ లెక్కడనచ్చిపడునో యను భయమున సదా యెదురుచూచుచుండవలసియుండును. ఆభయమున్నంతవరకు దేశమునందలి కళలు, శిల్పము, వాణిజ్యము, విద్య మొదలగునవి వృద్ధినొందజాలవు.

కనుక నిట్టియాక్రమణలనుండి సురక్షితమును నుంచుట కొఱకు ప్రత్యేకవిభాగము నేర్పరించుట సమాజమునకు తప్పనిసరి యగును. మఱియు నాక్రమణ లేనాడువచ్చునో తెలియదు. రాష్ట్రమందును మనోవృత్తులభేదమున గృహకలహరూప విప్లవ ముదయింప దనజాలము. ఇట్టివేవియురాకుండను లేకుండను రక్షాకర్మయం దనన్యనిష్ఠాప్రవృత్తమైయుండు టీయవాంతరవిభాగకర్తవ్యము. దాని నార్థికచింతావిముక్తముగావించుటకు సమాజము తనయాదాయ షష్ఠాంశముచే దదీయరక్షాసాధనోపోద్బలకముగ నుండుట యుచితము. తత్ప్రాప్తిచే నారక్షకవర్గము యథావసరముగ సామదానభేద దండనీతులం బ్రయోగించి రాష్ట్రమునుశాసించును, పాలించును. ఈవర్గమే క్షత్రియనామమున బిలువబడును.

ఇట్లు రాష్ట్రమునకు బ్రాహ్మణవర్గముచే జ్ఞానసంపత్తియు క్షత్రియవర్గముచే రక్షాసాధనమును లభించెను. ఇందొకటిజ్ఞానగుప్తియందు సక్తము. మఱొకటి రక్షాకర్మయందు నియుక్తము. ఇపు డర్థసమస్య యెదుటికివచ్చును. అదేలేసినాడు రాష్ట్రస్వరూపరక్షయే యసంభవముగదా! ఏతచ్చింతావిముక్తికరర్థసంగ్రహ మాచరించుటకు సమాజమునందొకవర్గము నియుతముగ నుండవలయును. కృషి, గోరక్ష-వాణిజ్యములద్వారా ఆభారముందనపైనిడికొని యాచింతను దొలగించును. జ్ఞాన, శాసనములకంటెస్వరూపరక్షణభారము నిదివహించును. ఈవర్గము వైశ్యనామమున బ్రసిద్ధము.

ఇంతటితో రాష్ట్రావసరములన్నియుదీరినట్లే. కాని, పైజెప్పినమూడువర్గములకేగాక మొత్తముప్రజానీకమంత కును దప్పకకావలసిన ప్రాతిస్వికకర్మలెన్నో మిగిలియున్నది. అవియన్నియు సక్రమముగ జరుగకున్నచో రాష్ట్రమునకు మహత్వమేయుండదు. చూడుడు! ప్రాసాదనిర్మాణము-వస్త్ర నిర్మాణము - వస్త్రక్షాళనము - క్షౌరకర్మ - వాహనసంచాల నము - గోచారణము - భారవహనము - మృద్దారుశిలాలో హాదికమున వివిధశిల్పనిర్మాణము మొదలగున వెన్నో యున్నవి. ఇవ్వియవిఅందరకు నన్నియనస్థలందు, దత్తదను రూపముగ నవసరములే. కనుక నివి పరిచర్యలందుము. ఈ బహిరంగకర్మ భారమునవహించుటకొకవర్గ మవసరము. దానిని శూద్రనామమునబిలచిరి. సేవాధర్మ మిందు ముఖ్యము.

శూద్రవర్గము కుపాస్యము శరీరబలము. విత్త బలమువైశ్యవర్గమూలప్రతిష్ఠ. క్షత్రియవర్గమున కైశ్వర్య బల మారాధ్యము. బ్రాహ్మణవర్గాశ్రయభూమి జ్ఞానబలము. ఇట్లు నాల్గువిభాగములవారును స్వస్వకర్తవ్యకర్మలం దసన్య భావనిరతులై యన్యోఽన్యసౌహార్దమున సమానాకూతి నొంది తమవ్యక్తిత్వమును, పరివారమును - సమాజమును రాష్ట్రమును బ్రహ్మక్షత్రవిట్బలములను నీనాల్గులోకవిభూతు లచే సుసమృద్ధములగావింప సమర్థులగుదురు. ఈవిధముగ భారతీయసమాజశాస్త్రజ్ఞులు తమ యిాలోకోత్తరసామాజిక

కల్పనాధారమున సమాజమును కర్తవ్యకర్మభేదమున నాల్గు వర్గములుగా విభాగించిసర్వము సిద్ధముగావించుకొనిరి.

పై జెప్పిననాల్గవాంతరమువిభాగములు సామాజికమహా కర్మసిద్ధిదృష్టితో సమాజమునకావశ్యకము లన్నది యటుంచి నైతికదృష్టితో జూచినను వీనిమహత్వము తప్పునకాదు. ఒకే క్షేత్రమున నీనాల్గుశక్తులును సమావేశమగుచో (అట్లగుటయే అసంభవము, అయినచో రక్షణసర్వథాఅసంభవము.) ఆక్షేత్రము - సమాజము - రాష్ట్రము, యొక్క నైతికబలమధఃపతన మొందును. నేటిస్థితి యీకర్మసాంకర్యఫలితమే. 'అందరునన్నిటికధికారు' లనుజ్వరమే నైతిక ప్రతిష్ఠం బోగొట్టినది. ఎవరికి నేదియు నంటకుండ బోయినది.

మొదటబ్రాహ్మణులంజూతుము:— శిరస్థానీయమగు నీ వర్గము శిరోమూలకజ్ఞానబలముతో నుదరమూలకార్థసంగ్రహానుగమన మారంభించిననాటినుండియు జ్ఞానబలముక్షీణించుటే గాక జన్మజాతమగు నయోగ్యత్వ ప్రభావమున నర్థసంగ్రహమందును సఫలముగాజాలదయ్యె. చివరకు "ఇతో భ్రష్టఃతతో భ్రష్టః" పురస్కారమే, యావర్గమునకు దాయసంపత్తియయ్యెను. ఇది సేవాధర్మ ముత్తరాధికారముగ గ్రహించి స్వార్థవశమున బతనకర్మసమర్థన గావించున ట్లించుక కనులుమూసి యోచించిన దెలియగలదు.

ఆదర్శవర్గమిట్లుకాగా ననుయాయివర్గముమాట యేల ? క్షత్రవర్గమైశ్వర్యబలముతో విద్యార్థసేవాక్షేత్రములందు

నిష్ణాతము గాఁగోరుచు లక్ష్యచ్యుతమగుచున్నది. వైశ్యుఁడు సంపత్తిసంగ్రహముతోఁబాటు ఉపదేశకుఁడు కావలయునని యువ్విళ్ళూరుచున్నాఁడు, శూద్రుఁడు సేవాధర్మముతోఁబాటు విద్యాశాసనార్థక్షేత్రాధిపత్యముం గాంక్షించుచున్నాఁడు. చివర కిందెవరికి నేయితరధర్మము నంటుటలేకపోవుటేగాక స్వధర్మ ముగూడ శైథిల్యముగాంచుచున్నది.

ఈహీనస్థితికి గొందరుదారులు జాలిఁబొంది సంస్కరణాభిముఖులుకాగా ముగ్ధులు వారిపక్షం జేరిరి. పాశ్చాత్యాహారవిహారసభ్యతాది భూతప్రపంచమున్నతి కేకమాత్రమూలస్రోతస్సని యెంచు నాసంస్కర్తలగు పురుషపుంగవులు రోగచికిత్సకుబదులు రోగిలేకుండుట మంచిదని యుపదేశించిరి. కాలాతిక్రమమున వర్ణవ్యవస్థయం దేర్పడిన దోషములం దూరముగావించుట వంకగాఁగొని మొదలునరుకఁబూనిరి. ఉన్నతిపథమునకునీవ్యవస్థ కంటకప్రాయమనిరి. కల్పితసామ్యవాదఘోషతో జాతి - పంక్తి - వివాహాదులందు సమత యుపాదేయ మనదొడంగిరి. సంఘటనమును పేర మర్యాదాసూత్రములం ద్రెంపి కాల రాచిరి. దానితో గావరకున్న శాంతికూడ యూడిపోయినది.

స్వార్థలోలుపులగు కొందరుపదేశకులు, ధర్మరక్షకులు, వర్ణధర్మప్రతిపాదకశాస్త్రమును కేవల ముదరపూరణసాధకముగ జేసికొని యీవర్ణవ్యవస్థను దురుపయోగముగావించుచున్నా రనియంగీకరించెదము, స్వాధ్యాయప్రణాళీవిముఖ

మగు నీయుపదేశకవర్గము నేడు 'బ్రాహ్మణప్రవ' నామము నొందియున్నది. కొందరుక్షత్రియరాజులుకూడ "క్షతాత్కిలత్రాయతే" యనునిర్వచనమును విడచి రక్షాకర్మకు బదులు రక్తశోషణపద్ధతిం దమయుద్ధామవాసనాపూరణ గావించుకొనుటలో మగ్నులైయున్నారు. ఇన్నియున్నను, ఈవ్యవస్థ నిర్దోషమనుటకు వెనుదీయము. మందబుద్ధియొక డజ్ఞానమున విద్యుద్యంత్రముచే దన్నునాశముగావించు కొనుచో నందువిద్యుత్తుయొక్క దోషమేమి? అజ్ఞానవశమున జీవనసాధక మగు నన్నముకూడ నతియోగాయోగ మిథ్యాయోగాదికారణములచే నాశకారణమగునుకదా! ఈస్థితిలో ప్రకృతిమూలయు, సమాజానుబంధినియు నగు వర్ణవ్యవస్థపై గళంక మాపాదించు టనుచితము.

## మనభ్రాంతి - తన్నిరాకరణము

కొందరు:— ధర్మశాస్త్రశిరోమణిభూత మానవధర్మశాస్త్ర మొకరాజర్షికృతమైనను, "ధర్మశాస్త్రములు వారి శ్రేష్ఠతనిరూపించుకొనుటకు బ్రాహ్మణులనిర్మించిరి. బ్రాహ్మణులకంటె నితరవర్ణముల కందలి దండవిధానమునం దెక్కువ శిక్షలువిధింపబడినవి" యను నిత్యాదిగ బక్షపాతమారోపింతురు. ఈయభియోగ మాపాతరమణీయమే గాని తథ్యమా? మాఘమాసపుచలి, – అమావాస్యనాటిభయానకరాత్రి –

మార్గముననడచుబ్రాహ్మణున కసచ్ఛూద్రస్పర్శతగిలినది. అది యు బుద్ధిపూర్వకముగాదు; ఈదోషమునకు ధర్మశాస్త్రము బ్రాహ్మణునకు సచేలస్నానము విధించెను. శూద్రునకేమియు లేదు. పక్షపాత మెందున్నదో చూడుడు.

మనముస్పృశింపనిచో శూద్రునకునష్టమేమి ? స్పృశించుచో వానినుద్ధరించుటగునా ? అధికారానుసారము వానికిగా మహర్షులుచెప్పిన పనులందు తామువోటీకిబోవుడు. అంతే చాలును. అందువలన వారుద్ధరింపబడుదురు, భారతీయచర్మకారనిర్మితపాదరక్షలెందరుదాము వాడుచున్నారు ? స్టేఫ్టీ రేజరెందరిమంగలివారిపనితగ్గించినది ? ఇత్యాద్యుదాహరణము లెన్నికావలయును ? ఇక ధర్మవిరుద్ధములగు, దేవాలయప్రవేశము, వేదాధ్యాపనము, యజ్ఞోపవీతధారణ, సహభోజనము మొదలగుకర్మలవలన శూద్రులకు కల్గునుపకార మేమో వ్రేలు మడచి చెప్పుడు.

" దేవాలయములందు ప్రాణప్రతిష్ఠాపూర్వకముగ ప్రతిష్ఠింపబడినభగవత్ప్రతిమాదర్శనము పుణ్యప్రదము " ఇందుప్రమాణమేమి ? శాస్త్రము. - అయినచో నంతటను ఆశాస్త్రము ప్రమాణముకాదా ? ఈయర్ధజరతీన్యాయమేల? " దేవుడందరకుగలడు వానినెల్లరు నుపాసింపనర్హులు " నిజమే. ఒకశూద్రుడుగూడ, సత్యము, అహింస, భూతదయ, దానము, మనస్సంయమనము, ఈశ్వరనామశ్రవణము,

నామసంకీర్తనము మొదలగు సామాన్యధర్మములచే ముక్తినొం దనచ్చును. కాని, యుపాసనామార్గ మొకసువ్యవస్థిత నైష్ఠికమార్గము. ఇందధికారమర్యాద నవశ్యముపాటింపవలయును. ప్రతిమార్చనమున శూద్రున కుపకారములేదు. కాని తదీయదృష్టిసంసర్గమున ప్రతిమయందలి ప్రాణాతిశయము దూషితమై పోవును. ఆవైశిష్ట్యాధానము వలననేకదా, యొక పాషాణ ఖండమో, ధాతుఖండమో యీశ్వరాసనముం గ్రహించి మన కుపాస్యమైనది? కనుక 'వృథాన్యాబ్ధభంగమే' గాని యింకేమియు ఫలితములేదు.

శాస్త్రము ప్రతిమోపాసనకు అసంస్కృతము (ప్రాకృతికము) సంస్కృతము (కృత్రిమము) అని రెండుభేదము లంగీకరించెను. (1) విరాట్పురుషుని యంగభూతములగు సూర్యుడు, చంద్రుడు, పృథివి, గంగ, యమున ఇత్యాదులు, ప్రాకృతిక దేవప్రతిమలు. వీనినుపాసించుటకు వర్ణావర్ణుల కందరకునధికారముగలదు. (2) వేదమంత్రములచే నొక విశేషమైనప్రక్రియచే ప్రాణప్రతిష్ఠగావింపబడు పాషాణాది ప్రతిమలన్నియు సంస్కృతప్రతిమలు. అసంస్కృతులకు వీనిందర్శించిన యుపకారములేదు. అంతగా శ్రద్ధయున్నచో దమయిష్టప్రతిమనిర్మించుకొని యింటియందో సమదాయమందో యుంచికొని యుపాసించి సఫలతనందవచ్చును. కానిండు, ఇటు ధర్మశాస్త్రములు – ద్విజాతులకు ప్రతిమాదర్శనమున వచ్చుఫల మసంస్కృతులకు శిఖరదర్శనమాత్ర

మున నే లభించుననన్నవి. పోనింకు, ఈయ ప్రాకృతవిసంవాద ముతో నిట బనిలేదు. ఉపాసనకు జెందిన యీవాదము మరొకచో బరీక్షసేయుదము. ప్రస్తుతము, శాస్త్రాదేశ ప్రకారము నడచుట ప్రజలకు మంచి దనిమాత్రమే యందుము.

కొందరు "అయ్యా, రాజనీతిం గుర్తింపుడు, సమానాధికారములేని యీయసమానవ్యవహారమున నవర్ణులు విధర్మగ్రహణమున హిందూత్వమునకు దూరులైపోవుచున్నారు." అందురు. నిజముగ నిది గొప్పయనర్థమే. వెంటనే యిందుకు బ్రతిక్రియయు జూడవలసినదే. కాని యీ యనర్థము నాపుటకింకొక యనర్థమునకు బీజారోపణ సేయవలయునా?

అవర్ణులేల విధర్ములగుచున్నారు? ఆలోచింతురా? వారియుపదేశకులు. వారికగపరచిన దేవుడు వారినాధర్మమునం జేరబిలుచుటవలననా? మీరామాత్రము సేయజాలరా? వారిధర్మప్రచారమున కెంతవ్యయమగుచున్నది? ఎన్ని సంఘములు? చర్చలెన్ని? అందలిబోధనలతీరెట్టిది? మీరేమిసేయుచున్నారు? ఇంతకు మీవిశ్వాసము మీకు దృఢముగనున్నదా? సహేతుకముగ మీరుబోధించి చూచిరా? ప్రయత్నించిరా? అందులకు రవంత శ్రమ, ఒకతృణమైనవ్యయము, సేయుచున్నారా? అవర్ణులేల? విదేశీయుల ప్రలోభనములకు నామమాత్రముగ హిందువులనుకొను సవర్ణు లెందరులొంగియుండుటలేదు? అవర్ణుల దోషములకు సవర్ణులేకారణ మనుటసత్యదూరమా? మన

మఠాధిపతులు, ఇతరసన్యాసులు, ఆశ్రమములు నిర్మించుకొని యేమో చేయుచున్నట్లు నటించు మహానుభావులు, మహాత్ములు – పరమహంసలు – నేమిసేయవలయును? ఏమి సేయుచున్నారు?

ముందుగావలసినది, ధర్మనీతియా? రాజనీతియా? రెంటికిసంబంధము లేదా? ధర్మనీతిలేని రాజనీతిసంఘమా రాష్ట్రము? హిందూత్వమునకు ప్రత్యేకలక్ష్యమాయిది? ధర్మనీతి-రాజనీతులం దేది దేనికిలోంగియుండవలయును? ప్రస్తుతస్థితి యెట్లున్నది? రాజనీతిశబలితముగాని ధర్మనీతికలదా? (పోపు) ధర్మోపదేశకుల కించుకలోంగిన ట్లగపడు విదేశీయులు మన కంటె కొంచెము మెఱుగేమో యోచింతురా?

ఏమందుము? పోనిండు, భారతీయధర్మ మితరధర్మములవలె సామయికపురుషశ్రేష్ఠుని కల్పనలకు జెందినది కాదనియు, నది జగన్నియంతయు జగదీశ్వరుడునగు నతని సనాతనావిచ్ఛిన్నమర్యాదాసూత్రమనియు మాత్రము జ్ఞప్తియందుంచికొన గోరెదము.

ఈధర్మసూత్రమే హిందుత్వము. దీనిగర్భమందు హిందూవ్యక్తియొక్క వైయుక్తిక, కౌటుంబిక, సామాజిక, రాష్ట్రీయైహలౌకికకర్మలును, యజ్ఞతపోదానాది పారలౌకిక కర్మలును, అన్నియు నున్నవి. ధర్మశాస్త్రము, వర్ణవ్యవస్థ, ఆశ్రమవ్యవస్థ, ధర్మమూలకవర్ణభేదము, వర్ణభేదమూలక

కర్తవ్యభేదము మొదలగునవే హిందూత్వపరిభాషలు, మన యీ హిందూత్వమునే పోగొట్టుకొన్న యుచ్ఛృంఖలరాజనీతి మన కేమియుపయోగించును? మన జాతి, కర్మ, ధర్మ, ఉపాసనా, జ్ఞానములన్నియు మర్యాదితములు. అధికారభేదమున, యోగ్యతానుసారముగ సువ్యవస్థితములు. ప్రవాహపతితులమై యీ ప్రాకృతికాధికారములకు జలాంజలి యిచ్చుకొన్నచో విదేశీయులకు మనకును భేదమేమి? మనము, మనముగానుండక, మౌలికత్వము ధ్వంసముగావించుకొని స్వతంత్రులము కాగోరుదుమా? ఈపశులకుణ స్వతంత్రతకు నేడు మనకడ్డమేమున్నది? ఇప్పటికి మనకదిలభింపలేదా?

ఏజాతికైన ఏదేశమునకైన స్వతంత్రతకు మూలమంత్ర మాయాజాతియొక్క స్వధర్మము. భారతవర్ష స్వతంత్రత కీ వర్ణధర్మము మూలమంత్రము. ప్రస్తుతరాజనీతి యనుగ్రహమువలన కొలదిగనో గొప్పగనో అన్నపానములందమర్యాదితమగు సదుపాయములభించినది. ఇందుకు బ్రత్యుపకారముగ మనమౌలికత బలియిచ్చుకొన్నచో చివరకు మనకు లభించునది సర్వనాశముగాకమరేమి? కాలమెంతయోపట్టునుగాక! మనమౌలికతను గాపాడుకొనుచు ధర్మరక్షణగావించుకొనుచు నభ్యుదయపథమున నడువవలయును. "అనేకవిజేతృజాతులీరాజనీతి దుర్ధర్షప్రాంగణమునకు వచ్చి డీకొనిపోయినవి. నేడు వాని పేరుకూడమిగులలేదు. అనేకశతాబ్దులనుండి పరతంత్రతాపాశబద్ధమయ్యు

నీ హిందూజాతి నేటివరకు దన సనాతనమౌలిక తాధారము పైననే బ్రదికియున్నది" అనుకొనవలయును.

"వర్ణధర్మము హిందూజాతికి గ్రమముగ హ్రాసకారణమైనది. హిందూజాతి, హిందుత్వము సురక్షితముగానలె" నను బుద్ధివాదులు ఇందుకు ధర్మపరిత్యాగము, వర్ణధర్మోపేక్ష మర్యాదాసూత్రోచ్ఛేదము మొదలగునుపాయములు స్వీకరించిరి. మంచిది, వారినొకటియడిగెదము:— వర్ణధర్మముగాక హిందుత్వమునకు మరొకపరిభాష యెట్టిది? "ప్రకృతిసిద్ధవీర్యభేద మంగీకరింపవద్దు అధికారభేదసిద్ధ కర్మభేదవ్యవస్థ స్వీకరింపకుడు, ఎవడైన నెవనియనుశాసనము నకును బద్ధుడుకారాదు. అందరును స్వేచ్ఛాచారులుకావలయును, అన్నపానములకును, వివాహమునకును ధర్మముతో సంబంధములేదు. స్పృశ్యాస్పృశ్యవివేకము స్వార్థలీల" ఈయాదర్శవాక్యముల పేరే హిందూత్వమా? ఏతదాధారముననే జాతి జీవితమును రక్షించుకొనునా? యోచింపుడు. మాకోసముకాదు. పూర్వులగౌరవరక్షణకోసము, భావిసంతతి కల్యాణముకోసము, యోచించి తెలిసికొని బుద్ధివాదప్రసారముగావింపుడు.

ఇంకొకయాక్షేపము, "దండవిధానమున మనువు బ్రాహ్మణపక్షపాతముం జూపెను. శూద్రునకు కఠినశిక్ష వచించెను" అని:— నిజమే చూతము. వర్ణములందేదియు

తక్కువమహత్త్వముకలదని మనువుమతముకాదు. అట్లని తారతమ్యముండకపోదు. అయ్యది ప్రకృతిసిద్ధ మని యీవరకే యెరిగితిమి. ఇంకను నెరింగెదము. ఆయావిశేషతలే జాతికి మూల్యములు. అందువలననే శ్రేణీవిభాగము కలిగినది. ఇందెక్కువతక్కువలు లేవు. బ్రాహ్మణుడు:— శిరస్థానీయుడు జ్ఞానప్రదుడు, ముఖ్యుడు, ఇహలోక సుఖసాధనపరిత్యాగపూర్వకముగ గాయక్లేశములను సహించి యనన్యభావమున యావజ్జీవము జ్ఞానచర్యయందు నిమగ్నుడై యుండువాడు. నిజముగ నట్టి 'ఏవంవిద్' సమాజమున కమూల్యనిధి. అతని నవమానించుట యసహ్యమైనను అతనియాకస్మికాపరాధము సహ్యమే, యగును. అయినను క్షంతవ్యుడో, స్వల్పదండభాగియో కానచ్చును. కాదనువారు "బ్రాహ్మణుడుకల్లు త్రావినచో నాకల్లు సలసలమరుగబెట్టి యతడు చచ్చువరకు నతనినోటబోయవలయు" నన్న స్మృతివచనముంజూచి శాంతిం తురుగాక! సామాన్యాపరాధముకే యట్టియమూల్యనిధిం బోగొట్టుకొన్నచో సమాజమునకు నష్టముగదా! అతని పరితాప - ప్రాయశ్చిత్తములకు స్వల్పదండముచాలును, "సంభావితస్యచాకీర్తి ర్మరణాదతిరిచ్యతే" గదా! దండవిధానము దేశకాలపాత్రముల యోగ్యతంబట్టియుండు ననుట లోకవిదితము. రాజప్రతినిధియు సాధారణమానవుడును మనుష్యత్వమున సమానులయ్యును సమానాపరాధమున సమానశిక్షార్హులగుదురా?

మరొకయాక్షేపము:— "భగవంతుడు శ్రీరాముడు శబరియెంగిలిపండ్లుదినెను. అస్పృశ్యుడగునిషాదుని (గుహుని) గాగలించుకొనెను. శ్రీకృష్ణుడువిదురునింట విందారగించెను. ఇత్యాదులెన్నోకలవు. అట్టియాదర్శపురుషు లస్పృశ్యతం బాటింపనపుడు "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరోజనః" యని యాదేశమున్నపుడు, అస్పృశ్యత స్వార్థముతో గూడిన కల్పన, మానవసమాజమునకు గళంకమునుకాదా?" అని.

నిజమే, భగవంతులట్లుచేసిరి. చేయుదురు, చేయుచున్నారు. వారు భగవంతులు వ్యాపకులు, వారి కధికారము కలదు. వారిస్పర్శనుండి తప్పుకొనునదేది? విభూతియోగమును దాటగలమా?......... మనమువ్యాపకులమా? వ్యాపకదృష్టికలవారమా? విశ్వధర్మము మనలను తనవంక కీడ్చుటలేదా? పుత్రమిత్రకళత్ర బంధుబాంధవాదిలౌకిక భేదము మనకభేదమయినదా? భగవంతులమయితిమా? కాకుండ వారిచరిత్ర ననుకరింప నధికారమెట్లు? ఆదర్శపురుషులవలె మనముప్రవర్తింపవచ్చునా? శంకరునట్లువిషపానము సేయనేర్తుమా? అగస్త్యునట్లు సముద్ర మాపోశనపట్టెదమా? ఈవచనములుచిత్తగింపుడు:—

> ధర్మవ్యతిక్రమోదృష్టః ఈశ్వరాణాంచసాహసమ్
> తేజీయసాంనదోషాయ, వహ్నేఃసర్వభుజోయథా.
>
> నైతత్సమాచరేజ్జాతు, మనసాపిహ్యనీశ్వరః
> వినశ్యత్యాచరన్ మౌఢ్యాత్ యథారుద్రోబ్ధిజంవిషమ్!!

ఈశ్వరాణాంవచస్సత్యం, తథైవాచరితంక్వచిత్
తేషాంయత్ స్వవచోయుక్తం, బుద్ధిమాంస్తత్సమాచరేత్.

కుశలాచరితేనైషాం, ఇహస్వార్థోనవిద్యతే
విపర్యయేణవానర్థో, నిరహంకారిణాంప్రభో !

కిముతాఖిలసత్వానాం, తిర్యఙ్మర్త్యదివౌకసాం
ఈశితుశ్చేశితవ్యానాం, కుశలాకుశలాన్వయః.

యత్పాదపంకజపరాగనిషేవతృప్తా, యోగప్రభావవిధుతాఖిలకర్మబంధాః
స్వైరంచరన్తిమునయోఽపినహ్యమానాః తస్యేచ్ఛయాత్తవపుషఃకుతఏవబంధః

క్షయకీటాణువులు స్పర్శాదిసహదోషములచే మన శరీరమునం బ్రవేశించి మనలం బాధసేయును. అవి సూర్య సంబంధమున దమఘాతక - దోషావహస్వరూపముం ద్యజించి వేయును. వీని ప్రభావము సూర్యునిముందర పనిసేయదు గదా! అమానవదివ్యపురుషుఁడు భగవంతుఁడు అతనికన్నియు సమానము. అతని యీవ్యావహారికజగత్తున నందరువిభిన్న - విశేషధర్మముతోడనే గూడియుండును. పైవాక్యములం బట్టి:— సత్యము - అహింస అస్తేయము, భూతదయ - ఆస్తిక్యము - బ్రహ్మచర్యము - మొదలగు కొన్నిసామాన్య ధర్మములందప్ప సమర్థపురుషుల లోకోత్తరచరిత్రానుకరణము సర్వథా పిచ్చితనమగును. వారివచనములే కల్యాణకరములుగాని వారిచేష్టలు మనకాదర్శములుకావు. కాదందురా? వారి నన్నింటియందుననుకరింపరాదా? అప్పుడు మిమ్మేభగవంతులుగ నెన్ని మీవచనములు వేదమందుము.

వట్టివత్సితవచనముల కార్యసంతతియందు విలువలేదు. సరి: గ్రంథము పెరుగుచున్నది.

వర్ణవ్యవస్థయు దానికిజెందిన ధర్మభేదము, విజ్ఞాన దృష్టికి సంబంధించినది. అందు వెంటనే చూపుచోరజాలము. దౌర్భాగ్యమున వైదికవిజ్ఞాన పారంపరిక స్వాధ్యాయ క్రమము నే డుచ్ఛిన్నప్రాయమైనది. అరదువలన మౌలిక తత్త్వము నెరుంగజాలక బాలబుద్ధులు సైతమాక్షేపించుట విననచ్చుచున్నది. ఏమైనను మనబుద్ధివాదులు తమబుద్ధివిశేషముం దురుపయోగముగావింపక ఈవైపున కించుకచూచి నచో పోగా పోగామిగిలిన యీభారతవైభవముం గాపాడిన గౌరవము నొంది యమరకీర్తింగాంచగలరు. పరమేశ్వరుడు వారికట్టి బుద్ధిం బ్రసాదించుగాక! యని పాఠకులదృష్టి మరల సామాజికవ్యవస్థవంకకు ద్రిప్పగోరుచున్నాము.

## ఆక్రమణరక్ష – వర్ణవ్యవస్థ

సామాజికదృష్టితో సమాజమును సువ్యవస్థితము గావించుటకు శ్రేణీవిభాగమూల వర్ణవ్యవస్థ యవసరమను ప్రసంగము నడచుచున్నది. రాష్ట్రసమృద్ధికి, స్వరూపరక్షకు, బ్రతిదశయందును, (1) శిక్షక (2) రక్షక (3) ఉత్పాదక (4) సేవకులను నాల్గువిభాగములవసరము. ఇందు క్షత్రియుడు కేవలము రక్షకుడే, వైశ్యుడుత్పాదకుడే, శూద్రుడుసేవకుడే, కాని;— | బ్రాహ్మణుడు శిక్షకుడగుటతో బాటు రక్షకుడు,

నుత్పాదకుడు - సేవకుడునగును. మూఁడు వర్ణములకు మూల మగు నీ వర్ణమట్లు కావలసినదే. మరియును;- బ్రాహ్మణునిచే నడుపబడు రక్షణోత్పాదన సేవాకర్మలు, క్షత్రియవైశ్య శూద్రులచే నడుపబడువానికంటె మహత్వముగలవి. కనుకనే బ్రాహ్మణుడు ప్రజాపతికిముఖ మనిరి. ఇతనిరక్షావృత్తియే మో చూతము.

మొదట రాష్ట్రముపై వచ్చునాక్రమణలేమో చూతము మనుష్యుడనః— అధ్యాత్మ - అధిదైవత - అధిభూతభావముల సమష్టి. ఈమూడుభావములుఃక్రమముగ (1) కారణశరీరో పలక్షిత - మనఃప్రధాన - జ్ఞానమయ - ఆత్మగ్రామము, (2) సూక్ష్మశరీరోపలక్షిత - ప్రాణప్రధాన - క్రియామయ - దేవగ్రామము (3) స్థూలశరీరోపలక్షిత - వాక్ప్రధాన - అర్థ మయ - భూతగ్రామము, అని ప్రసిద్ధినొందినవి. ఈమొత్తము మనుష్యుడు. అన్నిటికిపైనున్న స్థూలశరీరరూప భూతగ్రామ మాధిభౌతిక ప్రపంచము. దానికాధారముగ నందు సూక్ష్మ శరీరరూప దేవగ్రామ మాధిదైవిక ప్రపంచము. దానియందలి సర్వాంతరము సర్వాధారమునగు కారణశరీరాత్మ కాత్మ గ్రామ మాధ్యాత్మిక ప్రపంచము ఇందొకొక్కటియు, పంచపంచపర్వములు గలదగుట నీమూడును ప్రపంచము లందురు. ఆత్మలైదు - దేవతలైదు - భూతములైదు - ఈ సముదాయహేతువుంబట్టి గ్రామమనియు వ్యవహరింతురు. ఈమూడు ప్రపంచములకు నతీతము మాండూక్యపరిభాషాను

సారము ప్రపంచోపశమ మని ప్రసిద్ధిగన్న తురీయతత్త్వము పురుషాత్మ ; ఇదివర్ణమర్యాదాబహిర్భూతము. సృష్టిస్థితిలయములతోదీనికిబని లేదు. ప్రయోజనము లేదు. రక్షాపేక్షయు లేదు. ఇక నిందలిస్వల్పమాత్రలం గ్రహించి యితర ప్రపంచములు రక్షాభిమానముగావించును. ఇంతకు: మనుష్యసంస్థయందు, త్రిగుణాతీతము ద్వంద్వాతీతము నగు నొకపురుషాత్మయు నైదుగుణాత్మలు నైదు దేవతలు, నైదుభూతములు, నాల్గువివర్తములు కలవని తేలినది:— ఈపరిలేఖంజూడుడు

మనుష్యసంస్థ:— { పురుషాత్మ - సాక్షి
తురీయుడు - ప్రపంచోపశమము

| 1 ఆత్మప్రపంచము | 2 దేవప్రపంచము | 3 భూతప్రపంచము |
|---|---|---|
| 1 అవ్యక్తాత్మ (స్వాయంభువః) | వాక్ — అగ్ని | పృథివి |
| 2 మహానాత్మ (పారమేష్ఠ్యః) | ప్రాణః — వాయుః | జలము |
| 3 విజ్ఞానాత్మ (సౌరః) | చక్షుః — ఆదిత్యః | తేజస్సు |
| 4 ప్రజ్ఞానాత్మ (చాంద్రః) | శ్రోత్రం - దిక్సోమః | వాయుః |
| 5 ప్రాణాత్మ (పార్థివః) | మనః - భాస్వరసోమః | ఆకాశము |
| అధ్యాత్మం, కారణశరీరము. మనోమయ జ్ఞానప్రధాన. ఆత్మగ్రామము | అధిదైవతము, సూక్ష్మశరీరము, ప్రాణమయ, క్రియాప్రధానమైన గ్రామము | అధిభూతము, స్థూలశరీరము, వాఙ్మయ, అర్థప్రధానభూతగ్రామము |

ఈమూడుసంస్థలందును దోషసంక్రమణ మనివార్యము (1)క్లేశాత్మకములు క్లేశప్రవర్తకములు నగు నవిద్యాస్మితారాగద్వేషాభినివేశము లను నీ యవిద్యాదోషము

లైదును గారణశరీరాత్మ కాధ్యాత్మిక ప్రపంచము నాక్రమిం చుచుండును అందువలన నాత్మ ప్రపంచమునకు - సాక్షియగు పురుషోత్తమతో మేళనగావించు స్వాభావికజ్ఞానశక్తి యావృతముకాగా నీయాత్మసంస్థ క్రమముగ నజ్ఞానలక్షణ మోహము, అనైశ్వర్యము, ఆసక్తి- అధర్మము ననుభావము లకు వశమై యశాంతమగును. (2) కామాద్యరిషడ్వర్గము సూక్ష్మశరీరాత్మ కాధిదైవిక ప్రపంచము నాక్రమించుచుం డును. అందువలన శారీర దేవతల, (పంచేంద్రియములు) దివ్యకర్మశక్తి విలుప్తమై చిపరకవిక్షుబ్ధము లగును. (3) ప్రజ్ఞాపరాధమువలన తమస్వరూపభంగ మొనరించు, హీనయోగాతియోగ మిథ్యాయోగాయోగములను నీ నాల్గుమిత్సితయోగములను మూలముగాగొని యంకురించు సర్వవిధరోగములును స్థూలశరీరాత్మ కాధిభౌతిక ప్రపం చము నాక్రమించును. అందువలన ప్రాణాగ్నినిర్బలమై స్ఫూర్తియంతరించును. కర్తవ్యకర్మోత్సాహము చెడును. ప్రకారాంతమున:- (1) రోగాద్యాక్రమణమున స్థూలశరీర మరక్షితమగును. (2) కామాద్యాక్రమణమున సూక్ష్మశరీ రము సంత్రస్తమగును. (3) అవిద్యాద్యాక్రమణమున గారణశరీరము పరాపృష్టమగును. అని ఫలితార్థము.

మనుష్యుడు వికసింపవలెనన్నచో పుట్టుకనుండియు నుండు నీదోషములం దొలగించుకొనుటయు, భవిష్యమున రాకుండ జేసికొనుటయు, గావలయును లేదా యతడుసురక్షి

తుడుగ నుండజాలడు. ఈ త్రివిధరక్షాకర్మయు కేవలము బ్రాహ్మణసమాజ ప్రాతిస్వికకర్తవ్యముగా నెంచబడెను. తన జ్ఞానబలప్రభావమున నది మానవసమాజమందలి యీ త్రివిధ దోషములం బోగొట్టగలదు. ఎట్లన:— రక్షాధికరణములు మూడు. కనుకనే బ్రాహ్మణోపదేశలక్షణ రక్షాశాస్త్రము కూడ దర్శనతంత్రత్రయివలె మూడుతంత్రములుగ భాగింప బడెను (1) స్థూలశరీర చికిత్సకాయుర్వేదము (2) సూక్ష్మ శరీరచికిత్సకు ధర్మశాస్త్రము (3) కారణశరీరచికిత్సకు దర్శన శాస్త్రము. ఇందు మొదటి దర్థప్రధాన భూతప్రపంచరక్షక మగుటచే నర్థప్రధానశాస్త్రము. రెండవది క్రియాప్రధాన దేవప్రపంచ రక్షక మగుటచే గర్మప్రధానశాస్త్రము. మూడవది జ్ఞానప్రధానాత్మప్రపంచ రక్షకమగుటచే జ్ఞాన ప్రధానశాస్త్రము. ఈమూటికినుపదేశకుడు ప్రవర్తకుడు బ్రాహ్మణుడే. అతడే తన యీ త్రివిధోపదేశములచే వ్యక్తు లందలి త్రివిధదోషములం దొలగించి భావియాక్రమణల నుండి రక్షించును. ఇట్లతడు శిక్షకుడగుటే కాక రక్షకుడు నగు చున్నాడు.

పై జెప్పిన మూడాక్రమణలకును శరీరత్రయమునకు జెందిన యంతరంగసంస్థతోడనే సంబధము. ఎట్లన బహిర్జగ ద్దృష్టింబట్టి శరీరసంస్థ యంతరంగసంస్థగ నెంచబడినది. దీనికి పైనుండి రెండువిధముల యాక్రమణలు వచ్చును వానికి కేవలము స్థూలశరీరముతోడనే సంబంధము. ఆరెంటిని ఆధిదైవిక - ఆధిభౌతిక - ఆక్రమణలందుము.

ఉల్కాపాతము, భూకంపము, అతివృష్టి, అనావృష్టి
కరకాపాతము, ఇత్యాదు లీశ్వరతంత్రమునకో, ప్రకృతి
తంత్రమునకో చెందినవి. వీనినాధిదైవిక బాహ్యాక్రమణ
లందుము. వీని నివారణకు రాజతంత్రమేమియుచేయజాలదు.
అందలి న్యాయాలయములందు మేఘాదులపై నభియోగము
చేయనైతికాదు. వీనిదొలగించుపని కేవలము బ్రాహ్మణునిదే.
సాధన మొకవిజ్ఞానమయ వేదశాస్త్రమే. సహాయకుడు
క్షత్రియరాజే. (దైవీనాంమానుషీణాంచ ప్రతికర్తాత్వ
మాపదాం)

ప్రకృతితంత్రసంచాలనగావించు ప్రాణదేవతలందలి
విషమతయేర్పడగా నాప్రకృతిమండలమున గల్గు క్షోభవలన
నాధిదైవికాక్రమణ కల్గును. రాష్ట్రమందలి పాపము - అనా
చారము - ప్రకృతివిరుద్ధప్రవర్తనము - వర్ణాశ్రమధర్మపరి
త్యాగము - మొదలగు దుష్కృత్యములే- వికృతిరూప
మానవసంస్థ యందుండుప్రాణదేవతలతో నిత్యసంబద్ధులగు
నాప్రాకృతిక ప్రాణదేవతల క్షోభకు గారణములగును.
అప్పుడు ఏదోషమువలన నేప్రాణదేవత వికృతినొందెనో
కారణములరసి, వైజ్ఞానిక పరివర్తనములచే నాయూజాడల
దెలిసికొని అధ్యాత్మచికిత్సలాచరించుట విద్వాంసుడగు బ్రాహ్మ
ణునికర్తవ్యము.

అందులకుసాధనము వేదసిద్ధయజ్ఞకర్మయే. ప్రకృతి
యొక్క (సౌరమండల) ప్రాణదేవతలు పార్థివసంస్థతో.

యథానియమముగ గూడుచుండురు. రెంటికి బరస్పర మాదాన - విసర్గాత్మక "ప్రహితాంసంయోగః" - 'ప్రయు తాంసంయోగః' అగుచుండును. స్వాభావికమగు నీ దేవ సంగమకర్మ పేరే ప్రాకృతిక నిత్యయజ్ఞము. "సహయజ్ఞాః ప్రజాఃసృష్ట్వా పురోవాచ ప్రజాపతిః" ఇత్యాదులందీవిష యము స్పష్టమే. ఈయజ్ఞాధారముననే మహర్షులు వైధయజ్ఞ పద్ధతుల నావిష్కరింపజేసిరి. తత్ప్రతిపాదకము వేదశాస్త్రము. దానిని కేవలపారాయణవస్తువుగా జేసికొని నేటిబ్రాహ్మణ వర్గము తనమహత్త్వముం బోగొట్టుకొన్నది. దర్శనశాస్త్రము జ్ఞానప్రధానమగుచో వేదశాస్త్రము విజ్ఞానప్రధానము. అది యాధ్యాత్మికప్రపంచచికిత్స సేయుచో నిది యాధిదైవి కాక్రమణ ప్రతిబంధకము. ఈవిధముగ నీరక్షాకర్మ (1) ఆధ్యాత్మిక (2) ఆధిదైవిక (3) ఆధిభౌతిక (ఈమూ డును కారణ - సూక్ష్మ - స్థూల - శరీరసంబంధులు) (4) ఆధి దైవికము (ప్రకృతిమండలసంబంధి)లని నాల్గువిధములగును. ఇందు ప్రకృతిమండలమునకు జెందిన యాధిదైవికాక్రమ ణను మున్ను బహిరంగాక్రమణగ నంగీకరించితిమి కాని ప్రాణదేవతాపేక్షంబట్టి దీనింగూడ నొక యంతరంగాక్రమ ణమే యందుము. ఎందుకనః— ప్రకృతియందలి ప్రాణ దేవతలం దెపుడేవిపర్యయమగుచున్నదో, ఆవిషయము స్థూలదృష్టికి లొంగదుకదా కనుక నీనాల్గింటి నంతరంగరక్షా

కర్మలే యందుము వీనికి కేవలము వేదవిత్కర్మఠ బ్రాహ్మణుడే ప్రభువు.

| ఆక్రమణ | ప్రధానము | సంబంధి శరీరము | శాస్త్రము | శుద్ధి | రక్ష | |
|---|---|---|---|---|---|---|
| ఆధిభౌతిక | అర్థ | స్థూల | ఆయుర్వేద | శరీర | భూత | వైయక్తిక సామూహిక |
| ఆధిదైవిక | కర్మ | సూక్ష్మ | ధర్మ | అంతఃకరణ | దేవ | |
| ఆధ్యాత్మిక | జ్ఞాన | కారణ | దర్శన | ఆత్మ | ఆత్మ | |
| ఆధిదైవిక | విజ్ఞాన | విశ్వ | వేద | ప్రకృతి | ప్రకృతి | |

ప్రకృతి సంబంధముగల బాహ్యాధిదైవికాక్రమణ స్వరూపము చూపబడినది. ఇపుడొక బాహ్యాధిభౌతికాక్రమణ మిగిలియున్నది. స్వార్థవశమున నొకడొకనిసంపద నపహరించుచు. నిరపరాధినొకడుకొట్టును. నీచుడొకడు గౌరవనీయు నవమానించును. సబలు డబలునిపీడించును. హింస్రకము లగు వన్యపశువులు వ్యవసాయము నష్టముగావించును. సింహవ్యాఘ్రాదులు సమాజజీవనమున కాపత్తియాసాదించును. ఇవి యన్నియు బాహ్యాధిభౌతికాక్రమణలు. ఇప్పుడు శాస్త్రయగు క్షత్రియరాజు తన దండశాస్త్రమున నీయాక్రమణల నుండి రక్షింపవలయును. ఈక్షతభావములనుండి సమాజరక్షణమాచరించుటవలననే వీరభావప్రధానుడగు నీరక్షకుని 'క్షతాత్ త్రాయతే' యను నీ నిర్వచనమున క్షత్రియుడు అందురు అట్టితనకర్తవ్యములం దుదాసీనుడై తనవాసనాపూర్తికి న్యాయవిరుద్ధ నానావిధ కరగ్రహణమున సర్వబల

శోషణ మొకటే తనపనిగా గొనువాడు, మందాధులగు వేన, రావణ, కంసాదులవలె తనంతతా నేనశించును లేదా సమాజ క్రాంతియతనిని భస్మావశేషుని గావించును.

ఇంతకును, పైజెప్పిన యైదాక్రమణలందు నాల్గు ఆక్రమణల నివారణ బ్రాహ్మణుని ప్రాతిస్వికకర్తవ్యము, ఒక యాక్రమణనివారణ క్షత్రియుని కర్తవ్యము. ఇట్లు రక్ష కత్వమునందు బ్రాహ్మణుడు క్షత్రియుని మించును. క్షత్రి యునిదగు నా బాహ్యరక్షాకర్మయు, బ్రాహ్మణపురోధ నెదుట నుంచుకొనియే సంచాలిత మగును. తత్సహాయో గము లేనిచో న్యాయదండసంచాలనమున క్షత్రియు డసమర్థు డను విషయము మైత్రావరుణప్రకరణమున వెల్లడియైనది. ఇట్లు కృషి - గోరక్ష - వాణిజ్యకర్మలకధిష్ఠాతయగు వైశ్య వర్గము యొక్క యుత్పాదన శక్తియు పరంపరగ బ్రాహ్మ ణుని జ్ఞానోపదేశముపై నాధారపడియున్నది. ఆయుత్పాదన కర్మల మూటి హానిలాభములంజెప్పుట - దేశకాలపాత్ర ద్రవ్యానుసారము వీనిని విభక్తములుగజేయుట - బ్రాహ్మ ణోపదేశముయొక్క యనన్యకర్తవ్యమే. ఇదేవిధముగ శూద్రవర్గమునకు జెందిన శిల్పకలావర్గ తాత్త్వికబోధయు బ్రాహ్మణోపదేశముపైననే యాధారపడియున్నది. కనుక నీప్రకారముగ నొకచో శిక్షారూపమున నొకచోపథప్రద ర్శనరూపమున, నొకచో ననుమంతరూపమున, శిక్షకుడగు బ్రాహ్మణుడందరకు వారివారిచరిత్రల రహస్యముందెలు

పుచు, విద్యాబలమున గర్మలను ప్రశస్తములగావింపుచు సర్వమునగుచున్నాడు. ఈవిషయమున నీమనుపచనముల జూపుడు:—

> భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాంబుద్ధిజీవినః
> బుద్ధిమత్సునరాః శ్రేష్ఠాః నరేషుబ్రాహ్మణాఃస్మృతాః.
>
> మను 9-96 ఇత్యాదులు.

## వర్ణనామరహస్యము.

బ్రాహ్మణవర్ణమూంతర రక్షాకర్మ కధిష్ఠాత. క్షత్రియ వర్ణము బహిరంగరక్షాకర్మకు సంచాలకము. సేవకశూద్ర వర్ణముతో సద్భావము గల్గియుండువైశ్యవర్ణము బ్రహ్మ క్షత్ర పరిరక్షితమగుచు, కృషిగోరక్షవాణిజ్యకర్మలచే దేశా ర్థికసమృద్ధికి గారణమగును. సువ్యస్థితములుగ నీనాల్గువర్ణ ములు కర్తవ్యపాలనయం దున్నరాష్ట్రమవనతి నొందదు.

వైదిశబ్దసంకేతవిద్యానుసార మీనాల్గువర్ణముల నామ ముల, యుపనామముల, రహస్యజ్ఞానమెరింగిన వీని తాత్త్విక స్వరూపము స్ఫుటమగును. క్రమముగ బ్రాహ్మణ – క్షత్రియ- వైశ్య – శూద్ర – అనునవి నామములు. శర్మ – వర్మ – గుప్త – దాసఅనునవి యుపనామములు (1) మొదట బ్రాహ్మణశబ్దముం జూతము. దీనికి:—(1) బ్రహ్మణోఽపత్యం బ్రాహ్మణః (2) బ్రహ్మాధీతే ఇతి బ్రాహ్మణః (3) బ్రహ్మజానాతి ఇతి బ్రాహ్మణః అని మూడునిర్వచనములు కాగలవు. (బ్రహ్మ= ప్రజాపతి, వేదము, సర్వకారణభూతా వ్యయాక్షరవాచ్చి

స్నక్షురుడు) ఏ బ్రహ్మసంబంధమున నితడు బ్రాహ్మణుడయ్యెనో, యాబ్రహ్మ విశ్వప్రపంచమున కంతరంగరక్షకమై విశ్వాత్మకశరీరమునకు చర్మముగనున్నది. చర్మమేశర్మ కనుక తత్సమానధర్మియు బ్రహ్మమూర్తియునగు బ్రాహ్మణుని శర్మ యందురు.

అంతరంగాక్రమణవిముక్తుడు సుఖముగనుండగలడని మున్ననుకొంటిమి. ఇదే యతనిశర్మ (సుఖ) భావము. దీనికి ప్రవర్తకుడు బ్రాహ్మణుడు. కనుక నితనిని శర్మయనదగును. ఈవర్ణము స్వస్వరూపమున జక్కగానున్నచో రాష్ట్రసుఖము సమృద్ధియు నుండును. బ్రహ్మబలశూన్యసమాజము వైభవశూన్యము, నష్టప్రాయము. సమాజము లేక రాష్ట్రమొక శరీరము. అంతరంగాక్రమణలనుండి చర్మమే మనపాంచభౌతిక శరీరరక్ష గావించును. బ్రాహ్మణునిపనియు నదే కనుక నతడు చర్మస్థానీయుడు. వైదికభాషయందు చకారస్థానమున శకారముచ్చరించుట ప్రాయికము మనుష్యభాషలో 'చర్మ'. దేవభాషలో 'శర్మ' యందురు. ఈ శ్రుతింజూడుడు:-

"అథకృష్ణాజినమాదత్తే 'శర్మాసి'. ఇతి చర్మవాఏతత్కృష్ణస్య, తదస్యతన్మానుషం 'శర్మ' దేవత్రా ఇతి (శత॥)

(పౌర్ణమాస్యేష్టియందు హవిర్ద్రవ్యముందంచునపుడు ఆద్రవ్యము భూతభాగమునకుజెందిన భూమిపైబడి అయజ్ఞియమగును కనుక అట్లుపడకుండ రోటిక్రిందత్రయీవేదరూప కృష్ణమృగచర్మముం బరతురు. తచ్చర్మగ్రహణమున "శ

మంత్ర ముపయోగింపబడును. కృష్ణమృగచర్మము త్రయీ వేదరూప మనునది మరొకచో జూడవచ్చును. )

ఈశర్మయే పిమ్మట సుఖవాచకమైనది 'శర్మశాత సుఖానిచ' (అమ॥) ఈసందర్భమున ప్రబోధచంద్రోదయ మందలి యీశ్లోకము జ్ఞప్తికి వచ్చినది:—

"అస్రాక్షీన్న వనీలనీరజనళోపాంతాతిసూక్ష్మంపుసః
త్వఙ్మాత్రాంతరితామిషం యదివపుః నైతత్త్వజానాంపతిః
ప్రత్యగ్రక్షురదప్రమిశ్రపిశితగ్రాసగ్రహంగృధ్నతః
గృధ్రభ్యాంక్షువృకాన్ స్తనానిపతతః కోవా కథం వారయేత్ ?"

'క్షతస్యాపత్యమ్' 'క్షతాత్ - త్రాయతే' యని క్షత్రియశబ్దమునకు రెండునిర్వచనములు. ప్రకృతియందలి ప్రాణతత్త్వముక్షత్రము. తదపత్యముక్షత్రియుడు. * క్షత భావమునుండి మనలనురక్షించునది ప్రాణతత్త్వమే. కనుక క్షత్రియునిపనియునదే. ప్రాణబలాధారమునవే బాహ్యాక్రమ ణనుండి రక్షణగావింపబడును. దమ్యక్తక్షత్రియుడు సమాజ రూపశరీరము నట్లే రక్షించును. అంతరంగరక్షకము చర్మ యగునట్లు బహిరంగాక్రమణలనుండి శరీరమునురక్షించునది వర్మ. తత్స్థానీయుడగు క్షత్రియునకు వర్మశబ్దము ప్రయుక్తము.

---

* ప్రాణోహి వైక్షత్రం, త్రాయతేహైనం ప్రాణః క్షణితోః, ప్రక్షత్రమాత్రమాప్నోతి, క్షత్రస్యసాయుజ్యం, సలోకతాంజయతి, యఏవంవేద; (శత)

'విశతి' (భూమా - అర్థసంపత్తౌ.) అన్నది వైశ్య శబ్దనిర్వచనము. అర్థసంగ్రహదత్తచిత్తుడు వైశ్యుడు. విడ్వీర్య మితనికుపాదానము. అదియున్నసంపత్తి, బ్రహ్మ క్షత్రభోగ్యపదార్థము * బ్రహ్మక్షత్రసీమయందు ప్రవేశించును. కనుక వైశ్యనామమునుతగును. చర్మ - వర్మవేష్టిత శరీరము సుగుప్త (సురక్షిత) మగునట్లు బ్రహ్మక్షత్రరక్షా కర్మ సురక్షితుడగు వైశ్యుడు సుఖముండును. రాష్ట్రమూలాధారమర్థము గనుక వైశ్యుడు సమాజమునకు ప్రధాన శరీరము. ఇత్యాది బ్రహ్మక్షత్రగుప్త మగుటచే గుప్తనామమున బిలువదగును.

'ఆశుద్రవతి' యని శూద్రశబ్దనిర్వచనము. తన శిల్పాదికర్మలందనాలోచితముగ బ్రవర్తించువాడు. సేవాభావమునందాత్మసమర్పణకలదు. తనవ్యక్తిత్వముంచుకొనక పరేచ్ఛాగామియగుట దాసభావము. (దంసయతేస్వామికార్యాణిసావధానేన - దసి - దంశదర్శనయోః) దీనిని వ్యక్తముసేయునది దాసశబ్దము. ఈసాంకేతికోపనామములం గూర్చి యాస్మృతివచనముల జూడుడు:-

"శర్మవద్బ్రాహ్మణస్యోక్తం, వర్మేతిక్షత్రసంయుతమ్
గుప్తదాసాత్మకంనామ ప్రశస్తంవైశ్యశూద్రయోః (విష్ణుః)
శర్మవద్బ్రాహ్మణస్యస్యాత్ రాజ్ఞోరక్షాసమన్వితం
వైశ్యస్యపుష్టిసంయుక్తం, దాసఃశూద్రస్యకారయేత్ (మనువు)

---

*అన్నంవైక్షత్రియస్యవిట్: [శత]

శర్మ దేవశ్చవిప్రస్యవర్మ త్రాతుశ్చభూభుజః
భూతిదత్తశ్చవైశ్యస్య, దాసశ్శూద్రస్యకారయేత్ (యమః)

భారతీయసమాజశాస్త్రజ్ఞులు బీజరూపమున జన్మ నుండియునున్న యీ ప్రకృతిసిద్ధ చాతుర్వర్ణ్యావస్థను సాక్షాత్కరించుకొని పరిష్కరించి సమాజమును నాల్గుభాగములుగావించిరి. అట్టి యీవ్యవస్థ లోకవైభవసమృద్ధికి కారణమని యీవచనము చెప్పును.

"లోకానాంతువివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః
బ్రాహ్మణంక్షత్రియం వైశ్యంశూద్రంచనిరవర్తయత్"

మరియొక విషయము జ్ఞప్తియుంచుకొనవలయును. "ఈవ్యవస్థ మహర్షులకల్పన కాదు. బీజరూపమున నవ్యయే శ్వరునిచే ప్రకటమైనదని మున్నే చెప్పబడెను. ఈశ్వరీయవ్యవస్థ యనిత్యము, ఏకదేశీయమునుగాదు. మొదటినుండియునున్న చాతుర్వర్ణ్యప్రయోజక దివ్య వీర పశు మృత భావప్రవర్తక బ్రహ్మక్షత్రవిట్ఛూద్రభావములను వంశానుగతములుగ జేసి నిత్యసిద్ధవ్యవస్థంగా పాడుటయే సమాజశాస్త్రజ్ఞులపని"

## వర్ణభేదమూలక ధర్మభేదము

సమాజ, లేక, రాష్ట్రసమృద్ధికి వర్ణచతుష్టయ మావశ్యక మగునప్పుడు వాని స్వరూపరక్షకగు ప్రాతిస్వికధర్మములు భిన్నములే కావలయును. "భిన్న - భిన్న ప్రాకృతిక

వీర్యోత్పన్న భిన్నభిన్నవర్ణము లెన్నఁడును సమానధర్మాను గాములుకాజాలవు. కారాదుకూడ" నని ప్రకృతియాదేంశించును. వర్ణభేదముననను, వర్ణప్రజల యవాంతరశ్రేణీవిభాగముననను, మనసనాతనధర్మసమ్రాట్టు చాతుర్వర్ణ్య, చాతురాశ్రమ్య, పుత్రమిత్ర కళత్రాద్యనేక భేదములచే ననేక భాగముల విభక్తమై తన సమ్రాట్త్వోపాధి చరితార్థముగా వించుకొనుచున్నది.

### పాశ్చాత్యశిక్షాస్రోతస్సునంబడి కొట్టుకొనిపోవు నవశిక్షితవర్గము:—

#### పూర్వపక్షము 1

ఈధర్మభేదము తత్ప్రతిపాదకధర్మ శాస్త్రములును భారతశ్రీనపహరించి యేకసూత్రబద్ధము కానుండజేసి యైకమత్యముం జెడగొట్టినవి. ఈయుత్పాతములకు మూలము పురాణకాలము. వేదమునందీ భేదములేదు. అందఱకు సమాన ధర్మవిధానమేకలదు. వర్ణధర్మములు కల్పితములు. సమదర్శియగు నీశ్వరుని ప్రాంగణమున నందరు సమానులె కాని యొకడెక్కువవాడనియు వేరొకడు తక్కువవాడనియు లేదు. కనుక నందరుంగలసి యొకేనియమమున నడువవలయును. అందఱకు నన్నపానవివాహాదులన్నియు సమానరూపము నొందవలయును. వేదమునందుఁగూడ స్పృశ్యాస్పృశ్యాదిభేద విరహితమగు నేకము లేక సమానమగు ధర్మమే యాదేశింపబడెను. చూడుడు:—

1. "సహనావవతు సహనౌభునక్తు సహవీర్యంకరవావహై
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై
2. సంగచ్ఛధ్వంసంవదధ్వం సంవోమనాంసిజానతాం
దేవాభాగంయథాపూర్వే సంజానానాఉపాసతే.
3. సమానోమంత్రః సమితిః సమానీ సమానంమనఃసహచిత్తమేషాం
సమానంమంత్రమభిమంత్రయేవః సమానేనవోహవిషాజుహోమి.
4. సమానీవఆకూతిః సమానాహృదయానివః
సమానమస్తువోమనో యథావఃసుసహాసతి.
5. యదేవేహతదముత్ర యదముత్రతదన్విహ
మృత్యోఃసమృత్యుమాప్నోతి యఇహనానేవపశ్యతి.
6. బ్రహ్మైవేదంసర్వం నేహనానాస్తికించన
7. విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః
8. అయంనిజఃపరోవేతి గణనాలఘుచేతసాం
ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకమ్॥ ఇత్యాదులు.

## పూర్వపక్షము 2

కాదు, వేదమందు ధర్మభేదమున్నదన్నచున్నది సభ్యతావికాసమునకు బూర్వకాలికమై యుండవచ్చును, ఆకాలము లేఖనప్రణాళి నెఱుగనంత యవైజ్ఞానికయుగ మని వేదమునకుగల 'శ్రుతి'శబ్దమే చెప్పుచున్నది. ఆనాటి ప్రాత మాట లీనాడేమి ప్రయోజనమునకు? నాని కేమేమో స్వరాది నన్ని వేశము గావించినంతమాత్రమున నేమాయె? వైజ్ఞానికపరీక్షలచే సారాసారపరిశీలన సేయుగల నేటిమనకు మన మెట్లుండవలయునో దెలియుపాటి బుద్ధిబలము లేదా? ఒకనాడెందుకో వెలసిన యాచారధర్మము లట్లేయుండవలయునా?

కాలానుసార మెన్ని ధర్మములు మారుట లేదు ? "తాతస్య కూపోయ మితి బ్రువాణాః క్షారంజలం కాపురుషాః పిబన్తి" యన్నట్లు ప్రకాశమయమగు నీవిజ్ఞానయుగమున నిరుద్ధమగు ధర్మభేద రోదనము నెవడాలించును ? అదియుంగాక "యస్తర్కేణాను సంధత్తేసధర్మో వేద నేతరః" అని తర్కవిజ్ఞాన సిద్ధమగునదే ప్రమాణమని పూర్వముగూడ నంగీకరించునపుడు హేతు శూన్యమగు నీధర్మభేద మెవడంగీకరించును ?

## సమాధానము

"సమ్యక్సరణశీలముగల సంసారమందలి పదార్థములెల్ల ప్రతిక్షణపరివర్తనశీలములు, నిరవ్యదాకారయుక్తములు, నగుటచే నిందు వైలక్షణ్యమనుభూతమగుచున్నది. ఈక్షణమున నిదియని అప్పటికి దెలియరాకున్నను కించిత్కాలానంతరమైన నావిలక్షణత నూహింపగలము. గోరువెచ్చని పాలయందు దోడుపెట్టినది మొదలు స్వరూపపరివర్తనారంభమగుచున్నది. కాని యతిసూక్ష్మమగుటవలన క్షణికమగు నాపరివర్తనముం గనిపెట్టజాలకపోయినను ఆపాలు పెరుగుగ బరిణమించిన పిదపను ఆపాలకాధారభూతమగు రసరూపధారాబలమున, క్షణస్థాయియైన క్రియాసమష్టిని దధియందుము. ఈవచనముం జూడుడు.

"గుణభూతైరవయవైః సమూహః క్రమజన్మనాం
బుద్ధ్యాప్రకల్పితాభేదః క్రియేతి వ్యపదిశ్యతే" [వాక్యపదీయము]

ఈక్షణిక క్రియాభావముంబట్టి శ్రమానుయాయులగు దార్శనికులు "సర్వమిదం దృశ్యమానం, క్షణికం, క్షణికం;శూన్యం, శూన్యం; దుఃఖం; దుఃఖం; స్వలక్షణం స్వలక్షణం; అనిరి. కనుక పదార్థములెల్ల ప్రతిక్షణబదివర్తన శీలములు. పరస్పరభిన్నములు నని యెఱుంగనగును.

క్రియ, వినాశరూపముగలదేయనుకొంటిమి. నాస్తి-అస్తి - నాస్తియని, మధ్యసత్తారససంబంధమున అస్తిభావముతో నున్నట్లున్నను వాస్తకవముగ నాస్తిసారముగలదే. ఎట్లయినను "నామరూపాత్మక పదార్థములెల్ల క్రియాపేక్షచే క్షణికములన్నంతవరకు విప్రతిపత్తియుండదు:" అన్నచో, కొంచెమాలోచింతము:—

అన్నిపదార్థములునుక్షణికములేయైన; అస్తిభావోపలబ్ధి యెట్లు? ప్రతిక్షణపరివర్తమాన మయ్యు నదేయిది, యనుఅస్తిమూలప్రత్యభిజ్ఞ కల్గుచున్నదికదా!అనిత్యసత్తయే బ్రహ్మయని వేదజ్ఞులందురు, సర్వోపాధివినిర్ముక్తమగు నా సత్తంగూర్చి వారు:—

> ప్రత్యస్తాశేషభేదంయత్ సత్తామాత్రమగోచరం
> వచసామాత్మసంవేద్యం, తద్జ్ఞానంబ్రహ్మసంజ్ఞితం॥ అనిరి.

ఈసత్తాబ్రహ్మనిర్వికారము, సదాఏకరసము. కనుక నమృత మని ప్రసిద్ధము. పూర్వోక్తక్రియాకలాపము సవికారము, నాస్తిసారము. కనుక మృత్యురూపము. ఈ యమృతమృత్యుభావసమష్టి 'సర్వమ్' బ్రహ్మ. తదుప

నిషత్తు 'ఓమ్' అనునేకాక్షరము. బ్రహ్మాంశభూతుడు, నమృతమృత్యుమయుడు నగు జీవాత్మయుపనిషత్తు 'అహమ్' కాశ్యోపనిషత్తు 'అహః,' ఈ ఓమ్, 'అహమ్, అహస్సులు' ఉపాధిదృష్టిచే భిన్నములయ్యు పరమార్థతః అభిన్నములని యెరుంగవలయును. ఈ బ్రహ్మతత్త్వమునే శ్రీకృష్ణుడు, 'అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున' అనియెను అమృతమునందుమృత్యువు, మృత్యువునందమృతము. ఈ రెం టికి నోతప్రోతభావసంబంధము. అంగుళియందు క్రియయా? క్రియయందంగుళియా? అసమాధేయ ప్రశ్న. ఇటనాధారా ధేయసంబంధముకాదు. అంతరాంతరీభావసంబంధము. యద వచ్ఛేదమున నమృతసత్తయో, నాయవచ్ఛేదముచేతనే మృత్యువుయొక్క యవస్థానమును; ఈయభిప్రాయముననే వేదము "అంతరంమృత్యోరమృతం, మృత్యావమృతమా హితమ్" (శత) అనియెను.

అందు కేవలం బ్రహ్మ, నిత్యశాంతము. నిర్వికారము ఏకరసము. తదతిరిక్తమగు సర్వప్రపంచజాతమును విభిన్నధర్మ ములచే నిత్యమునాక్రాంతము. ఈధర్మభేదముచేతనే జగత్స్వ రూపస్థితి కలుగుచున్నది. అదిలేనినా డంతయు నుచ్ఛిన్న మగును. ఎట్లన!- సూర్యుడుష్ణతచే బంటలుపండించును. ప్రకాశముచే బదార్థములం బ్రకాశింపజేయును, చంద్రుడు నిట్లే యాప్యాయనమున నోషధులంబోషించును. చాంద్ర రసయుక్తములగు నాయోషధులు జీవులబోషించును. పృథివి

యు ధృతిరూపధర్మమున నన్నిటిం ధరించును. వాయువు తన గతిరూపధర్మమున పదార్థ ప్రవర్గ్యాంశల నొకదానితో నొకటి జేర్చుచున్నాడు. పర్జన్యుడు వికాసలక్షణస్వధర్మమున మేఘములందలి ' నముచి ' యొక్క సంకోచలక్షణ స్వధర్మనాశము గావించి వర్షముగురిపించుచున్నాడు. అయీ యన్నిటిధర్మ పరిణామభూత క్రియాకలాపమే సంసారము, అధర్మభేదము లేనినా డీసంసారము సంసారముగాక ఏకమేవాద్వితీయం బ్రహ్మయే. కేవలముస్వప్రతిష్ఠితమగును.

అయీధర్మభేద మద్వైతనామలు కాల్పనిక మను కొందురుగాక! ప్రమాణప్రమేయాది వ్యవహారాభినివిష్టులు వాస్తవిక మనుకొందురుగాక! ఏమనుకొన్న నవి దార్శనిక వస్తుకథలు. వానిని వివరించుటవలన మనకు ప్రయోజనము లేదు. ప్రస్తుతము ధర్మార్థకామమోక్షరూప పురుషార్థ చతుష్టయ ప్రధానభూతమును, విహితానుష్ఠానలక్షణమును, వేదమూలకము నగు ధర్మముంగూర్చి విచారింతము.

ధర్మభేదము (1) జ్ఞానకృతము (2) అజ్ఞానకృతము నని రెండువిధములు. అందు మొదటి దభ్యుదయమునకును, రెండవది పతనమునకును హేతువులు. కనుక వేదోదితమగు మొదటిదానింగూర్చియే ప్రస్తుతవిచారణ యని యెరుంగ గలరు.

“యతోఽభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిఃసధర్మః” అని శ్రీకణాదమహర్షియు “చోదనాలక్షణార్థోధర్మః” యని శ్రీ

జైమినిమహర్షియు ధర్మలక్షణమును వ్యాఖ్యానించిరి : మనువును:—

"విద్వద్భిః సేవితః సద్భిః నిత్యమద్వేషరాగిభిః
హృదయేనాభ్యనుజ్ఞాతః యోధర్మస్తంనిబోధత !" అని

నిర్దోషవిద్వదాచరణీయతయు, హృదయాభ్యనుజ్ఞాతత్వమును ధర్మలక్షణముగ ననువదించెను. సూక్ష్మముగ జూచిన యీ మూడులక్షణములతాత్పర్య మొకటేయగు ననుకొందుము.

నైయాకరణులు:— 'ధ్రియతేఇతి' — లేక 'ధరతి ఇతి' అని ధర్మశబ్దమును కర్మగనో కర్తగనో వ్యుత్పాదన సేయుచున్నారు. ధర్మ మన్నది క్రియారూపమో, క్రియాజనితాతిశయరూపమో యగుగాక ! రెండువిధములచేతను ధర్మిచే ధరింపబడునదే. ప్రపంచ మందలి జడచేతనాత్మకమగు నేవస్తువైన క్రియాక్రాంతముకాని దగపడదు. అనగా క్రియలేని పదార్థములేదు. నిత్యసిద్ధమగు నీ క్రియాభావముంబట్టియే భగవంతుడు:—

"నహికశ్చిత్ క్షణమపి జాతుతిష్ఠత్యకర్మకృత్
కార్యతేహ్యవశఃకర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః" అనియెను.

ఈ క్రియాపరిణామము రెండువిధములు. (1) ఒక క్రియస్వాశ్రయభూత పదార్థమును స్థిరముగనుంచును, లేక రక్షించును. (2) ఒక క్రియ స్వాశ్రయనాశము గావించును. ఇందుకునిదర్శనము మనశరీరమే. ఎట్లన:—

ఈపాంచభౌతికశరీరమందు దీని యునికికి హేతువగు నన్నాహారణరూప క్రియయొకటి యుపపన్నమగుచున్నది. చిత్యము, చితేనిధేయమునని యగ్ని రెండువిధములు. పృథివి యందలిఅగ్ని, అంతరిక్షమందలి వాయువు, దివియందలి సూర్యుడు, ఈమూవురిపరస్పరసంఘర్షణవలన నుత్పన్నమగు తాపధర్మముగల యగ్ని వైశ్వానరుడు. అనగా:—పృథివి యొకవిశ్వము. అంతరిక్షము రెండవవిశ్వము. మూడవ విశ్వము ద్యులోకము. ఈమూడువిశ్వములందు క్రమముగా అగ్నివాయ్వాదిత్యులు ప్రతిష్ఠితులు పృథివికగ్నియధిష్ఠాత, వాయువంతరిక్షమునకు.'ఇంద్రతురీయూః గ్రహాఃగృహ్యాన్తే' అనుటచే వాయువునందు మరుత్వాతేంద్రునకు నిత్యసంబంధము తెలియబడుచున్నది. కనుకనే వాయుగ్రహము "ఐంద్ర వాయవగ్రహ" మని ప్రసిద్ధినొందెను. వాయువున్నచో నింద్రుడు, ఇంద్రుడున్నచో వాయువు. ఇరువురకవినాభావము. ఇంద్రవరుణాలకు బ్రతిద్వంద్విభావము. ఆపస్సు వరుణునకు బ్రతిష్ఠ. వీరుభయులు నొకరున్నచో నొకరుండరు. ఇరువురికి నశ్వమాహిష్యముగదా! ఇంద్రు'డింద్రశచి' యను స్వశక్తి (సాశ్చాత్యులఎనర్జి)తో వాయువుద్వారా పదార్థములం దుండుచు, అందలి వరుణమూలక, దూషితపరమాణువులను నాశముగావించును. వాయునిరోధ మింద్రనిరోధనే. ఇంద్రనిరోధము వరుణప్రవేశము. వరుణుడుస్వపాశమున బంధించి సర్వమును దూషితముగావించును. ఈవాయువిజ్ఞాన

మునే నైఘంటికులు "యద్వై వాతోऽనాభివాతి (పవతి) తత్సి ర్వాంవరుణాదైవత్యం'' అనిరి: కనుక:— అంతరిక్షాధిష్ఠాతలు వాయువు ఇంద్రుడును. ద్యులోకమునకు ద్వాదశాదిత్యాత్మక సూర్యుడధిష్ఠాత ఈయభిప్రాయముతోడనే నైగమికులు:— "అగ్నిః పృథివీస్థానః, వాయుర్వేంద్రోవాఽన్త రిక్షస్థానః, సూర్యోద్యుస్థానః ఇతి: (నిరు - దైకాం) అనిరి. ఈమూవురు వైశ్వానరాగ్నికాధారభూతులని తెలియవలయును. "విశ్వేషాంనరాః విశ్వానరాః, విశ్వానరేభ్యో జాతోऽగ్నిర్వైశ్వానరః'' అని: లోకత్రయావచ్ఛిన్నుడు, ప్రాణాపానవ్యానమూర్తి, తాపధర్మముగల యగ్ని వైశ్వానరశబ్దవాచ్యుడగును. ఈవచనముజూడుడు:— "సయః సవైశ్వానరః ఇమేలోకాః ఇమ నేవపృథివీవిశ్వమగ్నిర్నరః, అంతరిక్షమేవవిశ్వం వాయుర్నరః, ద్యౌరేవవిశ్వ మాదిత్యో నరః'' (శత) ఈయగ్నియే యజ్ఞపరిభాషయందు చిత్యాగ్ని నామము నొందెను. ఇతడు భూతాగ్ని భూతపతి.

ఇక పిండస్వరూపసమర్థకము, చిత్యాగ్నియుపాదాన భూతము, అనగా ప్రతిష్ఠారూపము రూపరసగంధస్పర్శశబ్ద శూన్యలక్షణము, నగు మాలికాగ్ని యమృతాగ్ని. ఇదే చితేనిధేయాగ్ని. ఇట్లుభయవిధాగ్నియునన్నాదమే. అన్నాహుతి యున్నంతవరకే దీనియునికి. పాంచభౌతికమును, రసాసృఙ్మాంసమేదోస్థిమజ్జామయము నగు శరీరము చిత్యాగ్నిమయము. అందలి యన్నాదాగ్ని ప్రాణరూపము. అహర

హోమన్నాహుతి దానియందే యగుచున్నది. హుతాన్న మాంగ్గూహ్యపమొంది క్రమముగ బ్రాణస్వరూపతనొందు చున్నది. ప్రాణము మరల నన్నము గోరుచున్నది. అందు వలన మరల నన్నాహుతి. ఇట్లు అన్నప్రాణముల యన్యోన్యపరిగ్రహరూపమును, శరీరస్థితిసమర్పకము నగు యజ్ఞము నిత్యము జరుగుచున్నది. యజ్ఞమువలననే సర్వ భూతములుం బుట్టుచున్నవి. పుట్టినవి, పుట్టును. దీని నెంచియే భగవంతుడు:—

"సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా" ఇత్యాదిగా సెలవి చ్చెను. అన్నాదానాత్మకమగు నీయజ్ఞ మన్నిపదార్థము లందు బ్రతిష్ఠితము. తదాధారముననే యెల్లకర్మలు బ్రవ ర్తిలుచున్నవి. కనుక "యజ్ఞోవై శ్రేష్ఠతమంకర్మ" (అన్న దానముకంతఫలమును) అని చెప్పబడినది.

అన్నాహరణరూపమును, యజ్ఞస్వరూపసంపాదకము నగు నీకర్మ 'ఆగతి'యందురు. ఇది ప్రతిక్షణమును మన శరీరపుష్టినొసంగుచున్నది. ఈ క్రియాశక్తినే పౌరాణికులు విష్ణుమాయారూపమున స్తుతించిరి. మరి: ఈస్థితికివిరుద్ధముగ శరీరహానికల్గించునదియగు నింకొక క్రియ మనశరీరమున జరు గుచున్నది. అందువలన శరీరస్థములగు నన్నాదిరసముల కుత్ క్షేపముకల్గి శరీరమునకు క్షీణత – నాశము సంభవించును. అట్టి యీవిరుద్ధక్రియ 'గతి' యనిరి. దీనిని పౌరాణికులు రుద్రమాయ యని పొగడిరి. ఆదానక్రియచే విష్ణువుశరీర

మును రక్షించును. విసర్గక్రియచే రుద్రుడు శరీరమును నాశముగావించును. విజ్ఞానకాండయం దీరుద్రు డింద్రశబ్ద మున నుపవర్ణింపబడుచున్నాడు. ఆగతియున్నచో గతియు గతియున్నచో నాగతియు దప్పవు, కనుక రెండు నభిన్న మిత్రము లని ఋషి చెప్పెను:—

> విష్ణోఃకర్మాణిపశ్యత ! యతో వ్రతానిపస్పశే, ఇంద్రస్యయుజ్య సఖా [ఋక్]

ప్రతివస్తువునందును ఆత్మ – పదం– పునఃపదమ్– అని మూడువిన రభావము లెంచనలయును. వస్తుహృదయ మాత్మ. "యస్యాయదుక్థంసత్ – బ్రహ్మసత్ - సామస్యాత్ సతస్యాత్మా"అని యాత్మలక్షణము. ప్రభవస్థాన ముక్థము. ప్రతిష్ఠాస్థానము బ్రహ్మ, పరాయణస్థానముసామ, హృదయ మునుండిసర్వభావములు వెలువడును. కనుక "ఉక్థ్యస్తే= ఉత్తిష్ఠన్తి, భావాఃయస్మాత్" అను నిర్వచనముంబట్టి హృద యమే యుక్థము. స్వరము హృదయమందు బ్రతిష్ఠితము. కనుక నది వస్తువునకు బ్రహ్మ. వస్తుగతభావము లన్నియు హృదయమందు లయించును. హృదయమే వస్తువునకు సామ. కనుక నీయుక్థ – బ్రహ్మ – సామలక్షణ హృదయమే. వస్తు పిండమునకాత్మ యని నిష్కర్ష. వస్తుపిండముపదము. పిండ స్థానమునుండి బయటికి వెలువడు ప్రాణమండలము పునఃపదము. ఇది మహిత విభూతి – సాహస్రి యను పేర్లంబరగును. హృదయమందు హృ – ద – యమ్, అనిమూడక్షరములు.

"సర్వోఽక్షరమ్ సహోద్భైర్వ్యంజనైః" యని ప్రాతిశాఖ్య యం దక్షరలక్షణము. కనుక యమ్, ఒకేయక్షర మనుకొన నలయును. శబ్దసృష్టిమర్యాదచే నిశ్చితసంకేతానుసారము 'హృ' విష్ణుతత్త్వవాచకము. ఆహరణ లేదా ఆదాన క్రియచే విష్ణువుశరీముం గాపాడును 'ద' ఇంద్రతత్త్వవాచకము. ఖండనము లేక విసర్గక్రియచే రుద్రాపరపర్యాయము గల హృదయస్థేంద్రుడు శరీరము నాశముసేయును. ఈరెండిటి సంబంధముగలుగునట్టియు హృత్పుండీరస్థ, ప్రతిష్ఠారూప, నిష్క్రియ యగుమూడవ స్థితిరూప —బ్రహ్మశక్తి. గత్యాగతిభావముల నిది నియమించును. తద్వాచకము 'యమ్' మున్ను చెప్పినట్లు ప్రతివస్తువును ఆదానవిసర్గరూపక్రియచే నిత్యముగూడియుండును. ఈద్వివిధమగుక్రియయు గ్రియ యను పేరుగలది. అది స్వవ్యాపారార్థము నిష్క్రియ ధరాతలము నపేక్షించును. అదియే మూడవదగు నాధారభూత బ్రహ్మశక్తి. ఆదానవిసర్గముల కది ప్రతిష్ఠ. కనుకనే 'బ్రహ్మ వైసర్వస్య ప్రథమజం' "బ్రహ్మవైసర్వస్యప్రతిష్ఠా" అని వాజసనేయశ్రుతి వచించెను. ఇట్లన్నిమూర్త ద్రవ్యములందును బ్రహ్మ-విష్ణు-శివరూప స్థి-త్యాగతి-గతిభావముల సత్తసిద్ధ మగుచున్నది. మనకగపడుప్రతిపదార్థమును. బ్రహ్మ విష్ణురుద్రాత్మకమే, కనుకనే "ఏకామూర్తిస్త్రయోదేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః" యని పౌరాణికులువచించిరి. ఈ త్రిమూర్తియే. ప్రజాపతి. ఇతడు స్థితిభావమున బ్రహ్మ.

గతిభావముననింద్రుడు, లేదా మహేశ్వరుడుగ, ఆగతిభావ మునవిష్ణువుగ జెప్పబడును. హృదయాత్మకుడగు నీప్రజాపతి నభ్యబిందువునందు ప్రతిష్ఠితుడు. ఆయీ ప్రాజాపత్యవిజ్ఞాన మును వేదపురుషు డిట్లునిరూపించెను:—

" ప్రజాపతిశ్చరతిగర్భే అంత రజాయమనో బహుధావిజాయతే
తస్యయోనిం పరిపశ్యన్తిధీరా: తస్మిన్ హతస్థు: భువనానివిశ్వా "

పైనిజెప్పిన యాదానవిసర్గాత్మక ద్వివిధక్రియయు ధర్మిచేధరింపబడును. కనుక 'ధ్రియతే' అనిగాని 'ధరతి' యనిగాని నిష్పన్నమగు ధర్మముయొక్క యుదరమందు వినాశభూతక్రియకుగూడ సమావేశమున్నను, మొదటిక్రియ యాశ్రయస్వరూపరక్షణకు రెండవది స్వరూపనాశమునకు హేతువులు. గనుక 'ధరతి' యనికర్తృవ్యుత్పత్తి యాధా రమున ప్రథమోక్తక్రియయే ధర్మము. రెండవది యధర్మ మనియే యెరుంగనగును. అయినను " ధ్రియమాణస్సన్ ధరతి; స్వయంధర్మిణా ధ్రియతే, ధర్మిణంచ స్వస్వరూపేణ వస్థాపయతి యః సధర్మః " అనిసిద్ధమగును.

ఇంతవరకు:— జడచేతనాత్మకములగు సన్నిపదార్థము లందును పరస్పరము సర్వథా భిన్నములగుధర్మములుండునని తేలినను, ఆవిషయమునే సింహావలోకనన్యాయమున మరల గొంచెముమాత్రము:—

ప్రస్తుతము, ధర్మశబ్దమునకు పైజెప్పిన రెండునిర్వచ నములందును మొదటిదగు 'ధరతి' యనువ్యుత్పత్తినాశ్ర

యింతుము. కారణము ముందుస్పష్టముకాగలదు.

ధారణార్థకమగు నీధర్మమునకు కర్మ - సంస్కారము, అని రెండువిభాగము లంగీకరింపవచ్చును. మన మనుష్ఠించు నవి క్రియారూపధర్మములు. వీనివలన నంతఃకరణమున నొక యతిశయ ముప్పతిల్లి యంతర్జగత్తున నంతర్యామసంబంధము నొంది లౌకిక - పారలౌకిక సద్భావప్రవర్తక మగును. అప్పుడు దీనిని సంస్కారరూపధర్మ మందుము. ఈరెంటికి ప్రతిష్ఠధర్మియే. ధర్మాచరణముగావించువాడే కర్మాత్మక ధర్మమునకాలంబనము. సంస్కారాత్మకధర్మమున కధిష్ఠాత యునగును. కనుక ఈరెండుదృష్టులచేతను 'ధ్రియతే' అను నిర్వచనానుసారము రెంటినిధర్మములందుము.

మొదట క్రియాత్మక ధర్మముంగ్గొరొందము. ఇయ్యది క్రియాభేదముంబట్టి ధర్మము - అధర్మము అని రెండుభేదములగును. కొన్నిక్రియలు స్వాశ్రయస్వరూపరక్షకములు, కొన్నిక్రియలు తన్నాశకములు నగును. ఇందు రక్షకములు ధర్మరూపధర్మములు. నాశకము లధర్మరూపధర్మములు.

ఉదాహరణము:—శరీరమందగు నాదానవిసర్గములను విరుద్ధక్రియలురెండును ధర్మిచేధృతములే కనుక 'ధ్రియతే' యని ధర్మశబ్దవాచ్యములైనను ఒకదానిచే రక్షణ ఒకదానిచే నాశము నగును కనుక నాలక్షణ మపేక్షించి 'ధరతి' యను నిర్వచనమును స్వీకరింతుము. "యత్ స్యాద్ధారణసంయుక్తమ్" అన్నదే ధర్మముయొక్క ధర్మత్వముకనుక

కర్తృప్రధాన వ్యుత్పత్తిమాన్యము, విసర్గక్రియ ధర్మి యొక్క ధృతినూడ బెరుగును కనుక 'ధరతి' మర్యాదా బహిర్భూతము కనుక "ధ్రియతే" అనుసారముగుధర్మము 'ధరతి' దృష్టితోఅధర్మమందుము. అందుచే "ధ్రియమాణఃసన్ధరతి... ఇత్యాదిగా పైన జెప్పినదే క్రియాత్మకధర్మమువకు లక్షణ మననచ్చును.

అట్టిసూధర్మతత్వము, (1) స్వాభావికము (2) ఆగంతుకము అని రెండువిధములు. ఇందు మొదటిది స్వధర్మను అభయసాధనము, రెండవది పరధర్మము భయావహమునగును, మొదటిదేధర్మి (వస్తు) స్వరూపమందురు. ఉదాహరణమున:— బ్రాహ్మణాగ్ని (ధర్మి) యం దంతర్యామసంబంధమున ప్రకాశధర్మముగల యింద్రుడు, తాపధర్మముగల వైశ్వానరుడు ప్రతిష్ఠనొందగా నది భూతాగ్నిగ బరిణతినొందును. అప్పుడు దానికి తాపప్రకాశములు స్వరూపధర్మము లగును. ఆధర్మములను వేరుజేసినచో భూతాగ్నికి రూపనే యుండదు. ఇట్లే శైత్యము ఆప్యాయనము (తృప్తి) అనుస్వరూపధర్మములం దప్పించినచో జలమునకు రూపనేయుండదు. స్వధర్మ ముండునంతవరకే పదార్థస్వరూపస్థితియు నుండును. వస్తువున కన్యవస్తుసంబంధమున గల్గు పరధర్మలక్షణముగల యాగంతుకధర్మము సంకరధర్మము లేదా వ్యభిచారధర్మము అందురు.

పై జెప్పిన రెండు ధర్మములు ధర్మిచేధృతములయ్యును మొదటిదిముఖ్యము రెండవదిగౌణము నందురు. మరియు,

స్వధర్మానుకూలమగునంతవరకే యాగంతుకధర్మము ధర్మ మని జ్ఞప్తియుంచుకొనవలయును. లేదా స్వధర్మనాశమునకు హేతువై 'ధరతి' యను కర్తృవ్యుత్పత్తినంచిత మగుచు నధర్మమేయగును. అందుచే వస్తుప్రతిష్ఠకే యుచ్ఛేదము కల్గును గదా! ఉదాహరణమున:- జలముంజూడుడు:-- "ఆపోద్రవాఃస్నిగ్ధాః అను దార్శనికసిద్ధాంతముంబట్టి ద్రవ త్వము జలస్వరూపధర్మము. ఈదృష్టింబట్టియే "సాంసిద్ధికంద్ర వత్వంజలే" యని నవ్యన్యాయము కల్గినది. ఈస్వరూప ధర్మము ధరుణాపరపర్యాయక తరళాగ్ని యొక్క కృపా ఫలము. ధ్రువాగ్నిసంబంధమున నాజలమే గడ్డకట్టును. జలమునకు ద్రవతయు, నగ్నిసంబంధమువలననే యని "అపాంసంఘాతో విలయనంచ తేజఃసంయోగాత్" అను కణాద సూత్రము చెప్పును. -- ధరుణాగ్నికి తాపముస్వరూప ధర్మము. అయ్యది తరళతగా బరిణతిగాంవించుకొని జలము నకు స్వరూపధర్మముగా నైనది. అదే జలముంగూర్చి అగ్ని ధర్మముయొక్క ఆత్మసమర్పణము. దానితో నాయగ్ని జల మునకు స్వరూపధర్మమైపోయినది. ("అగ్నింయాగర్భందధి రేవిరూపాః") ఈధర్మమున్నంతవరకె జలస్వరూపరక్ష; లేనిచో తత్స్వరూప ముత్క్రాంతమగును.

వెచ్చబెట్టినజలమందలి యగ్నితాపము జలమునకాగం తుకధర్మము. అది బహిర్యామసంబంధము. జలస్వరూపహాని లేనంతవరకది "ఆగంతుక - ధర్మ" మే యందుము.

మిగులవేడియెక్కగా నాజలమావిరియై పోవునప్పు డది జలముల కాగంతుకధర్మముగాక యధర్మమేయగును. కనుకనే వేత్తలు ఆగంతుకమగు పరధర్మము భయావహ మన్నారు.

విశ్వమందలి స్థిరచరముల యన్నిటిధర్మములు వేర్వేరుగ నున్నవి. ధర్మభేదమే పదార్థమూలప్రతిష్ఠ. స్వాభావికమగు నీభేదములేనిచో విశ్వము స్వప్రకృతిగర్భవిలీనమై పోవును. అట్టి విశ్వప్రాకృతిక పదార్థోపాదానోత్పన్నులగు సస్మదాది వికృతప్రాణుల ధర్మము సమానమగుటెట్లు? ప్రతిదానికిని ప్రకృతి, ఆకృతి, అహంకృతి భిన్నములై యుండ ధర్మ మభేదమెట్లు? ఈధర్మభేదము పతనమునకు గాక గౌరవమునకే కారణమగుచున్నది. ఉదాహరణమున కుపాసనాకాండంగైకొనుడు:— మన దేవప్రతిమలు పెక్కువిధములగలవు. యుపాసకులయోగ్యతంబట్టియున్నవి. సాత్త్వికప్రకృతిగలవాడు రాజసతామసోపాసనలచే సాఫల్యము నొందజాలడు. విష్ణు, శివ, కాళీ, లక్ష్మీ, సరస్వతీ గణపత్యాది ప్రతిమాభేద మీధర్మభేదముపై నాధారపడియున్నది. భేదవాదమునకు వ్యావహారికరూప మిచ్చి యంతటనభేదముం దర్శించుటయే మనధర్మముయొక్క సర్వోత్కృష్టత. అనేకత్వాధారమున నేకత్వారాధన మనముఖ్యలక్ష్యము. నిత్య విజ్ఞాన సహకృత జ్ఞానమార్గము మన శ్రేయఃపథము. అందరును స్వధర్మలక్షణ కర్తవ్యకర్మలం దనన్యభావమున బ్రవర్తిల్లుచు పరస్పరసహయోగమున నుండుట మనజాతీయ

వాదము. వేదముదానినే "సహనావవతు" ఇత్యాదిగా విశ్లేషణగావించెను. పరస్పరము సర్వధా విభిన్నధర్మానుగమనము సేయు సూర్యచంద్ర – పృథివీ – వాయ్వాది ప్రాకృతికపదార్థము లామహావిశ్వధర్ముఁడు ధర్మమూర్తి మహామహేశ్వరునకు సమానములేకదా! మనలక్ష్యమునదే. బుద్ధివాదియుదహరించిన వేదవచనములకిదేయర్థము.

ఆత్మదృష్టిచే వాస్తవముగ జరాచరములెల్ల సమానధరాతల ప్రతిష్ఠితములే. కాని వర్ణమూలక వ్యవహారకాండయందన్నియు విభక్తములై. విభక్తములందవిభక్తదర్శనము మనపురుషార్థము. (అవిభక్తంవిభక్తేషు) శాస్త్రము, "పండితాఃసమదర్శినః" యని స్పష్టముగ సమదృష్టిప్రాధాన్యము నంగీకరించెను. దర్శనముసమము, వర్తనము (వ్యవహారము) భిన్నము. ఇదే రహస్యము. భేదవాదమునకసహ్యాపహువారీశ్వరసృష్టితో విరోధింపవలయును. అందు భేదవాదవికాసమేగదా!

గానిందు :— బ్రహ్మనుండి యుత్పన్నమై వర్ణములకు ప్రతిష్ఠయగు ధర్మముంగూర్చి విచారించుట మనప్రస్తుతవుబని. "తదేతత్ క్షత్రస్యక్షత్రం- యద్ ధర్మః" (శత) అని వేదము చాతుర్వర్ణ్యధర్మభిన్నతయు, మౌలికతయు, నిత్యతయు, సిద్ధముగావించుచున్నది. బ్రాహ్మణుని బ్రాహ్మణత్వము ఇత్యాదిగాజెప్పు నీ'త్వ'లక్షణ ధర్మ మేమి పదార్థము ? అను ప్రశ్నకు లోకదృష్టాంతమున స్పష్టముగావించుచు

శ్రుతి చెప్పుచున్నది. "సత్యము పేరే ధర్మము, ధర్మము పేరే సత్యము". ఇది హృదయభావమునకు జెందినదై యంతర్యామియొక్క నిత్యనియతియై యున్నదని పూర్వము సత్యానృతవివేకమునం జెప్పబడినది. నీరుపల్లమునంజూచును. అగ్నియూర్ధ్వమునకే వెలుగును. వాయునడ్డముగనే నడచును. పదార్థముల యీనియతధర్మ - భావమే సత్యము. వర్ణపదార్థము తనయంతర్యామి, నియతిలక్షణనియతిమర్యాద కనుగామి. అదే దానిసత్యానుగమనము. యథార్థసత్యాగ్రహము. ఇదే ధర్మముయొక్క ధర్మత్వము. (చూ:-కర్మయోగవిజ్ఞానము).

అటుగాక "నేమనుకొన్నదే ధర్మము, సత్యము, ఈశ్వరాదేశము, అని ముగ్ధజనమోహకారకులగు వారి యీశ్వరవాదము దురాగ్రహము. నియతిస్వరూపముగూడ వర్ణధర్మవికృతిచే జెడును. అంతర్యామియొక్క సత్యనియతి యాపామరవిద్వజ్జన మందరియందును సమానమైనను, సౌర ప్రకాశము నీలాదికాచావరణమున తద్రూపమగునట్లు, వర్ణధర్మవిరోధి - వికర్మలక్షణ - అసత్కర్మాచరణమున బుట్టు నవిద్యాదోషావరణ మధ్యమునంబడి తద్రూపమే యగును. ఈదుష్టనియత్యనుశాసనము నన్నడు నాత్మనియత్యనుశాసన మనదగదు. ఈధ్వని నియతిది కాదు. దోషముల ప్రతిధ్వని. దానిని నియతియని మనము భ్రాంతి పడుచుందుము. నియతిచెడుట నియతము చెడుట యగును. అయ్యది సత్యవంచన. సత్యవంచితుడు 'తాజెడ్డకోతి' యగును.

ఇంకొకదృష్టితో నీధర్మభేదముం జూతము. మన (మానవసమాజ) మీశ్వరీయజగత్తున నొకస్వల్పాంశము కనుక మొదట మన కాయీశ్వరీయ (ప్రాకృతిక)ధర్మ మన్వేషించు టేపని. అం దనీశ్వరవాదమూలక - ప్రజాతంత్రానుగత - సామ్యవాదప్రతిచ్ఛాయ కలదో! ఈశ్వరవాదమూలక రాజతంత్రానుగత - భేదవాదసామ్రాజ్యము కలదో! చూతము.

తత్త్వమీమాంస సేయుగా భేదముపేరే విశ్వ మని నిర్ణయముం జేయుదుము. ఆ నిరుపాధి - కాద్వయ - నిర్వికా-రాఖండ - సర్వబలవిశిష్ట - రసమూర్తియగు పరాత్పరబ్రహ్మకంటె నతిరిక్తమగు సంపూర్ణప్రపంచము క్షణికక్రియచే నిత్య మాక్రాంతమగుచు, పరస్పరము సర్వథాభిన్నరూప మే యగుచున్నది గదా! పదార్థములన్నియు భిన్నధర్మయుక్తములై యున్న వని మున్నే యనుకొంటిమి. ఈతాత్త్విక భేదాధారముననే సంసరణశీల సంసారస్వరూపము నిల్చి యున్నది. ఈశ్వరావయవరూపులగు ప్రకృతిమండల దేవతలు వారివారిధర్మబలమున వారివారి యాధికారిక కర్మానుష్ఠానముం గావించుచు, విశ్వసామ్రాజ్య సంవాహకు లగుచున్నా రని యీవరకే తెలిసికొంటిమి. కనుక నిపు డా ప్రాకృతిక ధర్మభేదమీమాంసం గట్టిపెట్టి చతుర్విధ పురుషార్థములందు మొదటిదగు ధర్మముం జూతము. ఇది యీ తత్త్వాత్మక - ప్రాకృతిక - ధర్మతుల్యమగుటచే తద్భేదమే యేతద్భేదము

నందును. ప్రాకృతికధర్మములతో నీధర్మముల గ్రంథిబంధన సంబంధముం గుర్తించుచునే మన మీయుద్దేశ్యభూత ధర్మ విచారణము సేయవలయును:—

ఏకర్మలచే - వస్తుసంసర్గముచే - నియమోపనియమ ముల పరిపాలనచే, మనుష్యత్వము సురక్షితమగునో వాని యన్నిటిసంగ్రహము మనుష్యధర్మము. తద్విరుద్ధము తద ధర్మము. ఇట్లే సభ్యత్వరక్షణోపాయములు సభ్యధర్మములు. విపరీతములధర్మములు. ఈపరిభాషంబట్టి వర్ణత్వధర్మరక్షణో పాయములు వర్ణధర్మములు. విపరీతకర్మలధర్మములు. ఇక దివ్య - వీర - పశు - మృతభావ ప్రయోజకములగు బ్రహ్మ- క్షత్ర - విట్ - శూద్రభావములు సర్వథా భిన్నభిన్నము లగుచో వానిధర్మములును వేర్వేరుగ నుండునని యంగీక రింపవలయును. ఏలయన:— ధర్మభేదనే యవచ్ఛేదమర్యా దచే, ధర్మావచ్ఛిన్నధర్మిభేదమునకు గారణ మని నియతము గదా! ఈభిన్నభిన్నధర్మములచే కృతాత్మయగు వర్ణధర్మ మును భిన్నభిన్న మనుకొనుటే న్యాయసంగతము.

ఈవర్ణధర్మములను మహర్షులు సామాన్య - విశేష భేదమున రెండువిధములుగ జేసిరి. సత్యము - అహింస - శౌచము - ఇంద్రియనిగ్రహము - అమానిత్వము - అదంభి త్వము - అలోభత్వము - మొదలగునవి సామాన్యధర్మములు. మనుష్యత్వప్రమాణపత్రమొకటియే వీనిననుగమింప నధి కారముం గూర్చును. వర్ణముతోబనిలేదు. మనుష్యత్వరక్ష

ణాయే వీనిలక్ష్యము కనుక వీనిని 'ఆనృశంసధర్మ'ములనియు నందురు. మనుష్యత్వము మనుష్యమాత్రునకుసమానము. కనుక వీనికందరు నధికారులు.

కొన్ని విశేషపరిస్థితులందు వీనికి నపవాదములు వచ్చుచుండును. ఎట్లన:— వధింపబడ సిద్ధముగనున్న నిరపరాధప్రాణియసత్యమాడుటచే రక్షింపబడు నెడ 'సత్యమేవ వదేత్' 'నానృతంవదేత్' అను సామాన్యధర్మమునుపేక్షించి "వర్ణినాంహివధోయత్ర తత్రసాక్ష్యనృతంవదేత్" అను వచనప్రకార మనృతమాడుట తప్పుగాదు. ఇట్లే:— "మాహింస్యాత్సర్వభూతాని"యను సామాన్యవిధికి "అగ్నీషోమీయంపశుమాలభేత" ఇత్యాద్యపవాదములు. యజ్ఞకర్మయందేకాక యింకను పెక్కుచోట్ల నహింసకపవాదములు కలవు. చూడుడు:—

"ఏకస్మిన్ యత్రనిధనం ప్రాపితే దుష్టకారిణి
బహూనాంభవతి క్షేమం తస్యపుణ్యప్రదోవధః॥" ఇత్యాదులు.

ఈయాధారముననే వేటమంచిదని వనపర్వమందున్నది. ఇట్లు మనుష్యమాత్రోపయోగములగు సామాన్యధర్మములను బరిస్థితులంబట్టి యపవాదములుండును. ఇది యెరుంగక "శాస్త్రముహింసయు నహింసయు జెప్పును. ఏది సత్యమనుకొనవలె" ననువారి లోకవమాట "ధర్మమొక సుసూక్ష్మతత్త్వము, దేశ - కాలపాత్ర - ద్రవ్య - శ్రద్ధాది భావముల సమన్వయతారతమ్యముననే యది వ్యవస్థితము.

పరోక్షతత్త్వమూలకములగు ఈ ధర్మవ్యవస్థల విషయమున శబ్దశాస్త్రనిర్ణయముకంటె మరొకగతిలేదు'' అని చెప్పి 'యశ్శాస్త్రవిధిముత్సృజ్య' ''తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే' అనుగీతావచనములం జ్ఞప్తికిఁ దెచ్చెదము.

సామాన్యముమనుష్యసామాన్యునకు, విశేషధర్మము విశిష్టునకు రక్షకము నుపకారకము నగును. సామాన్య - విశేషములకు విరోధము ప్రాప్తించు నెడ సామాన్యముపేక్షింపబడి విశేషధర్మమునకు ప్రాధాన్యమీయబడును. ఉదాహరణమునకు:— అర్జునుడొక విశిష్టమనుష్యక్షత్రియ వ్యక్తి - అతడు మనుష్యసామాన్యధర్మమగు నహింసననుగమింప నున్నపుడు భగవంతుండతని విశేషధర్మమునకే ప్రాధాన్యమిచ్చి యిట్లు చెప్పెను:—

(1) సహజంకర్మ కౌన్తేయ సదోషమపినత్యజేత్
సర్వారంభాహిదోషేణ ధూమేనాగ్నిరివావృతాః

(2) స్వధర్మమపిచావేక్ష్య నవికంపితుమర్హసి
ధర్మ్యాద్ధియుద్ధాచ్ఛ్రేయోన్యత్ క్షత్రియస్యనవిద్యతే

(3) యదృచ్ఛయాచోపపన్నం, స్వర్గద్వారమపావృతం
సుఖినఃక్షత్రియాఃపార్థ! లభన్తేయుద్ధమీదృశం

(4) అథచేత్త్వమిమంధర్మ్యం సంగ్రామంనకరిష్యసి
తతఃస్వధర్మంకీర్తించ హిత్వాపాపమవాప్స్యసి

(5) శ్రేయాన్‌స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనంశ్రేయః పరధర్మోభయావహః

ఈస్వధర్మాధారముననే కల్పసూత్రకారులు అయజ్ఞియ శూద్రవర్గమునకు వేదాధ్యయనాదికము నిషేధించిరి.

ఈస్వధర్మభేదమునకు విజ్ఞానకృత (ప్రాకృతిక) ధర్మభేద ముతో సంబంధమున్నది. అట్టిదే స్వధర్మము. సామయిక పరిస్థితివిశేషముంబట్టి కల్పితములగు కొన్నివిశేషనియమములు మతవాదమును జెంది శాశ్వతలుగా నెన్నబడవు.

## ధర్మభేదముంబట్టి ఆహారాదులందుభిన్నత

సమాజమునకు వర్ణవ్యవస్థయు, అందుకుధర్మవ్యవస్థయు నవసరమే. కాని, ఆచూకట్టుబాటులు సరిగాసాగించు నేర్పాటులు సేయుటెట్లు? విన్నను మనసునబట్టదు, పట్టినను, ప్రవృత్తికలుగకున్నది. కలిగినను సరిగాసాగక చెడుచున్నది. అనుకొన్నను అనుష్ఠింపజాలకున్న కారణమేమి ?

ఇందుకు (1) సంస్కారాత్మకము (2) అవ్యాత్మకము సని రెండుసమాధానములు. ఇందు మొదటిది సంస్కారవిజ్ఞానమను శీర్షిక క్రింద బరిశీలింతము. రెండవదానిగూర్చి యిట గొంచెము చూతము:— ఇదియైనను మహత్త్వమునందు సంస్కారభావమునకు దీసిపోదు. ధర్మభేదరక్ష కన్న భేదము కూడ బ్రధానసాధనమే. ఇది పదార్థధర్మభేముంబట్టి యుండును. దానింబట్టియే యనుష్ఠేయవర్ణధర్మభేదము నిల్చియున్నది. ఇంతకు దేలునదేమనగా —" వర్ణానుగత ధర్మభేద రక్షణకు మనము వర్ణధర్మవిముఖులము గాకుండవలయు, నను నుద్దేశ్యసిద్ధికి ధర్మానుగ తాహారవిహారాద్యనుగమ మావశ్యకము. అటుగాక, అందరును సమానాహారవిహారు

లగుచో నందువలన నర్ణధ్యక్షమగు భూతాత్మ (కర్మాత్మ) సమానలక్షణమై యెన్నడు ధర్మభేదభిన్న-వర్ణభేదమున కనుగామికాదు" అనియే.

ధర్మరహస్యజ్ఞానశూన్యులు కొందరు "అన్నపానములకు ధర్మమునకు నేమిసంబంధము? తావన్మాత్రమున నే చెడిపోవునంత పటుత్వములేనిదా భారతీయధర్మము? ఇదంతయు గల్పితమాత్రము నిరర్థక" మందురు. ఆర్యులంతమాత్ర మెరుగకపోలేదు. అన్నమర్యాద నుల్లంఘించుట ప్రారంభించిననాదినుండియే మన దివ్యశక్తిహ్రాస మారంభమైనది. అసదన్న పరిగ్రహమున నే భీష్మునంతటి ధర్మజ్ఞుడధర్మరతుడగు దుర్యోధను పక్షమందుండు గతికి పాలయ్యెనని భారతమున వినుచున్నాము. భూతాత్మకు స్వరూపమిచ్చునది యన్నమే. ఖగోళీయ సూర్య - చంద్ర - శనైశ్చరాది గ్రహోపగ్రహముల క్రూరదశలనుండి కాలానుసారము మనుజుడు ముక్తి నొందవచ్చును. గాని, మహాగ్రహలక్షణముగల యన్నగ్రహగృహీతవ్యక్తి ముక్తినొందుట కఠినము. గ్రహతత్త్వమీమాంసచేయుచు వేదము అన్నమును ప్రధానగ్రహమని యెను. చూతము:—

"ఏషవై గ్రహః - య ఏష తపతి (సూర్యం) యేనేమాః సర్వాః ప్రజాః గృహీతాః; వాగేవ గ్రహః, వాచాహీదం సర్వం గృహీతమ్; కిము తద్యద్వాగ్గ్రహః? నామైవ గ్రహః, నామ్నాహీదం సర్వం గృహీతమ్, కిము తద్యత్ నామ గ్రహః? బహూనాం వైనామాని విద్మ -అథనః తేన తేన

గృహీతాభవన్తి, అన్నమేవగ్రహః, అన్నేనహీదం సర్వాంగృహీతమ్, తస్మాద్యావన్తోనోశనమశ్నంతి, తేనః సర్వేగృహీతాభవన్తి! ఏషైవస్థితిః
( శత: 4-5-6 )

ఆహారములన్నియు సమానధర్మములుకలవి కావు. సత్వగుణప్రధానములై జ్ఞానశక్తిప్రర్ధకములగునవి కొన్ని. కొన్నిరజోగుణప్రధానములై క్రియాశక్తిను త్తేజములు. రజస్తమఃప్రధానములై యర్ధశక్తి నుపోద్బలకములుకొన్ని. ఇక వర్ణసంప్రదాయమునందో, సత్వప్రధానబ్రాహ్మణవర్ణము జ్ఞానశక్తికి, రజఃప్రధానక్షత్రియవర్ణము క్రియాశక్తికి,రజస్తమఃప్రధాన వైశ్యవర్ణమర్ధశక్తికి ననుగాములు. కనుక మూటినిసేవించువారు మూటికిజెందుదురు. మరియు—| మస్తిష్కశక్తివికాసాధిక్యానుపాతమున నుపదేశశక్తి వికసితమగును. ఇట్లే యుద్ధకర్మ సహోబలోపేత ( సాహసయుక్త ) హృదయబలము నపేక్షించును. కనుక తద్బలానుపాతమున క్షత్రియుడు యశోవీర్యవికాస సాఫల్యమునొందును. ఈ గుణ - శక్తి - వీర్యాదివివేకముచే “ ఉపదేశశక్తియుక్తుడగు బ్రాహ్మణునకు మస్తిష్కశక్తిసంరక్షకములు వర్ధకములు నగు సాత్వికాహారవిహారాదులే యుపయోగ్యములు రక్షక క్షత్రియవర్గమునకు హృదయబలసంరక్షకములగు సాత్వికరాజసాహారాదు లుపయుక్తములు. వైశ్యునకర్ధశక్తిసంరక్షక రాజసతామసాహారవిహారాదు లుపకారకములు, అఛందస్కుడగుటచే శూద్రుడు యథాకాముడు యథాచారుడు గావచ్చును. అని తేలును.

మరియు:— తన ప్రాతిస్వికరూపమున నన్నము సాత్త్విక మేయగుగాక! తత్తత్ప్రకృతిప్రధాన తత్తద్వ్యక్తులయధీన మై (యాత్మనీమం బ్రవిష్టమగుటచే) తనసాత్త్వికగుణముం గోలుపోయి తత్తత్ప్రకృతిగుణయుక్తమగును. ఏవర్ణము వాడైనను శాస్త్రవిరుద్ధపథానుగామియై అసద్వృత్తిచే ధనో పార్జనగావించుచో నతనిప్రాతిస్వికదివభావ మీవృత్తి-భావ దోషదూషితమై వర్ణధర్మమునకు వెలియైపోవును. అట్టి వ్యక్తుల యధీనమునందున్న యన్నాదిసంపత్తియు దూషి తమే యగును. ఎందుకన:— "యావద్విత్తం తావదాత్మా" అన్నట్లు భోగ్యసంపత్తియం దది కలవానియాత్మ విభూతిరూ పమున నుండును. ఈయాధారమున నే సూతకాన్నపరిగ్ర హమును ధర్మశాస్త్రములు నిషేధించెను. కనుక నీవిషయ మున జాగ్రతకలిగిమెలగవలయును.

అన్నాహుతిగ్రహణవిషయమునను గొన్నివిశేషనియ మములం బాటింపవలయును. అపవిత్రస్థానము అసమయము అవ్యవస్థితపద్ధతి అతిభోజనము, ఇత్యాదిదోషములచే సాత్త్వి కాన్నముగూడ తామసమైపోవును — ఇంకను, భోజ్యపదార్థ ముల పరిపాకమునకు జెందిన యవస్థలంగూడ గుర్తింపవల యును— ఘృతతైలాదిపదార్థములు సంక్రమణభావమునకు బ్రతిబంధకములుగ నెంచిరి. హేతువేమన:— వరుణనిచే ప్రతి మూర్ఛితమగు నగ్నిఘృతము. ఇంద్రుడు తైలము. అగ్నికి తాపము, ఇంద్రునకు బ్రకాశము, ధర్మములు. తాపప్రకాశ

ములతో విద్యుత్తునకు ఘనిష్ఠసంబంధ ముండును. అనగా విద్యుత్తు - తాపము - ప్రకాశము - సహయోగితత్త్వము లని భావము. ఆయగ్నీంద్రులు విద్యుత్సహయోగముననే వరుణదోషసంక్రమణము నాపగలవారగుదురు.

వరుణుడుజలదేవత. జలసమ్మిశ్రణమున నన్నముసంపన్న మగును. అందు వరుణభాగము ప్రధానముగ నుండును. వాయుమండలమున వరుణవాయు సామ్రాజ్యము. అందు తమోగుణవర్ధకము వరుణప్రాణ ప్రధానము నగు నాప్యాసుర తత్త్వ ముండును. సజాతీయాకర్షణసిద్ధాంతముంబట్టి యీ ప్రాకృతికాసురదోష మీవారుణాన్న ముంగూడుచుండును. కనుకనే కేవలజలపక్వాన్నము చాలకాలము నిలువయుండినచో నీరసమై దానియమృతభాగ మఛ్ఛిన్నముకాగా మర్త్యమగు నాసురభాగము వ్యాప్తినొందును. పగలుసూర్యసత్తచే సౌరేంద్ర ప్రాణసంపర్కమున వరుణసంయోగము ప్రబలము కాజాలదు. కాని, వారుణీరాత్రి సహయోగమువలన దానికి స్వతంత్రతకలుగగా చివరకు రాత్రినిలువయున్నది యుదయమున కాసురభాయుక్తమైపోవును. ఈవిషయము: "యాతయామంగతరసంపూతిపర్యుషితంచయత్" అన్న గీతావచనమున దెలియును.

వారుణకృతదోషమేకాక జలపక్వాన్నమును ముట్టుకొన్నచో నా యంటినవారి దోషమన్నమందు సంక్రమించును జలముతోబిసికినపిండిరొట్టె యగ్నిపక్వము ఘృత

యుక్తమయ్యు నాఘృతాగ్ని సంబంధముబహిర్వ్యాపము, అదిసాంక్రామిక భావప్రతిబంధమునం దసమర్థము, కనుక జలీయాన్నము సాంక్రామికాన్నమందురు; అట్టిదానిని రక్షాపూర్వకముగ, మర్యాదాగ్రహమున, శుచిభావపరిణితుడై, యారగిపవలయును.

"ఘృతతైలపక్వాన్నములు పూర్వోక్తవిద్యుత్సంపర్కమున దోషావహములుగావు. వానికియాతయామత లేదు. దారుణదోషప్రభావము వానిపై బారదుగదా" యన్నచో వానియందైనను జాతిభేదము జూడవలయును తత్తత్పదార్థ యుక్తికస్వరూపమునకు జెందిన తారతమ్యము పాలయందు నన్నము ందుగూడనుండును. బియ్యముంగ్గైకొనుడు పయఃపక్వము, ఘృతపక్వము, వహ్నిపక్వము నగు నన్నము ఫలమువలె గ్రాహ్యమనుకొనుడు కాని, నీటవండినయన్నము అగ్రాహ్యము. ఇందుఘృతాదిసంపర్కమున్నను, వరుణభాగముప్రధానముగనుక నాసాంక్రామికదోషముం దప్పించుకోజాలమని స్పష్టము. మరియు బియ్యముయొక్క యుత్పత్తియు జలమునందే కదా! ఇట్లు చివరకు క్షీరాన్నముగూడ సాంక్రామికమే యగును. కాగా నికఘృతతైలయుక్తాన్నము సంక్రమణభావరహితమందురు. దీనిందినుటకు మర్యాదాగ్రహాది ప్రతిబంధమంతగ నుండదు. ఇంతకు అన్నమర్యాదచే మనము వర్ణధర్మరక్షణకు సమర్థులముగాగలమని యే తాత్పర్యము. ఇందేదియు లేనివానిస్థితి వానిబుద్ధియు మొగమును జెప్పుచునేయుండును.

" లశునం, గృంజనంచైవపలాండుం, కవకానిచ
అభక్ష్యానిద్విజాతీనాం అమేధ్యప్రభవాణిచ "
(అనిమనువుచెప్పెను

ఒకపరిమితిలో వాడుకొనిన-చో నీవి భౌతికశరీరమునకు యథావసముగ నుపకారకములగుననుటనిజమే కనుక నే భగవంతుడు చరకాచార్యుడు మద్యమునకు హృదయబలముంబెంపొందించు నానాగుణములంజెప్పెను. కాని తమోగుణప్రధానములగు నీపదార్థములు ఆత్మగత బ్రహ్మవీర్య (జ్ఞానశక్తి) మునకు ముఖ్యశత్రువులనుట సిద్ధవిషయము. ఆసురజ్ఞాన – బలములు, క్షణికవిజ్ఞానము. విశుద్ధభూత్రోన్నతి గోరువారలానందమునకీతామసపదార్థ సేవనమాదరింతురుగాక ! దివ్యజ్ఞానోపాసకులు లోకవైభవముతో నాత్మవైభవముంగాక్షించువారు, వీనిందృజించుటుచితము.

ఇక నన్నపానములవలన నేమున్న దనుకొనువారు ప్రస్తుతము అవ్యవస్థితులు శక్తిశూన్యులు, ఉత్పథగాములు, కాంతిశూన్యులు, హీనవీర్యులుగ నున్న ప్రజావర్గముంగాంచి

" అలసులు, మందబుద్ధిబలు, లల్పతరాయువు, లుగ్రరోగసం
కలితులు, మందభాగ్యులు, సుకర్మములెవ్వియు జేయజాల, రీ
కలియుగమందుమానవులు. కావున నెయ్యదిసర్వసౌఖ్యమై
యలవడు ? నేమిటంబొడమునాత్మకుశాంతి ? మునీంద్ర । చెప్పవే

యన్న వ్యాసవచనమును స్మరించుకొను చుండుట మంచిది.
మరియు:– అన్నపానముల కాత్మతో సంబంధము లేదు. ఇవి కేవలశరీర పుష్టినిగావించును. కనుక శరీరమునకు హితకరపదా

ర్థములం దినుటలో దోషము లేదు; అనుకొనువారికి కొంచెము చెప్పెదము.

మనమతిభోజనము సేయు నెడ శరీరవృష్టి శిథిలమై స్నాయుతంతువులందు ప్రవహించు జ్ఞానధారయు మందగించుచున్నది. కారణశరీరరూపమగు నాత్మ, సూక్ష్మశరీరరూపమగు నింద్రియవర్గంబు, స్థూలశరీరరూప భౌతికశరీము, ఈమూటికి త్రిదండన దన్యోన్యాశ్రితభావము. ఒకదానిభావము రెండవదానికి సంక్రమింపకుండదు. చివర కాత్మ యన్నదోషము నుండి తప్పించుకొనజాలదు. ఈశ్రుతివచనములం జూడుడు:—

" అన్నమశితం త్రేధావిధీయతే తస్యయస్థవిష్ఠోధాతుః తత్పురీషం భవతి యోమధ్యమ స్తన్మాంసం యోణిష్ఠః తన్మనః ఆపఃపీతాః,త్రేధావిధీయన్తే తాసాంయఃస్థవిష్ఠోధాతు స్తన్మూత్రం యోమధ్యమస్తల్లోహితం, యోణిష్ఠఃసప్రాణః, తేజోశితంత్రేధావిధీయతే,తస్యయఃస్థవిష్ఠోధాతుస్తదస్థి, యోమధ్యమఃసమజ్జా, యోణిష్ఠఃసావాక్, అన్నమయంహిసౌమ్యమనః, ఆపోమయఃప్రాణః, తేజోమయీవాక్ [ఛాందో] " సవాఏషఆత్మా వాఙ్మయఃప్రాణమయో, మనోమయః. [బృహ]

ఇట్లు శ్రుతులు స్పష్టముగా నాత్మ తేజోబన్నమయ' మనుచున్నవి. కనుక దాని కాహారాదిసంబంధము లేదను టెట్లు? అన్నము, చాంద్రసోమ ప్రధానతచే సౌమ్యము, అంతరిక్ష్య వాయుప్రవేశమున వాయవ్యము, పార్థివమృద్వికారమున పార్థివము, నైయున్నది. ఈమూండుపాదానములంగాని యన్నముప్పతిల్లదు, (1) రసాసృఙ్మాంసమేదోఽస్థిమజ్జాశుక్రములను సప్తధాతుసమష్టి యన్నగతపార్థివభాగమున సంపన్నము

గును. ఇదే స్థూలశరీరాత్మకమగు (నాత్మకు) వాగ్భావమై యున్నది. (2) ఆధాతు ప్రతిష్ఠాలక్షణమగునోజస్సు అన్న గతాంతరిక్ష్యవాయుసంపన్నమగును. ఇది యాత్మకుసూక్ష్మ శరీరాత్మక ప్రాణము. (3) సర్వ ప్రతిష్ఠాలక్షణమగుమనస్సు అన్నగతదివ్యచాంద్రరససంపన్నము. ఇది యాత్మకు గారణ శరీరాత్మక మనోభాగము. ఇట్లాయన్నసే ద్రవ్యభేదమున సంపూర్ణాత్మసంస్థకు ప్రతిష్ఠయైయున్నది. ఇట్టిస్థితిలో:— ఆత్మ స్వరూపరక్షకు, తత్పూర్వక వర్ణస్వరూపరక్షకు, తత్పూర్వక వర్ణధర్మరక్షకు, ఆహారవిహారాదుల (గుణభేదముచే) విభిన్నత తప్పక యనుసరింపవలసినదే యని తేలుచున్నది.

## వర్ణవ్యవస్థయొక్క సామాజికనియంత్రణము

అనృతసంహితుడుమనుజుడు. ("అనృతసంహితా వై మనుష్యాః, సత్యసంహితా వై దేవాః") ఈయనృతభావమున వర్ణధర్మము దురుపయోగముగావింప నవకాశములేకుండ నియంత్రణ మవసరము. ఇందుకొరకు గొన్ని నియమము లేర్పడెను. తమతమ యధికారముతోబాటందరు వారివారి ఆయా నియమములచే నియంత్రితులై యున్నచో వర్ణ ధర్మము దృఢమగును.

మొదటిదగు బ్రాహ్మణవర్ణము జూతుడు:— బ్రహ్మవీర్యమున కధికారముగల యిది జ్ఞానశక్తి కధిష్ఠాతయగుటచే

సమాజమునకు శిరస్సు, సర్వశ్రేష్ఠము. మనుజు డేనాడు ప్రతిష్ఠకు జరమసీమం జేసుకొనునో యానాడతని కభిమానముతో నతిమానముకలుగును. ఇది పరాభవమూలకము కనుక దీనిచే బ్రాహ్మణుని బ్రహ్మవీర్యము హతప్రభమగును. సమాజమునకు జతుర్విధరక్షాసమర్థమగు నిది యిట్లుకారాదని అతిమాన దోషమునుండి తప్పించుకొనుట కీ నియంత్రణమును చూడుడు:—

(1) సమ్మానాద్బ్రాహ్మణోనిత్యం ఉద్విజేతవిషాదివ
అమృతస్యేవచాకాంక్షేత్ అవమానస్యసర్వదా
(2) సుఖంహ్యవమతః శేతే సుఖంచపరిబుధ్యతే
సుఖంచరతిలోకేస్మిన్ అవమంతావినశ్యతి
(3) అలాభేనవిషాదీస్యాత్ లాభేచైవనహర్షయేత్
ప్రాణాతిక్రమమాత్రః స్యాత్ మాత్రాసంగాద్వినిర్గతః

ఇందువలన నేమి తేలినది? బ్రాహ్మణవర్ణము ధనబలము శస్త్రబలము, ప్రతిష్ఠాతిమానము, ననుమూటినుండి తప్పించుకొనవలయును. వీనిసహాయోగము కల్గుచో జ్ఞానబలము సన్నగిల్లును. శాస్త్రోక్తమార్గమున నాజీవికామాత్రార్థ పరిగ్రహానుగమనమున బ్రాహ్మణుడు ధనాది లిప్సలేక బ్రతుకవలయును. ఏలయన, లక్ష్మ్యుపాసనజ్ఞానోపాసనకు బ్రతిబంధకముగ నెంచబడినది.

ఇక: క్షత్రియునిచేతిలో శాసనదండమున్నది. దానికి ధనముతోడయ్యెనా యనర్థసంభావనతప్పదని యతనిచేతినుండి

యర్థబలము తీసివేయబడినది. ఆశాసనబలము దురుపయో
గము కాకుండ జేయుట కీధర్మదండము నియమింపబడినది:

" దండోహిసుమహత్తేజో దుర్ధరశ్చాకృతాత్మభిః
ధర్మాద్విచలితేహన్తి నృపమేవసబాంధవమ్॥"

ఇంకను:— వైశ్యవర్గమైనను ధనసంపత్తి తమపిత్ర్యా
మనుకొని దానిని సామాజికవ్యవస్థ కుపయోగింపకుండ బ్రోవు
చేయరాదని బ్రహ్మ-క్షత్రనియంత్రణతోబాటు "దద్యా
చ్చసర్వభూతానామన్నమేవప్రయత్నతః" యని యాదే
శము కూడజేయబడినది. ఇట్టినియంత్రణలవలన యుచ్ఛృం
ఖలముగాక సర్వోచ్చమై వెలయు వర్ణవ్యవస్థ నేటియవస్థ
చెప్పనక్కరలేదు. ......

## వర్ణవ్యవస్థ - కర్మమూలమను.
## వాదియాక్షేపణలు: 13.

వర్ణవ్యవస్థకర్మమూలమా? జన్మమూలమా? నేడిది
యొక విచిత్రసమస్యగ నున్నది. ఇది ప్రకృతియందలి వర్ణదేవ
తలకు జెందినది. దీనికి ప్రవర్తకుడవ్యయేశ్వరుడయినచో క
ర్మమూల మనుటెట్లు? "చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మవిభాగశః" ఇందుగుణకర్మశబ్దములంబట్టి కొందరు
కర్మమూల మనిచెప్పుటకు శ్రమపడుచున్నారు. ఏగుణకర్మ
విభాగముల యాధారమున నవ్యయేశ్వరు డీచాతుర్వర్ణ్య

మును సృష్టించెను? మనయెదుటనున్న ప్రస్తుతబ్రాహ్మణా
దుల గుణకర్మలంబట్టియా? కాదు; ఔననియెంత శ్రమపడినను
చివరకు వర్ణోపాదానభూతములగు దివ్య — వీర — పశు—మృత
భావప్రవర్తక బ్రహ్మ - క్షత్ర - విట్ - శూద్రత్వముల
గుణకర్మలకడకు బోవలసివచ్చును. ఆయాగుణకర్మలుగల
వీర్యములతో నానావర్ణములను భగవంతుడు (క్షరబ్రహ్మ)
సృష్టించెననవలయును.

పై వాక్యమందలి 'సృష్టమ్' పదముంజూచితిరా? అది
జన్మభావమునే సూచించునుగదా! 'అవ్యయుడనయాత్మ
(భూతాత్మ) యందెట్టిగుణసంస్కారములుండెనో, దాని నా
వర్ణమునం దుత్పన్నముగావించితిని' "అనగా: శుక్ర
శోణితసమన్వితరూపమునం బ్రవేశించు నౌపపాతిక కర్మ
భోక్త - కర్మాత్మయొక్క గుణకర్మ సంస్కారానుసార
మాయావర్ణరజోవీర్యమునం బ్రవేశించి యందందు జనించు"
ననియే తాత్పర్యముగాని "ముందునాచేసృష్టింపబడినది
పిమ్మటగుణకర్మవిభాగశః చాతుర్వర్ణ్యము విహితమైనది"
అనిభావముకాగలదా? అసంభవము.

మనగుణకర్మలే చాతుర్వర్ణ్యసృష్టి కారంభకము
లగుచో నీవ్యవస్థ మనుజులందె యుండవలయును. మరియట్లు
లేక, సృష్టియందలి చరాచరపదార్థము లన్నిటియందు
నున్నదే. దేవసృష్టిమొదలు స్తంబసృష్టివరకు నీవ్యవస్థ

నిత్యసిద్ధము. కనుక నాభగవద్వాక్యము వ్యాపకసృష్టిపరకమె యుండును. కనుక పూర్వమునూ చెప్పినయర్థమేసరి.

విషయము పెరుగుచున్నది. అయినను గతిలేదు. నేటి కాలమున నెవరికి నీవిమర్శ ప్రవృత్తియే లేదు. తీరికయు లేదు. కనుక విస్తరింపవలసిదే యున్నది. ఈ ప్రకరణమును జక్కగాజూచిన సమాధానముకుదురు ననుకొనుచున్నాము.

ఈవ్యవస్థ నెందిన జన్మకర్మవాదులను నాల్గుభాగము లుగ జేయవచ్చును. (1) సనాతనధర్మలు (2) ఆర్యసామాజికులు (3) సంస్కర్తలు (4) తటస్థులు: వారిమతములిం చుక చూతుము:—

(1) సనాతనధర్మలు:— ఈవ్యవస్థమనుజకల్పన కాదు. అనాది. జగదీశ్వరుడుదీనికావిర్భావకుడు. విరాట్పురుషుని ముఖమునుండి బ్రాహ్మణుడు. బాహువులనుండిక్షత్రియుడు, ఊరువులనుండివైశ్యుడు, పాదములనుండిశూద్రుడు, బుట్టెను. ఈసృష్టిఈశ్వరీయ మనుకొన్నపు డిదిజన్మమూలమే యగ వలయును.

(2) ఆర్యసామాజికులు:— ఇది వేదసిద్ధమే కాని, దీనికి మూలముగుణకర్మలే. వైదికయుగమున నేయేగుణకర్మలు కలవాని నాయానవర్ణీయునిగ నెంచిరి. జన్మమూలమను ధర్మ వచనము లేనేని యున్న నవి బ్రాహ్మణవైయక్తిక ప్రతిష్ఠ కొరకు కల్పితములగు ప్రక్షిప్తములు. ఇయ్యది గుణకర్మా

నుగతమై యున్నంతకాలము దేశోన్నతిబాగుగ నేయుండి జన్మానుగత మనుకొన్నప్పటినుండియు పతనమునకు దారి తీసెను. పౌరాణికకాలీనమగు నీయుపిద్యందొలగింపవలయును.

(3) సంస్కర్తలు:— భారతవర్ష మాన్నత్యమునొంది యున్ననా డీవర్ణవ్యవస్థయేలేదు. దీనికి జెందిన కలహము లును లేవు. ఆనాడందరు సమానులే. అందరకు నన్నిట నధి కారముకలదు. అందరుంగలసి యీశ్వరోపాసన జేయుచుండిరి. సత్యాహింసాదులే నాటి ప్రధానధర్మములు. దౌర్భాగ్యమున నామతులు చెడి యీదశపోయినది. నాశకారిణియగు నీవ్య వస్థ పౌరాణికకాలీన వ్యక్తిస్వార్థప్రాధాన్యమున బుద్ధిజాడ్య జనితోన్మాదులు వెలయించిరి. ఇందుచే నైక్యతచెడినది. ఉచ్చ - నీచభావములు వెలసినవి. దానితో త్రోడినాగరక దేశములయెదుట తలయెత్తజాలని స్థితిపట్టినది. ఈవ్యవస్థ త్వరలో నాశము సేయుట మేలు.

(4) తటస్థులు:— ఈవిషయము (వ్యవస్థ) వేదము లందు లేదనుట తప్పు. ఆనాడిదిశుద్ధకర్మప్రధానముగ నుండెను గాని, జన్మతోసంబంధములేదు, కర్మనుబట్టివర్ణము. కాగా చివరకది వంశానుగతమన్నారు. తరువాత క్రమ ముగా జన్మమూలమనుకొన్నారు.

ఈనలువురిలో సంస్కర్తలభినివేశపూర్ణులు "తా బట్టినకుందేటికిమూడేకాళ్ళు" అను కోటిలోనివారు. వ్యతి రేకవచనములు ప్రక్షిప్తములు, కల్పితములు, అను గీర్వా

ణములంగొట్టినైతురు. కనుక వారికేమిచెప్పిన నరణ్యరోదనము. కనుక వారితో వాదింపజాలము. సత్యజ్ఞానమునకు శబ్దము, అందును, వేదము ప్రమాణమని యుదివరకేచెప్పుకొంటిమి. ఆవిషయమున వారికి 'నమ్మము' అను మూలమంత్రమున్నది. ఇక 'కాలేకారుణికత్వమైనకృపయా తేభావనీయానరాః' అనువాక్యమే గతి. కనుక విడిచెదము.

ఇక సనాతనధర్మికెదురాగనున్నవారిద్దరు. వీరివ్యవస్థయొక్క వైదికత నొప్పికొందురు. కాని జన్మసిద్ధము కాదనియు గుణకర్మమూలమనియు నందురు. వారివాదము నిదము.

(1) జన్మసిద్ధములు మను - ష్యాశ్వ - గో - వృషభ - మృగ - పక్షి - క్రిమి - కీటాది - జాతులేకాని యీ వర్ణములుకావు. అవి ఈశ్వరుడుసృజించినవి. అతడుసమదర్శి. భారతవర్షీయులను సృష్టించిన ట్లితరదేశీయులను సృష్టించియుండడా? భారతశాస్త్ర మితరదేశములను మ్లేచ్ఛదేశములనును. అటకుబోయిన ప్రాయశ్చిత్తముగూడ విధించును. వీరివలెవారు ముఖాదిజనితులుకారా? ఈవ్యవస్థయు, ధర్మశాస్త్రములును భారతీయవిద్వాంసులయుపజ్ఞలు. జ్ఞాన - కర్మ - అర్థ - శిల్ప - సమృద్ధులకొరకై ఈవిభాగ మవసరమనుకొనిరి. నేడిట్టివిభాగము పాశ్చాత్యులందును మరొకరూపమున అనగా: సివిలు, మిలటరీ, మర్చెంట్, లేబరు, అనియున్నది. దానివలె నిదియు మనుష్యకల్పితమే. మహీదాస-ఐతరేయుడు ఈవ్యవస్థకల్పితమనియెను చూడుడు:—

"దేవవిశః కల్పయితవ్యాః ఇత్యాహుః తాః కల్పమానా
అనుమనుష్యవిశః కల్పన్తే, ఇతిసర్వావిశోకల్పతే యజ్ఞోపి"

(2) మనసభ్యతకు మహాభారతము మాన్యగ్రంథము. ఈవ్యవస్థ నది గుణకర్మప్రధానమే యనియెను. తన్మతమున సభ్యతారంభయుగమున నొకవర్ణమేయుండెనట! పిమ్మట నాయొకటే కర్మభేదమున నాల్గుతరగతులయ్యెనట!

"నవిశేషోస్తివర్ణానాం, సర్వంబ్రాహ్మమిదంజగత్
బ్రహ్మణాపూర్వసృష్టంహి, 'కర్మభిః' వర్ణతాంగతమ్"

వనపర్వమునయుధిష్ఠిర నహుషసంవాదమున వర్ణవ్యవస్థామూలములు గుణకర్మములే యని చెప్పబడియెను. ఋషిశాపమున సర్పమైన నహుషునితో యుధిష్ఠిరుని యీసంవాదభాషం జూడుడు:—

యుధిష్ఠిరః:- "సత్యంజ్ఞానంక్షమాశీల మానృశంస్యంతపోఘృణా
దృశ్యన్తేయత్ర నాగేంద్ర సబ్రాహ్మణ ఇతిస్మృతః
సర్పః :- చాతుర్వర్ణ్యం ప్రమాణంచ సత్యంచబ్రహ్మచైవహి
శూద్రేష్వపిచసత్యంచ దానమక్రోధఏవచ
యుధిష్ఠిరః:- "శూద్రేతుయద్భవేల్లక్ష్మ ద్విజేతచ్చనవిద్యతే
నవైశూద్రోభవేచ్ఛూద్రో బ్రాహ్మణోనచబ్రాహ్మణః
యత్రైతల్లక్ష్యతేసర్ప! వృత్తంసబ్రాహ్మణఃస్మృతః
యత్రైతన్నభవేత్సర్ప తంశూద్రమితినిర్దిశేత్
సర్పః :- యదితేవృత్తతోరాజన్ బ్రాహ్మణఃప్రసమీక్షితః
వృథాజాతిస్తదాయుష్మన్ కృతిర్యావన్నవిద్యతే
యుధిష్ఠి :- జాతిరత్రమహాసర్ప మనుష్యత్వేమహామతే
సంకరాత్సర్వవర్ణానాం దుష్పరీక్షేతిమేమతిః"

(3) ఇందువలన 'జాతి' ప్రధానముకాదనియు, వృత్తి ప్రధానమనియు, దేలుచున్నదికదా! యక్షయుధిష్ఠిరసంవాద నందునింతే. చూడుడు:—

యక్షః :- "రాజన్ కులేనవృత్తేన స్వాధ్యాయేన శ్రుతేనవా
బ్రాహ్మణ్యంకేనభవతి ప్రబ్రూహ్యేతత్సునిశ్చితమ్"

యుధిష్ఠిరః :- శృణుయక్ష! కులంతాత! నస్వాధ్యాయోనచశ్రుతమ్
కారణంహిద్విజత్వేచ వృత్తమేవనసంశయః
వృత్తంయత్నేనసంరక్ష్యం బ్రాహ్మణేనవిశేషతః

(4) బ్రాహ్మణవ్యాధసంవాదమునందును గుణకర్మలకే ప్రాధాన్యమీయబడినది. చూడుడు:—

"శూద్రయోనౌహిజాతస్య సద్గుణానుపతిష్ఠతః
వైశ్యత్వంలభతేబ్రహ్మన్, క్షత్రియత్వంతథైవచ"
"ఆర్జవేవర్తమానస్య బ్రాహ్మణ్యమభిజాయతే
గుణాస్తేకీర్తితాఃసర్వే కింభూయఃశ్రోతుమిచ్ఛసి"

(5) గౌరవపూర్ణప్రామాణిక గ్రంథమగు వాల్మీక రామాయణముగూడ మొదటనొకవర్ణమే యనుచున్నది. కనుక పిమ్మటనే గుణకర్మలంబట్టి యీవ్యవస్థయేర్పడి యుండును. చూడుడు:—

"అమరేంద్ర మయాబుద్ధ్యా ప్రజాఃసృష్టాఃతదా ప్రభో
ఏకవర్ణాః, సమాభాషా, ఏకరూపాశ్చసర్వశః (వా॥రా॥ఉ॥)

(6) ఈవ్యవస్థ 'అనాది' యగుచో కృతయుగమునందు గూడ నుండవలయునా? మరి యట్లులేదనియు, త్రేతాయుగమం దేర్పడినదనియు జెప్పునీపురాణవచనములం బరికింపుడు.

"సమంజన్మచరూపంచ మ్రియంతేచైవతాఃసమం
తదాసత్యమలోభశ్చ క్షమాతుష్టిః సుఖందమః
నిర్విశేషాస్తుతాఃసర్వాః రూపాయుఃశీలచేష్టితైః
అబుద్ధిపూర్వకంవృత్తిం ప్రజానాంజాయతేస్వయం
అప్రవృత్తిఃకృతయుగే కర్మణశ్శుభపాపయోః
వర్ణాశ్రమవ్యవస్థాశ్చ నతదాసన్ నసంకరః
అనిచ్ఛాద్వేషయుక్తాస్తే వర్తయన్తిపరస్పరమ్
తుల్యరూపాయుషఃసర్వాః అధమోత్తమవర్జితా
సుఖప్రాయాహ్యశోకాశ్చ ఉత్పద్యన్తేకృతేయుగే
నిత్యప్రహృష్టమనసః మహాసత్త్వామహావహాః (వాయుః)

(7) గుణకర్మమూలకముగ నీప్రచలితవర్ణవిభాగ మెప్పుడు ఎందుకు కల్గెనో! ఆవాయుపురాణముననే చూడుడు: —

"విషాదవ్యాకులాస్తాస్తై ప్రజాస్తృష్ణాక్షుధాత్మికా
తతః ప్రాదుర్బభౌ తాసాం, సిద్ధిస్త్రేతాయుగేపునః"

.................

"సంసిద్ధాయాంతువార్తాయాం తతస్తాసాంస్వయంభువః
మర్యాదాఃస్థాపయామాస యథారబ్ధాఃపరస్పరం
యేవైపరిగృహీతార స్తాసామాసన్ విధాత్మకః
ఇతరేషాంకృతత్రాణాః స్థాపయామాసక్షత్రియాన్
ఉపతిష్ఠన్తియేతాన్వై యావన్తోనిర్భయాస్తథా
సత్యంబ్రహ్మయథాభూతం బ్రువన్తోబ్రాహ్మణాశ్చతే
యేచాన్యేప్యబలాస్తేషాం వైశ్యసంకర్మసంస్థితాః
కీనాశానాశయన్తిస్మ పృథివ్యాం ప్రాగతంద్రితా

నైశ్యానేవతుతానాహుః కీనాశాన్ వృత్తిసాధకాన్
శోచంతశ్చద్రవంతశ్చ పరిచర్యాసుయేరతాః
నిస్తేజోల్పవీర్యాశ్చ శూద్రాంస్తానబ్రవీత్తుసః

.....................

(8) శ్రీమద్భాగవతముకూడ జన్మవాదముల కంత సుముఖముగ లేదు.

"ఆదౌకృతయుగేవర్ణోనృణాం హంసఇతిస్మృతః
కృతకృత్యాః ప్రజాజాత్యా తస్మాత్కృతయుగంవిదుః
త్రేతాముఖేమహాభాగ ప్రాణాన్మేహృదయాత్త్రయీ
విద్యాప్రాదురభూత్తస్యా అహమాసంత్రివృన్మఖః
విప్రక్షత్రియవిట్ శూద్రా ముఖబాహూరుపాదజాః (స్కం)

(9) కల్పసూత్రములును సంస్కార - యజ్ఞవిశేషను లాయానర్ణప్రతిష్ఠలనుచున్నవి కాని జన్మవాద మంగీకరించి నట్లు కనుపింపదు. చూడుడు:—

(1) జన్మనాజాయతేశూద్రః సంస్కారాద్ద్విజఉచ్యతే
(2) స్వాధ్యాయేనజపైర్హోమై స్త్రైవిద్యేనేజ్యయాసుతైః
మహాయజ్ఞైశ్చయజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతేతనుః

మరియు:— ద్విజత, సంస్కారకర్మచేసంపన్నమగును. పతితసావిత్రీకుడు వ్రాత్యుడు. నాడు పంక్తిబాహ్యుడు. "బ్రాహ్మణోమదిరాంపీత్వా బ్రాహ్మణ్యాదేవహీయతే". ఇత్యాదులు సంకరీకరణములు మలినీకరణములే గాక కొన్ని జాతిభ్రంశకరకర్మలు నున్నవి. ఇనియన్నియు కర్మప్రధాన

తనే సూచించుచున్నవి. గుణకర్మవాదపుష్టినొసంగు నీక్రింది వచనములంగనుగొనుడు.

> "శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చేతి శూద్రతాం
> క్షత్రియాన్ జాతమేవన్తు విద్యాద్వైశ్యాత్తథైవచ
> యథా కాష్ఠమయోహస్తీ యథాచర్మమయో మృగః
> యశ్చవిప్రో నధీయానః త్రయస్తేనామధారకాః
> —యోనధీత్య ద్విజో వేదా నన్యత్రకురుతే శ్రమం
> సజీవన్నేవశూద్రత్వ మాశుగచ్ఛతిసాన్వయః" ఇత్యాదులు

"అథ-యోనగ్నికః - సఖంభేలోష్టః తద్యథాఖంభేలోష్ఠః ప్రక్షిప్తో నైవశౌచార్థాయ కల్పతే నైవశస్యంనిర్వర్తయతి ఏవమేవాయం బ్రాహ్మణో నగ్నికః తస్య బ్రాహ్మణస్యాఽగ్నికస్య నైవదైవందద్యాత్ నైవపిత్ర్యమ్ నచాస్యస్వాధ్యాయాశిషః నయజ్ఞఆశిషః స్వర్గంగమాభవన్తి.

(10) ఐతరేయ బ్రాహ్మణమునందొకకథ:— ఒకప్పుడు సరస్వతీనదీతీరమున ఋషులుసత్రయజ్ఞమునారంభించిరి. అం దనర్హుడగు ఇలూషుడనువానికొడు కైలూషుడను కవషుడు జేరెను. ఋషులువానింగనిపట్టి:— "వీడుదాసీపుత్రుడు, జూదరి, యబ్రాహ్మణుడు వీనికి మనలోదీక్షయేమి ?" యని యెంచి వానినానవలకుదరిమి 'చచ్చుగాక' యని యొక నిర్జల వాలుకామయ (ఎడారి) ప్రదేశమున బడవైచిరి. అటనతనికి దప్పిపుట్టెను. అందు కతడు చేయునది లేక వేదమందలి 'ఆపోనప్త్రీయ' సూక్తమును స్మరించెను. తత్ప్రభావమున నొక శీతలజలధార యుదయించి యాఋషులు యాగమొనరించు తీరముగూడ ముంచివేయగా వారందరచ్చెరువంది అతని

మహాత్మ్యమునంగీకరించి, యాసూక్తమును వారుగూడనను గమించిరి. సరస్వతికి నలువైపుల నావరించిన యానది నేఁడు 'పరిసారక'నామమున నొప్పుచున్నది. ఆసూక్తమున కతడు మంత్రద్రష్ట మహర్షి. మనవారు శూద్రులకు వేదాధ్యయనము నిషేధించిరి. కవషునివంటి యబ్రాహ్మణుడు వేద సూక్తములకు ద్రష్టయయ్యెను. ఏమనవలయును. ఈవర్ణ వ్యత్యయికనైన జన్మసిద్ధ మనువాదము ద్రోసివేయరా?

(11) ఇట్లు: గాధిపుత్రుడు విశ్వామిత్రుడు బ్రహ్మర్షియైన వృత్తము, సుప్రసిద్ధనే, వీతిహోత్ర, ఋషభపుత్రాదుల యాఖ్యానములుగూడ నీపట్టునజూడదగినవి. కర్మప్రభావమున కులనేపరివర్తన మొందినట్లు భాగవతమునం దొకచో కలదు. (9-2) చూడుడు హరివంశమందును "నాభాగారిష్టపుత్రౌద్వౌవైశ్యౌ బ్రాహ్మణతాంగతౌ"ఇత్యాదిగా, కర్మచే వర్ణవ్యవస్థయే స్వీకరింపబడినది.

(12) ఇంకొకగొప్పచిక్కేమన, ఈవ్యవస్థజన్మమూల మగుచో ఆకారమందే భేదముండవలయును. గవాశ్వాజాదుల కంతేకదా! అదికాదు, స్వభావభేదమిందుకు బరిచాయక మనుచో నదివట్టిమాట. బ్రాహ్మణులందే చెడ్డవారు శూద్రులందే మంచివారు పెక్కురు అగుపడుచున్నారు. జన్మమూలవాదమువలన మంచివారిని నుపయోగించుకొనుటయు బ్రాప్తి

లేకున్నది. చెడ్డవాని నుపయోగించుట తప్పనిసరియగు చున్నది. ఇంతకంటె వేరొకఫల మగపడుట లేదు.

(13) జన్మవాదమున కనుకూలించునట్లుండు "బ్రాహ్మణోఽస్యముఖమాసీత్"......"గాయత్ర్యా బ్రాహ్మణం నిరవర్తయత్" ఇత్యాది శ్రుతులను నౌపచారికార్థముచెప్పుటయే యుక్తము గాని రూఢ్యర్థముం జెప్పదగదు. "సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా" అన్నట్లు బ్రహ్మ "సర్వతఃపాణిపాదంతత్ సర్వతోఽక్షిశిరోముఖం" అనుకొన్నచో నిదిబ్రాహ్మణాదుల యుత్పత్తికి గారణమనుకోవచ్చునా? శ్రుతులందు ఉత్పన్న - జాత - ప్రసూతాదిశబ్దములు ఔపచారికార్థములందె వాడబడినవి. వర్ణవ్యవస్థమాట యటుంచి ఆశ్రమవ్యవస్థంగూడ యిట్లేవర్ణించినట్లు చూడగలము. అది యంతయు నట్లే నిజమ నుకొనవచ్చునా? చూడుము:—

"గృహాశ్రమోజఘనతః బ్రహ్మచర్యంహృదోమమ
వక్షస్థానాద్వనేవాసో న్యాసంశీర్షణిసంస్థితః
వర్ణానామాశ్రమాణాంచ జన్మభూమ్యనుసారిణీః
ఆసన్ప్రకృతయోనౄణాం, నీచైర్నీచోత్తమోత్తమైః

ఇంతకునీవ్యవస్థ గుణకర్మలంబట్టి వచ్చినదికాని జన్మసిద్ధముకా దని తేలినది.

—:0:—

# జన్మసిద్ధవర్ణవ్యవస్థ

## సమాధానములు 13.

(1) భారతవర్షమందె కాని వర్ణవిభాగమెచ్చటను లేద నుట పొరబాటు. దేశమేల? మనుష్యులేల? చరాచర ములందేదైనబదార్థమాత్రమున్నచో జాలు నేదోయొకబీజ రూపమున వర్ణవ్యవస్థయుండితీరినదందుము. పాశ్చాత్యులం దొకవిధము మీరొప్పినారుగదా! మనఋషులు చక్కగ బ్రకృతిరహస్యముల నెరింగి వర్ణ'వ్యవస్థ'చేసిరిగాని 'సృష్టి' చేయలేదు. సంస్కారాదివిశేషములచే వర్ణబీజము బుష్పి తము పల్లవితము గావించిరి. స్థూలభౌతికవాదులగు నితర దేశీయులకీరహస్యజ్ఞానము శూన్యము కనుక నందది వ్యవస్థి తముకాజాలదయ్యెగాని, సృష్టము కాకపోలేదు. ఉదాహర ణమునకు విద్యుత్తులేనిపదార్థములేదు. దానినెరిగినవాడు సువ్యవస్థితముగ జేసి యుపయోగించుకొనును. అది నేర్వనివా డట్లేయుండునుగదా! వర్ణవిషయమున గూడనింతే. మరియు:- ఈశ్వరీయతత్వ మంతటనున్నది ఒకచో వికసించుట యొకచో వికసింపకుండుట దానియిచ్ఛ. దానిని పక్షపాతమెట్లందుము? సమభావమున్నచో సృష్టియేయుండదు. ఏలయన సృష్టిస్వ రూపరక్షణ విషమత్వపైననే యాధారపడియున్నది.

"అన్నితత్త్వములు నన్నిదేశములందును సమాన ముగనుండవలయు" ననుట యవైజ్ఞానికము, అశాస్త్రీకము.

అన్ని దేశములను, అందలిశీతోష్ణములను, వస్తువులను అనగా పశుపక్షిమృగమనుష్యాదులను, పంటలను, సమములుగా నేల సృష్టింపలే దని యీశ్వరు నేయడుగుటమంచిది. భాగీరథి యుత్తరభారతమున నేలయవతరించె ? శాలగ్రామమందే శాలగ్రామోత్పత్తి కేమికారణము ? సూర్యోదయాస్తమయములెందుకు? స్త్రీపురుషశరీరనిర్మాణమున బక్షపాత మేల? ఇత్యాదులు ప్రశ్నమర్యాదాబహిర్భూతములగు నతిప్రశ్నలు. తైలముచేదీపము వెల్గును ఏల ? నీటితో వెలుగదు ఏల ? ఏదో కారణము చెప్పుదుము. అప్పుడు మరలనది యేల ? అని ప్రశ్న. దీనికంత మెప్పుడు ?

'స్థితస్యగతిఃచింతనీయా' ఉన్నదానింబట్టి విచారింపవలయును. కాని అచింత్యభావములం దర్కించుకొని బుద్ధి జెడగొట్టుకోరాదు.

> ..అచింత్యాఖలుయేభావా నతాంస్తర్కేణయోజయేత్
> ప్రకృతిభ్యః పరంయచ్చ తదచింతస్యలక్షణమ్''

భారతవర్షముతూర్పు, యూరపుమొదలగునవిపడమర, ఇటనింద్రప్రాణము, అటవరుణప్రాణము, ప్రధానములు. ఇట దేవసృష్టి, అటనసురసృష్టి, ప్రధానములు. రెంటియందు రెండుభావములును బూర్ణముగ నుండకపోవు. ఇటనొకటి అటనొకటి స్వల్పములని యూహింపవలయును. ఈవిషయము ప్రాక్పశ్చిమములను శీర్షిక క్రింద గీతావిజ్ఞానపరిచయమున వివరింపబడినది. దివ్యసృష్టిమూలకములగు, వేదము, సనాతన

ధర్మము వర్ణవ్యవస్థ, ధర్మభేదము, ఈ దేశసంపదలు. | త్రయీ వేదరూప కృష్ణమృగ మిందు స్వేచ్ఛగాదిరుగును. | ఇది యార్యావర్తము, దీనికిబశ్చిమముతో బోలికయేమి? అట్లుండ నేలయను కేమి ప్రశ్న? నాగరకుల మనుకొను నితర దేశీయులు భూతజ్ఞానాభావలక్షణాజ్ఞాననిద్రానిమగ్నులైయున్న నాటికే భారతవర్షము తత్త్వజ్ఞానచరమసీమం జేరెను. ఆత్మ-పరమాత్మలవంటి యతీంద్రియతత్త్వ - సాక్షాత్కారముం నొందెను. కారణమేమి? యను ప్రశ్న యెందుకు? అది యీ దేశప్రాతిస్విక సౌభాగ్యము. దీనియావైయక్తికమహత్వము జూడుడు:—

1. నిషేకాదిశ్మశానాంతో మంత్రైర్యస్యోదితో విధిః తస్యశాస్త్రేధికారోస్మిన్ జ్ఞేయో నాన్యస్యకస్యచిత్॥
2. సరస్వతీదృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్
తందేవనిర్మితందేశం, బ్రహ్మావర్తం ప్రచక్షతే
3. తస్మిన్ దేశేయఆచారః పారంపర్యక్రమాగతః
వర్ణానాంసాంతరాళానాం ససదాచారఉచ్యతే
4. కురుక్షేత్రంచమత్స్యాశ్చ పంచాలాశ్శూరసేనకాః
ఏషబ్రహ్మర్షిదేశోవై బ్రహ్మావర్తాదనంతరః
5. ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్రజన్మనః
స్వంస్వంచరిత్రంశిక్షేరన్ పృథివ్యాంసర్వమానవాః
6. హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ ప్రాగ్ వినశనాదపి
ప్రత్యగేవప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః

7. ఆసముద్రాత్తువైపూర్వా దాసముద్రాత్తుపశ్చిమాత్
తయో రేవాంతరంగిర్యోః ఆర్యావర్తంవిదుర్బుధాః

8. కృష్ణసారస్తుచరతి మృగోయత్రస్వభావతః
సజ్ఞేయోయజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశస్త్వతఃపరః

9. ఏతాన్ ద్విజాతయో దేశాన్ సంశ్రియేరన్ ప్రయత్నతః
శూద్రస్తుయస్మిన్ కస్మిన్వా నివసేద్వృత్తికర్శితః

10. ఏషాధర్మస్యవోయోనిః సమాసేనప్రకీర్తితా
సంభవశ్చాస్యసర్వస్య వర్ణధర్మాన్నిబోధత (మనువు) 2-16-25.

ఇక "దేవవిశఃకల్పయితవ్యాః"అను నైతరేయవచనముంబట్టి వర్ణసృష్టి, వ్యవస్థలు కాల్పనికము లని యర్థము కాదు. "ప్రాణోయజ్ఞేనకల్పతామ్" "ఆయుర్యజ్ఞేనకల్పతామ్"అనుచో కల్పనాశబ్దమున కేమియర్థము? మిథ్యా-కృత్రిమము, ననియా? ప్రాణము, ఆయువు యజ్ఞముచేకల్పితమగుగాక యన్నచో తత్త్వమేమున్నది? (1) అన్యోన్య ద్రవ్యాణా నామన్యోన్యపరిగ్రహఃయజ్ఞః (2) వాచశ్చిత్తస్యోత్తరోత్తరక్రమోయజ్ఞః ఆదానవిసర్గాత్మక ప్రాకృతిక క్రియావిశేషము యజ్ఞము. దీనివలన మనకు ప్రాణతత్త్వరక్షణయగుచున్నది. ఆప్రాణమాయుర్నిర్మాణముసేయుచున్నది. అని 'కల్పతామ్' శబ్దము ప్రయోగింపబడెను. 'కల్పనా'శబ్దమునకర్థము:-రచన, సంపాదనము. మీమాంసాసమ్మతమగు ఈదృష్టితో "దేవవిశఃకల్పయితవ్యా"యనగా "మొదట ప్రజాపతిద్వారా దేవప్రజలుకల్పింపబడిరి. (సృష్టింపబడిరి) పిమ్మట నాదేవప్రజ

లచే మనుష్యప్రజలు కల్పింపబడిరి, మనువుకూడ నుత్పత్తి క్రమనిట్లే చెప్పెను. సప్తప్రాణరూపసప్తర్షిమూర్తియగు పురుషప్రజాపతియొక్క ఋషిభాగము చేబితరులు, పితృసమన్వయమున దేవాసురులు, దేవసమన్వయమున చరాచరములు వికాసమొందెను. చూడుడు:—

"ఋషిభ్యః పితరోజాతాః పితృభ్యోదేవదానవాః
దేవేభ్యశ్చజగత్సర్వం, చరంస్థాణ్వానుపూర్వశః"

మానససంకల్పముకామన, అదిమొదలుగ కర్మయారంభమగును. చిత్రకారాదులందరకు నిదేక్రమము. సంకల్పము – సూక్ష్మమగుమానసచిత్రము. కల్పనాచిత్రము. క్రమముగస్థూలరూపమున స్థూలభూతసహాయమున వికసిల్లి, బాహ్యజగద్వస్తువగును.

యజమానుని వైధయజ్ఞమందు, ప్రాకృతికయజ్ఞభావములు సరిగాకల్పింపబడును. అచ్చటి ప్రాణదేవస్థను బట్టియే యిందును మంత్రాహ్వానమున దేవప్రజాకల్పనయు సేయబడును. కనుక "దేవవిశఃకల్పయితవ్యా" అనియెను. దేవప్రజాకల్పనాకారణము? "తాఃకల్పమానాః అను, మనుష్యవిశఃకల్పన్తే" ప్రాకృతికయజ్ఞమున కీయజ్ఞ మనుకరణము. అందేకర్మయో ఇందునదే. ప్రాకృతికయజ్ఞకర్తయగు ప్రజాపతి మొదట దేవతల నుత్పత్తిచేసెను. వారిచే మనుష్యప్రజానిర్మాణము గావించెను. ఇచ్చటనంతే 'యద్వై;

దేవాఅకుర్వన్: తత్ కరవాణి' ఇదే యామైతరేయ శ్రుతి రహస్యము.

వర్ణసృష్టి కేవలమనుష్యకల్పనయగుచో నా శ్రుతివలన వాదివాదము సంభవమేయగును. కాని మొదటనే దేవప్రజా కల్పన స్పష్టముగావింపబడినది. అగ్నీంద్రవిశ్వేదేవపూషలు నలువురు ప్రాణదేవతలు. వర్ణసృష్టికి కాల్పని కాకారబీజ రూపులు. కనుక "తాఃకల్పమానాః" ఇత్యాదిగ చెప్పబడినది. ఇందువలన గుణకర్మభావ ముపేక్ష్యము.

(2) రెండవ దైతిహ్య ప్రమాణము. ఇతిహాసమా ద్యంత మొకమారు చదువగోరెదము. అందు "ఆయాగుణము లాయావర్ణవిహితములగునపుడు సరియే, లేనపుడేమనవలయు" నన్నచో 'జాత్యోపజీవి'మాత్రమనవలయు ననుటే తాత్ప ర్యము తేలును. మరియు, సముచితసంస్కారములేనిబీజము వృక్షరూపపరిణతినొందదుగదా! అచ్చటన దేయూహింప వలయును. సంస్కారికకర్మలు వర్ణపరిచాయకములు. కనుక వర్ణమునకు వృత్తిము ప్రధాన మనుట వర్ణమూ మొదలే లేదనుటకా?

ద్విజులకు స్వాధికారికకర్మలక్షణ స్వస్వవృత్త్యాధికా రము ఛందోమర్యాదానుసారము 8,11,12వ సంవత్సరము లందు లభించును. అంతకుబూర్వ మఛందస్క శూద్రసము

డనుట న్యాయము. ఆయాఖ్యానమునందలి వే యగు నీవచన ములఁ జూడుఁడు:—

ప్రాఙ్నాభివర్ధనాత్పుంసః జాతకర్మ విధీయతే
తత్రాస్యమాతా సావిత్రీ పితాత్వాచార్యఉచ్యతే
తావచ్ఛూద్రసమోహ్యేష యావద్వేదేనజాయతే
తస్మిన్నేవంమతిద్వైధే మనుఃస్వాయంభువోబ్రవీత్.

కర్మలేకుండ యోనిభావమునకు వికాసముండదు కనుక "యత్రైతన్నభవేత్సర్ప! తంశూద్రమితినిర్దిశేత్" అనియెను. అనగా వృత్తశూన్యుఁడు శూద్రసముడనియే భావము. వీర్యాభావమున శూద్రుడేవృత్తియందున్నను జాతిశూద్రుడే. వీర్యముంబట్టియే సంస్కారముండును. సంస్కారము వీర్యవికాసకారణము. వీర్యాభావమునందు సంస్కారము నిష్ప్రయోజనము.

లోకమందుని దేచూతుము. శ్రేష్ఠుడుమర్యాదదప్పిన నప్రతిష్ఠపాలగును. అవరశ్రేణివాడెంతయుచ్చకర్మగావించి నను విశేషశ్రేణికధికారియగుటలేదుకదా! "తావచ్ఛూద్రసమః" యన్నది యోనిభావమునే దృఢముసేయుచున్నది. అసంస్కారి శూద్రసముడుగాని శూద్రజాతివాడుకాడని తాత్పర్యము.

ఇయ్యదిధర్మశాస్త్రవిషయము. ప్రస్తుతము యుధిష్ఠిరునకు ఘాచీలేదు. కనుక "ఇతి మేమతిః" యని తనసర్వ

జ్ఞత నివారించుకొని "మనుఃస్వాయంభువో బ్రవీత్" అని యాభారము మనువుపైవైచెను. అనగా "నేనిట్లనుకొన్నాను మంచిచెడ్డలు మానవధర్మశాస్త్రము నిర్ణయింపవలయు" నని భావము. ఇదిసంవాదము. ప్రాసంగికము. వర్ణమునుగూర్చి ఎట్లు? ఎప్పుడు, ఎన్ని? ఎందుకు? అనునవి ప్రకరణాంతరము నకు జెందినవి. కనుక భారతమునందైనను, ఇట్టివిషయమునం దందుకు సంబంధించిన ప్రకరణములందే చూడదగును. చూతము.

పూర్వము ప్రాకృతిక, దేవమూల, వర్ణసృష్టిం జెప్పచు "మొదట బ్రజాపతిముఖమునుండి యగ్నిరూప బ్రాహ్మణవర్ణ వికాసమును, బిమ్మట ఇంద్ర - విశ్వేదేవ - పూషాలక్షణా-క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణముల యుత్పత్తియు నైనట్లును, ఈయంతకును త్పాదకుడు కేవలమవ్యయాక్షరానచ్ఛిన్న వాఙ్మ యక్షర బ్రహ్మయే యనియు జెప్పబడినది. శ్రుత్యుక్తమగు నీయర్థము నుపబృంహణముసేయుచు భారతకారు డిట్లను చున్నాడు.

1. అసృజద్బ్రాహ్మణానేవ పూర్వం బ్రహ్మా ప్రజాపతీన్
   ఆత్మతేజోభినిర్వృత్తాన్ భాస్కరాగ్నిసమప్రభాన్
2. తపః సత్యంచధర్మంచ తపోబ్రహ్మచశాశ్వతమ్
   ఆచారంచైవశౌచంచ స్వర్గాయవిదధేప్రభుః
3. దేవదానవగంధర్వ దైత్యాసురమహోరగాః
   యక్షరాక్షసనాగాశ్చ పిశాచామనుజాస్తథా

4. బ్రాహ్మణక్షత్రియావైశ్యాః శూద్రాశ్చద్విజసత్తమ!
యేచాన్యేభూతసంఘానాం వర్ణాంస్తాంశ్చాపినిర్మమే

ఇందు మనుష్యసృష్టి వేరుగజూపెను. చాతుర్వర్ణ్య సృష్టి వేరుగజూపెను. చాతుర్వర్ణ్య మందరను జెందినదగుటయే యీ భేదదృష్టికిగారణము. జడచేతనములందుగూడ జాతుర్వర్ణ్య మున్నది. కనుకనే యీవచనములుసంగతములగుచున్నవి. — వృక్షములందు —

"లఘుయత్ కోమలంకాష్టం, సుఘటంబ్రహ్మజాతితత్
దృఢాంగంలఘుయత్ కాష్టం, అఘటంక్షత్రజాతితత్
కోమలంగురుయత్కాష్టం, వైశ్యజాతితదుచ్యతే
దృఢాంగంగురుయత్కాష్టం, శూద్రజాతితదుచ్యతే

ఈయోనిభావాధారమున ప్రాకృతిక దేవతలందును చాతుర్వర్ణ్యము:—

1. ఆదిత్యాఃక్షత్రియాస్తేషాం, విశశ్చమరుతస్తథా
అశ్వినౌతుస్మృతౌశూద్రౌ తపస్యుగ్రేసమాహితౌ
2. స్మృతాంగిరసోదేవా బ్రాహ్మణాఇతినిశ్చయః
ఇత్యేతత్ సర్వదేవానాం చాతుర్వర్ణ్యంప్రకీర్తితమ్

"బ్రహ్మణాపూర్వసృష్టంహి కర్మభిర్వర్ణతాంగతం" అనుటకిదేరహస్యము. ఇదంతయు ప్రాజాపత్యసృష్టి. ప్రజాపతియొక్క ప్రాణాత్మక తపఃకర్మచే వర్ణసృష్టి వికసించెను. "బ్రహ్మవాఇదమగ్రఆసీత్ ఏకమేవ" ఇత్యాదిగా గల

బ్రహ్మమూలవర్ణసృష్టిప్రకరణమున "మొదట బ్రహ్మయను నొకవర్ణమేయుండెను. పిమ్మటతనవైభవముంగోరి ప్రజాపతి చాతుర్వర్ణ్యవికాసముగావించెను." అని చెప్పబడినది. ప్రస్తుత భారతవచనము నాశ్రౌతసిద్ధాంతమునే స్పష్టముగావించెను.

పోనిండు, సభ్యతారంభయుగమున వర్ణభేదఃములేదు. తరువాతఋషులు కల్పించిరందము. దేనింబట్టి? గుణ-కర్మలం బట్టి. అవిఁపుడెట్లులయుండవలయును? ఇకపై వాదమునాశ్రయింపవలసిన దేకదా! ఋషుల యన్వేషణకర్మతో ప్రారంభమయ్యె నను నభిప్రాయముననే "కర్మభిర్వర్ణతాంగతం" యనుటయేసరి. "వర్ణసృష్టిజన్మోత్తరమందగు మనకర్మలచేనైన" దని యెట్లనుకొనవచ్చును? ఏకర్మచేనే ప్రాకృతికవర్ణ రక్షయగును? అనుప్రశ్నలకు ఈసమాధానములరయుడు.

1. జాతకర్మాదిభిర్యస్తు సంస్కారైః సంస్కృతః శుచిః
   వేదాధ్యయనసంపన్నః షట్సుకర్మస్వవస్థితః
2. శౌచాచారస్థితఃసమ్యక్ విఘసాశీగురుప్రియః
   నిత్యవ్రతీసత్యపరః సవైబ్రాహ్మణఉచ్యతే
3. క్షత్రజంసేవతేకర్మ వేదాధ్యయనసంగతః
   దానాదానరతిర్యస్తు సవైక్షత్రియఉచ్యతే
4. వణిజ్యాపశురక్షాచ కృష్యాదానరతి.శుచిః
   వేదాధ్యయనసంపన్నః సవైశ్యఇతిసంజ్ఞితః
5. సర్వభక్షరతిర్నిత్యం, సర్వకర్మకరోశుచిః
   త్యక్తవేద స్త్వనాచారః సవైశూద్రఇతిస్మృతః

భార. శాంమో. 881.

అభ్యుపగమవాదమున గొంచెము కర్మమూలవాద మంగీకరించినను ధర్మశాస్త్రగీతాశాస్త్రములందలి 'స్వధర్మ' మున కర్ధమేమి ? చూడుడు:—

1. బ్రాహ్మణక్షత్రియవిశాం, శూద్రాణాంచపరంతప
   కర్మాణిప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః
2. శమోదమస్తపశ్శౌచం శాంతిరార్జవమేవచ
   జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజం ఇత్యాదులు.
3. స్వేస్వేకర్మణ్యభిరతః సంసిద్ధింలభతేనరః
   స్వకర్మనిరతఃసిద్ధిం యథావిందతితచ్ఛృణు ఇత్యాదిగీతా.

రజోవీర్యములకుజెందిన ప్రకృతిస్వభావము, దానికి సత్త్వరస్తమములనిమూడుగుణములు. ఇందుండిసత్త్వాత్మక బ్రహ్మవీర్యము, సత్త్వరజోమయక్షత్రవీర్యము, రజస్తమోమయవిడ్వీర్యము, తమోమయశూద్రభావము, వికసించెను.

ఇట్లు స్వాభావికకర్మల మహత్త్వముంజెప్పుగీతావచనములు వర్ణసృష్టినిత్య మనుచున్నది. యోనిభావమును సురక్షితముగావించుటకు కర్మయాధారము కనుక కర్మ తప్పక యుపాదేయము. "కర్మభిఃవర్ణతాంగతం" అను ప్రకృతవచనము కర్మయొక్క విశేషముజెప్పుచున్నది. అందుచే దాని నిత్యతకుబాధలేదు.

(౩) ఇక మూడవవాదము గతార్థమైనట్లే. అది (ఆఖ్యానము) కర్మవిశిష్టతనేసూచించుచున్నది. అందును

'బ్రాహ్మణుడు - వృత్తలక్షణ'-అనియిట్లు చెప్పుటచే మొదట జన్మ-పిదపకర్మ. వర్ణముకాక, 'వర్ణముజన్మసిద్ధ'మని జాతి ప్రధానముగ నెంచినట్లు వృత్తానుష్ఠాన మాదేశింపబడుచున్నది,

(4) బ్రాహ్మణవ్యాధసంవాదము. ఇందలిగుణభావముం గాదందుమా? అది వర్ణమూలప్రతిష్ఠయే యగుదుము. గుణ శబ్దము త్రిగుణప్రకృతినుపలక్షణము. ప్రకృతింబట్టిచేయు కర్మయే గుణానుగతకర్మ. వ్యాధుడు ప్రకృతినివర్ణప్రతిష్ఠగ జెప్పి, యోన్యనుగతగుణనే వర్ణస్వరూపరక్షక మనియెను. వర్ణముయోనిభావమునకు జెంద దనుకొనువారు 'శూద్రయో నౌతుజాతస్య' యను వాక్యము గమనించుటముంచిది. శూద్ర యోని యొక ప్రాకృతికయోని, అందుండి పుట్టినవాడు జాతిచే శూద్రుడు అని దానితాత్పర్యము.

✓(5) ఆరామాయణీయశ్లోక మానాటిప్రజలందలి యైక మత్యము, సౌహార్దము, బరిచయము సేయుచున్నది. 'ఒకతండ్రి బిడ్డలట్లేకముగనున్నార'నులోకోక్తి వంటిదేయావచనము. 'ఏకవర్ణా'యనుటకు ఆనాడువర్ణవిభాగములేదని యర్థమను కొన్నచో 'సమాభాషా' = ఏకరూపా ఇత్యాదివిశేషణముల యవసరమేలేదుకదా! మరొకటి:- దేశభేదమున నాకా రము, వ్యవహారము, ప్రకృతి, శీలము, భాష, మొదలగు నన్నిటియందు భేదముండును. 12 క్రోశములందాటిననేభాషా పరివర్తనముంజూతుమని యున్నది. కనుక ప్రకృతవచన

ముల కాళాంతయుగమునందలి రాగద్వేషాదిరాహిత్య సూచననే తాత్పర్య మనవలయును.

కాదన్న చోఁ బోనిండాయారంభయుగమున వ్యక్తముగ వ్యవస్థితముగాని స్థితియనుకొన్న మాత్రమునను దాని (వర్ణవ్యవస్థ) నిత్యసిద్ధతకు బాధలేదు. పిమ్మట దానింగని పెట్టియే వ్యవస్థ జేసియుండును. న్యూటను (గ్రావిటీ) భూమ్యాకర్షణశక్తిని సృష్టింపలే దనుకొన్నచోఁ జాలును. ఈవాదమం దీవచనమంతగా నెవరికిని బ్రయోజనకారి కాజాలదు.

(6) కృతయుగమున నీవ్యవస్థయున్నట్లు లేదేమి? యనియీవాది యాక్షేపణ. ఇతఁడు వేదమునునమ్మును. పురాణములునమ్మఁడు. అవి కల్పితములని యభిప్రాయము. సరియే వేదములీశ్వరకృతములో అంగిరాదిదృష్టశ్రుతములో యగుఁగాక? "బ్రాహ్మణోస్యముఖమాసీత్" అనున దన్ని వేదములందుం గలదు. వేదము - సత్యయుగము వీనిపౌర్వాపర్యములనతఁడే నిర్ధారణచేసికోవలయును.

శ్రుతిస్మృతిపురాణవాదులకే బాధయు లేదు. వంశానుగతవ్యవస్థయెప్పుడువచ్చినను, జన్మానుగత వర్ణవిభాగము నంగీకరించుటకనాది వేదవచన ప్రామాణ్య మంగీకరింపవచ్చును గదా! త్రేతయం దీకులక్రమాగతవ్యవస్థ వచ్చిన దన్నవాయవీయపురాణవచనమునకును బాధలేదు.

నిజమునకు వర్ణవికాసము కృతయుగమందేయున్నట్లు పురాణములు నందందు జెప్పకపోలేదు. వేయేల గీతయందే "ఏవంపరంపరా ప్రాప్తమిమంరాజర్షయోవిదుః" అనియున్నది. సూర్యవంశ ప్రవర్తకుడగు నారాజర్షి కృతయుగపువాడు. ఆనాటికి రాజర్షి – బ్రహ్మర్షి విభాగమున్నదని యనుకో వచ్చునుగదా !

ఒకవిషయముమాత్ర మంగీకరింపవచ్చును. ఏమన:– ఆనాడు సామాజికనియంత్రణ మంతగా లేదు. ఏలయన:–నాడందఱకుస్వధర్మోచిత ప్రవృత్తియుండి,కలహావసరము లేకుండెను. పూర్వోదాహృత వాయుపీయవచనము లీస్వాభావికసత్య లక్షణ నియతిస్వరూప స్వధర్మపథ స్పష్టీకరణము గావించు చున్నవి. ఆనాడు వర్ణములు లేవనికాదు. "వర్ణాశ్రమవ్యవస్థాశ్చ నతదాసన్" అనుదానికి నియంత్రణమూలక వ్యవస్థలు లేవనియే యర్థము. సాంకర్యముకాకుండజూచుటకువ్యవస్థ. అందు కానాడవసరము లేకుండవచ్చును. తరువాత నేర్పడ వలసివచ్చియుండును.

(7) పైవ్రాతవలన నీయేడవవాదము గతార్థమైనట్లే "మర్యాదాఃస్థాపయామాస యథారబ్ధాఃపరస్పరం. అను వాక్యము వర్ణవిభాగశాశ్వతత్వము చెప్పుచునేయున్నది. సహజానృతభావనియంత్రణకోసమే కాలాంతరమున నియంత్రణ మవసరమగుగాక! అయ్యది త్రేతాయుగమునవగుగాక! ఆవచనములు మర్యాదమాత్ర సూచకములే.

(8) భాగవతవచనములకు నిదే తాత్పర్యము. హంస శబ్దము వాయువాచక మని 'తృతీయం చహంసమ్' అను నాథర్వణికవాక్యముచే స్పష్టము. హంసవాయువు సోమసంబంధియగు పానకతత్త్వము. ఈ పవిత్రవృత్తివ్యక్తీకరణము కొరకే వర్ణప్రజకు హంసశబ్దము ప్రయుక్తము. ఆనాడన్ని వర్ణములు హంసాత్మకములు అనగా సత్యపూతములు, సంకర దోషరహితములు, కృతకృత్యులు, పరస్పరవిరోధభావము లేనివారు అనిభావము. 'కృతకృత్యాః ప్రజాః జాత్యా' యను వచనము వర్ణవికాసమును సూచించుచేయున్నది. తరువాత త్రేతయందు దృఢనియంత్రణ యేర్పడియుండవచ్చును. పెక్కేల? అందే 'ముఖబాహూరూపాదజాః' అను వచనముచే నిత్యతయంగీకరింపబడుచున్నదిగదా!

(9) కల్పసూత్రకారవచనములును వర్ణధర్మకర్మ నియంత్రణకే ప్రాధాన్యమిచ్చునుగాని వేరేదియుగాదు. కాదన్నచో శూద్రునకు వారు వేదాధ్యయననేలనిషేధింతురు? అతడయజ్ఞియుడని యజ్ఞకర్మయందు, వ్యవహార్య సచ్ఛూద్రప్రవేశము కూడ నిషేధించిరి. అట్టిస్థితిలో 'జన్మనాజాయతేశూద్రః' యను నిట్టివచనములకు కర్మనైశిష్ట్య సూచనమే తాత్పర్య మనుకొనదగును.

నియతకాలమున యజ్ఞోపవీత సంస్కారముగానివాడు 'పతిత సావిత్రీకు' డందురు. సంస్కారభావమున యోవిలక్షణ

వర్ణదేవతయభిభూతమగును. అట్టి వ్రాత్యసంసర్గమున సంస్కృత వీర్యము దేవసమీకరణముచే దుర్బలమగునేగాని వ్రాత్యున కగు నుపకారములేదు. కనుక నట్టి సంసర్గము నిషిద్ధము. ఇక నచ్ఛందస్కుడగుశూద్రుడు నిత్యాసంస్కృతుడు కనుక నవ్యహార్యుడనుట యీ యోనిభావ సూచకమే.

జ్యోతిష్టోమాపరపర్యాయక సోమయాగ దీక్షితుడు వ్రతియు నగు యజమానుడు సాక్షాద్దేవమూర్తియగును. కనుక నతడాదీక్షయందున్నంతకాలము సచ్ఛూద్రసంభాషణ కూడ నిషిద్ధము (ఇకస్పర్శవిషయము చెప్పబనియేలేదు.) ఈవచనముంజూడుడు.

"తన్న సర్వ ఇవాభి ప్రపద్యేత - బ్రాహ్మణోవైవ, రాజన్యోవా వైశ్యోవా తేహియజ్ఞియా। సవైనసర్వేణైవసంవదేత । దేవాఞ్వాఏష ఉపావర్తతేయోదీక్షతే। సదేవతానామేకోభవతి । నవాదేవాః సర్వేణేన సంవదంతే. బ్రాహ్మణేనవా। రాజన్యేనవా। వైశ్యేనవా తేహియజ్ఞియాః। తస్మాద్యద్యేనం శూద్రేణసంవాదోవిందేత్ - ఏతేషామేవైకంబ్రూయాత్ । ఇదమితివిచక్ష్వ, ఇమమితివిచక్ష్వ ఏషఉతత్రదీక్షితస్యోపచారః [శత]

మరియు :—'అసతోవాఏషసంభూతః. యత్ శూద్రః (తైబ్రా) అనృతం, స్త్రీ, శూద్ర, శ్వా, కృష్ణః, శకునిః, (కాకః) తానినప్రేక్షేత ఇత్యాదులచే శూద్రులకు ద్విజధర్మ బహిష్కృతి కనబడుచున్నది. దర్శనముకూడ బహిష్కృతము.

యజ్ఞాధికారము శూద్రులకు గల దనువారికి వైపం క్తులేచాలును. ద్విజాతులందుమాత్రము అన్నియజ్ఞములందు

సందరకు నధికారములుకలవా? క్షత్రియునకే రాజసూయము, వాజపేయము బ్రాహ్మణునకే.

"సవై బ్రాహ్మణస్యైవయజ్ఞః యదనేనబృహస్పతిరాజాయత బ్రిహ్మహిఃబృహస్పతిః బ్రహ్మహిఃబ్రాహ్మణః రాజ్ఞఏవరాజసూయం ఇత్యాది

గాయత్రి కేవలముద్విజాతులకే. ఈవచనము గమనింపుడు:—

"స్తుతామయాపరదా వేదమాతా ప్రిచోదయన్తామ్ పావమానీద్విజానామ్ ఆయుఃప్రాణం ప్రిజాం పశుంకీర్తిం ద్రివిణం బ్రిహ్మవర్చసమ్ మహ్యందత్వావ్రిజత బ్రహ్మలోకమ్ [అధర్వ]

యజుస్సంహితయం దాయావర్ణములకు, సచ్ఛూద్రులకు, అవరవర్ణులకు, నృత్త. శైలూష భీమల, రేభ, కోలాల. కర్మార, మణికార, ధనుష్కార, జ్యకార, యాతుధానులను, నసచ్ఛూద్రులకును, ధర్మభేదములున్నవి. చూడుడు:—

"బ్రాహ్మణేబ్రాహ్మణం, క్షత్రాయరాజన్యం, మరుద్భ్యోవైశ్యం, తపసేశూద్రం తమసేతస్కరమ్ః ఇత్యాది.

వీనికన్నిటికి యోనిభావాంగీకృతి లేక సమానధర్మత కర్మమూలత నంగీకరింపుచో గతియేమి? సమానత ప్రళయ సూచకమా? సృష్టిసూచకమా? కానిండు:—

'మద్యపానముచే బ్రాహ్మణత్వము నష్టమగును' నుట జాతిపరాభవసూచకము. మద్యపానమున బ్రాహ్మణసహజ ధృతిభావవిచ్యుతికల్గి 'మాల్యు' మనునస్థిరభావ ముద

యించును. అందుచే బ్రహ్మవీర్యము దోషాక్రాంత మగును. కనుకనే 'బ్రాహ్మణ్యాదేవహీయతే' అనిరెను. మద్యపానాదులు జాతిభ్రంశకరములని కల్పసూత్రకారులనిరిగదా! వారి భావము జాతిభావసమర్ధకముగదా ?

"శూద్రో బ్రాహ్మణతామేతి' ఇత్యాదివచనములకు నిదేస్థితి. ఈవచన మేప్రకరణములోనిదో విచారించిన సహజముగనే సమాధానము కుదురును. శూద్రక్షేత్రము- బ్రాహ్మణబీజము- పుట్టినవాడు 'పారశవుడను' బ్రాహ్మణుడు. అతడు మరలశూద్రాసంపర్కమున సంతానముంగనును. ఇట్లుకాగా కాగా నేడవజన్మమున బ్రాహ్మణవీర్యమున కాత్యంతికాభావము సిద్ధించి శూద్రతాసిద్ధి యగును. ఈయనుగమానుసారమే క్షత్రియ - వైశ్యులకు శూద్రాగర్భజసంతతి యైదవ జన్మమున బరివర్తన మొందును. ఇట్లనేకజన్మములందు వర్ణవిపర్యయము జెప్పు మనువు, వర్ణములకు యోనిప్రధానత నంగీకరించుచున్నాడు. "బ్రాహ్మణుడుశూద్రుడు, శూద్రుడు బ్రాహ్మణుడు"నగును, నిజమే. ఎప్పుడు ? ఎన్నిజన్మలకు ? కనుమూసిధ్యానింపుడు.

'యథాకాష్ఠమయోహస్తీ'త్యాదులు కర్మావశ్యకతా సూచకములుమాత్రము. కర్మలేనిచో వీర్యవికాసముండదని మున్నే యనుకొంటిమికదా ! వీర్యవికాసములేనిజాతి నామమాత్రమే.

(10) కవషఐలూషునియాఖ్యానమందు స్వార్థదృష్టి యనుట దృష్టిభేదము. అతడ బ్రాహ్మణుడు సత్యమే. ఆపోన ప్త్రీయమున కతడు ద్రష్టయే. కాని యీయాఖ్యానమ బ్రాహ్మణుడు యజ్ఞాధికారికాడని గట్టిగా చెప్పినదనుట తథ్యము. మరియు వర్ణవ్యవస్థ కర్మప్రధానమే కాదనికూడ సూచించినది. కాదన్నచో నతనికిబహిష్కృతియుండదుగదా! ఇందుచే యోనిగతవర్ణవ్యవస్థ దృఢమూలమైనది.

ఇక కవషునందు జన్మాంతరీయ దివ్యసంస్కార మున్నది. అందువలన నతడాసూక్తద్రష్ట యయ్యెను. ఋషు లనేకనిపట్టిరి. అపవాదమర్యాదంబట్టి తమలో జేర్చుకొనిరి. పరీక్షించుటతప్పా? గతశతాబ్దులందు, కబీరుతుకారామ్ రైదాసు మొదలగువారిని వారివారి దివ్యసంస్కారవిశేషముం బట్టి యున్నతాసన మిచ్చి గౌరవించి యార్యులు తమ గుణ గ్రాహకత్వము వెల్లడించిరిగదా! ఆ కబీరు తుకారామ్ రైదాసుమొదలగు మహాపురుషులైన నపవాదమర్యాదం బ్రధానమనక స్వస్వవర్ణానుగత ధర్మవ్యవస్థానుకూలముగ బ్రవర్తింపదగు ననియే బోధించిరి. తామట్టిభావముననే వర్తించిరి. ధర్మరక్షకదియే నిజమగుమార్గముకదా! ఇంతకు నపవాదమునునమ్మి వ్యవస్థనంతటిని బాధసేయరాదనియే ఫలితార్థము. ఆయాఖ్యానము యోనిభావపోషకముగాని మరొకటికాదు.

(11) విశ్వామిత్ర విషయముగూడ నిదివరకె ఁరో
పెద్దలు చర్చించివైచియున్నదే. బ్రాహ్మణాదత్తచరుబీజ
మున నతడు బ్రాహ్మణుడే యనుట పురాణములం దాయా
ఖ్యానమెరింగినవారికి క్రొత్తది కాదు. ఇట్లే వీతిహోత్ర
ఋషభపుత్ర - నృగవంశాది పౌరాణికస్థలములును కవష
చరిత్రవలె నపవాదమర్యాదకు జెందిన వగుటచే సామాన్య
వ్యవస్థం బాధింపజాలవు. తపోనిష్ఠమహాపురుష వర ప్రభావ
మున నెటనేని వర్ణపరివర్తన మగపడిన నది వరప్రభావ
మనుకొనవలెనేగాని యావర్ణకర్మ మహిమ యనజాలము.
జాతిపరివర్తనమునర కేల? తపఃప్రభావమున సృష్టియందలి
యనేకనియమములనే మార్పవచ్చునని వినుచుందుము. ఒక
మహాత్మునివరమున నొకనికి కుష్ఠవ్యాధినివారణమైనంత
మాత్రమున జికిత్సావిధిం ద్రోచివేయవలసిదేనా?

(11) 'వర్ణము యోనిమూలకమగుచో గవాశ్వాదు
లకువలె నాకృతిభేదముండవలదా?' యనియాక్షేపము. ఈ
వాది పాపము! స్థూలజగదుపాసకుడు. తాత్త్వికము, సూక్ష్మ
మునగు నంతర్జగత్పరిచయము నెరుగడు. ఆకృతియే భేద
పరిచాయకమా? ఆకృతింబట్టి భేదముండవలయుననుకొన్నచో
నదియెంతో అనర్థదాయక మగును. వాదియు నందుకంగీక
రింప జాలడు. విద్వాంసుడు, తపస్వి, లౌకికుడు, అనుభేద
మతడునంగీకరించును. ఇదియాకృతింబట్టి తేలునదా? కనుక
నింకొక హేతువుం జూడవలయును.

కర్మయను భేదముంబట్టి వర్ణ భేదము - వాదియు నంగీకరించును. తదుపయోగితయు నావశ్యకతయు స్వీకరించును.

ఇక:—ఋషులన్ననో, స్థూలాకృతి - సూక్ష్మకర్మ - కంటె సూక్ష్మతను ప్రకృతిభేదము నొకదానింగనిపట్టి యిందు త్తరోత్తరము బలీయమనిరి. కేవలమాకృతిభేదవాదము నిలువజాలదు. సుందరుడొకడు మందుడు, క్రూరుడు, గావచ్చును. రూపహీనుడొకడు, తెలివిగలవాడు, మృదుహృదయుడు, గావచ్చును. సర్పపరీక్షకు డాకృతింబట్టికాక ప్రకృతిభేదముంబట్టి శ్రేణీవిభాగముం గావించును. ఆకారముభయావహము, స్వభావముమృదువు, నగు సర్పములున్నవి. ఆకారము స్వల్పము, స్వభావము భయానకమునగు సర్పములున్నవి.

సామాన్య దృష్టి స్వరూపభేదమున విశ్రాంతినొందును. వైజ్ఞానికదృష్టి ప్రకృతిభేదమును లక్ష్యముగాగొనును. ఈ ప్రకృతినే స్వభావ మందురు. తద్భేదము : వర్ణ భేదపరిచాయకము. స్థూలశరీరమునకు జెందినయాకృతిభేదముతో వర్ణభేదమునకు సంబంధమేలేదు. " ఆకృతి గ్రహణాజాతిః " యనున దేకదేశలక్షణము. ఇది స్థూలమునకు జెందినలక్షణము. వాది, యేయోనిభేదముంగొని యాకృతిభేదముండవలయు ననుకొనుచున్నాడో ఆయోని నతడెరుగడు. సామాన్యతః " శుక్రశోణితసమన్వితరూపము కర్మాత్మకు - జీవాత్మకు - యోని " యనుకొందురు. ఈభేదమే భేదక మనుకొందురు.

వస్తుతః పారమేష్ఠ్యసోమతత్త్వముచే తనరూపము నిర్మించుకొను మహత్తత్త్వము పేరు యోని. అందాకృతి, ప్రకృతి, అహంకృతి, యనుమూడుభావములు నిత్యముగ నుండును. అదిశుక్రమందు బీజరూపముననుండి యావపాతిక కర్మభోక్తయగు కర్మాత్మకు యోనియగును. యిందు కర్మాత్మ గర్భధారణగావించును. ఈగీతాసిద్ధాంతముం బరికింపుడు.

"మమయోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భందధామ్యహం, సంభవః సర్వభూతానాం తతోభవతిభారత! సర్వయోనిషుకౌన్తేయ! మూర్తయః సంభవన్తియాః తాసాంబ్రహ్మమహద్యోనిరహంబీజప్రదఃపితా॥"

ఇట్లు యోనిరూపమహత్తుయొక్క ఆకృతిభావము బాహ్యాకారభేదమునకు, ప్రకృతిభావమభ్యంతరగుణానుగత వర్ణభేదమునకు, అహంకృతిభావ మంతర్ముఖైంద్రియక కర్మ భేదమునకు బ్రతిష్ఠలగును. అట్టిచో ఆకారమొకటే యోని భేద మనుకొనుట తన్మర్యాదాబహిర్భూతము.

ప్రస్తుతము మనమనుకొను వర్ణభేదము (బ్రాహ్మణ క్షత్రియాదికము) ఆకృతిలక్షణ యోనిభేదమునకు జెందినది కాక ప్రకృతిలక్షణ యోనిభేదమునకు జెందినదై యున్నది. రెండుభేదములకు లక్ష్యములే సర్వథాభిన్నములు. ప్రకృతికి జెందిన యోనిభేదము చర్మచక్షుర్గోచరముకాదు. కర్మవలన దీని నించుక యనుమానింపగలమేమో! ఏలయన:—

వర్ణసృష్టి ప్రకృతికి జెందిన దనుకొంటిగదా! ప్రకృతి యన క్షరబ్రహ్మపేరే. భూతరూపబహిర్వ్యాప్తమును, భూత స్వరూపసంపాదకము నగునీ క్షరబ్రహ్మనుండి వర్ణరూపము గనైన దేవసృష్టి యమూర్తము. ప్రాణదేవతలు, ప్రాణాత్మ కము లగుటచే, తన్మాత్రాతీతములగుటచే, నింద్రియాతీ తములై యుండి ఆయాశుక్రవిశేషములందు మహదనుగత ప్రకృతిద్వారా బీజరూపముననుండి బ్రాహ్మణాది వర్ణసృష్టి ప్రవర్తకము లగు నని మున్నే విస్తరింపబడినది. కనుకనిట్టి ప్రాణాత్మకము, శక్తిరూపము, స్వాభావికము, నగు దీనికి నాకృతిభేదముతో సంబంధమేమి?

"బ్రాహ్మణాదివర్ణములందు నేడు పరస్పర ప్రకృతి విపర్యయ మగపడుచున్నది గదా! ఇట్టిస్థితిలో నీజన్మమూల వాదము నెట్లంగీకరింపవచ్చును?" అందురేమో నిజమే:— కాలదోషము, అన్నదోషము, శిక్షాదోషము, ఆలస్యము, సంస్కారలోపము, మొదలగు ననేకదోషములచే నేడునిజముగా వర్ణప్రకృతులయాంశికవిపర్యయమైపోయినది. "శూద్రాశ్చ బ్రాహ్మణాచారాః" అను నిత్యాదిరూపములచే శాస్త్రము లును జెప్పినవి. బ్రాహ్మణులు చాలవరకు శూద్రప్రాకృతిక సేవాధర్మానుగాములై యున్నారు. తక్షనాపిత, మూర్తి కారాదు లెందరో సచ్ఛూద్రులు స్వప్రకృతిమూలక స్వధ ర్మమును ద్యజించి బ్రాహ్మణులుగాజూచి ప్రయాసపడు చున్నారు.

అయినను మావిశ్వాసముపీడము. పైనుదహరించిన దోషములు సవరించుకోరానివి కావు. క్రమముగా దృష్ణా చాపల్యములం దగ్గించుకొనుట కించుక శ్రద్ధవహించుచో నంతయు బాగుపడును. ఆగంతుకదోషముల నీమాత్రపు ప్రయత్నమున దొలగించుకోలేక మొదలునాశముగావించు కొనుట బుద్ధిమల్లక్షణ మనిపించుకొనదు. దృశ్యములందలి చాపల్యమున బెరుగుటకు నేయుప్రయత్న మించుకదగ్గించు కొనుటకాని నిజముగ నిందుప్రయత్నముకూడ లేదన వచ్చును. ఇట్లు చేయుచుండుట అపూర్వఘటనకాదు. గత యుగములందును భారతీయసంస్కృతి కింతకుమించిన భయం కరసంఘనలు ఘటిల్లినవి. కాని యానాటి నేత లాసామయిక ప్రవాహపతితులుగాక సంస్కృతిని రక్షించుకొనుచు నేనచ్చిరి. నేటికిని హిందూజాతి కొనయూపిరితోనుండుట కిదేకారణము. ఈ రవంతవ్యక్తిత్వమును స్మృతిగర్భవిలీనముగాకుండ జూచుట మనవిధి. పిదప పరమేశ్వరానుగ్రహ మెట్లున్ననట్లగును. పరమాణువిశకలనమున ప్రగల్భములుకొట్టుచున్న గొప్ప సభ్యతకు జేరిన మన కిదియసాధ్య మనుకొనుట భావదాస్యము గాక మరొకటికాదు. ఆసభ్యతకంటె నిది యెన్నోవేల మండుగులు హితకరమ నుటకంటె విస్తరింపజాలము.

(13) "బ్రాహ్మణోస్యముఖమాసీత్" 'గాయత్ర్యా బ్రాహ్మణాసిరవర్తయత్' ఇత్యాదివచనము లౌపచారికము

లని యెంచి వర్ణవ్యవస్థ కర్మప్రధానమని సిద్ధముసేయ వాది ప్రయాసపడియెను. కాని యందుకు నేమమాత్ర మొప్పికోని దెప్పుడు ? గాయత్ర్యాదిఛందముల యష్టాక్షరాదులనుండి మనుష్యవిధ బ్రాహ్మణాదివర్ణములు యుత్పత్తియ్యాయె నంటిమా ? "అగ్నితత్త్వము ప్రజాపతిముఖ స్థానీయము, అందుండి బ్రహ్మవీర్యలక్షణ దివ్యభావముద్వారా, బ్రాహ్మణ వర్ణవికాసమయ్యెను. అష్టాక్షరాష్టావయవ ఛందోఛందితాగ్ని దేవత బ్రహ్మవీర్యస్వరూపము. తత్సమన్వయమున బ్రాహ్మణ వర్ణ ముత్పన్నమయ్యె"నను నిత్యాద్యర్థము మున్నే వర్ణోత్పత్తి రహస్యమున జెప్పియుంటిమి. అట్టిచో నిక నీవాదమునిరుప యోగము. ఈయుపచారభావము వర్ణనిత్యత కెట్లుభంగము కల్గించును ?

## వర్ణవ్యవస్థ - వ్యాపకత్వము

ఇక నీవ్యవస్థంగూర్చి స్వతంత్రరూపము గొంచెము విచా రింతము. వర్ణవ్యవస్థకు గర్మతోసంబంధములే దనుట దుస్సా హసము. జన్మన లేనిదియునుపకారకమే. మరియు స్వరూప రక్షణ కారణమగుటచే జన్మకంటె కర్మకేయుచ్ఛాసనము,

వైశిష్ట్యము నున్నట్లు వాదియుదహరించిన వచనములు నైతి హ్యాములు జాలినంత ప్రమాణములు. అయినను యోనిభావ మున్మూలనజేయజాలము. ఏమన:— ఈవ్యవస్థ:—

సర్వవ్యాపకమగుటయేకారణము. వేదము, పితృదేవ మనుష్య గంధర్వాసురవృక్షౌషధిపశుపక్ష్యాది చరాచర పదార్థము లన్నిటియందు నీవ్యవస్థంజెప్పినది. అదిన్యాయ సంగతముకూడను. ఎట్లన:— చరాచరసృష్ట్యుపాదానకారణ రూప ప్రాణదేవతలే నాల్గువర్ణములుగ నున్నపుడు "కారణ గుణాః కార్యగుణానారభన్తే" యనున్యాయమును బట్టి ఈ వ్యవస్థ విశ్వవ్యాపకమనుట కించుకయు సంకోచింపము. కర్మ దీనికుపోద్బలకము గావచ్చును గాని 'మూధార' మనజాలము. ఒకవేళ కర్మశబ్దముచే జన్మాంతరీయ, సాంస్కారిక, సంచిత కర్మ యభిప్రేత మగునేని మాకునిష్టమే. ఏలయన:— "జాత్యాయుర్భోగాః"యను సిద్ధాంతముంబట్టి యీమూడును జన్మాంతరీయసంస్కారానుసారము లభించుచుండును. కాని యిట్టిసంచితకర్మ జన్మభావసమర్థకమగుటచే వాదికిష్టము కాదు. జన్మోత్తరకాలీన కర్మలను వర్ణవిభాగమునకు మూలముగానెంచు మహానుభావులిటుపై మాయుదహరించు వచనము లీవిశుద్ధకర్మవాదాధారమున సమన్వయించుకోవలసి యుండును. లేనిచో యోనిభావముతోబనిలేకుండ నావచన ముల నెట్లుసమన్వయింతురో దయయుంచి మాకెరిగింప వలయును.

అజ (మేక) పశువు బ్రాహ్మణుడు, అశ్వము క్షత్రియుడు, ఇత్యాదులందు కర్మాభిమానులేమందురు? అజపశువునకు బ్రాహ్మణోచిత వేదాధ్యయన యజ్ఞదానాది కర్మలవలన బ్రాహ్మణత్వము సిద్ధించెనా? ఇట్లే పగలు బ్రాహ్మణుడు, రాత్రి క్షత్రియుడు, వసంతము బ్రాహ్మణుడు, గ్రీష్మముక్షత్రియుడు, ఇత్యాదులెన్నో ముందుచూడగలరు. జన్మవాదమొప్పుకొనువారికివి, సుసంగతములే యగును. అజపశూపాదానభూత శుక్రశోణితములందు బ్రహ్మవీర్యసంపాదక ప్రాణాగ్ని ప్రతిష్ఠితమైయున్నది. తత్సంబంధమున దానిని బ్రాహ్మణుడనవచ్చును. ఇట్లు కర్మకంటె వేరుగా వర్ణతత్త్వవ్యాపకతాదృష్టిచే తప్పక కొన్ని స్వాభావిక - ప్రాకృతిక యోసలక్షణ ధర్మముల సత్త యంగీకరింపవలసియుండును. ఆవిశేషధర్మములనే ఈవ్యవస్థకు మూలాధారములనవలయును.

చాతుర్వర్ణ్యమీశ్వరసంస్థను జెందినది. అనగా:—
ఈశ్వర ప్రజాపతి చాతుర్వర్ణ్యోపేత ప్రాణదేవతల నుపాదానముగాగొని విశ్వమును నిర్మించెను. కనుక నంతటను వర్ణవిభాగముతప్పదు. కొన్ని యుదాహరణములిందు చూపెదము. వీనిచే నీవ్యవస్థ మానవకల్పనకాదనియు, ఈశ్వరుని మర్యాదాసూత్రమనియు, వీనిభోగము కేవలము ఈశ్వరేచ్ఛచే, వేదధర్మమూర్తి, కృష్ణమృగము, స్వేచ్ఛగాదిరుగు దేశమునకే కలదనియు, నిర్ణయించుకొనవచ్చును.

# చతుష్టయం వా ఇదం సర్వమ్

| ఏది ? | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర |
|---|---|---|---|---|
| దేవతలందు | అగ్నిః | ఇంద్రః | విశ్వేదేవాః | పూషా |
| పితరులందు | సోమపాః | హవిర్భుజః | ఆజ్యపాః | సుకాలినః |
| వేదములందు | సామ | యజుః | ఋక్ | అథర్వ |
| ఛందస్సులందు | గాయత్రీ | త్రిష్టుప్ | జగతీ | అనుష్టుప్ |
| సవనములందు | ప్రాతః | మాధ్యందిన | తేజోమయ సాయం | తమోమయ సాయం |
| దిక్కులందు | ఉత్తరా | దక్షిణా | ప్రాచీ | ప్రతీచీ |
| కాలమందు | వర్తమాన | భూత | భవిష్యత్ | సర్వకాలః |
| వర్ణములందు | శ్వేత | రక్త | పీత | కృష్ణ |
| యజ్ఞములందు | సోమయాగః | పశుబంధః | ఇష్టయః | దర్వీహోమః |
| ప్రకృతియందు | సత్వము | సత్త్వరజస్సు | రజస్తమస్సు | తమస్సు |
| బలమందు | విద్యాబలము | ఐశ్వర్యబలము | విత్తబలము | శరీరబలము |
| శక్తులందు | జ్ఞానశక్తి | క్రియాశక్తి | అర్థశక్తి | పశుశక్తి |
| స్వరములందు | ఉదాత్తము | అనుదాత్తము | స్వరితము | వికస్వరము |
| శబ్దబ్రహ్మయందు | స్ఫోటము | స్వరము | వర్ణము | వ్యంజనము |
| పరబ్రహ్మయందు | అవ్యయః | అక్షరః | ఆత్మక్షరః | వికారక్షరః |
| అధ్యాత్మమందు | ప్రజ్ఞాత్మ | తైజసాత్మ | వైశ్వానరాత్మ | పాంచభౌతికశరీరమ్ |
| అధిదైవతమందు | సర్వజ్ఞః | హిరణ్యగర్భః | విరాట్ | భౌతికవిశ్వము |

| ఎందు ? | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర |
|---|---|---|---|---|
| ప్రాకృతాత్మలందు | శాంతాత్మ | మహానాత్మ | విజ్ఞానాత్మ | ప్రజ్ఞానాత్మ |
| భూతములందు | వాయ్వాకాశములు | తేజస్సు | జలము | మృత్తు |
| జ్ఞానమందు | ఆత్మజ్ఞానమ్ | సద్జ్ఞానము | విరుద్ధజ్ఞానము | అజ్ఞానము |
| కర్మలందు | ఆత్మకర్మ | సత్కర్మ | విరుద్ధకర్మ | అకర్మ |
| దృష్టియందు | పరమార్థదృష్టి | వ్యవహారదృష్టి | ప్రాతిభాసికదృష్టి | అదృష్టి |
| గతులందు | ముక్తి | దేవస్వర్గము | పితృస్వర్గము | దుర్గతి |
| ఉపవేదములందు | గంధర్వవేదము | ధనుర్వేదము | ఆయుర్వేదము | స్థాపత్యవేదము |
| ఆనందములందు | శాంతానందము | ప్రమోదానందము | మోదానంద | హర్షానందము |
| ప్రపంచములందు | ఆధ్యాత్మిక | ఆధిదైవిక | ఆధిభౌతిక | పరివర్గ్యపరిప... |
| శరీరములందు | కారణ | సూక్ష్మ | స్థూల | కిట్ట |
| విద్యలందు | జ్ఞానము | ఐశ్వర్యము | వైరాగ్యము | ధర్మము |
| అవిద్యలందు | అవిద్యా | అస్మితా | సక్తి | అభినివేశము |
| ప్రమాణములందు | ఆప్తప్రమాణము | అనుమానప్రమాణ | ప్రత్యక్షము | యుక్తి |
| వివాహము | బ్రాహ్మము | స్వయంవరము | గాంధర్వము | పైశాచికము |
| అధికారులందు | జ్ఞాని | జిజ్ఞాసువు | అర్థార్థి | ఆర్తుడు |
| వృత్తులందు | మైత్రి | కరుణ | ముదిత | ఉపేక్ష |
| యుగములందు | కృత | త్రేతా | ద్వాపర | కలి |
| రాత్రులందు | కాళరాత్రి | మహారాత్రి | మోహరాత్రి | దారుణరాత్రి |
| ,, | శివరాత్రి | దీపావళి | జన్మాష్టమి | హోలికా |

| ఎందు ? | బ్రాహ్మణ | క్షత్రియ | వైశ్య | శూద్ర |
|---|---|---|---|---|
| శత్రువులందు | కామ | క్రోధ | లోభ | మోహ |
| అవస్థలందు | కృతకృత్యాతి | కర్మావస్థ | జాగ్రత్ | సుషుప్తి |
| వాక్కులందు | పరా | పశ్యన్తి | మధ్యమా | వైఖరీ |
| శబ్దప్రపంచమందు | ఛందస్సులు | వాక్యములు | పదములు | వర్ణములు |
| హాసములందు | కలహాసము | మందహాసము | అతిహాసము | అట్టహాసము |
| పురుషులందు | శశలక్షణః | హయ | కురంగ | వృషభ |
| అపరాముక్తులందు | సాయుజ్య | సారూప్య | సామీప్య | సాలోక్య |
| దేవతలందు | బ్రహ్మ | రుద్ర | విష్ణుః | గణపతి |
| సృష్టులందు | మానసీసృష్టి | గుణసృష్టి | వికారసృష్టి | మైథునీసృష్టి |
| ప్రాణులందు | జరాయుజ | అండజ | స్వేదజ | ఉద్భిజ్జ |
| నీతులందు | ధర్మనీతి | రాజనీతి | సామాజికనీతి | వ్యక్తినీతి |
| అర్థసాపేక్షముగ | పరమార్థము | పరార్థము | స్వార్థము | పరమస్వార్థపరము |
| పశువులందు | అజ (మేక) | అశ్వ | గోవు | అవి (గొఱ్ఱె) |
| సర్పములందు | సువర్ణాభాః | స్నిగ్ధవర్ణాః | లోహితధూమ్రాః | అనేకవర్ణాః |
| ,, | పన్నగాః | భృశకోపనాః | పారావతాః | రూక్షత్వచః |
| వృక్షములందు (వనస్పతి) | అశ్వత్థవటపలాశబిల్వాదులు | దేవదారుశ్రీపర్ణికాశ్మర్యాదులు | ఫలపుష్పప్రదాతలగునవన్నియు | వంశతూలికాదయః |
| కీటకములందు | పుష్పాదిగతములు | సప్తధాతుగతములు | పట్టుపురుగులు | పంకాదిగతములు |
| పక్షులందు | చక్రవాకకపోతాదులు | శరభబకాదులు | హంసమయూరాదులు | కాకగృధ్రాదులు |
| శరీరావయవములలు | శిరోమండలము | హస్తవక్షము | ఉదరము | పాదములు |

ఇత్యాదులనేకములున్నవి. వీని మౌలికపరిజ్ఞానము నకు స్వతంత్ర గ్రంథము లవసరములు. పాఠకులు స్వయముగ వేదపదార్థవిద్యాతారతమ్యమునకు జెందిన యావిభాగముల తాత్త్వికమన్వయము జేసికొనవలయును. ప్రస్తుతము కొన్ని వచనముల నుద్ధరింతుము. వీనిచే నీవ్యవస్థ ప్రకృతిసిద్ధమని యొప్పికొనకుండుట యసంభవము.

## వర్ణవ్యవస్థ - శ్రుతిసమర్థనము

1. బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత

త్రైలోక్యవ్యాపక విరాట్పురుషముఖస్థానీయ ప్రాణాగ్నినుండి బ్రాహ్మణవర్ణము, బాహుస్థానీయ, మరుత్వానింద్రునుండి క్షత్రియవర్ణము, ఊరుస్థానీయ, విశ్వేదేవులనుండి వైశ్యవర్ణము, పాదస్థానీయపూషానుండి శూద్రవర్ణము, వికాసమొందె నని తాత్పర్యము.

2. ప్రజాపతిరకామయత, 'ప్రజాయేయ' ఇతి సముఖతః త్రివృతం నిరమిమీత, తమన్వగ్నిర్దేవతా, అన్వసృజ్యత, గాయత్రీఛందః, రథంతరం సామ, బ్రాహ్మణో మనుష్యాణాం, అజః పశూనాం, తస్మాత్తే ముఖ్యాః ముఖతో హ్యసృజ్యంత॥ (1)

ఉరసో బాహుభ్యాం పంచదశం నిరమిమీత, తమింద్రో దేవతా అన్వసృజ్యత, త్రిష్టుప్ఛందః బృహత్సామ రాజన్యో మనుష్యాణాం, అశ్వః పశూనాం, తస్మాత్తే వీర్యావన్తః, వీర్యాద్ధ్యసృజ్యంత॥ (2)

మధ్యతఃసప్తదశంనిరమమీత, తంవిశ్వేదేవాదేవతాఅన్వసృజ్యన్త - జగతీఛందః, వైరూపంసామవైశ్యోమనుష్యాణామ్, గావః పశూనాం, తస్మాత్తేఆద్యా (భోగ్యాః) (ఉదరః, అన్నాధానాద్ధ్యసృజ్యంత, తస్మాద్భూయాంసో న్యేభ్యః భూయిష్ఠాహిదేవతాఅన్వసృజ్యన్త॥ 3.

పత్తఏకవింశంనిరమమీత, తమనుష్టుప్ఛందోన్వసృజ్యత, వైరాజం సామ శూద్రోమనుష్యాణాం అవిఃపశూనాం, తస్మాచ్ఛూద్రోయజ్ఞేనవ క్లృప్తః నహిదేవతాఅన్వసృజ్యత, తస్మాత్ పాదావుపజీవతః పత్తోహ్యస్యసృజ్యేతామ్ శత)

3. సోకామయత, 'యజ్ఞం*సృజేయ' ఇతి సముఖతఏవత్రివృతమసృజత తంగాయత్రీఛందోన్వసృజత, అగ్నిర్దేవతా

వసంతఋతుః,తస్మాత్ 'త్రివృత్' స్తోమానాంముఖం, 'గాయత్రీ' ఛందసాం, అగ్నిర్దేవతానాం, బ్రాహ్మణోమనుష్యాణాం,వసంతఋతూనాం, తస్మాద్బ్రాహ్మణోముఖేనవీర్యంకరోతి, ముఖతోహిసృష్టః (1)

సఉరస్తఏవబాహుభ్యాం, పంచదశమసృజత, తంత్రిష్టుప్ఛందోన్వసృజత, ఇంద్రోదేవతా, రాజన్యోమనుష్యః గ్రీష్మఋతుః తస్మాద్రాజన్యస్య పంచదశస్తోమః, త్రిష్టుప్ఛందః, ఇంద్రోదేవతా, గ్రీష్మఋతుః తస్మాదు బాహువీర్యః, బాహుభ్యాంహిసృష్టః (2)

సమధ్యతఏవప్రజననాత్, సప్తదశమసృజత, తంజగతీఛందోన్వసృజ్యత, విశ్వేదేవాదేవతాః వైశ్యోమనుష్యః వర్షాఋతుః, తస్మాద్వైశ్యో ద్యమానోనక్షీయతే, ప్రజననాద్ధిసృష్టః, తస్మాదుబహుపశుః వైశ్వదేవోహి, జాగతః వర్షాహ్యస్యర్తుః, తస్మాద్బ్రాహ్మణస్యచరాజన్యస్యచాద్యో ధరోహి సృష్టః (3)

---

* సర్వసాధక అగ్నిష్టోమనామకయజ్ఞము.

సపత్త ఏవ ప్రతిష్ఠాయా ఏకవింశమసృజత, తమనుష్టుప్ఛందోన్వసృజ్యత, నకాచన దేవతా - శూద్రో మనుష్యః, తస్మాచ్ఛూద్రో ఉతబహుపశుః - అయజ్ఞియః, విదేవోహి, నహితంకాచన దేవతాన్వసృజ్యత, తస్మాత్పాదావ నేజ్యన్నాతివర్ధతే, పత్తోహిసృష్టః, తస్మాదేకవింశః, స్తోమానాం ప్రతిష్ఠా ప్రతిష్ఠాయాహిసృష్టః, తస్మాదానుష్టుభంఛందాంసి, నానువ్యూహన్తి తాండ్య) 4.

ఇట్లు ఈరెండువిధముల శ్రుతులవాక్యములును, ప్రజాపతినుండి వర్ణసృష్టిక్రమముం జెప్పినవి. ఆ ప్రజాపతి సంవత్సర ప్రజాపతియే యని 'అదితిదితిమూలకవర్ణావర్ణసృష్టి ప్రకరణమున జెప్పబడినది. స్తోమ, ఛంద, దేవతా, ఋతు, మొదలగునవే వర్ణముల కుపాదానముగ జెప్పెను. ఈయుపాదానములెల్ల నీశ్వరీయకర్మచే నుత్పన్నములు. ఇవివర్ణసృష్టి ప్రవర్తకములు. అట్టియెడ వర్ణములకు జన్మమూలత నంగీకరింపబడదు టెట్లు ?

| ముఖతః | ఉరస్తః | మధ్యతః | పత్త ఏవ. (పాదతః) |
|---|---|---|---|
| త్రివృత్ స్తోమః | పంచదశస్తోమః | సప్తదశస్తోమః | ఏకవింశస్తోమః |
| అగ్ని - దేవత | ఇంద్రో దేవతా | విశ్వేదేవా దేవతాః | ............ |
| గాయత్రీఛందః | త్రిష్టుప్ఛందః | జగతీఛందః | అనుష్టుప్ఛందః |
| రథంతరంసామ | బృహత్సామ | వైరూపంసామ | వైరాజంసామ |
| ప్రాతఃసవనమ్ | మాధ్యందినం సవనమ్ | సాయంసవనమ్ | ............ |
| బ్రాహ్మణుడు మనుష్యుడు | రాజన్యో మనుష్యః | వైశ్యోమనుష్యః | శూద్రోమనుష్యః |
| అజః పశుః | అవిః పశుః | గాః పశుః | అశ్వాః పశుః |
| ముఖాః | వీర్యవన్తః | ఆద్యాః | ప్రవర్త్యాః |
| జాత్యా బ్రాహ్మణాః | జాత్యా క్షత్రియాః | జాత్యావైశ్యాః | జాత్యాశూద్రాః |
| అన్నాద | భోక్తృవర్గః | అన్నవర్గః | భోగ్యవర్గః |

4. అభిషేచనీయాని పాత్రాణిభవన్తి, యత్రైతా ఆపోభిషేచనీయాని, భవన్తి। పాలాశంభవతి, తేనబ్రాహ్మణోభిషించతి। బ్రహ్మవై పలాశః। నైయగ్రోధపాదం భవతి। తేనమిత్రోరాజన్యోభిషించతి పద్భిర్హిన్యగ్రోధః ప్రతిష్ఠితః, మిత్రేణవై రాజన్యః ప్రతిష్ఠితః। ఆశ్వత్థం భవతి తేన వైశ్యోభిషించతి. (శత)

రాజసూయమున, మూర్ధాభిషిక్తరాజునకు (1) బ్రాహ్మణుడు, (2) మిత్రరాజు, (3) వైశ్యుడు ఆయాఅభిషేచనీయపాత్రలందుంచబడిన, ఆయావిశేషశక్తి - వీర్యగుణకములగు, నాయాజలములలతో (మొత్తము 17 జలములు) నభిషేచించు నవసరమున జెప్పబడిన యీమంత్రమందు; పాత్రభేదముంజెప్పుచు, నాయావృక్షవిశేషములందు బ్రహ్మక్షత్రవిడ్వీర్యవ్యవస్థితి సూచించుచున్నది, గదా! వాని కాయావర్ణోచిత కర్మవిశేషములుకలవా ? ఈయాధారమున నే సనాతనధర్మలు వర్ణవ్యవస్థ యోనిమూలమనిరి. మరియు-

## 1 బ్రాహ్మణుడు

1. బ్రహ్మవైబ్రాహ్మణః 2. గాయత్రఛందావైబ్రాహ్మణః 3. ఆగ్నేయో వైబ్రాహ్మణ 4. దైవ్యోవైవర్ణోబ్రాహ్మణః 5. సోమోవైబ్రాహ్మణః 6. యద్బ్రాహ్మణ ఏవగోపీథిః (సప్తసప్త క్రమాద్ జ్ఞేయా విప్రాద్యాకృత్తికాదయః) 7. బ్రహ్మవాఅజః, 8. బ్రహ్మవాఏతద్రూపంయదహ, 9. గాయత్రం వైప్రాతస్సవనం, బ్రహ్మ గాయత్రీ, బ్రాహ్మణోషుహ పశవోభవిష్యత్. (10) సర్వేషాంవాఏషవనస్పతీనాం, యోవీర్యత్పలాశః, 11. బ్రహ్మహివసంతః తస్మాద్బ్రాహ్మణోవసంతే ఆదధీత, 12. సామవేదోబ్రాహ్మణానాం ప్రసూతిః

## 2 క్షత్రియుడు

1. క్షత్రస్యవా ఏతద్రూపం యద్రాజన్యః, 2. ఆదిత్యోవై దైవం క్షత్రం, 3. క్షత్రంవా ఇంద్రః, 4. త్రిష్టుప్ఛందా వై రాజన్యః, 5. ఐంద్రో వై రాజన్యః, 6. క్షత్రంహి రాజన్యః తస్మాద్ రాజన్యో గ్రీష్మే - ఆదధీత, 7. ఐంద్రం మాధ్యందినం సవనం, క్షత్రమింద్రః, క్షత్రయేషు హవై పశవో భవిష్యత్, 8. క్షత్రంహ అశ్వః, విడితరే పశవః, 9. క్షత్రస్యైతద్రూపం యద్ధిరణ్యం, 10. క్షత్రంవా ఏతదారణ్యానాం పశూనాం యద్వ్యాఘ్రః, 11. క్షత్రంవై ప్రస్తరః విశ ఇతరం బర్హిః.

## 3 వైశ్యుడు

1. జగతీఛందా వై వైశ్యః, 2. అన్నం వై విశః, 3. విడేవ వర్షాః తస్మాద్వైశ్యో వర్షాదధీత, 4. వైశ్వేదేవం వైతృతీయసవనం, సర్వమిదం విశ్వే దేవాః తస్మాత్ సర్వత్రైవ పశవః.

## 4 శూద్రుడు

1. సశౌద్రం వర్ణమసృజత పూషణం, 2. అసతో వా ఏష సంభూతో యత్ శూద్రః, 3. అనూర్యః శూద్రః.

## 5 చతుర్వర్ణములు

1. చత్వారో వై వర్ణాః, బ్రాహ్మణః, రాజన్యః, వైశ్యః, శూద్రః

## శ్రుత్యనుగత - పౌరాణిక స్మార్తవచనములు

1. లోకానాంతు వివృద్ధ్యర్థం, ముఖబాహూరుపాదతః,
బ్రాహ్మణం క్షత్రియం, వైశ్యం, శూద్రంచ నిరవర్తయత్.

2 సర్వస్యాస్యతుసర్గస్య గుప్త్యర్థంసమహాద్యుతిః
ముఖబాహూరుపజ్జానాం, పృథక్కర్మాణ్యకల్పయత్ (మనుః)

3. విప్రక్షత్రియవిట్శూద్రాః ముఖబాహూరుపాదజాః
వైరాజాత్పురుషాజ్జాతాః యఆత్మాచారలక్షణాః (భాగవత)
11.57

4. వక్త్రాద్యస్యబ్రాహ్మణాః సంప్రసూతాః
తద్వక్షస్తః క్షత్రియాః పూర్వభాగైః
వైశ్యాశ్చోర్వోః యస్యపద్భ్యాంచశూద్రాః
సర్వేవర్ణాఃగాత్రతః సంప్రసూతాః (వాయువు)

5. తతఃకృష్టోమహాభాగ! పునరేవయుధిష్ఠిర!
బ్రాహ్మణానాంశతంశ్రేష్ఠం, ముఖాదేవాసృజత్ప్రభుః
బాహుభ్యాంక్షత్రియశతం, వైశ్యానామూరుతఃశతః
పద్భ్యాంశూద్రశతంచైవ కేశవోభరతర్షభ!
సఏవంచతురోవర్ణాన్ సముత్పాద్యమహాతపాః
అధ్యక్షంసర్వభూతానాం ధాతారమకరోత్స్వయం (మహా॥భార
శాం॥ 207 అ)

6. ముఖతో వర్తతబ్రహ్మ పురుషస్యకురూద్వహ
యస్తూన్ముఖత్వాద్వర్ణానాం, ముఖ్యోభూద్బ్రాహ్మణోగురుః
బాహుభ్యో వర్తతక్షత్రం, క్షత్రియస్తదనువ్రతః
యోజాతాఃత్రాయతేవర్ణాన్, పౌరుషః కంటకక్షతాత్
విశో వర్తంతతస్యోర్వోః లోకవృత్తికరీఃవిభోః
వైశ్యఃతదుద్భవోవార్తాం నృణాంయస్సమవర్తత
పద్భ్యాంభగవతోజజ్ఞే శుశ్రూషాధర్మసిద్ధయే
తస్యాంజాతఃపురాశూద్రో యదవృత్త్యాతుష్యతేహరిః - (భాగ.

ఇత్యాదులన్నిటిసమన్వయమునను వర్ణవ్యవస్థ జన్మమూల మనుటకు సందేహముండదు. వాదికర్మప్రధానము

లెనుకొను పురాణవచనములు కర్మాతిశయద్యోతకమాత్ర ములు. ఈవ్యవస్థ త్రేతకు సంబంధించిన దని వాదియుపహ రించిన వాయవీయవచనముల కటనే సమాధానమీయబడి నది కాని, యతనిపరితోషముకొరకు మరియొకదృష్టితో సమాధానమిచ్చుట యనుచితముకాదు.

ఆనాడు వర్ణధర్మపాలనమం దుపేక్షాభావము పుట్టి యుండును. కనుక నప్పుడు మర్యాదాసూత్రబంధనము దృఢ ముగావింప బడెను. శ్రీభగవాన్ రామచంద్రునవతార మిందుకు సూచకము. అయినావిషయము నటులను, ఈవ్యవస్థ యనాదిత్వమునకును ఈ క్రిందివాయవీయవచనములు గమ నింపవలయును.

> "తతఃసర్గేహ్యవష్టబ్ధే సిసృక్షోర్బ్రహ్మణస్తువై
> ప్రజాస్తుధ్యాయత స్తస్య సత్యాభిధ్యాయిన స్తథా
> మిథునానాంసహస్రంతు సో సృజద్వైముఖాత్తథా
> జనా స్తేహ్యుపపద్యన్తే సత్త్వోద్రిక్తాఃసుచేతసః
> సహస్రమన్యద్ వక్షస్తో మిథునానాంససర్జహ
> తేసర్వేరజసోద్రిక్తాః శుష్మిణశ్చాప్యశుష్మిణః
> సృష్ట్వాసహస్రమన్యత్తు ద్వంద్వానామూరుతఃపునః
> రజ స్తమోభ్యాముద్రిక్తాః ఈహాశీలస్తుతేస్మృతాః
> పద్భ్యాంసహస్రమన్యత్తు మిథునానాంససర్జహ
> ఉద్రిక్తాఃతమసాసర్వే నిశ్శ్రీకాహ్యల్పతేజసః 8-36-40.

ఇట్లు కొంతముందుకుబోయిన నందే

> "తేషాంకర్మాణిధర్మాంశ్చ బ్రహ్మాతువ్యదధాత్ ప్రభుః"
> "సంస్థితౌప్రాకృతాయాంతు చాతుర్వర్ణ్యస్యసర్వశః":

యని యీవ్యవస్థయొక్క నిత్యతసూచింపబడినది. భాగవతము నిశ్లేసమర్థించె నస పూర్వవచనములచే స్పష్టము. శ్రుతులయభిప్రాయమునే పురాణములుననుసరించెను.

పోనిండు వాదివాద్దమునంగీకరించి కొంతతడవు ఈవ్యవస్థకర్మానుసారిణియే యనుకొన్నను, ఆకర్మకాధారమేమి? ఋషులుదాని నెట్లుకనిపట్టిరి? బలాత్కారముననో, శాసనబలముననో, కొందరియందలి ప్రత్యేకాభిమానముననో, యిది వారేర్పరచిరనగలరా? పోనిండు, అప్పటిప్రజలలో వారి వారికోర్కెలననుసరించియే యేర్పరచియుందు రందమా? యెవడైన మంచికర్మలకే సిద్ధపడ వలయును గాని నికృష్టకర్మలకు సిద్ధపడ జాలకుగదా! చివరకు ద్రావిడప్రాణాయామ, ఘట్టకుటీప్రభాతన్యాయ గతిలోనైనను కర్మవాదియు జన్మమూలప్రకృతి నాశ్రయించవలసియేయుండును. ప్రవృత్తికి మూలము ప్రకృతి. ప్రకృతికితూలరూపము వర్ణము, లేదా జాతి. అదేకర్మకునుమూలాధార మనుట నిశ్చయము. నిజముగ వర్ణవిభాగనే కర్మవిభాగమునకుమూలము గాని యెన్నియుక్తులుచెప్పినను కర్మవిభాగము వర్ణవిభాగమనుట పొసగదు. యోగ్యత, ప్రవృత్తి, ప్రకృతి, స్వభావము, శక్తి గుణవిశేషముల యాధారమునకర్మవిభక్తమయ్యెగాని, కర్మవిభాగానుసారము వర్ణవిభాగముకాదు. ఈ విషయముననీ గీతావచనముం బరికింపుడు

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచపరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః

పూర్వపక్షము:—

"సరే అంతయు నొప్పికొందుము, అయినను ఈవ్యవస్థ సమాజహితముం గోరినదైనను వంశానుగతముగా నెంచకుండుట మంచిది. ఏలయన:— ఈవర్ణమున కిదికర్తవ్యము, ఇది యాహారము, అని మనకగపడు నీవ్యవస్థవలన ప్రకృతిరహస్యమెరిగిన మనఋషులే దీనినింత దృఢముగావించి రనుట నిర్వివాదము. కనుకనే యిది బీజరూపమున ప్రపంచమంతటనున్నను భారతవర్షమందే పల్లవించి పుష్పించెను. "కర్మభిర్వర్ణతాం గత" మనుచో సమాధానమిచ్చుచు నీవిషయము మీరు నంగీకరించిరి. ఇక భారతదేశములం దిట్టి ప్రాణదేవతా తాత్త్వికజ్ఞానపారంగతులు, ప్రకృతిరహస్యతత్త్వపరీక్షకులు, ప్రకృత్యనుకూలకర్మవిభాగమును, తత్తత్కార్మానుకూలాహారవిహారనియమములను, గావించువారు లేకపోవుటచే నేదో స్వాభావికవిభాగమున్నను, ఇట్టి స్థూలవ్యవస్థ లేకుండెను. ఇందువలన:— మూలవర్ణవిభాగము జన్మసిద్ధమేయైనను, ఈశ్వరకృతమేయైనను, వర్ణకర్మలుకూడ ప్రాకృతములేయైనను, స్థూలవర్ణవ్యవస్థమాత్రము భారతవర్షమహర్షులు కర్మవిభాగాధారముననే వ్యవస్థితముగావించిరని యొప్పుకొన్నచో జివరకు నీవ్యవస్థాకర్తృత్వము సమాజానుబంధియే యైపోవును.

కాగా:— నేడన్నివర్ణధర్మకర్మలయందును పరస్పర విపర్యయ మెంతయో చూపట్టుచున్నది. శుద్ధబ్రాహ్మణదంప

తులకు పరమప్రాత్యులు కలుగుటయు, ప్రాత్యులనుకొను వారింట మంచివారు జనించుటయు జూచుచున్నాము. కనుక వంశానుగత్యభినివేశమునువిడచి, మున్ను ప్రకృతిసిద్ధమనుకొన్నను నేడు కర్మప్రధానతనే యంగీకరించి ఆయాలక్షణములుగలవాని నాయావర్ణస్థునిగా నెంచుటన్యాయముగాని యాపూర్వపునియమములనే పట్టిప్రాకులాడుటలో నంత మహత్వ నుగపడదు.

సమాధానము:- వాదము చారు + వాక్కులుగలదై చార్వాకమతముం బోషించుచున్నది. వాది తన కర్మాభినివేశమునబడి ' వంశానుగతి నగీకరింపనిచో వర్ణవ్యవస్థయొక్క తాత్త్వికస్వరూపమే సురక్షితముగనుండజాల,డను విషయము మరచినాడు. దీనిని ఋషులు త్రేతయందేర్పాటుచేసి రనియే యంగీకరింతము కాని: వాది "కారణగుణాఃకార్యగుణానారభన్తే" యను మర్మమెరిగిన ఋషు లీవ్యవస్థను వర్ణానుగామినిం గావించి రన్నది కూడ మరువరాదు. వారుకావించు ౘుల అదియే విడువ దనుకొనుటయే మేలు. ఋషులు వంశప్రవృత్తికినియమబంధములద్వారారక్షకమాత్రులే. "సవర్ణేభ్యఃసవర్ణాసుజాయంతేహిసజాతయః" అనునదిసర్వమాన్యసిద్ధాంతముకదా! మధురబీజమున కటుఫలము, కటుబీజమున మధురఫలమునా ? |

ప్రకృతివిపర్యయమున కేదోకారణ ముండియుండవలయును. అందువలన మేఘావరణమున సౌరప్రకాశమట్లు

బ్రాహ్మణతాదు లభిభూతములు కావచ్చును. అట్టిచో రజో-వీర్యమానదోషమునో దేశ శిక్షాన్నకుసంగ, సంస్కారాభావాది దోషములనో కారణములుగా ననుమానింపవలయును. కాని, ఇట్టియపవాదములు ప్రకృతిసిద్ధ . సవర్ణనియమమునకు బాధకములుకాజాలవు. తద్వర్ణసంతానము తద్వర్ణమే యన వచ్చును. వర్ణవిభాగమువలె వంశానుగత వర్ణపరంపరయు ప్రకృతిసిద్ధమే. రెంటికి మూలము యోనిభానమే.

"వర్ణవ్యవస్థయోనిమూల మన్న నంగీకరింతుము గాని వంశానుగతమనుటలో బ్రమాణమేమి ?" యన్నచో చురలతమరాత్మస్మృతినొందుచున్నారు. కొంచెము యోచించినచో మీచూపిన కపషోపాఖ్యానమే యిందుకు బ్రమాణము "మంచివాడైనను చెడ్డవాడైనను. బ్రాహ్మణపుత్రుడు బ్రాహ్మణుడే, శూద్రపుత్రుడు శూద్రుడే" యనుసిద్ధాంతము ప్రకృతిసమ్మతముకానిచో బ్రాహ్మణస్వభావోచిత యజ్ఞకర్మ భావనంగొని ఋషిసత్రమునకు వచ్చినకవషుని శ్రుతి యబ్రాహ్మణుడనునా ? నతడు వెడలగొట్టబడునా ? జాత్యాధికార విరుద్ధకర్మకు దండితుడగునా ? వర్ణవ్యవస్థ వ్యక్తిసంబంధమే యగుచో నిదియంతయు నెట్లుజరిగెను ? అతనియజ్ఞకర్మ ప్రవృత్తి కాఋషులేల యానందించి యంగీకరింపరైరి ? జన్మాంతరీయ దివ్యసంస్కారవిశేషమున నతడుసూత్రద్రష్ట కాగా నపవాదమర్యాదంబట్టి వారంగీకరించిరి. ఆయపవాదము సామాన్యమునకు భంగముదెచ్చునా ?

విశేషకారణములవలన ప్రకృతివిపర్యయముండ వచ్చును అంతమాత్రమున ప్రకృతిమొత్తమునకు భంగము వాటిల్లునా? మనుజులకుమనుజులేపుట్టుదురు. ఏదోకారణమున నొకమనుష్యస్త్రీగర్భమున ద్విముఖశిశువో, సర్పాకృతి శిశువో, అజాకృతిశిశువో, ఇంక నేమో, వికృతసంతానము కల్గిన సామాన్యనియమాభావముగ నెంచవచ్చునా? మరియు మలము, అస్థి, చర్మము, కేశములు, అపవిత్రములనిసామాన్యముగనందరెరింగిననియమము, ప్రకృతిసిద్ధము. ఇందుకపవాదముగ గొన్నివిశేషకారణములవలన గోమయ, శంఖ, కృష్ణాజిన,చామరములు, పవిత్రములనియెంచుచోనది సామాన్యనియమ భంజకమగునా? కవషోపాఖ్యాన మీస్థితికిజెందినది. ఇంతకుజెప్పవచ్చినదేమన:— ఋగ్వేదమునకు జెందిన యైతరేయబ్రాహ్మణస్థమగు నీయాఖ్యానము ప్రాచీనతమము. అందు వంశానుగతి యుల్లేఖమున్నపు డిదికల్పనయనుట కాధారములేదనియే.

ఇకవిశ్వామిత్రాఖ్యానముంజూతము. అతడు వశిష్ఠుని బ్రహ్మబలమునకోడి "నేనుబ్రాహ్మణుడను కావలె" నని సంకల్పించి యాసిద్ధికొరకెన్నివత్సరము లెన్నికష్టముల నోర్చుచు నెంతతపస్సుగావించెనో నేడిచ్ఛామాత్రమున బ్రాహ్మణులుకాగోరుమహానుభావులు స్మరించిన హృద్గతియవరుద్ధముకాగలదు. అతడు 'ఊం' యని సంకల్పించినయుత్తరక్షణమున బ్రహ్మర్షి కాలేదు. వాదిమతానుసారమైనచో

నత డన్ని పాట్లుపడ నేల? ఏదో బ్రాహ్మణకర్మానుష్ఠానమాత్ర మున బ్రాహ్మణుడు కాజాలడా? తపస్సువలన నే బ్రాహ్మణోచిత యోగ్యత యావిర్భవించు నన్నచో నదిమరింత యుపహాసాస్ప దమగును. ఈవిషయమున విశ్వామిత్రుని యోగ్యత చరమ సీమం జేరిపోయినది. కాని ఫలింపలేదు. యోగ్యతయున్నను జన్మాభిభవముంబట్టి చరువిపర్యయసంబధమగు నాదోషము దొలగించుకొని వీర్యశోధన కావించుకొనంతవరకు వశిష్ఠాదు లతనిని బ్రాహ్మణుడని యనలేదు. ఈవిధముగ నపవాదరూప వర్ణవిపర్యయముగూడ ప్రాకృతికసామాన్యనియమబాధకము కాజాలదు.

మనయనాదిసాహిత్యము ఋగ్వేదము. అందు విశ్వామిత్రు డనేకసూత్రద్రష్ట. నాటినుండియున్న ఈవ్యవస్థ యనాదియని తేలుచున్నది. ఆలోచింపక యపూర్ణసాహిత్యముపై దొందరపడి యభిప్రాయ మీయరాదు. అపవాదములు నియమములు కావు. ఈయొకవాక్యముంగూడ బరిశీలించినచో నీవ్యవస్థ జన్మమూలమనునది తేటపడును:—

"తద్యఇహరమణీయచరణా, అభ్యాశోహయత్తే రమణీయాంయోనిం ఆపద్యేరన్, బ్రాహ్మణయోనింవా, క్షత్రియయోనింవా, శూద్రయోనింవా, అథయఇహకపూయచరణాః, అభ్యాశోహయత్తే కపూయాంయోనిమాపద్యేరన్, శ్వయోనింవా, సూకరయోనింవా, చాండాలయోనింవా.

ఛాందో, 5-10-17.

శ్రుతిస్పష్టముగా బ్రాహ్మణాదికమును 'యోని' యన్నది. మనుష్య పశుపక్ష్యాదికము మాత్రమే 'యోని'

యనుకొని వేదభక్తినగపఱ్చువారు ఈ శ్రుతింజూచి కొంచెము నేర్చుకొనుట మంచిది.

కర్మవలన వర్ణవిపర్యయ మనుకొనువారు, హరిశ్చంద్రో పాఖ్యానమెఱుంగరా? అతఁడుచండాలుని సేవించుచు, చండాల కర్మనియుక్తుడై యున్నను చండాలుఁడుకాలేదుగదా! నేఁటి బ్రాహ్మణసమాజమం దెంతమంది తమయవివేకముననో, అయోగ్యతవలననో, దాస్యకర్మానుగాములయ్యు జాతిబ్రాహ్మ ణులనిపించుకొనుటలేదు? మదాంధధనికులయవివేకతకు లొంగి యవిద్యానుగ్రహమున వంటవాడై యుండు బ్రాహ్మణుడు బ్రాహ్మణుఁడుగ వంశానుగత వ్యవస్థకు సమర్థుఁడే యగు చున్నాడు. గురు, దేవ, మహారాజ, పండిత, శాస్త్రి, మొద లగు శబ్దములీనాఁడు జాత్యోపజీవులకుగూడ సత్కారకములగు చున్నవి.

ఇట్టియపవాదములంబట్టి నియంత్రణ దృఢముగావింప వలసివచ్చెను. కృతయుగమున నంత యవసరములేకపో వచ్చును. ఆనాఁటివారి బలవీర్యపరాక్రమవిశేషములు వేరు. ఎక్కడనైన నొకయపవాదమున్న నది యంతలెక్కకు రాలేదు. ఆదర్శముకాలేదు. ఆనాడేమరచిపోవుచుండిరి. యుగపరివర్తనమున నాశక్తిహ్రాసముకాఁగా, ప్రజావర్గమం దనృతభావ ప్రాబల్యముజూచి నాటిఋషులు మర్యాదాసూత్ర ముంబిగించుటయు, తప్పినవారిని తగినట్లు శిక్షించుటయు, జరుగుచుండెను. త్రేతాయుగమందలి వ్యవస్థావిషయికవచ

నము లిందుజేసిన వేయగును. వాయుపురాణములను నీవచనములం బరికింపుడు.

"సంస్థితౌ ప్రాకృతాయాంతు చాతుర్వర్ణ్యస్య సర్వశః
పునః ప్రజాస్తుధర్మాంశ్చ బ్రహ్మాసువ్యదధాత్ప్రభుః
వర్ణధర్మైరజీవన్త్యః వ్యరుధ్యంత పరస్పరం
పునః ప్రజాస్తుతా మోహాత్ తాన్ ధర్మాన్నానపాలయత్"
క్షత్రియాణాంబలందండం యుద్ధమాజీవమాదిశత్
యాజనాధ్యాపనంచైవ తృతీయంచపరిగ్రహం
బ్రాహ్మణానాంవిభుస్తేషాం కర్మాణ్యేతాన్యథాదిశత్
పాశుపాల్యంచవాణిజ్యం కృషించైవవిశాందదౌ
శిల్పాజీవంభృతించైవ శూద్రాణాంవ్యదధాత్ప్రభుః

మర్యాదాపురుషోత్తముడు, భగవంతుడు, రామచంద్రుడు త్రేతాయుగపురుషుడన్నది సర్వవిదితమే. ఈవ్యవస్థాదృఢమూలతః వాల్మీకి, రామాయణమందు జన్మభావవిరుద్ధ తపోనుష్ఠానముగావించి శ్రీరామశిక్షచే సద్గతినొందిన శంబుకోపాఖ్యాము నిదర్శనము. వర్ణధర్మరహస్యమెటుంగని యువివేకులిది ఋషికల్పయనుకొన్నపుడు :

"పిబంత్యేవోదకంగావో మండూకేషురుదత్స్వపి
నతేధకాగోధర్మేస్తి మాభూరాత్మప్రశంసకః"

యనువిశ్వామిత్రవచనమే సమాధానమిచ్చును.

భగవంతుడుపరశురాము డాయుగమువాడే. అతడు క్షత్రధర్మానుగామియై పరశుధారణమున దిరుగుచుండు. క్షత్రియులపై బెక్కుమార్గులు దండువెడలి భూలమందిని నాశ

ముగావించెను. భీష్మునితో బోరాడెను. ఇంతయైనను శ్రీరాముడతనిని బ్రాహ్మణుడనియే పూజించెను. భవభూతియు 'శస్త్రగ్రాహీ బ్రాహ్మణో జామదగ్న్యః, తస్మిన్ దాంతే కా స్తుతిః తస్య రాజ్ఞః" అనియీవిషయమును సమర్థించెను.

✓నేటికైదు వేలవత్సరములకుబూర్వము మహాభారత యుద్ధముజరిగెను. అందు ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, క్షత్రియోచిత సేనాపత్యకర్మంగావించినను, వారిబ్రాహ్మణత్వమున కేమాపత్తియురాలేదు. భారతమునందలి సంవాదములందు కర్మప్రాధాన్యము ననుమానించువారీభీష్మయుధిష్ఠిరసంవాదముం గమనింతురుగాక!

యుధిష్ఠిర: నాస్త్యస్మాదన్యోలోకేషు ప్రష్టవ్యోస్తినరాధిప!
క్షత్రియోయదివావైశ్యః, శూద్రోవారాజసత్తమ!
బ్రాహ్మణ్యం ప్రాప్నుయాద్యేన తన్మేవ్యాఖ్యాతుమర్హసి
తపసావాసుమహతా కర్మణావా శ్రుతేనవా
బ్రాహ్మణ్యమథ చేదిచ్ఛేత్ తన్మే బ్రూహిపితామహ

భీష్మః బ్రాహ్మణ్యంతాత దుష్ప్రాపం వర్ణైఃక్షత్రాదిభిస్త్రిభిః
పరంహిసర్వభూతానాం స్థానమేతద్యుధిష్ఠిర!
బహ్వీస్తుసంసరన్ యోనీర్జాయమానః పునః పునః
పర్యాయేతాత! కస్మింశ్చిత్ బ్రాహ్మణోనామజాయతే

కేవలకర్మయేవర్ణజనకమగుచో భీష్మునియీయుత్తరమునకు మహత్త్వమేమి? ఇప్పట్టున భీష్ముడుమతంగోపాఖ్యానముంజెప్పెను. మతంగుడు జాతిశూద్రుడు. కాని బ్రాహ్మ

ణోచితసద్వృత్తుడు. అతడు బ్రాహ్మణుడుకాగోరి తపమున నింద్రుని బ్రత్యక్షగావించుకొని యాతనితో

> "ఇదంవర్ష సహస్రంవై బ్రహ్మచారీసమాహితః
> అతిష్ఠమేకపాదేన, బ్రాహ్మణ్యంనాప్నుయాంకథం,
> అహింసాదమమాస్థాయ కథంనార్హామివిప్రతామ్"

అని తనకోరిక నెరిగించుటయు, నింద్రుడేమనియెనో చూతము:—

> "శ్రేష్ఠతాంసర్వభూతేషు, తపోర్థంనాతివర్తతే
> తదగ్ర్యం, ప్రార్థమానస్త్వం, అచిరాద్వినశిష్యసి"

పిమ్మట మతంగుడాసంకల్పమునుండి విరమించుకొనెను. ఇంతటితో పౌరాణికవృత్తమైనది. ఇక కొన్ని ధర్మశాస్త్రవచనములను జూతము. ఇందు జెప్పదగినదిలేకున్నను కేవలముతుష్టికొరకుదహరింతుము.

> "సర్వవర్ణేషుతుల్యాసు, పత్నీష్వక్షతయోనిషు
> ఆనులోమ్యేనసంభూతాః జాత్యాజ్ఞేయాస్తఏవతే
> ఉత్పత్తిరేవవిప్రస్యమూర్తిర్ధర్మస్యశాశ్వతీ
> సహిధర్మార్థముత్పన్నః బ్రహ్మభూయాయకల్పతే
> బ్రాహ్మణోజాయమనోహి, పృథివ్యామధిజాయతే
> ఈశ్వరఃసర్వభూతానాం, ధర్మకోశస్యగుప్తయే (మనువు)

బ్రాహ్మణ్యాం బ్రాహ్మణేనైవ ఉత్పన్నో బ్రాహ్మణః స్మృతః హారీతః

> "జన్మనాబ్రాహ్మణోజ్ఞేయః సంస్కారైర్ద్విజఉచ్యతే
> విద్యయాయాతివిప్రత్వం శ్రోత్రియస్త్రిభిరేవచ,"

ఇత్యాదు లెన్నో యున్నవి. ఇంతకు:— వర్ణవ్యవస్థ, యు, తద్వంశాన గతియు, ప్రకృతి - జన్మసిద్ధములనుట యే నిష్కర్ష. కనుక నే

"యోనివిద్యాకర్మ చేతి త్రయం బ్రాహ్మణ కారకమ్."

అనుటచరితార్థమగును. కర్మశూన్యుడగు బ్రాహ్మణుడు నిందనీయుడే. శాస్త్రమితనిని 'బ్రాహ్మణబ్రువు'డన్నది. వ్యాసుడిట్టి కర్మసంస్కారవిద్యాశూన్యులను శూద్రస్త్రీకోటిం జేర్చి 'ద్విజబంధువు'లని వీరికి వేదాధికారము లేదని యెను. స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీన శ్రుతిగోచరా"

కర్మావశ్యకతం జెప్పువాక్యములు శాస్త్రములం దెన్నో యున్నవి. కర్మశూన్యుడు శూద్రసముడన్నారు. అదియథార్థముగూడను వర్ణానుసారకర్మ లేనిచో మహత్వమేమి? జాత్యభిమానమాత్రమున వర్ణత్వమునకవికాసమేది? అట్టివారు సమాజమునకు భారమందుము. కిట్టావరణమున వజ్రమువజ్రమయ్యు నేమియుపయోగము?

✓ విద్య, తపస్సు, కర్మ, ఇవే జాతికిబలములు. బలశూన్యునకాత్మబోధయసంభవము. యోనిభావమును సమర్థించు శాస్త్రము, అంతపట్టుదలతోడనే కర్మపతిపాతముం బూనియున్నదని వాది యుదహరించినవచనములే చాటును. కేవల జాతిమాత్రము నూతగాగొని యుదరపోషణమాత్రమున దృప్తినొందువారు కనులు దెఱచి చూడవలయునని కొన్ని వచనము లిట నుద్ధరింతుము :—

"నజాతిర్నకులంరాజన్ నస్వాధ్యాయః శ్రుతంనవా,
కారణానిద్విజత్వస్య, వృత్తమేవహి కారణమ్
కింకులంవృత్తిహీనస్య, కరిష్యతిమహాత్మనః
కృమయఃకింనజాయన్తే కుసుమేషుసుగంధిషు
జాతికర్మాదిభిర్యస్తు సంస్కారైః సంస్కృతః శుచిః
వేదాధ్యయనసంపన్నః షట్సుకర్మస్వవస్థితః
సత్యవాగ్నిఘసాశీతు శీలవాంశ్చగురుప్రియః
సత్యవ్రతీసత్యపరః సవైబ్రాహ్మణఉచ్యతే
విద్యాతపశ్చయోనిశ్చ ఏతద్బ్రాహ్మణలక్షణమ్
విద్యాతపోభ్యాంయోహీనో, జాతిబ్రాహ్మణఏవసః. ఇత్యాదులు

ఈవ్యవస్థయొక్క జన్మభావమునుగూర్చి యాక్షేపించు వారికంటె జాతిమాత్రమున నిరర్థకాభిమానముంచి యుప జీవించువారే యీవ్యవస్థకెక్కుడు హానికారకులు. వారిం జూచియే జనసామాన్యమునకునిందు శ్రద్ధావిశ్వాసము లంత రించినవి. ఇతరుల దోషము లెంచుటకంటె తన దోషములు సవరించుకొనుట మేలు. వర్ణమహాత్త్వము వట్టిబుకాయింపు లతో నిల్చునదికాదు. కొందరు నేడుదానధర్మములు లోపించి నవి, యందువలన ధర్మకర్మలులోపించె నందురు. కాసందు దోషమంతయు నితరులదే యనుటయన్యాయ్యము. మనము మనకర్తవ్యమాచరింపము. సమాజమునకు మనవలన హాని యేగాని లాభమించుకయు లేదు. ఇక కేవలజాత్యభిమానమున దిరుగుట నిరర్థకముగాదా ?

కానిండు, 'కర్మోపయోగితసర్వమాన్యము,' అన్నం తనే యోనిప్రాధాన్యమునకు లోపమురాదని జ్ఞప్తియుంప

వలెను. తద్వికాసమునకే సంస్కారవిధానమున్నది. మరియు, జాతిభావమునంగీకరింపక నామకరణ సంస్కారము నెట్లు కాపాడు కొనగలరు ? పుట్టినదినమునుండి పదియవదినమున నామ కరణ సంస్కారవిధియున్నది. అందలియా దేశముజూడుడు:—

> "మాంగళ్యం బ్రాహ్మణస్యస్యాత్ క్షత్రియస్యబలాన్వితమ్
> వైశ్యస్యధనసంయుక్తం, శూద్రస్యతుజుగుప్సితమ్

ఉత్పన్నశిశువున కింకను గర్మయోగ్యత లేదుకదా ! అట్టిచో వర్ణోచితనామభేద మెట్లుసంఘటిల్లును ? జాతిభావము నంగీకరింపనిచో నిదియసంభవము. కనుకనే యదివంశాను గత మనుటకూడ ప్రకృతిసిద్ధము.

ఈకులమహిమచేతనే నేడైన నీభారత మన్నిటనా దర్శముగ నిల్చియున్నది. భారతశిల్పకళను, సుసమున్నత పశ్చిమదేశ మిప్పటికి ననుకరింపజాలకున్నది. అదియ్యా య్యానే, వంశపరంపరగవచ్చుకర్మ, మనః ప్రాణవాఙ్మయాత్మ యందు, శుక్రశోణితములందు, శాశ్వతముగ వంశానుగత వాసన లవిచ్ఛిన్నరూపమున నుండుచుండ నావాసనావాసిత కర్మనైపుణ్యము నెంత తెలివిగలవాడగు నవీనుడేని, యను కరింపగలడా ? అదియంత త్వరితముగబట్టువడునా ? భారత వర్ష సర్వోత్కృష్టశిల్పము, బ్రాహ్మణవర్గలోకోత్తరజ్ఞానవైభ వము, క్షత్రియుల యపూర్వపౌరుషము, వైశ్యులపశుసంపద, వీనివికాసమున కీకులపరంపరామహిమయే కారణము. ఈ వర్ణవ్యవస్థ వ్యక్తి ప్రధానమగుచో నిది యంతయు నెక్కడ,

నేటికాలమునకు వర్ణసాంకర్యము, కర్మసాంకర్యము మూలములు. అందరు స్వధర్మకర్మపరిత్యాగమున నన్నికర్మలకు సిద్ధమగుచుండుట. మరియు నొకడేపని చేసిన నందరు దానివంక కేపోవుట.

"సర్వే యత్ర నేతారః, సర్వే పండితమానినః
సర్వే సర్వస్వమిచ్ఛన్తి తత్ర నాశః ప్రవర్తతే"

ఏక్షేత్రమందు నెవరికిని సంపూర్ణ సఫలత లేదు. నైతిక బలముపోయి యర్థసంకటమేర్పడినది. ఫలితము? రోగుల కంటె చికిత్సకులధికమైరి. చదువువారికంటె పత్రికలధికము. ధరించువారికంటె భూషణనిర్మాతలధికము. వ్యాజ్యములకంటె న్యాయవాదులెక్కువ. విద్యార్థులకంటె శిక్షకులెక్కువ. కొనువారికంటె దుకాణములధికము. ఎక్కువారికంటె వాహనములెక్కువ. చివరకన్న వస్త్రములకు కరవు.

"స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధింలభతే నరః" అను సూత్రమర్థమెరిగి యాచరింపవలయును, అప్పుడీ చిక్కులు తొలగును, గాని వేరొక యుపాయము లేదు. విజ్ఞానము, దర్శనము, సాహిత్యము, శిల్పము, కళలు, కృషి, పశువులు, వస్త్రములు, ఈ మొదలగునవన్నియు నవసరములే - వర్గీకరణమునగాని యేపనియు సాగదు. అన్నియు నన్యోన్యాశ్రితములు. ఆవేశమున నందరు నన్నియు నేకముగా మూటగట్టబోయినచో సర్వనాశమునకు గారణమగును.

నేడు బ్రహ్మక్షత్రములు పేక్షింపబడినవి. కేవలము, వణిక్శూద్ర ధర్మములువరింపబడినవి. బ్రహ్మక్షత్రములు

రక్షకబలములు. అర్థ - ప్రవర్గ్యరూపరాష్ట్ర బాహ్యకళేబర మీరెంటిచే సురక్షితముగనుండును. ఈరెంటియు పేక్షవల నను, రాష్ట్రనేమైనదో స్పష్టమే. రక్షకుడులేనిరక్ష్యము, భోక్తలేనిభోగ్యము, అన్నాదుడులేనియన్నము, మొత్తముపై యథాన్నము. ఇందుకుచికిత్సయేమి ? నియంత్రణ పూర్వకముగ బ్రాహ్మణుని బ్రహ్మసాహిత్య (వేదశాస్త్ర) ప్రతిష్ఠితుం జేయుట మొదటిపని, పిమ్మట కావలసినదంతయు సదేయగును. "బ్రాహ్మణత్వస్యహిరక్షణే రక్షితస్యాద్వైదికో ధర్మః"

ఇంతవును:— 'వర్ణసృష్టికిజన్మయేమూలము, తద్వికాసార్థము కర్మానుష్ఠానము పరమావశ్యకము' ఇట్లు 'జన్మ ప్రధానకర్మ' యే వర్ణవ్యవస్థకు మూలస్తంభముగ నేర్పడును. జన్మకర్మల ఈరహస్యమును, ప్రతిష్ఠాత్వమును, భగవంతుడు ఈశ్లోకమున వెల్లడించెను.

"చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః
తస్యకర్తారమపిమాం, విద్ధ్యకర్తారమవ్యయం"

ఇందలిగుణశబ్దము త్రిగుణప్రకృతిసూచకము. జాతి కదియే ప్రతిష్ఠ. దీనిచే నీవ్యవస్థ జన్మపరకమనియు, కర్మశబ్దముచే తద్రక్షణార్థము కర్మావశ్యకతయు భగవంతుడు సూచించెను. ఈతత్త్వము నెరింగియే ధర్మాచార్యులు నిట్లు సూత్రించిరి :—

ప్రకృతివిశిష్టం, చాతుర్వర్ణ్యం; సంస్కారవిశేషాచ్చ వసిష్ఠః

ఇక : పాశ్చాత్యమతశంఖతీర్థమునగాని మనము పవి

త్రులముగా మనుకొనువారు. ప్లేటోమహాశయుని రిపబ్లిక్ (Republic of plato) యను గ్రంథమునరయుదగును. అందు: క్లర్జి (Clergy) సోల్జరు, (Soldier) మర్చెంటు (Merchant) లేబరు, (Labour) అను పేరులతో నాలుగువిభాగములంగీకరింపబడినవి. మరియు, ప్రకృతింబట్టి మనోవిజ్ఞానానుసారము, (Psycology) (1) గార్డియన్స్ (Gardians) (2) సోల్జరు (Soldier) (3) ఆర్టిజన్ (Artisan) అని త్రైవర్ణిక నిర్దేశమున్నది. ఈ ప్రశ్నోత్తరములను జూడుడు :—

Whether the soul has three principles of life?

Certainly it has, The three principle divissons of Society, that we practically see in the world, Can be, but the Reflection of the soul it self. ............... మహమ్మదీయులందు నొకవిధముగ సైయుద్, పఠాను, షేక్, మొగలు అను నాల్గువిభాగములు, కలవు. వేయేల? ఈవ్యవస్థ చరాచరపదార్థములన్నిటియందు కలదు.

ఏ ష ధ ర్మః స నా త నః

ఇతి శ్రీమత్

కౌండిన్యసగోత్రపవిత్ర చల్లా సుబ్బాంబా సుబ్బారాయతనూభవస్య కృష్ణమూర్తిశర్మణః కృతిషు - అను శ్రుత్యుపనామక, విజ్ఞాన లక్ష్మీనారాయణీయే, ప్రస్థానమీమాంసాయాం, శ్రీమద్భగవద్గీతోపనిషద్విజ్ఞాన పరిచయే,, కర్మయోగ విజ్ఞానాంతర్గతవర్ణాశ్రమ సంస్కార విజ్ఞానే, వర్ణవ్యవస్థా విజ్ఞానమ్ సంపూర్ణమ్.

ఓమ్.

నమః పురుషోత్తమాయ.

# ఆశ్రమవ్యవస్థా విజ్ఞానము

మొదట నే, కర్తృభేదభిన్నసామాజికవ్యవస్థ వర్ణవ్యవస్థ యనియు, ఆయుఃకాలభేదభిన్న వైయక్తికవ్యవస్థ యాశ్రమవ్యవస్థయనియు అనుకొంటిమి. ఇదియు నంతమహాత్త్వము గలదియు ప్రకృతిసిద్ధమునైనదే. అది సమాజోపకారకము, ఇది వ్యక్తిస్వరూపవికాసకము. పరమార్థసాధనకది, వ్యక్తి స్వార్థరక్షకిది. దానికిది ప్రతిష్ఠ.

## ఆశ్రమ శబ్ద నిర్వచనము

శ్రముతపసి (దివాది) యను ధాతువునకు ఘఞ్ ప్రత్యయయోగమున నాశ్రమశబ్దము నిష్పన్నమయ్యెను. బ్రహ్మచర్య, గార్హస్థ్య వానప్రస్థ, సన్యాసములను నీనాలుగవస్థలతో యుక్తుడగు వ్యక్తి క్రమముగ దత్తదవస్థానురూప తత్తత్కారానుగమనము గావించును కనుక నివి యాశ్రమము లందురు. కర్మవివర్తము, ''తపస్సు - శ్రమ''యని రెండు భాగములు. ఏకతోఽనుగామియగు శారీరకకర్మ శ్రమ యనియు, సర్వతోఽనుగామియు ప్రాణసంబంధకర్మయునగు తపస్సు పరితఃశ్రమభావమునం బరిశ్రమయనియు వ్యవ-

హారము. ఆశ్రమశబ్ద మీతపఃకర్మకు సూచకము. కనుక కోశము.— "ఆ-సమంతాచ్ఛ్రమోఽత్ర" యనియు నిర్వచించెను. నాలుగాశ్రములందును తపఃకర్మప్రాధాన్యమే కలదు. కనుక వీనినాశ్రమములనదగును. "కుర్వన్నేవేహ కర్మాణి" యన్నది లక్ష్యముగాగొని యాశ్రమియగువాడు జన్మక్షణాది నిధనక్షణపర్యంతము యథాశాస్త్రముగ నాయా యవస్థానురూప కర్మలాచరింపుచునే జీవనోద్దేశ్యము సాఫల్యముగావించుకొనగలడు. ఈసఫలతారహస్యమే, ఈయాశ్రమవ్యవస్థయం దంతర్నిగూఢము.

## సహజజీవనము - సహజజ్ఞానము
## ఆశ్రమవ్యవస్థ

ఆశ్రమవ్యవస్థంగూర్చి తెలిసికొనుటకుముందు ఇందుకు సంబంధించిన సహజజీవనముంగూర్చియు, దానికిజెందిన సహజజ్ఞానముంగూర్చియు, కొంచెమెరుంగుటమంచిది. సహజజీవనమును ప్రాకృతికజీవనమనియు, శాస్త్రీయజీవనమును కృత్రిమజీవనమనియు, ననవచ్చును, "ఇదేమి అనృతసంహితుడగు మనుజుడు సహజప్రాకృతిక - జీవనచర్యయందన్యవస్థగ నడచినప్పుడు శాస్త్రమర్యాద యతనిని బద్ధుంజేయును గదా! అట్టిచో ప్రాకృతికజీవనమున కుపోద్బలకమగు శాస్త్రీయజీవనమును వేరుసేయుడువేమి" యన్నచో ఆ రెంటికిని ఒక పరమమూర్ఖుడు బరమశ్రద్ధాళువు నగువానికిని,

మహాబుద్ధిమంతుడు శ్రద్ధాశూన్యుడు నగువానికిని గల భేద మున్నదనియందుము.

మాటవరుసకు, బుద్ధివాదముకంటే మనుష్యుని ప్రాకృతికశక్తుల వికాసమునకు వేరొక మంచిమార్గములేదు. కాని యించుక యోచించినచో, "తనకుమించిన (బుద్ధివాదమున కందని) యనధికారచేష్టలుగల ప్రశ్నలను తర్కపరంపరలను గర్భమందుంచికొని, స్వాభావికములగు నాత్మవిశ్వాసమును, మానసశ్రద్ధను, సమూలోత్పాటనగావించు నీబుద్ధివాదమే, మనసహజజీవన - వికాసములకు ముఖ్యశత్రువై యున్నదను సత్యముంజేరగలము. బుద్ధివాద ముపయోగమే. కాని, ఎక్కడ? కేవలము వ్యావహారిక క్షేత్రమందు. శ్రద్ధావిశ్వాసములునుపయోగులే. ఎక్కడ? ఆత్మక్షేత్రమందును, తన్మూలకధర్మక్షేత్రమందును.

వ్యావహారికజీవనము, కృత్రిమజీవనము. దీనిని సామాజికజీవనమందుము విశేషపరిస్థితులంబట్టి యిందు తన సహజజీవనస్వాభావికనియమములను, అప్పుడప్పు డపవాదములం గావింపవలసివచ్చును. బుద్ధివాదాధికారము కేవల మీవ్యావహారిక కృత్రిమజీవనమువరకే సీమితము. అనగా:- (ప్రకారాంతరమున) సామాజికశిష్టాచారములు, వైయక్తిక సదాచారములు, పారస్పరికవ్యవహారములు, యథాసమయ కర్తవ్యకర్మానుగతులు, మొదలగువ్యావహారిక క్షేత్రము

లన్నిటియందు నీబుద్ధివాదమునకే ప్రాధాన్యము. వీనియం దెల్లపుడును బుద్ధివివేకధర్మమునకే ప్రాధాన్య మీయ వలయును.

ఇక :—ఆత్మానుబంధియు, నతీంద్రియము, మనో బుద్ధులకతీతమునగు ధర్మక్షేత్రమునందు, బుద్ధివాదమును, తన్మూలకతర్కవాదమును, పూర్తిగా గట్టిపెట్టవలయును. అట్టియపుడే ఆత్మానుగతధర్మమున మనశ్రద్ధావిశ్వాసములు ప్రతిష్ఠనొందగలవు. ఇదే మన సహజజీవన - జ్ఞానములకు మూలసూత్రము. బుద్ధిక్షేత్రము కేవలము బాహ్యజగత్తు. అంతర్జగత్తునందు దీనికిగతిలేదు. తన యధికారక్షేత్రమున బనిసేయుటయే బుద్ధిమత్త్వము. ఇదే శాస్త్రీయబుద్ధివాదము. ఇట్లు శాస్త్రము, వ్యావహారికక్షేత్రమున బుద్ధివాదమునకు సర్వోచ్చాసనమిచ్చి, యలౌకికాత్మక్షేత్రము (ధర్మక్షేత్రము)నందు బుద్ధితర్కాదిపరిత్యాగమును శ్రద్ధావిశ్వాసాను గమనము, నాదేశించెను.

నేడు బుద్ధివాదయుగము. సహజజీవనమునకు జెందిన, సహజజ్ఞాన - శ్రద్ధా - విశ్వాసాది ప్రాకృతికవిభూతు లెగిరి పోయినవి. అందరును కేవలబుద్ధిపథపథికులు. తర్క - ప్రశ్న - వితండాదులు మనముఖ్యమిత్రులు. ఇంకొక భయంకరవిషయ మేమన :— బుద్ధితోబనిసేయుపట్టున శ్రద్ధావిశ్వాసానుగ మనము, నాశ్రద్ధావిశ్వాసము లుండవలసినపట్టున బుద్ధిసమా

వేళమును, గావించుట. ఆపని జర్జరితబుద్ధివాదమున సమర్థించుకొనుట. ఉదాహరణమునకు:-- మనదైనికజీవనోపయుక్తములగు నౌషధాహారవస్త్రాది పదార్థములంగూర్చి యోచించినంజాలును ఒకంపెనీయేదోయొక వస్తువునిర్మించెను. పరమకారుణికములు, పరోపకారవ్రతశీలములునగు సమాచారపత్రములు దానియశోగానము కావించెను. "అది మనయాత్మాంతఃశక్తుల నేమేని మలినముగావించునా?" అను నిత్యాది బుద్ధివాదముతో మనకుబనిలేదు. పరమశ్రద్ధాళువుల్లు కనులుమూసికొని యన్యాహార్యమనుగాక, దానింగొని యుపయోగింతుము. ఆపని నెంతో ప్రయాసపడి సమర్థింతుము. చూచితిరా? ఈభావుకతను, మూర్ఖతాపూర్ణశ్రద్ధను? ఈవిధముగ మనవ్యావహారికక్షేత్రమందు అకమొదలు ఇతివరకు, నవ్యావహార్య శ్రద్ధావిశ్వాసముల కనుగాములమై వ్యవహార్యబుద్ధివాదమును బూర్ణముగా మరచిపోయి, అభ్యుదయమునకుబదులు సర్వనాశము నాహ్వానించుచుంటిమి.

ఇక నాత్మక్షేత్రమునంకకు మరలుదము. అది మన తర్కము, యుక్తి, బుద్ధి, మొదలగునవి యొకమూలకుద్రోచి, 'పాండిత్యంనిర్విద్య బాల్యేనతిష్ఠాసేత్' యనునౌపనిషదాజ్ఞను శిరసావహించి - యన్నిటను మూర్ఖులమై, పరమశ్రద్ధావిశ్వాసములతో నాత్మోపయికమలగు నీశ్వరభక్తి, ధర్మము మొదలగువాని ననుగమింపదగినచోటు. అచ్చట మనబుద్ధిమత్వ చాకచక్యముం బ్రవేశపెట్టెదము. ఈశ్వరు

నేలయంగీకరింపవలయును? గంగాస్నాన మేమిలాభమునకు? సంధ్యావందన మెందుకు? యజ్ఞోపవీత ప్రయోజన మేమి? ఇత్యాదు లెన్నో! ఎందుకుపనికిరానిచోట 'ఎందుకు' ఎందుకు? యేదైపోయినను మరల సంపాదింపవచ్చునేమోకాని శ్రద్ధా విశ్వాసములం జోగొట్టుకొన్నచో మరల సంపాదించుట కష్టము. "భవానీశంకరౌవందే శ్రద్ధావిశ్వాసరూపిణౌ" అనుటకు మనబుద్ధివాద మడ్డముగనున్నది గదా!

ఇంకొకయుదాహరణము:— ఈశ్వరుడు, ధర్మము, పరలోకము మొదలగు నాత్మసంపత్తులందు దృఢనిష్ఠకలవాడొకడు దేశహిత మాచరింపగోరి యందలిధర్మసంబంధముగల కొన్ని యాటంకములంగాంచి, ధర్మరక్షణగావించుకొనుచు, దేశహితమాచరించు మాధ్యమిక మార్గమెరుంగ నొక మహాపురుషునిదర్శించెను.

ఈమధ్యవచ్చిన యీమహాపురుషశబ్దమునకు, ప్రస్తుత దృష్టికోణముంబట్టి కొంచెము వ్యాఖ్యానమవసర మనితోచుచున్నది. "విబుధజనులవలన విన్నంతకన్నంత తెలియవచ్చినంత తేటపరతు"

'పెద్దవాడు' అని దీనియర్థము. ధనముగలవాడో, విద్యాసంపదగలవాడో, దేశసేవయందగ్రణియో, సర్వస్వము సమర్పించినవాడో, ఈపరిభాషకర్థము కానచ్చును. కాని వర్తమానయుగదృష్టింబట్టి స్వీయసహజజ్ఞానాధారమున దీనికి (మహాపురుషశబ్దమునకు) బరిభాష నేర్పరుపయువల

నన్న చో నీవాక్యముస్ఫురించుచున్నది. | "ఎవడు నిజమెన్నడు జెప్పినదిలేదో, అసత్యమెన్నడుజెప్పినదిలేదో, అతడు మహా పురుషుడు" | ఈపరిభాషనించుక ధ్యానదృష్టితో మననము సేయుచో దీనివ్యాప్తి ప్రత్యక్షమగును.

దీనితాత్పర్యము మున్నేస్పష్టముగావింపబడెను. (1) ధార్మికక్షేత్రమున రాజనీతియొక్కయు, (2) రాజనైతిక క్షేత్రమున ధర్మనీతియొక్కయు సమావేశముసేయుగోరు వారు మొదటిచోట నసత్యమాడరు. రెండవచోట నిజము చెప్పరు. కనుక వారు మహాపురుషులు.

పై జెప్పినశ్రద్ధాళువు అట్టి మహాపురుషుంజూచి తన జిజ్ఞాస నెరిగించుటయు నతడు:- "సోదరా! పొరపడుచున్నావు! పరతంత్రరాష్ట్రమునకు, ధర్మము, జాతి, వర్ణము నేమి? దేశము స్వతంత్రముగాకుండ ధర్మపాలనయసాధ్యము. కనుక ముందు దేశహితము, స్వాతంత్ర్యము. పిదప ధర్మము." అనెను.

ప్రత్యుత్తరమునందన్నదో కొంచెమైన నసత్యము లేదు. మహాపురుషుడబద్ధమాడునా? యుక్తితర్కసమ్మతము, బుద్ధిగమ్యము, నగునుత్తరము. ధర్మక్షేత్రమున రాజనీతి క్షేత్రాక్రమణము! శ్రద్ధావిశ్వాసములపై బుద్ధివాదమున కాధిపత్యము! కానిండు, దీనితో నా శ్రద్ధాళువు ధర్మశ్రద్ధా గ్రంథులు వదులైనవి. నిజముగ:- రాష్ట్రస్వాతంత్ర్యము ముందు, వ్యక్తిగతధర్మమున కొకవిలువయా? రాజనీతి-

ధర్మనీతి సంఘర్షమున, రాజనీతికే విజయశ్రీ లభించు చున్నదిగదా!

సరియే. అతడు కార్యరంగమునదిగెను. అత్యాచారము నెదిరింపుడని యాదిష్టుడయ్యెను. అందుకుసాధన మేది? ఊయ నిన దెబ్బలు, గ్రుద్దులు, బలాత్కారముగ నోటికుందభక్ష్య పదార్థములు గ్రుక్కుట, ప్రాప్తించుచున్నవి. ఇట్లు రాజ నైతికక్షేత్రమున కేవలబుద్ధివాదాశ్రయమున, బుద్ధిమంతు లనపించుకొన్న రాజనీతివిశారదులు, శాసకులు చేయరాని దంతయుజేయుచు, సాధనహీనులకు రాజనైతికపధికులను పరాభవములపాలుసేయుచున్నారు. ఇక నేమనుకొననలయును? "యేయథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవభజామ్యహం" అను వచనమునాశ్రయింపకుండ నీక్షేత్రమున విజయమొందుట కఠినము, అసంభవము." అనుకొని మన శ్రద్ధాళువు మరల మహాపురుషుం జేరి తనయావేదనం జెప్పికొన "ఆతతాయిన మాయాంతంహన్యా దేవావిచారయన్" అనువచనానుగ మునగాక సఫలతయుండదేమో! యనుటయు, నమ్మహా పురుషుడు :—

"అయ్యో! ఎట్టితప్పుపల్కితివి? ఈశ్వరోపాసకుడవు, సత్యాహింసాపాలనము నిష్ఠగలవాడవు, ఆత్మబలముబూనుము పిరికితనమువీడుము, ఈశ్వరునినమ్ముము, హింసకు బ్రతిహింస కూడదు, హింసకునివాని పాపమే హరించును. 'అహింసాపరమోధర్మః' ఆస్తికుడవు కమ్ము, ఎవరినిశత్రువులను

కొనవలెను, అందరకు మేలుగోరుము, ఒక నాడీనిష్ఠ ఫలించి తీరును."

అనుటతోడనే మన శ్రద్ధాళువు "దోషదర్శనానుకూలవృత్తి ప్రతిబంధకవృత్తికారణం శ్రద్ధా" యనునీ శ్రద్ధాప్రభావమున నదేమంచిదనుకొనెను. ఆ ప్రత్యుత్తరమునందత్త్వనేమో చూతము:— రాజనైతిక క్షేత్రమున రాజనీతికే ప్రాధాన్యము. అందు, యుక్తితర్కసమ్మత బుద్ధివాదముననే పనిజరుగగలదు. ఈశ్వరుడు, ఆత్మ, ధర్మము వీనిపై నాధారపడి చేతులుముడిచికొని కూర్చున్నచో గతయుగములందైనను ఈక్షేత్రమున నెవనికిని విజయశ్రీలభింపలేదు. నేడునంతే. ఇక:—ధర్మక్షేత్రమున ధర్మనీతికే ప్రాధాన్యము. "యశ్చబుద్ధేఃపరంగతః" యనుటతప్ప, నస్మదాదిసామాన్యులకు ధర్మప్రవృత్తికేకమాత్రసాధనము శ్రద్ధావిశ్వాసానుగమననే. ఇందు యుక్తిసమ్మతబుద్ధివాద ప్రవేశమునిషిద్ధము. మహాపురుషుడు :—ధర్మమడిగినపుడు, రాజనీతిని, రాజనీతినడిగినపుడు ధర్మమునుజెప్పెను. రెండును లక్ష్యచ్యుతములే.

'అతడట్లెందుకుచెప్పి యీశ్రద్ధాళువుంజిక్కుపెట్టెను ? అన్నచో:— మహాపురుషశబ్దమందే యీయర్థమున్నది. ఎట్లన పెద్దవాడనిపించుకోదలచినవాడు మొదట సత్యమార్గగామియు, త్యాగభావముగలవాడు, సామాజిక సుఖదుఃఖసహనశీలుడుగనుండును. అందుచే హిందూజాతి తత్ప్రత్యుపకారమునకు బద్ధులతనికివ్యక్తిప్రతిష్ఠనిచ్చి మహాపురుషుడని మన్నించును,

దానివలన నతడు కొంతకాలముగడువగా, కర్తవ్యము - వ్యక్తిత్వము, అనురెంటిలో కర్తవ్యముమరచి వ్యక్తిత్వమునేబట్టి ప్రాకులాడుచు సర్వజ్ఞవేషమున సమాజము నెదుటకువచ్చునటు రావలసియుండును. వచ్చి, "నేనెవరిజిజ్ఞాసను శాంతింపజేయ లేకున్నను, ఉత్తరమీయజాలకున్నను వ్యక్తిప్రతిష్ఠపోవు" ననుకొని స్వాకల్పితసర్వజ్ఞతారక్షణార్థము, "నిజమాడుట లేదు. అబద్ధముపల్కుటలేదు" అనుమార్గముంబట్టును.

కానిండు, ప్రస్తుతముంజూతము:— అట్టిలక్ష్యచ్యుతుడు రాజనైతికక్షేత్రమున నేమిచేయును? చేయకుండ గలడు? సాధనాభావమొకవంక నుండనేయున్నది. దానిపై నహింసాధర్మము మార్గమునుమూసివేసినది. కష్టపడి ప్రోగు చేసిన ప్రతిమాసంఘము లక్ష్యభ్రష్టము, అకర్మణ్యము, నైపోయినది. కేవలవాచిక ప్రలోభనములపై నాధారపడి భిన్నభిన్నముకాకెంతకాలముండును? "ఒకతప్పుచేసి దానిని రక్షించుకొనుటకు బుద్ధిపూర్వకముగ మరొకతప్పుచేయ వలయు" అనుసామెతయున్నది. అందును వ్యక్తిప్రతిష్ఠను ప్రధానముగనెంచు, మహాపురుషున కీపని తప్పనిసరి. ఈస్థితిలో నతడేమియుపదేశించునో చూతము!

"మన రచనాత్మకకార్యము సరిగాలేదు. మనమీ క్షేత్రమునకయోగ్యులము. మొదటమనలను మనము బల వంతులుగాజేసికొనవలయును. అందుకు సామాజికరూఢివాదముల నను, ఆచరణలను, తొలగించుకొనవలయును. అందు

కొరకు ప్రచారము, ఆందోళన, యనసరములు." (ఈ మాటలు మొదటనే చెప్పిన ప్రతిమాసంఘ నిర్మాణావసరమే యుండదు) చివరకు:—

'చచ్చువాడుచావయంత నేరదొర్లును' అను నానుడి చరితార్థమగును. వ్యక్తి ప్రతిష్ఠారక్షకము, ఆందోళనకొరకాందోళన సేయుట, యగును. ఎంతవరకు? ఉపేదేష్ట బ్రతికియున్నంతవరకు. వానితోనిదియు సమాప్తమగును. తనయీ చిరకాలి కాపజయమున బ్రతిమాసంఘము కాలాంతరమున విద్రోహాత్మకముగ బరిణమించి చెదరిపోవును. కల్పిత-సంచిత శక్తుల నగ్నస్వరూపము బయటపడును. ఈపరమభక్తులందరు నన్నిట నుచ్ఛృంఖలభావమును స్వీకరింతురు. వారినేమి సేయవలయునో తోచక 'శిక్షింపవలయు' నను చీత్కారములు వెలువడును. ఇంతకు గారణము? సత్యముజెప్పక, యబద్ధమాడక యుండు మహాపురుషమనోవృత్తి. ఇందు సహజ జీవనసంబంధ సహజజ్ఞానాభావమును, కృత్రిమజీవన సంబంధి బుద్ధివాదసమాశ్రయమును, కారణములు. ఈస్థితితొలగు టెట్లు? బుద్ధివాదచక్రమునంబడక తప్పించుకొనుటెట్లు? అధికారబలముంబట్టి కర్తవ్యమునకు మహత్వమిచ్చుటెట్లు? ఇత్యాది ప్రశ్నలకుసమాధానముగ, సామాజిక - విభక్త-కర్తవ్యస్పష్టీకరణ పూర్వకముగ వర్ణవ్యవస్థ చూపబడినది. వైయక్తిక - విభక్త - కర్తవ్యపూర్వకముగ నావర్ణవ్యవస్థకు

రక్షకమగు నాశ్రమవ్యవస్థా విజ్ఞానము పాఠకులయెదుట బెట్టెదము.

దీనిచే వ్యక్తిస్వాతంత్ర్యవికాసము, సామాజిక - రాష్ట్రీయకర్మయోగ్యతయు, సిద్ధించును. మనసజహాజీవనమునం దాశ్రమవ్యవస్థల పూర్ణసమన్వయము కుదురును. సాంసారికబోధకలుగనంతవరకు మనమసమర్థులము కనుక బెద్దలయనుశాసనము నపేక్షించుచు వారి శిక్షానుసారము ప్రవర్తింతుము. జీవనముయొక్క యీ మొదటిస్థితియే బ్రహ్మచర్యాశ్రమ మనియందురు. ఇట్లు కొంతకాలము గతింపగా గురుజనాధీనతనుండి వెలువడి స్వకీయానుభవ బలమున సాగి సామాజికక్షేత్రమున మనయస్తిత్వప్రతిష్ఠను కాంక్షింతుము. ఇదేమనస్వాభావిక గృహస్థాశ్రమము. ఇది ప్రవృత్తిప్రధానము. సమాజానుబంధసాపేక్షము. బ్రహ్మచర్యాశ్రమమున గొలదిమందిగురువుల యాదేశమే పాలింపవలయు గాని యిందన్ననో సామాజిక - నాగరిక - లౌకిక - దైశిక - జాతీయాద్యనేకధర్మనీతిగురువుల యాదేశముంబట్టి నడువలయును. కనుక నిందుబాధ్యతలధికము. సమాజానుబంధమూలములగు నీ యనుశాసనములకు జెంది పొందికగలిగి యుండుటకు పారివారికజీవనమును జక్కగాసాగింపవలయును.

కాని, యేదోయొకనాడీసామాజిక నియంత్రణలు, జాతీయార్గళములు, పారివారిక ప్రపంచము, మనలను త్రస్తుల జేయును. అప్పుడు సంశయాత్మనట్లు ద్వైవిధ్యమునంబడి

చివరకు, దాంపత్యభావమును మాత్రము సురక్షితముగా నుంచికొని తక్కినవానికన్నిటికి అనగా మొత్తముగ గృహస్థాశ్రమమునకొక ప్రణామము నర్పించుకొందుము. ఇది స్వాభావిక వానప్రస్థాశ్రమము. పిమ్మట జ్ఞానవికాసమునను, బాహ్యానుభవములవలనను, శారీరకాశక్తతంబడి, యాదాంపత్యభావముంగూడ బరిత్యజింపవలసివచ్చును. అదే సన్యాసాశ్రమము. ఇట్లు మనజీవనావస్థావిశేషములందు, సహజజీవనమునకు జెందిన సహజజ్ఞానతారతమ్యమున, నాలుగాశ్రముల ననుగమింతుము. వర్ణవిభాగమట్లిదియు, మనశాస్త్రజ్ఞులు వ్యక్తిస్వాతంత్ర్యమూలమంత్రముగా జూచిరి. దీనిని కార్యరూపపరిణతినొందింపగోరి శతాయుఃపురుషుని యాయువు నొక్కొక్కటికిరువదియైదువత్సరములచొప్పున నాల్గుభాగములుగావించి యీయాశ్రమవ్యవస్థ నేర్పరచిరి. దీనివివరణమునే యీప్రకరణమునంజూతము.

## ఆశ్రమవ్యవస్థ - ఆశ్రమము

కొలదికాలమునుండి మన దేశమున నాశ్రమనిర్మాణపుబిచ్చి వెలసినది. కొంతకాల మాపిచ్చితోనేమును కాలముబుచ్చితిమి. విలుప్తప్రాయ వ్యక్తిస్వాతంత్ర్య పునరుద్ధారణగావించి యాశ్రమవ్యవస్థను నిలువబెట్టుటకు ఆశ్రమనిర్మాణమవసరమనుట నిర్వివాదమే. కాని 'ఆశ్రమస్వరూపమెట్లుండవలయు? నని ప్రశ్న. చాలమందికీవిషయమున "నాగరికవాతావరణమునకు దూరముగ నెక్కడనో యొక

విశాలమైదానముననో! యరణ్యముననో! పర్ణకుటీరములు నిర్మింపవలెను. అందు, నాగరిక సభ్యతాచారవ్యవహార ప్రవేశము నిషేధించి, యందలి విద్యార్థుల కాసంపర్కము లేకుండజేసి కేవలశాస్త్రచింతనకు ప్రాధాన్యమీయవలయును. ఆశ్రమకులపతి నిస్స్వార్థియు, త్యాగియు, సంయమియు, నై యుండవలయును.'' అను నిత్యాద్యభిప్రాయములు కలవు.

కల్పితాదర్శవాదానుగమనము మనకొక గొప్ప ప్రమాదము. ఆయభినివేశమునబడి మనము తథ్యపూర్ణ సామయికపరిస్థితుల నుపేక్షించి సర్వనాశము గావించు కొన్నాము. ఆదర్శవాదమట్లు పరిస్థితివాదమును తప్పక గమనింపదగినదే. ''చికిత్సరోగమునకుగాని రోగికికాదు'' అనునది లక్ష్యమందుంచికొని యాదర్శము ననుగమింపవలయును. పరిస్థితికిలోనగినవానిం బాగుచేయు ప్రయత్నము, తత్పరిస్థితి బాగుసేయనంతవరకు వ్యర్థము. దోషింగూర్చి విమర్శించుట దోషులనువృద్ధిసేయుటకే. దోషసమాలోచన దోషులను దగ్గింపగల దని సిద్ధమైనది. ఈదృష్టికోణముననుండి యాశ్రమ స్వరూపముంజూతము.

ఆశ్రమశబ్దమునకు బూర్వోక్తవ్యాఖ్యసేయువారు, సామాన్యముగ, ప్రాచీనభారతమునందలి యాశ్రమస్వరూపములట్లే జనసంపర్కమునకు దూరముగ, గౌపీనధారులగు కులపతులచే నడుపబడుచునుండెడి వనియే యనుకొనుచుందురు. కాని 'నేతి హైవావాచ'. కారణముస్పష్టమే-

కర్మానుగతయగు స్త్రీ-ఉగ్రకర్మానుగతపురుషుడు వివాహ సూత్రసీమితులుగానంతవర కర్థవృగలులు, అర్థేంద్రులు. "సప్తపురుషపురుషాత్మక చితాగ్నిమయ ప్రజాపతి, అగ్నీషోమాత్మకము. కనుక స్త్రీపురుషమూర్తియు,నగు తనసంవత్సర స్వరూపమునను బూర్వ మేకాకిగనుండెను. రమణమునకు దన్నసమర్థునిగ నెంచి తత్సాధనభూతమగు రెండవదానింగోరి, స్వయముగ దన్నుదాను పతి-పత్నీ రూపముల బరిణతుగా వించికొనెను. కనుకనే ప్రజాపతి యిచ్ఛచే బుట్టిన యతని యీరెండవరూప మర్ధవృగలము. (సగముకోసినభాగము).

"సవైనరేమే, తస్మాదేకాకీనరమతే, సద్వితీయమైచ్ఛత్ సహైతావానాస, యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ సఇమమేవాత్మానం ద్వేధాపాతయత్ తతఃపతిశ్చపత్నీచాభవతాం తస్మాదర్ధబృగలమివస్వః ఇతిహస్మాహయాజ్ఞ్యవల్క్యః (బృహదా)

ఈ శ్రుతితత్త్వార్థ మేమన :—సంవత్సరచంక్రోత్పత్తికి బూర్వము, బ్రహ్మనిశ్వసితనామ కాపౌరుషేయవేదమూర్తి, సత్యాగ్నిఘన స్వయంభూ ప్రజాపతి సామ్రాజ్యమేకలదు. సృష్ట్యనుబంధములగు కామ,తపః,శ్రమభావములచే నీస్వాయంభువ వాగగ్నియందు క్షోభయుదయించెను. అందువలన నందేకాంశ మబ్రూపమున బరిణతమయ్యెను- గోపథమున నీయబ్భాగము బ్రహ్మస్వేదము నాబడినది. (గోప 1-1-1) ఇది యీ బ్రహ్మ(వాగగ్నికి) రెండవరూపము. ఆరెండురూపముల సమన్వయముచే బ్రహ్మప్రజాపతి మున్ను చెప్పినట్లు సంవత్స

nce) దర్శనశాస్త్రమందో (Phylosphy) తమనోవిజ్ఞానమందో (Psycology) పండితుడై సమాజక్షేత్ర ప్రవిష్టు డయ్యెనను కొనుడు. ఇత డింతవాడగుటకు సమాజము చాలినంత నష్టమును భరించెను. కనుక తనయందితనికి స్థానమిచ్చినది, అది యీశిక్ష నెరుగదు, కనుకనీయతిథికి దగుసత్కారమాచరించెను. ఇతని, ప్రతిష్ఠ, ధనము మొదలగునన్ని విధముల నేల్లను చేకూరెను. ప్రత్యుపకారముగ నితడు సమాజమున కిచ్చినది? 'నాస్తి'. ఈశబ్దమున కీవాఖ్యాకు ముందుగ సమాజమం దీనాడేశిక్షకు ప్రాధాన్యమున్నది? ఏశిక్షితు లీనాడెక్కువయుపయోగము నందున్నారు? అన్నదికూడ జూచుకోవలయును.

ఆశ్రమచతుష్టయివలె భారతీయసంస్కృతియందు బురుషార్థచతుష్టయియు సుప్రసిద్ధమే, వానియనుష్ఠానముకోసమే వర్ణాశ్రమవ్యవస్థల విధానము. ధర్మము, అర్థము, కామము, మోక్షము, అనిపురుషార్థమునాలుగు. ఇందు అర్థముస్థూలశరీరమునకు, కామము మనోరాజ్యమునకు, ధర్మమువిద్యాబుద్ధికి, నుపకారకములు, నుత్తేజకములును. మోక్షమాత్మానుగామి. ఇట్లీనాల్గును మన, ఆత్మబుద్ధి మనశ్శు, శరీరముల కుపకారకములనువిషయము వేరొకచో వివరింపబడును. ప్రస్తుతమీశిక్షాక్షేత్రమందు ధర్మమోక్షములకు బహిష్కారమైనది. అర్థముపెరిగి ధర్మమునుభక్షించివైచెను. నిస్సీమకామము మోక్షమును మ్రింగివైచెను.

చివరకర్థకామములు మనలక్ష్యము లయ్యెను. ఈరెంటి నన్ని విధముల గాపాడుటకు, డాక్టరీ, వకాలతు అను రెండుశిక్షలు వెలసినవి. డాక్టరీకామలక్ష్యసాధనము. వకాలతు అర్థలక్ష్యమునకు ప్రోత్సాహకము. సమాజమున వీరికున్నమహత్వము ఎంతమనోవైజ్ఞానిక - దార్శనికాదులకును లేదు. ప్రభుత్వపు పన్నునుండియైన దప్పించుకొనవచ్చును. వేయేలమృత్యువు పన్నునుండియైన దప్పించుకొనవచ్చును. గాని యీయిరువురి పన్నులు దప్పనిసరిగా నెంతవానికైన జెల్లించితీరవలయును. మనలక్ష్యపూర్తి ప్రధానసాధకులగు వీరికి లోటేమి? నేడీ రెండును ప్రధానశిక్షావిభాగములు.

వీరుసమాజమునకు జేయు ప్రత్యుపకారము 'నాస్తి' యని మున్నేయనుకొంటిమిగదా! శిక్షాకాలమున వీరికి సామాజికసభ్యత, శిష్టాచార, సదాచార, జాతీయవిధులేమియు, దెలియవు. ఆకాలముగడపి సమాజమం దడుగు పెట్టగనే, యవియన్నియు నెదురువడును. సమాజము వీరిని పెద్దమనుష్యులని నేర్చినవారని యాదరించును. వీరువిషమస్థితింబడుదురు. "సమాజముతోగలసి జీవింతుమా వీరియాచారాదులేమో యెరుంగుటకు 'ఓనమ'లకు శ్రీగణేశాయనమః, అనుకోవలయును. మననాగరకత, శిక్ష, వ్యక్తిప్రతిష్ఠ యనువానికి స్వస్తి చెప్పి ఈయశిక్షితులను గురువులుగా నెంచవలయును. అటుగానిచో నీప్రతిబంధములు సుఖముండనీయవు." అనిధ్యానింపగనే వీరియెదుట నొకప్రణాళిక (Sceam) ప్రత్య

క్షమగును. అప్పుడు "ఓసామాజికులార! మీరనుకొనునవి. తప్పులు మీనిత్యాచారములు కృత్యములు రూఢివాదములు ఏనాడో త్రుప్పపట్టిపోయిన పరమపౌరాణిక ఛాందసములు చదువుకొన్నవారు వీనినాందోళనపూర్వకముగా మొదలంట బెరికివేయవలెను." అనియాదేశింతురు. ఆదేశించుచున్నారు. పాపము! ముగ్ధసమాజము కింకర్తవ్యతావిమూఢమై మనస్సునణచికొని, చేయునదిలేక, చేతులునలుపుకొనుచు తామునంపాదించినది వీరికోసము పోగొట్టుకొని కూర్చుండును.

ఈపరిస్థితులకాధ్యత, యాశ్రమప్రతీకములుగనున్న శిక్షాసంస్థలదే. అందుండి వెడలివచ్చినవారికి "మేమను కొన్నది చేయునదిస. మీరనుకొన్నది చేయునదితప్పు." అన్నమూలమంత్ర మహాస్త్రములు నెత్తికెక్కియుం డును. ఈస్థితిలో మన యాశ్రమవ్యవస్థ కెట్టిపరిభాష నేర్పగుప వలయును? "మనజాతీయత సురక్షితముగనుండవలెను. శిక్షితులముగావలెను. సమాజమునకుబనికిరావలెను. మనము సమాజమునకేగాని సమాజము మన కాత్మార్పణ సేయ నక్కరయుండరాదు. వ్యక్తిప్రతిష్ఠ సమాజప్రతిష్ఠను మింగి వేయరాదు. సమాజగర్భమున వ్యక్తిసురక్షితముగనుండ వలెను."

అడవులలో పర్ణకుటీరము లక్కరలేదు. కాషీనధారి కులపతులపనిలేదు. నాగరికజీవనమునకు నీళ్లువదలనక్కర లేదు. అట్టియాశ్రమములు మున్నెన్నడలేవు, నేడునువాని

వలన లాభముండజాలదు. ఉపయోగితాదృష్టితో ననుపయుక్త ములగు నాశ్రమనామకసంస్థలు సమాజము నార్థికసంకట మునం ద్రోయుటకే. ఈసమాజమునకు జెందినశిష్టుడు, శిక్షితుడు, విద్వాంసుడు, అనుభవముగలవాడు, నగు సద్గృహస్థుడే కులపతి. కర్తవ్యదృష్టితో శిక్షాప్రసార మతడేకావించును. అతనియవసరములను సమాజమేతీర్చును. ఇదేభారతీయాశ్రమసంక్షిప్తరూప రేఖ. నేడు నదేకావలయును. ఆర్యుల ప్రతి గృహము నాశ్రమమే. విశేషశిక్షకు గృహస్థఋషుల బ్రహ్మపరిషత్తులుండెను. మనకులపతులు కౌపీనధారులై యుపవాసములతో నడవులదిరుగువారుకారు, చక్రవర్తులరాజ్యకార్యములందు జోక్యముకలవారు. రాజ - లోక - సమాజసభలందు వారికి బూర్ణప్రవేశముండెను. విశేషవిషయముగని పట్టి ప్రచారముసేయుదలచువారికి శాసకునిపక్షమున నేదో యొక నియతస్థలమేర్పాటు సేయబడుచుండినది. మంత్రవర్ణనముంబట్టి నదీసంగమమో, పర్వతోపత్యకయో, అందు కుపయోగముగ నెంచబడుచున్నట్లుతోచును. చూడుడు :—

"ఉపహ్వరేగిరీణాం, సంగమేచనదీనాం, ధియా, విప్రో అజాయత" ఋక్ 8-62 వికాసభూమియగు నాశ్రమప్రాసంగికరూపరేఖయిది. ఇట్టివానియందు సమావర్తనానంతరము గృహస్థాశ్రమప్రవిష్టులగుచు తమయాశ్రమనామమును జరితార్థము గావించుకొనువారుస్నాతకులు. అట్లుగాక :— మనమో, కేవల బాహ్యాచారచక్రమునంబడి శ్రద్ధను దురుప

యోగముగావించి నాలుగాశ్రములను బరిత్యజించి, పరంపరగ విశ్వశాంతికారణమగు వ్యక్తిస్వాతంత్ర్యమునకు దిలోదకములు విడిచిపెట్టితిమి.

## వ్యక్తిస్వాతంత్ర్యము

వ్యక్తియొక్కపూర్ణవికాసము వ్యక్తిస్వాతంత్ర్యము. కాని ఏమర్యాదయులేక ఉచ్ఛృంఖలముగ దిరుగుటకాదు. అట్టిది వ్యక్తిత్వమును నాశముగావించి చివరకు బరతంత్రమును కల్గించును. మర్యాదాబద్ధుడై కుటుంబ, సమాజ, రాష్ట్రముల, యనుశాసనముంబట్టి నడచుట వైయక్తికవికాసమునకు ముఖ్యకారణము. వ్యక్తిస్వాతంత్ర్య మూలప్రతిష్ఠయునదే.

ఇట్టివ్యక్తులుగల సమాజము, రాష్ట్రము, తన, జ్ఞాన-క్రియార్థ - శిల్పశక్తులందు సమున్నతమై - స్వతంత్రమై విశ్వశాంతిలక్షణ విశ్వస్వాతంత్ర్యమునకు ప్రాణప్రతిష్ఠయగును. అంతకునుమూలము, మర్యాదాలక్షణవ్యక్తిస్వాతంత్ర్యమే. ఇందుకు, పరిభాష:--వైయక్తిక - గుణ శక్తుల పూర్ణవికాసము. ఇందుకుమూలము, స్వాధికారకర్మలయందనన్యభావనిష్ఠ. విశ్వప్రతిష్ఠామాలికరస్యమిదియే.

స్వయముగనయోగ్యుడు, మర్యాదనెరుగడు, అనుశాసనముసహింపడు. కర్తవ్యదృష్టిలేదు, అట్టివాడు కుటుంబమునకు బనికిరాడు. అందెవరునితనిమాటవినజాలరు. ఇక సమాజమునకు రాష్ట్రమునకునితడెందుకు? తానుముందు

శుద్ధుడై కుటుంబమునకో యితరులకో యనుశాసకుడు కావల
యును. కుటుంబముంగూర్చి తా నేదివాంఛించునో యది
తనకుండవలెను. "అన్నిటనాయిష్టమే చెల్లవలె" ననుకొను
వాడు ఎన్నడును గొప్పవాడుకాడు. ఆసిద్ధాంత మేనాడును
సాగినదిలేదు. స్వ = ఆత్మ; తంత్రము = సీమ = ఆత్మసీమకు
లోఁగినదిస్వతంత్రము. పర = ఇతరము తంత్రము = సీమ =
పరసీమాప్రవిష్టము, పరతంత్రము. అనగా ప్రకారాంత
రమున నిట్లనుకొనవచ్చును:- తనశరీరము, ఇంద్రియవర్గము,
మనోబుద్ధులు, స్వార్జితపిత్రార్జితస్థిరచర సంపత్తులు ఆహార
విహారములు, మొదలగువానిని తనయాత్మాధికారమం దుంచు
కొనుట స్వతంత్రత. వైయక్తికసర్వాంగీణానుశాసనము
స్వతంత్రత. (ఈస్వతంత్రపరతంత్రవాదము మరొకచో వివ
రింపబడినది.) చూ। కర్మయోగవిజ్ఞానము.

(1) ఇతరతంత్రములను మనకు రక్షకములు గావించు
కొనుటయే స్వతంత్రరక్షణ కుపాయము (2) ఇతరుల
స్వాతంత్ర్యానురోధమున :- మన స్వాతంత్ర్యమును రక్షించు
కోగలము. ప్రతియొకవ్యక్తియు, పూర్వలక్షణస్వతంత్రతం
గోరును. కాని, ప్రతియొకవ్యక్తియొక్క స్వ - భావమును
"అన్నాదశ్చవా ఇదంసర్వమన్నంచ" అన్నట్లు పారస్పరిక -
అన్న - అన్నాదభావమువలన స్వరూపరక్ష కన్యోన్యసహా
యము నపేక్షించు నని జ్ఞప్తియుంచుకొనవలయును.

వర్ణవ్యవస్థం జెప్పునపుడు "మనుజుడు గ్రామ్యపశువు,
సామాజిక ప్రాణి. ఇతని వైయక్తికావశ్యకతలు సమాజము

వలన నే పూర్ణములగును. చివర కితని స్వాతంత్ర్యమురక్షించు నది సమాజశక్తియే''యని చెప్పబడినది. ఈస్థితిలో స్వతంత్ర మున నుండుటకు ప్రతివ్యక్తికి వ్యష్టి - సమష్టిరూపమున సమాజానుశాసనమును మన్నించు టావశ్యకము. అందుకు వ్యతిరేకముగ నమర్యాదగ నడచి యదే స్వ - తంత్రమను కొనునా డన్నివైపులనుండియు బహిష్కార ప్రాప్తి యగును. సమాజసాపేక్షములగు మన యేకోరికలును జెల్లజాలవు. అంతటితో బారతంత్ర్యనే సిద్ధించును. ఈవిధమగు వ్యక్తి స్వాతంత్ర్య మంటురోగమువలె మెల్లగావ్యాపించి సామాజిక శక్తులం దగ్గించి క్రమముగా విశ్వశాంతి విఘాతకము కాగలదు. నేడిదేయక్షరశఃచరితార్థ మగుచున్నది.

స్వతంత్ర పరతంత్రశబ్దములకు కల్పితపరిభాషలంబట్టి నేడు, పితా - పుత్ర, పతి-పత్నీ-భ్రాతా - సేవక - స్వామీ, రాజా, ప్రజా, శిక్షక - విద్యార్థి ఈమొదలగువారందరు నొకరియనుశాసముతో నొకరికిబనిలేకుండుటే స్వతంత్రత యనుకొనుచున్నారు. ఇదేమియన్నచో "మనము ప్రకతి యొక్క స్వతంత్రాంశలమైయున్నపు డితరులయంశలను మన యధికారమునం దుంచుకొనుటకు మన కేమికలదు?" అందురు.

నేడు సామాన్యముగ పారస్పరికానుశాసనమూలక మర్యాదాభావములను తమసుఖములకు బ్రతిబంధకము లను

కొనుచున్నారు. కాని :— ప్రకృతియొక్క యంశరూపము లగు సూర్య - చంద్ర - పృథివీ - గ్రహ - నక్షత్రానలానిలాదు లానియతిదండశాసితములై, పరస్పరాధికారరక్షణమున స్వాధికారరక్షణకు సమర్థులై యున్నారని వారు మరచుచున్నారు, ఆనియతిఁదాటుటకే వారికైన శక్యమా ?

"భీషాస్మాద్వాతోదేతి, భీషోదేతిసూర్యః
భీషాదగ్నిశ్చవాయుశ్చ మృత్యుర్ధావతిపంచమః"

జిహ్వయు, ముఖముదనవే కనుక నెట్లైననను కోవచ్చును. లేదులేదనుటయేకాని యధికారవ్యాప్తినుండి యెవడును వంచితుడుకాజాలడు. ఈరెండుస్థితులకు భేదమేమన :—స్వేచ్ఛాపూర్వకముగ నధికారనియంత్రణమున నడచుటచే శాంతిలక్షణసుఖసామ్రాజ్యముండును. అనిచ్ఛాపూర్వకముగ నాక్రమణముసేయు నధికారనియంత్రణమున నాత్మక్షోభ యుదయించును. ఒకసజ్జను డీరుస్వైచ్ఛిక నియంత్రణమర్యాదనుండి కూడ బాహ్యుడై పోవుచో యథాకామయథాచార పశువునకు నతనికిని భేదమేమి ? అనుశాసనోపేక్షామూలము, అమర్యాదితము, నగుప్రస్తుతస్వాతంత్ర్యమెట్లు వ్యక్తిత్వ, కుటుంబసమాజ - రాష్ట్రములను పరతంత్రములనుగావించెనో, వివరింపబనిలేదు. ఫల మనుభవించుచున్నాముగదా !

ఇంతకు :—"సమాజస్వరూపరక్షకు వర్ణవ్యవస్థయు, వ్యక్తిస్వరూపరక్ష కాశ్రమవ్యవస్థయు, నావశ్యకములని

తేలినట్లు విజ్ఞులెంచగలరు. 'వ్యష్టిలేనసమాజ' మనుకొన్నచో వర్ణవ్యవస్థకంటె యాశ్రమవ్యవస్థయొక్క ప్రాముఖ్యమును, దేటపడగలదు.

## ఈశ్వరీయవిభూతి - తత్ప్రాప్త్యుపాయము

భారతీయాశ్రమ విభాగము సమయవిభాగముపై నాధారపడియున్నది. వర్ణవిభాగమునందువలె నిందు గర్తలు నలువురుగాక యొకడే. అతడే నాల్గుస్వతంత్రకర్మలం జేయ వలయును. కాని, పరస్పరము భిన్నోద్దేశ్యములు కర్తవ్యతలు గల నాల్గుకర్మలు నొకేసమయమున గాజాలవు. కనుక జీవ నము నాల్గుభాగములుచేసి యాశ్రమవిభాగము సేయబడి నది. ఆత్మశక్తివికాసకములు, నైయక్తికపురుషార్థప్రద ములు నగు నాకర్మలేవియో చూతము.

మనుజు డావిశ్వవ్యాపకేశ్వర ప్రజాపతియొక్క యొక యంశ; "మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః" అని గీతావచనము. అంశియగునతడేకము. అంశలగుమనమనే కము. "అంశో నానావ్యపదేశాత్, అన్యథాచాపి, దాశకిత వాదిత్వమధీయతఏకే" (బ్రహ్మ।సూ।) అయినచో మాత్రా తారతమ్యమున నతనియందున్నశక్తులే మనయందు నుండ వలయునుగదా! అతనియందు జ్ఞానము - క్రియ - యను రెండు విభూతులున్నవి. (1) జ్ఞానము = బ్రహ్మ - సత్తు - అమృతము - రసము. (2) క్రియ = కర్మ - అసత్ -

మృత్యువు - బలము. ఇట్లు బ్రహ్మ - కర్మసముచ్చయమే సగుణేశ్వర ప్రజాపతి ప్రాతిస్వికస్వరూపము. (చూ బ్రహ్మ కర్మపరిచయము).

ఇయ్యదిమూడుసంస్థలందు వ్యాప్త మగుచున్నది. అవియుపనిషత్తులందు క్రమముగ (1) ఓంకారము (2) అహస్కారము, (3) అహంకారము అందురు. ఇదేక్రమముగ (1) ఈశ్వరుడు (2) జగత్తు (3) జీవుడు అనవచ్చును. మూడుగలిసి "సర్వము" (1) ఈశ్వరోపనిషత్తు (మూలప్రతిష్ఠ) ఓమ్, "తస్యోపనిషదోమితి" (2) జగదుపనిషత్తు 'అహః' "తస్యోపనిషదహరితి" (3) జీవునియుపనిషత్తు 'అహం' "తస్యోపనిషదహమితి".

ఈశ్వరసంస్థయందు బ్రహ్మ - కర్మలు (జ్ఞాన - క్రియలు) రెండును పూర్ణసమృద్ధములు, వీర్యయుక్తములు, వికసితములునై యున్నవి. కాని :—అవిద్యాప్రధాన - గుణమయీ - యోగమాయానుగ్రహమున, (శుక్రశోణిత మిథునభావప్రవిష్ట మగు నౌపపాతికాత్మరూప) జీవునందా రెండు నపూర్ణములు, అవికసితములు, నైనవి. అవిద్యాది దోషములవలన వీర్యభావమూలక వికాసవంచితములుగ నున్నవి. ఇందువలననే జీవుడు దుఃఖియయ్యెను. (చూ॥ ఆత్మవిజ్ఞానము.) జీవుడ నందఘనాంశయగుట నానందము గోరుట యితని స్వాభావికవృత్తి. కాని, యానందవికాస హేతుభూత జ్ఞాన - కర్మవిభూతు లవిద్యాగ్రస్తములగుట

వలన సతతము నానందకామనయుండియు వాస్తవికేశ్వరా నందవంచితుడే యగుచున్నాడు. "ఈశ్వరునివలెనితడును, నిత్యానందమూర్తి కావలయును. అల్పతామూలకము, కనుకనే దుఃఖమూలకమునగు సాంసారికవాతావరణములచే నిత్యము నాక్రాంతుడైయుండియు, బూర్ణతనుండి చలింపకుండవలయును. ఇతని స్వాభావికశాంతి ప్రతిష్ఠలకు బాధ రాకూడదు." ఇదేజీవుని పరమపురుషార్థము.

కాని:— భౌతికాక్రమణల నెదురుశక్తిలేదు. అవియే జయించుచుండును. జ్ఞానకర్మలువికసించి పూర్ణతనొందు నుపాయముదొరికినచో నీయాగంతు కాపూర్ణతపోయి, "పూర్ణమదఃపూర్ణమిదం" చరితార్థమగును. ఈపూర్ణదశకు వచ్చు నహంకారోపనిషల్లక్షణ జీవాత్మ, ఓంకారోపనిషల్లక్షణ పూర్ణేశ్వరునితో యుక్తుడై అహస్కారోపనిషల్లక్షణాధిభౌతికజగత్ప్రపంచములందు వ్యాప్తుడయ్యు నిత్యశాంతుడుగనే యుండును. కనుక పూర్ణశక్తిలాభార్థము, పూర్ణేశ్వరునే శరణందవలెను. ఏదియెచటలభించునో యచటికే పోవలయునుగదా! చివర కంశరూపజీవు డంశిరూపేశ్వరుని ఉప=సమీపమున, ఆసన=కూర్చుండుటవలననే (యుపాసనవలననే) శక్తిలబ్ధినొందగలడు.

అతనికడనున్న యాజ్ఞానకర్మశక్తుల యాగమనము లేక పూర్ణతయు, భూమాలక్షణానందము, కలుగుట యసంభవముకనుక జీవుడు తన కర్మభాగముచే నీశ్వరీయకర్మ

పాసనయు జ్ఞానభాగముచే నీశ్వరీయ జ్ఞానాశ్రయమును, స్వీకరింపవలయును. ఆ యీజంటల కంతర్యామసంబంధము గుదుర్పవలయును. "నేడుమాత్రము మన మాతనివిభూతి ద్వయమునంచితులమా? ఆతని యాశక్తులన్నియెడల సదా సమరూపమున వ్యాప్తము లేగదా!" యన్నచో :- తైల రంజితవస్త్రముతో సతతయుక్తమయ్యు, రంగు, వస్త్రము కంటె వేరగు దానివలెనున్నట్లు, అవిద్యారూపతైలా వరణము మధ్యస్థమై యుండుటచే నాశక్తుల స్వాభావికాగ మనము మన కేయుపకారమును గావింపజాలదు. శ్రద్ధ - ఉపనిషత్తు - విద్య మొదలగు నుపాయముల నెదుటనుంచికొని, యావరణము లందొలగించి, యాశక్తుల ననుగమింపవలసి యుండును. ఆయంతరాయతిమిరోపశాంతి కాగానే యా శక్తుల స్రోతస్సు మనయల్పశక్తుల స్రోతస్సునంగలిసిపోవును. అప్పుడు మనపురుషార్థసాధన సాఫల్యమగును.

> "ప్రతిబోధవిదితంమతం, అమృతత్వంహివిందతే
> ఆత్మనావిందతేవీర్యం, విద్యయావిందతేమృతం"

ఇందువ జీవాత్మకు (1) కర్మపురుషార్థము (2) జ్ఞాన పురుషార్థము నను రెండుపురుషార్థములు సిద్ధింపవలయును. పురుషార్థము క్రత్వర్థమున నగును. ఎట్లన:- పాకకర్మపురు షార్థము, తదర్థములగు నీరు, నిప్పు, పొయ్యి తండులాదులు మొదలగు వాని సంపాదనరూపములగు నవాంతరకర్మలు క్రత్వర్థములు. పాకకర్మక్రతువు. అదేపురుషార్థము. తదర్థ

కర్మక్రత్వర్థమన దగును. ఈసామాన్య పరిభాషంబట్టి జీవాత్మ కర్మ - జ్ఞాన - పురుషార్థములసాధనకు, క్రత్వర్థ లక్షణకర్మను క్రత్వర్థలక్షణజ్ఞానభావమును ఆశ్రయింప వలయును.

అట్లయిన "జ్ఞానపురుషార్థమునకు క్రత్వర్థనేదియ గును? కర్మపురుషార్థమునకు క్రత్వర్థనేది?" యన్నచో:- స్పష్టమే:- కర్మస్వరూప నిష్పత్తి జ్ఞానముననును, కర్మచేజ్ఞానో దయము నగు చుండును. పురుషార్థకర్మకు మూలా ధారము జ్ఞానము. పురుషార్థజ్ఞానమునకు మూలాధారము కర్మ. ఇట్లొకదానికొకటి యుద్దేశ్య - విధేయములగు పురు షార్థ క్రత్వర్థములుగ సాధన, సాధ్యములుగ జేసికొన్నచో చివరకు:- జ్ఞానము - కర్మ; కర్మ - జ్ఞానము; అని నాల్గు కర్తవ్యములై వీనిని మనజీవితమునందు సంపాదింపవలసి యుండును. అనగా:-

(1) ఉద్దేశ్యాత్మక - క్రత్వర్థలక్షణ - జ్ఞానము సాధనము
(2) విధేయాత్మక - పురుషార్థలక్షణ - కర్మ సాధ్యము
(3) ఉద్దేశ్యాత్మక - క్రత్వర్థలక్షణ - కర్మ సాధనము
(4) విధేయాత్మక - పురుషార్థలక్షణ జ్ఞానము - సాధ్యము

అని యిట్లు జ్ఞానకర్మచతుష్టయి యేర్పడును.

## ఆయుఃస్వరూపపరిచయము

భిన్నేతికర్తవ్యతలుగల యీనాల్గిటియనుష్ఠాన మొకే కాలమున యసంభవము. కనుక నాయువును నాల్గుభాగములు

గావింపవలయును. ఆయువెన్ని వత్సరములు? అర్థవాదము లను జెందిన పౌరాణికాయుర్విచారోపబృంహణము మన కిప్పుడప్రస్తుతము. ఒకటిమాత్రము జ్ఞప్తియందుంచదగినది. ఏమన:- అహో. మాససంవత్సరశబ్దములు నిలుకడలేని యర్థముగలవి. మనుష్యాయువుంగూర్చి వాడుకసేయు సంవత్సరమహస్సును జెప్పును. ఉదాహరణమునకు:- ఈఋషి 36000 వత్సరములుతపస్సు గావించె నన్నప్పుడు వానిని దినములుగ నెంచి నూరువత్సరము లనుకొనవలయును.

(1) సహస్రసంవత్సరం, తదాయుషామసంభవాత్ మనుష్యేషు (2) సంవత్సరోవిచాలిత్వాత్ (3) అహానివాభిసంఖ్యత్వాత్ అనుమీమాంసానూత్రిములును! "సంవత్సరశతం నృణాం పరమాయుర్నిరూపితమ్" [భాగ,]

"పుంసోవర్షశతంహ్యాయుః, తదర్ధంచాజితాత్మనః
నిష్ఫలంయదసౌరాత్ర్యాం, శేతేంధం ప్రాపితస్తమః, [భాగ]
"శతాయురుక్తః పురుషః, సర్వవేదేషు వైయదా,
నాప్నోత్యథచతత్సర్వం, ఆయుః కేనేహ హేతునా?
శతాయురుక్తః పురుషః శతవర్షశ్చజాయతే
కస్మాన్మ్రియంతేపురుషాః, బాలా అపిపితామహ!" [భారఅను]

ఇత్యాదిపౌరాణికైతిహాసికవచనములును, "శతాయుర్వైపురుషః శతవీర్యః" "శతవర్షాణిజీవ్యాసం" "శతం జీవశరదోవర్ధమానః, శతంహేమంతాన్ శతమువసంతాన్" ఇత్యాది శ్రౌతవచనములు నీవిషయమునకు బలమిచ్చుచున్నవి. - దోషవిశేషములచే మనుష్యుడీయవధిలోపలనే చచ్చుచున్నాడు. గాయత్రి - త్రైష్టుభ - జాగతస్తోమ

(యుగ్మస్తోమ) సమష్టిరూప 'ఛందోమా యాగముననో, ఆయుర్వేదోక్త కల్పాది ప్రయోగమువలననో, యోగశాస్త్రోక్త ప్రక్రియావిశేషముల వలననో, శతాధికవర్షములును కొందరు బ్రదుకుచున్నారు. కాని ప్రకృతిసామాన్యనియమానుసారము మనుష్యాయువు నూరువత్సరము లనియే యెంచబడినది.

ప్రకృతిచే నెన్ని యాయుస్సూత్రములు లభించునో, వానియాధారమున నూరువర్షములు జీవింపగలరు. జ్ఞానకర్మమయమగు నాత్మ, పాంచభౌతికశరీరమునం దుండునంతవరకు మనుజుడు బ్రదుకును. ఈయాత్మ రోదసీబ్రహ్మాండాధినాయకుడగు సూర్యునితో సంబంధముగలది కనుక ననగా:- సూర్యప్రత్యంశయగుటవలన నీయాత్మమనః ప్రాణవాఙ్మయ మని "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" "స వా ఏష ఆత్మా వాఙ్మయః ప్రాణమయో, మనోమయః" ఇత్యాదులచే స్పష్టము. పంచపర్వాత్మక ప్రకృతిమండలకేంద్ర*మం దున్న సర్వలోకసాక్షియు, మనఃప్రాణవాఙ్మయుడు నగు సూర్యునిద్వారా మనఃప్రాణవాఙ్మయమగు నీభూతాత్మ వికసిల్లెను. సూర్యదేవతయే తన యాయుర్భాగముచే పార్థివభూతాత్మయొక్క (జీవాత్మ) స్వరూపసంపాదనగావింపుచు నిందుపరిగణితాయుస్సూత్రమును బ్రతిష్ఠితముసేయుచున్నాడు.

---

* ఆదిత్యో వై విశ్వస్య హృదయమ్. [శత]

సూర్యుడు, 'జ్యోతిః, గౌః, ఆయుః,' అను మూడు మనోతాలుగల్గి యొప్పుచున్నాడు. ఇందు (1) జ్యోతిర్భాగమునుండి ముప్పదిముగ్గురు జ్యోతిర్మయప్రాణదేవతల వికాసమును, నీరిపరస్పరయజనము (సంగతికరణము)చే జ్యోతిష్టోమనామకమగు నట్టియు నేడుసంస్థలుగలట్టియు సంవత్సరయజ్ఞస్వరూపమును, నిష్పన్నమైనను. (2) గౌభాగమునుండి యగ్నిహోత్రమునలన భూతసృష్టి (మర్త్యసృష్టి) వికాసమయ్యెను. వీనిసమన్వయముచే గోష్టోమ మను యజ్ఞరూపము సంపన్నమయ్యెను. (3) ఆయుర్భాగమునుండి యాత్మసృష్టియు, ఆయుష్టోమమనుయజ్ఞమును కలిగెను.

దేవప్రాణాత్మక సౌరజ్యోతిష్టోమమునుండి యాధ్యాత్మిక దేవత లనబడునింద్రియముల వికాసమును, భూతాత్మక గోష్టోమమునుండి మనశరీరస్వరూపనిష్పత్తియు, నాయుర్మయ సౌరాయుష్టోమమునుండి భూతాత్మప్రతిష్ఠయు కల్గెను. ఇందు జ్యోతిర్భాగము ప్రాణప్రధానము, గౌభాగము వాక్ప్రధానము, ఆయుర్భాగముమనః ప్రధానము. మూటియందు నుమూడుసమన్వయ మొందియున్నను ప్రధాన తాప్రధానతా తారతమ్యముబట్టి యిట్లు చెప్పబడినదని యెరుంగవలయును. ఇట్లు సూర్యదేవతయు, జ్యోతిర్భాగముంబట్టి "ప్రాణః ప్రజానాముదయత్యేషసూర్యః" యనియు, భౌతిక వర్గప్రసవిత్రియగు గౌభాగముంబట్టి "నూనంజనాఃసూర్యేణ ప్రసూతాః"యనియు, మనః ప్రధానాయుర్భాగముం బట్టి "సూర్యఆత్మాజగతస్తస్థుషశ్చ" అనియు, జెప్పబడెను.

ఇందొకటి క్రియాశక్తిమయము, రెండవదియర్థశక్తి మయము, మూడవది జ్ఞానశక్తిమయము, కనుక మనకు వీని నుండియే జ్ఞాన క్రియార్థశక్తులు కల్గుచున్నవి. సూర్యుడే మనకు ప్రభవ - ప్రతిష్ఠా - పరాయణము. అతడు మనము నొకటే. "యోఽసావాదిత్యే పురుషః సోఽహమ్ యోఽహం సోఽసౌ, యోఽసౌ సోఽహం" ఇదే మనకును నతనికిని సంబంధము. ఆదాన ప్రదానాత్మకమగు నీసంబంధ మున్నంతవరకే జీవనయజ్ఞము సురక్షితముగ నుండును. ఈ స్వాభావిక యజ్ఞనిచ్ఛిత్తి పేరే మృత్యువు. ఈయజ్ఞసంబంధరక్షణయే జీవనము. ఈపరిలేఖుంజూడుడు:— అన్నిటియందు నన్నియు నున్ననుట మరువరాదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| జ్యోతిః | జ్యోతిష్టోమః | ప్రాణమయః | క్రియాప్రధానః | దేవసృష్టిః | ఇంద్రియవర్గం |
| గౌః | గోష్టోమః | వాఙ్మయః | అర్థప్రధానః | భూతసృష్టిః | శరీరస్వరూ॥ |
| ఆయుః | ఆయుష్టోమః | మనోమయః | జ్ఞానప్రధానః | ఆత్మసృష్టిః | ఆత్మస్వరూ॥ |

''సూర్యోబృహతీమధ్యూఢః తిష్ఠతి'' ''బృహద్ధతస్థౌ భువనేష్వంతః'' "మధ్యేఏకలఏవస్థాతా'' ఇత్యాదిశ్రౌతవచనములంబట్టి, జ్యోతిర్గౌరాయుమయుడును, జ్ఞాన - క్రియార్థ ప్రవర్తకుడు, నగు సూర్యదేవత 'బృహతీఛంద' కేంద్ర మందున్నాడు. (1) గాయత్రి (2) ఉష్ణిక్కు (3) అనుష్టుప్ (4) బృహతి (5) పంక్తి (6) త్రిష్టుప్ (7) జగతియను నీయేడుఛందస్సులే వర్తమానజ్యోతిశ్శాస్త్రమందు సప్తాహోరాత్ర (పూర్వాపర) వృత్తము లందురు. (చూ:-

ఉపనయనసంస్కారము) వీనిచే నహోరాత్రస్వరూప నివృ త్తియగుచున్నది. 'సప్తదేవచ్ఛందో విజ్ఞానముం'బట్టి యా యేడుఛందస్సులకు క్రమముగ నక్షరములిట్లుండును. పాదము×4=మొత్తము.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| గాయత్రి | ఉష్ణిక్కు | అనుష్టుప్ | బృహతి | పంక్తి | త్రిష్టుప్ | జగతీ |
| 6×4 | 7×4 | 8×4 | 9×4 | 10×4 | 11×4 | 12×4 |
| =24 | =28 | =32 | =36 | =40 | =44 | =48 |

ఇందు, బృహతి కేంద్రము. మూడుఛందస్సు లుత్తర ఖగోళమందును, మూడు దక్షిణగోళమునందును కలవు. ఈయేడుఛందస్సులే సూర్యాశ్వము లని మరియొకచో స్పష్టము. ప్రస్తుతము కావలసినది బృహతి. ఇందు మొత్తము 36 అక్షరములు, సూర్యు డిందుండుటంబట్టి ప్రతియక్షరము సూర్యుని మనోవాఙ్మయప్రాణమునకు బ్రతిష్ఠయైయున్నది. ఈసంబంధమున నాత్మరూపసౌరప్రాణమును 36 భాగము లగును. పిమ్మట 'వషట్కార×' సంబంధముగలట్టియు, 'అభిప్లవస్తోమ*' మునకు జెందినట్టియు, 'వాక్సాహస్రీ' యొక్క సంబంధమున 36 భాగములైన యాత్మరూపమగు ప్రతియొక సౌరప్రాణమును వేయి - వేయిభావములు గల దగును. ఈమంత్రముంజూడుడు :-

× వషట్కారస్వరూపము వేదపరిచయమున జూడవలయును.

* వషట్కారమండలమున (1) బృహత్సోమము (2) అభిప్లస్తోవ

"సహస్రధా పంచదశాన్యుక్థా యావద్ద్యావాపృథివీ తావదిత్తమ్ సహస్రధా మహిమానః సహస్రం, యావద్బ్రహ్మవిష్ఠితం తావతీవాక్

బుక్ 0, 114-8.

ఈసహస్రభావముంబట్టియే, సూర్యుఁడు సహస్రాంశు వందురు. సహస్రభావాత్మకములగు నీ సూర్యప్రాణములే మన 'ఆయుఃసాహస్రీ'కి స్వరూపసమర్థకములని 'ఆయుర్వై సహస్రమ్' యని కృష్ణశ్రుతి చెప్పను. అనగా:— సూర్యునందలి ఆయు వను మనోతా, పుగ్రోక్తములగు 36 బృహతీ ప్రాణములతోఁగూడి మొదట 36 భాగములై పిమ్మట వాక్సాహస్రీసంబంధమున ప్రత్యేకాయుః ప్రాణమును సహస్రభావ సంబంధమున 36000 గ బరిణతమగును. ఈసంఖ్యాసమష్టిని వైదికసంకేతభాషంబట్టి 'బృహతీసహస్ర' మందురు. బృహతి= బృహతీఛందము, దీనికి 36 అక్షరములు కనుక బృహతియన 36 దీనితో సహస్రముఁ జేర్చిన, 'బృహతీసహస్ర'మున కర్థము. 36000 లు అని యగును. ఆయుః ప్రాణమే ప్రాణులకు మిత్రము. విశ్వమునకు మిత్రము నగుటచే నీయాయుః ప్రాణము లేక బృహతీ ప్రాణము "విశ్వామిత్ర" శబ్దమున

మము, నని రెండుమస్తోములుండును. (1) వర్తులవృత్తాకారముఁగల, త్రివృత్ పంచదశ, సప్తదశ, ఏకవింశ, త్రిణవ. త్రయస్త్రింశస్తోమములు 'పృష్ఠ్యస్తోమములనియు ○ పిండకేంద్రమునుండి నలువైపుల రశ్మిరూపమున పరిధి వరకు బ్రసరించునట్టియు 36 వేల రశ్ములంబరిణతమగునట్టియు, బృహతీ సంబంధమున 36 భాగములగునట్టియు స్తోమ భిప్లవము, ఆయువునకు ఈ 36 అభిప్లవస్తోమములతో సంబంధము, ఇవే ఆయుస్స్వరూప సమర్థకములు, కనుక నిందు వషట్కారమండలమునకు జెందిన యభిప్లవస్తోమాత్మక. + వాక్సహస్రభావములనే గ్రహించితిమి. [విశేషములు వేదవిజ్ఞానమందు.

వ్యవహరింతురు. ఏమహర్షి మొదట నీసౌరేంద్రతత్త్వోపాసన (పరీక్ష)ద్వారా యీ ప్రాణమును సాక్షాత్కరించుకొనునో ఆయన 'విశ్వామిత్రుఁ' డని పేరొందెను. విశ్వామిత్రఋషి ద్వారాదృష్టమగు నీవిశ్వామిత్ర ప్రాణ దిగ్దర్శనముగావింపుచు నైతరేయుడిట్లు చెప్పుచున్నాడు :—

విశ్వామిత్రం హ్యేతదహః, శంసిష్యన్తమింద్రఉపనిషసాద।

సహోన్నమిత్యభివ్యాహృత్య. బృహతీసహస్రం శశంస। తేనేంద్రస్య ప్రియం ధామోపేయాయ। తమింద్రఉవాచ _ ఋషే!. ప్రియం వైధామోపాగాః. సవాఋషేద్వితీయంశంసేతి। సహోన్నమిత్యేవాభివ్యాహృత్య బృహతీసహస్రం. శశంస। తేనేంద్రస్యప్రియంధామోపేయాయ। తమింద్ర ఉవాచ – ఋషే! ప్రియంవైధామోపాగాః। సవాఋషే | తృతీయంశ సేతి। సహోన్నమిత్యేవాభివ్యాహృత్య బృహతీసహస్రంశశంస। తేనేంద్రస్య ప్రియంధామోపేయాయ। తమింద్ర ఉవాచ – ఋషే | ప్రియం వైధామోపాగాః। వరం తేదదామీతి। సహోవాచ, త్వామేవజానీయామితి। తమింద్ర ఉవాచ – ప్రాణోవా అహమస్మిఋషే! ప్రాణఃత్వం, ప్రాణః సర్వాణిభూతాని, ప్రాణోహ్యేష, యఏషతపతి। సఏతేనరూపేణ సర్వాదిశోవిష్టోస్మి। తస్యమేన్నం మిత్రం దక్షిణం, తద్వైశ్వామిత్రమేష తపన్నేవాస్మీతిహోవాచ।

తద్వాఇదం బృహతీసహస్రం సంపన్నమ్, తస్యయానివ్యంజదాని తచ్ఛరీరమ్, యోఘోషసఆత్మా, యఊష్మాణః సప్రాణః ఏతద్ధస్మవై తద్విద్వాన్ వసిష్ఠోవసిష్ఠోబభూవ, తతఏతన్నామధేయం లేభే ఏతదుహైవేంద్రో విశ్వామిత్రాయప్రోవాచ ఏతదుహైవేంద్రోభరద్వాజాయ ప్రోవాచ తస్మాత్ సతేనబంధునా, యజ్ఞేషుహూయతే॥

తద్వా ఇదంబృహతీ సహస్రంసంపన్నమ్ తస్యావా ఏతస్యబృహతీ సహస్రస్య సంపన్నస్య షట్ త్రింశతమక్షరాణాం సహస్రాణిభవన్తి వ్యంజనైరేవరాత్రీరాప్నువన్తి, స్వరైరహాని.

తద్వా ఇదంబృహతీ సహస్రంసంపన్నం. తస్యవా ఏతస్యబృహతీస హస్రస్యసంపన్నస్య పరస్తాత్ విజ్ఞానమయో, దేవతామయో, బ్రహ్మమయో మృతమయః సంభూయదేవతా అప్యేతియ ఏవం వేద, తద్యోహం సో సౌ,యో సౌ సోహం, ఏతదుహైవ ప్రేక్షేత ఉపేక్షేత.

[ఐతరేయారణ్యకము]

ఈ శ్రుత్యర్థము మరొకచో జూడనలయును. ఇచ్చట సామాన్యముగ తెలిసికొందము:— "ఒకప్పు డింద్రుని స్వరూప పరిజ్ఞానమునకై విశ్వామిత్రుడు బృహతీఛందో ఛందితములగు వేయిమంత్రములచే 'అవివాక్యమహః' యను నింద్రాన్నభూతమగు 'మహావ్రత' మను 'అహ'శ్శంసనము చేసెను. దానితో నింద్రుడు ప్రసన్నుడై విశ్వామిత్రుని యొద్దకువచ్చి "ఋషీ! సంతోషించితిని, మరల నీవు రెండుమారులాబృహతీ సహస్రముతో శంసన కర్మ సేయుము" అనుటయు నత డట్లేచేసెను. అప్పుడు సంతుష్టుడై యింద్రుడు "నీయిష్టవరముంగోరు" మనవుడు నతడు "నిన్నె యెరుంగుదును గాక!" యనియెను. ఇంద్ర డిట్లు చెప్పనొడగెను. "నేను (బృహతసహస్రాత్మక) ప్రాణము నేనైయున్నాను. నీవును ప్రాణమవే, భూతములన్నియు ప్రాణాత్మకములు. తపించునీతడు (సూర్యుడు) ప్రాణమూర్తి. తన ప్రాణరూపమున నన్ని దిక్కులందును వ్యాపించుచున్నాడు. (నేంద్రాద్య

తేపవతేధామకించన) ప్రాణ మగు నాకు బృహతీసహస్రాత్మక మహావ్రతలకు ణాన్నము పరమమిత్రము. దానిచే నేను విశ్వామిత్రుడనై యున్నాను. ఈరూపమున నే నేను వెల్గు (తపించు)చున్నాను, శబ్దాత్మకబృహతీసహస్రము లోని వ్యంజనములు శరీరము, స్వరములాత్మ. శబ్దోష్మాదానభూతోష్మ (అగ్ని) ప్రాణము. ఈవిశ్వామిత్ర ప్రాణపరిజ్ఞానము నను, ఉపాసనచేతను వసిష్ఠుఖు వసిష్ఠుడయ్యెను. (వసీయాః)"

స్వయముగ నింద్రుడు విశ్వామిత్రునకును, భరద్వాజునకు, నీ ప్రాణమును స్పష్టపరచెను. ఈబృహతీ సహస్రమందు 36000 అక్షరములుండును. 100 సంవత్సరములందలి దినములునింతే. వ్యంజనములచే రాత్రులు, స్వరములచే పగళ్లు బ్రాప్తించును. బృహతీసహస్రాత్మక మగు నీ ప్రాణము ప్రజ్ఞామయము, బ్రహ్మమయము, అమృతమయము, నై యున్నది. దీని నెరింగివాడు పూర్ణాయువగును. ఈ ప్రాణభేద సంబంధమున నేను (ఆధ్యాత్మిక ప్రాణము) అతడు (సౌరాధ్యాత్మిక ప్రాణము) నొకటే. | గురుముఖమున నీ ప్రాణరహస్యము మఱి, మఱి యెరుంగవలయును. |

శ్రుతి, మూడుబృహతీసహస్రములను జెప్పెను ఏల యన:- ఆయువువలన సంపన్నమగు నాత్మ మనఃప్రాణవాఙ్మయము. దీని ప్రతియొక కళయు బృహతీసహస్రయుక్తము. సూర్యునుండి యొక్కొక బృహతీసహస్రము (జ్ఞాన, క్రియార్థ కళారూపమున) మనకు లభించుచున్నది. కనుక శ్వావి

మిత్రునిద్వారా మున్మూరు బృహతీ సహస్రశంసనము జూపెను. మనః ప్రాణవాక్కులు పరస్పర మవినాభూత ములు. కనుక బిమ్మట మూడుగలిసి యొకటిగ బరిణతి గాంచును. ఈవాజసనేయవచనము చూడుడు.

"తదిదంమనః సృష్టమావిరబుభూషత్ - నిరుక్తతరం మూర్తతరం। తదాత్మానమన్వైచ్ఛత్ - తత్తపోపస్యత - తత్ప్రామూర్ఛత్ - తత్ షట్ త్రింశతం - సహస్రాణ్యపశ్యత్ - ఆత్మనోగ్నీనర్కాన్, మనోమయాన్ మనశ్చితః........ సేయంవాక్ సృష్టారావిరబుభూషత్ ............ సాప్రామూర్ఛత్ - సాషట్త్రింశతం సహస్రాణ్యపశ్యత్ ........వాఙ్మయాన్......1 సేయంప్రాణ సృష్ట ఆవిఃబుభూషత్ ...... సప్రామూర్ఛత్ - సషట్త్రిం శత-సహస్రాణ్యపశ్యత్ ...... ప్రాణమయాన్। తేసామేకైకఏవతావాన్, యావానసౌపూర్వః (శత)

ఇట్లు:—మనః ప్రాణవాఙ్మయము, బృహతీసహస్ర పరిమితమునగు నాయురూప సౌర ప్రాణమే, మనయాధ్యాత్మిక సంస్థయందు, ప్రతిదినమును, మనః ప్రాణవాఙ్మయమగు నాత్మస్వరూప రక్షకొరకు మనః ప్రాణ వాఙ్మయమగు నొక్కొక యాయుస్సూత్రము నొసగుచున్నది. ఒక యహోరాత్రమున నొకటి చొప్పున 36000 అహోరాత్ర ములందు మొత్తమన్నియు భుక్తముకాగా, బిమ్మట నిధనము కల్గుచున్నది. ఇట్లు మనుష్యాయువు 100 సంవత్సరములు 36000 అహోరాత్రములుగా వేదమున బరిగణింపబడినది. ఈ యాయుఃకాలమున బూర్వోక్త క్రత్వర్థ - పురుషార్థలక్షణ జ్ఞానకర్మ చతుష్టయీస్వరూపసంపాదన సేయవలసియున్నది.

# ఆశ్రమవిభాగ పరౌలికత్వము

I

కర్మ - జ్ఞానపురుషార్థ స్వరూపములు పరస్పరభిన్నము లగుటచే సహానుష్ఠాన మసంభవ మని మహర్షులు మనుష్యా యువును మొదట 50-50. చొప్పున రెండు భాగములు గావించి మొదటిభాగము కర్మ ప్రధానముగ, రెండవ భాగము జ్ఞాన ప్రధానముగ నెంచిరి. పాంచభౌతిక విశ్వ మందు స్థూలమగుకర్మకు ప్రాథమ్యము సూక్ష్మమగు జ్ఞాన మున కాకర్మమయ విశ్వగర్భనిగూఢతయు గలదు. ఈ స్థూలారుంధతీన్యాయముంబట్టి మొదట గర్మానుష్ఠానమున కును, దానియనంతరము జ్ఞానానుష్ఠానమునకును, స్థానమీయ బడినది. అట్లుగావించు మనుజుడు కర్మ - జ్ఞానశక్తుల వికా సమునొంది వ్యక్తిత్వమున బూర్ణస్వతంత్రుడై యాపూర్ణేశ్వ రుని పూర్ణతంబొంది కృతకృత్యుడు కాగలడని యభి ప్రాయము.

కాని, వెనుక తృతీయపరిచ్ఛేదమున జెప్పిన యొక సమస్యం గొంచెము వివరింపవలయును- కర్మ - జ్ఞానములు రెండును తమతమ స్వరూపసిద్ధికి బరస్పరసహయోగ మెల్ల ప్పుడు నపేక్షించును. జ్ఞానములేని కర్మప్రవృత్తియు, కర్మ లేని జ్ఞానవికాసమును, అసంభవములు. జ్ఞానమువలయుచో గ్రంథావలోకన గురూపదేశ శ్రవణాది కర్మానుష్ఠానము గావలయును. మరల నిదియుజ్ఞానమును మూలముగాగొనియే చేయవలయును. మొదట, యోగ్యతాలక్షణజ్ఞానములేకుండ

నది సాగదుకదా! జ్ఞానమెంతయున్న, గర్మ కంతవికాసము
లభింపగలదు కనుక:— పూర్వాయువున గావింపనున్న
వ్యక్తిపురుషార్థలక్షణ కర్మానుష్ఠానమునకు మొదట తదు
చితయోగ్యతకు జ్ఞానసంపాదన యావశ్యకము కనుక మొదట
జ్ఞానచర్యాశ్రమమును స్వీకరింపవలయును. ఈ ప్రాకృతిక
స్థితిని లక్ష్యమునందుంచుకొని ఋషులు పూర్వాయువు 50
వర్షములను (1) సాధనలక్షణ జ్ఞానచర్యను, (2) సాధ్య
లక్షణ కర్మచర్యను అపేక్షించి 25-25 గ రెండు భాగములు
గావించిరి. మొదటి 25 వత్సరములందు కర్మకర్తృత్వ
యోగ్యతాలక్షణ జ్ఞానము నార్జించును. ఈజ్ఞానము కర్మ
కుపకారక మగు సాధనముగ నెన్నబడినది. ఏతదుపకృతకర్మ
సాధ్య మనబడును. సాధనము క్రత్వర్థమగుటచే గౌణము
గను, సాధ్యముపురుషార్థమగుటచే ప్రధానముగ నుండును.

జ్ఞానము (బ్రహ్మ) మొదటి 25 వత్సరములందు దీని
చర్య ననుగమింపవలయును గనుక నీ ప్రథమాశ్రమమును
బ్రహ్మచర్యాశ్రమమందురు ఇందు ద్విజాతిబాలుడు ఋషికుల
ముననుండి విశేషనియమపాలనమున జ్ఞానమునార్జించును. 25 వ
వర్షమున సమావర్తన సంస్కారము కాగా స్నాతకుడై
తిరిగివచ్చి యా సంచితజ్ఞానాధారమున బురుషార్థలక్షణ
గృహస్థకర్మ ప్రవృత్తుడై 'గృహమేధి'యగును. ఈకర్మ
ధార రెండవ 25 వత్సరముల చివరవరకు అనగా 50 వరకు
బ్రవాహితమగును. ఇదే గృహస్థాశ్రమము రెండవది. దీనితో
సాధకుని కర్మభాగము కృతకృత్యతనొందును.

ఇట్లే జ్ఞానానుగతమగు నుత్తరాయువగు 50 వర్ష ములును రెండుభాగములు గావింపబడెను. అందు మొదటిది వానప్రస్థాశ్రమము. రెండవది సంన్యాసాశ్రమము. ఈవిధ ముగ జ్ఞానకర్మల యన్యోన్యాశ్రయమున కర్మాశ్రమ - జ్ఞానాశ్రమములకు (1) సాధనజ్ఞానాశ్రమము (బ్రహ్మ చర్యము) (2) సాధ్యకర్మాశ్రమము (గార్హస్థ్యము) (3) సాధనకర్మాశ్రమము (వానప్రస్థము) (4) సాధ్యజ్ఞానాశ్ర మము. అని నాలుగవాంతర భేదములగుచున్నవి. అందు మొదట:—

## కర్మాశ్రమమీమాంస

చూతము :—"అందరికిని కర్మలందును సమా నాధికారము కలద"నునది యీవరకే నిరాకరింపబడినది. నాల్గువర్ణములకర్మలును నియతములు. ఆశ్రమవ్యవస్థా విధానము త్రైవర్ణికులకుమాత్రమే. నాలవవర్ణము త్రైవర్ణిక పరిచర్యచేతనే స్వపురుషార్థసిద్ధినొందగలదు. ఈవిషయము ముందు తేటపడును.

ఏకర్మయందైన బ్రవృత్తుడగుటకు తదనుకూల యోగ్యతాలక్షణమగు నధికార ముండవలయును. దానిని వైదికభాషయందు దీక్ష యందురు. దీక్షాయుక్తాధికారి దీక్షితుడు. నాలుగాశ్రమములందును మొదటిదగు బ్రహ్మ

చర్యాశ్రమమనే దీక్షాశ్రమము. ఈయాశ్రమదీక్షితు డగు వాడు తనవర్ణధర్మానుకూల కర్మయందు యథాధికార ప్రవృత్తుడై తనపురుషార్థకర్మ సఫలతంగాంచును.

పురుషోపకారకము పురుషార్థకర్మ. ఇది ధర్మార్థ కామమోక్షములని నాల్గుభాగములు. ఈనాల్గుకర్మల తారతమ్యవిచారణసేయుచో ధర్మార్థములు సాధనకోటికిని, కామ (సుఖ–సమృద్ధి) మోక్షములు (నిఃశ్రేయసము–శాంతి) సాధ్యకోటికిని జెంది వరుసగా నొక జతపురుషార్థము నొకజంట పురుషార్థము నగును. ధర్మార్థములందు ధర్మము విశేష మహాత్వముగలది. ఏలయన దానివలన దక్కిన మూడులభించును. ఇక నర్థముచే కామము, మోక్షసాధనధర్మమును, సంపాదింపవచ్చును అర్థముతో నెట్లయిన కామప్రాప్తి సంభవమేమోకాని, ధర్మమువలె నిదిమోక్షమునకు సాక్షాత్సాధనము మాత్రము కాజాలదు. కనుకనే శ్రుతి "నామృతత్వస్యాశాస్తివిత్తేన" యని చెప్పెను. కాని పరంపరగ మోక్షసాధన మర్థమనుటకు సందేహములేదు. సాక్షాత్తుగ ధర్మకామములకు మాత్రము సాధనము. ఈవచనముం జూడుము :—

"అథవందుర్బలం ప్రాహుః ధనేనబలవాన్ భవేత్
సర్వంధనవతాం ప్రాప్యం, సర్వంతరతికోశవాన్
కోశేనధర్మః కామశ్చ పరలోకస్తథాహ్యయం
తంచధర్మేణలిప్సేత, నాధర్మేణకదాచన ॥ (భార; శాంతి)

ధర్మమన్నిటికి నుపకారకము సర్వోత్తమమునై యున్నది. దానివలన నభ్యుదయము నిశ్శ్రేయసమును సిద్ధించును. కనుక పరమపురుషార్థము. కనుకనే శ్రుతియు: "తస్మాద్ధర్మం పరమంవదన్తి" అనియెను.

"ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష, నచకశ్చిచ్ఛృణోతిమే
ధర్మాదర్థశ్చకామశ్చ, సకిమర్థంనసేవ్యతే? (వ్యాసః)

కామము, ఐహికము – ఆముష్మికము నని రెండు భాగములు. లౌకికనైయుక్తికసుఖము మొదటిది, రెండవది పారలౌకికస్వర్గసుఖము. / మోక్ష మను నానంద మీరెంటి కంటె వేరై నిశ్శ్రేయసమను పేరుగలది. | కామముక్తుడు ధర్మాచరణము గావించుచున్నను నిష్కామలక్షణముగల మోక్షమున కధికారికాజాలడు. 'నకామకామీ' (గీత) నిష్కామధర్మాచరణమే మోక్షప్రాప్తికి ప్రధానసాధనము.

ధర్మతత్త్వమెంతో విలక్షణము, కొంత యీవరకు చెప్పబడినది. అయినను దీని, సర్వథావిలక్షణమగు నొక పరిభాషంగొంచెము విన్నగోరెదము:— ఇసుకపై బాదముంచి నచో నందు బాదముద్ర యేర్పడునట్లు ప్రతియొక కర్మానుష్ఠానముచేతను, ఆత్మయందు, అనగా :-

ప్రజ్ఞానాత్మయను సర్వేంద్రియము లేక నిరింద్రియ మగు మనస్సునందు, గర్మజన్యమగునొక యతిశయముప్పతిల్లి యందేవసించుచు, "వాసనాసంస్కార" మనబరగుచున్నది దీనిపేరే 'ధర్మము' ఏలయన:- పూర్వజన్మమందో యీ

జన్మమందో చేసినసంచిత సంస్కారముల యుక్తము (పుంజము) చేతనే మనస్స్వరూపము ధృఢమైయున్నది. ధృతిలక్షణమగు నీధారాకర్మ (వాసనాసంస్కారము) కర్మనుండిపుట్టినది. అనగా నిదికర్మయొక్క యవస్థావిశేషము, లేక రెండవ యవస్థయైయున్నది. కనుక దీనిని గూడకర్మయే యందుము. ఈకర్మ (ధర్మరూపవాసనాసంస్కారము) కర్మాత్మయందు బీజరూపముననుండి యైహికాముష్మికములగు నర్థకామము లకు సాధనమగుచున్నది.

కొన్నికర్మలు (బుద్ధిపూర్వకముగ నాలోచించిచేయ బడునవి) జ్ఞానపూర్వకములును, కొన్ని మానసరుచిప్రాబలా కర్షణమున నజ్ఞానపూర్వకములుగ (అజ్ఞానయుక్తజ్ఞానలక్షణ మోహపూర్వకములుగ) నగునవిగ నుండును. ఈరెండు తెరగుల కర్మలనుండియు, క్రమముగ శుభా[1]శుభ[2] సంస్కారములుపుట్టి ధర్మా[1]ధర్మ[2]ముల నబడుచు, నాత్మవికాసమునకు నవనతికి గారణములగుచున్నవి. కనుక :-

మనయైహికాముష్మికకర్మలు మోహపూర్వకములై యశుభసంస్కారజనకములై సర్వనాశకారణములు కాకూడదనియు, జ్ఞానపూర్వకములై అభ్యుదయమూలక శుభసంస్కారజనకములై యుండదగుననియు నెంచి మనధర్మాచార్యులు, పూర్వాయుఃపూర్వభాగమున కర్మోపయుక్త జ్ఞానము సంగ్రహింపవలయుననియు, అదే బ్రహ్మచర్యా

శ్రమము సుననియు, నట్లుగావింపనినాడు మీగార్హస్థ్య కర్మ
కలాపము ప్రకృతి విరుద్ధమై యాత్మపతన కారణ మగుననియు
నాదేశించిరి. యీవచనముం జూడుడు.

"జ్ఞాత్వా కర్మాణి కుర్వీత నాజ్ఞాత్వా కర్మ ఆచరేత్
అజ్ఞానేన ప్రవృత్తస్య ఫలసంస్యాత్ పదేపదే"

వాసనాత్మకసంస్కారము ధర్మమంటిమి. అది యుక్త
రూపపరిణతినొంది, జాత్యాయుర్భోగ ప్రవర్తక మగును.
కర్మనుబట్టియే అనగా:— (వాసనాలక్షణ సంచితసంస్కా
రాత్మక - ధర్మానుసార ముత్తమ మధ్యమాధమ యోనియు
(జాతి), భోగము (అర్థ - కామములు), ఆయువులభించు
చున్నవి. ఏకర్మకేదియుదర్కము ? కర్మలందవాంతర భేదము
లేమి ? అను నిత్యాదులు మరొకచో జూచుకొందము. ప్రస్తు
తము శుభోదర్కముకొరకు మొదటి 25 వత్సరములందు,
జ్ఞానలక్షణ బ్రహ్మచర్యము ననుగమింపవలయు ననియే.
ఇట్లు కర్మోపయుక్త- క్రత్వర్థలక్షణ జ్ఞానసంగ్రహానంతరము-
26 న యేట గార్హస్థ్య ప్రవేశము జేసి విద్యాసాపేక్ష యజ్ఞత
పోదానలక్షణ ప్రవృత్తికర్మల ద్వారా దేవస్వర్గమునో,
విద్యానిరపేక్ష - ఇష్టా-పూర్త-దత్తలక్షణ ప్రవృత్తికర్మల
ద్వారా పితృస్వర్గమునో, లౌకిక, కౌటుంబిక, సామాజిక -
రాష్ట్రీయ, కర్మలద్వారా తత్తత్సమృద్ధినో, కాంక్షింపుచు,
జ్ఞానపూర్వకముగ గృహ్యకర్మప్రవృత్తుడగును, ఇట్లు 50
వత్సరములుగడువగా కర్మసంపత్తిపూర్ణమై ఆధ్యాత్మికకర్మ

యం దీశ్వరీయకర్మ వీర్యపూర్ణతాధానముకాగా, నాత్మ యొక్క కర్మభాగమన్ని విధముల బరిపూర్ణమై కర్మాశ్రమము సఫలతగాంచును. ఆయురర్ధభాగము సమాప్తమగును. పిమ్మట :—

## జ్ఞానాశ్రమమీమాంస

ఆయురుత్తరభాగమున జ్ఞానసాధన సేయవలయును. జ్ఞానములేనికర్మవలె గర్మలేని జ్ఞానము ననుపపన్నమే. పురుషార్థరూపమగు నీసాధ్యజ్ఞానసిద్ధికి, సాధకునకు, గ్రత్వర్థరూపకర్మ ననుగమింపవలయును. జ్ఞానసాధకమగు నీకర్మాశ్రమమును వానప్రస్థాశ్రమ మందురు. ఇందు కర్మగౌణము జ్ఞానము ప్రధానము. ఆత్మయుత్తరోత్తరము నిష్కామభావమునంక కగ్రేసరమగుచు జ్ఞానమును సమీపించునట్టి కర్మలనే ఈయాశ్రమం దనుగమింపవలయును. కనుక నిందలి కర్మకలాపముం గర్మయనక తపశ్చర్య యందురు. గార్హస్థ్యకర్మయు, నిదియు కర్మత్వముచే గర్మలేకాని, అది కర్మలక్షణకర్మ ఇదితపోలక్షణకర్మ. ఈరెంటిస్వరూపమునను గొప్ప భేదముకలదు. అదిసకామము, ఇదినిష్కామము. అందు పుత్రకళత్ర – బంధు – బాంధవ – జాతిసమాజ – రాష్ట్రాది – వాఙ్మయ భౌతికపరిగ్రహసంగ్రహ మున్నది. ఇందీ యన్నిటికి విముక్తియున్నది. అదిసాంసారికవస్తువు,

సమూహకలకలసాపేక్షగలది. ఇది యందునవ్యతిరేకము. "అర తిర్జనసంసది"

కామన, వాక్కున కనుగ్రాహకము. కనుక వాఙ్మయ సకామ కర్మప్రవర్తకము. ఈకర్మను శ్రమ యందురు. నిష్కామభావమునకు వాక్ప్రపంచమందాసక్తి యుండక, ప్రాణప్రధానకర్మసంగ్రహణమే యుండును. విశుద్ధప్రాణ మసంగము. కనుక వన్యకర్మయసంగము. అదితపస్సు అందురు. ప్రకరణారంభమున నాశ్రమకర్మలన్నియు తపో లక్షణము లంటిమి. కాని, అవ్యాప్తి, అవ్యవసితములు, అశాస్త్రీయములు. విశుద్ధభౌతిక - వాఙ్మయ - శ్రమరూప లౌకికకర్మములకంటె నాశ్రమకర్మలు తపఃకర్మ లనుటకు మాత్రము పనికివచ్చును. ఇక నాశ్రమకర్మలందు దారత మ్యమెంచుచో గృహ్యకర్మలు శ్రమలక్షణములనియు, వన్య కర్మలు తపోలక్షణకర్మ లనియు నెంచబడును. అవియాదాన లక్షణములు. ఇవి త్యాగలక్షణములు నని "ఏతద్వైతప ఇత్యాహుః, యత్ స్వందదాతి" యనునీ శ్రౌతతపోలక్షణ ముచే స్పష్టము.

వనస్థతపస్వి, లోకసంగ్రహదృష్టితో నైహికాముష్మి కములగు నన్నికర్మలందు ప్రవర్తిల్లును గాని నిష్కామ భావమున నుండును. ఏలయన నాభావములేనిచో జ్ఞానో దయ మసంభవము. అట్టి యీతపఃకర్మ నివృత్తిప్రధానమై యొకవిధముగ జ్ఞానోపాసనయే యగును. అందుచే సాధకుడు

జ్ఞానసామీప్యము గాంచుచుండును. ప్రకారాంతరమున గృహకర్మ, కర్మకాండయు, వన్యకర్మ, ఉపాసనాకాండయు, నది ప్రవృత్తిమార్గము నిది నివృత్తిమార్గము నైయున్నవి, మను వీరెండు కర్మమార్గములును వేదసిద్ధములనియెను. "ప్రవృత్తంచనివృత్తంచద్వివిధంకర్మ"

"వన్యకర్మలుజ్ఞానార్థములు, జ్ఞానోదయసాధకములు, అసంగజ్ఞానయుక్తములు, కనుక సంస్కారలేపబంధనమునకు గారణములుకావు గాన బంధకారణములు కాకపోవచ్చును కాని 'జ్ఞానార్థమాదిష్టము' లను దృష్టితో వీనిని నిష్కామములనజెల్లునా ? యన్నచో జ్ఞానరూపనైష్కర్మ్యసంపత్తి సాధకము లగుటచే "తాచ్ఛబ్ద్యన్యాయమున వీనిని నిష్కామము లన దగును. మరియును:– "సర్వంకామస్యచేష్టితం" అను మనువచనముబట్టి కామనలేని కర్మయసంభవము. వన్య కర్మలు నీప్రాకృతికదృష్టితో సకామములేయగును. కాని, కామనకు ఫలమగు నాసక్తి వీనియందులేదు కనుక నిష్కాము ములనుట యన్వర్థమే.

ఒకసద్గృహస్థుడు యథాశాస్త్రముగ తనయాశ్రమ మర్యాదలను పాలింపుచు 50 వయస్సుకలవాడగునాటికి తని పుత్రుడు బ్రహ్మచర్యాశ్రమము ముగించి కర్మమార్గ యోగ్యతతోవచ్చెను, "అనాయకావినశ్యంతి నశ్యన్తిబహు నాయకా" యన్న నైతికదృష్టితో జూచిన నొకయింట బెక్కరిపెత్తన ముండరాదు. యువకుడు గృహాధికారి

కాంగోపట సహజము. కనుక నేకవి త్తమున కిరువురకు భా క్తృ త్వ ప్రతిస్పర్ధ యుదయించు నవకాశముగల కుటుంబము మర్యాదచెడి క్లేశముపాలగును, ఈస్థితిలో కొడుకునకు బె త్తన మిచ్చి తండ్రి 'ననంపంచాశతో ప్రజే త్'నన్యాయనుుంబట్టి నై నొలగుట యుచితము. అందువలన నేవిధమగు నశాంతి యాశంకయు నుండదు.

ఆర్థికసంకట గ్ర స్తమగు నేటిభారతీయ సమాజము సంతాననిగ్రహవ్యాకులతతో బనిలేకుండ నీవ్యవస్థచే జరితార్థముకాగలదు. "అలసులు, మందబుద్ధులు లల్పతరాయువులుగ్రరోగసంకలితులు మందభాగ్యలు సుకర్మములెవ్వియు జేయజాల'ని సంతతికంటె, తన్నిగ్రహమునుంచిదనుకొని యల్ప హేతువులుచూపువారికి:— ఆశ్రమమర్యాదలు చెడుటచే ననలంబింపబడు నీకృత్రిమసాధనములు నౌషధములుసు, రోగనాశమునకుబదులు సర్వనాశమునకు గారణములగు చున్నవని మాత్రము చెప్పెదము.

ఆహారవిహారాదులం దనియమితత్వము, జ్ఞానచర్య బొత్తిగాలేకుండుట, కామనకు త్తేజకములగు భౌతికసంపత్తులందు దుర్దాంతలాలసత్వము, ఇంద్రియసంయమనము నందు పరాఙ్ముఖత్వము, కామభోగపరాయణులు, నైషయికులు నగు బుద్ధిమంతుల యనుగ్రహమున నటనటయంతటను విలసిల్లుకామో త్తేజకములగు నావిష్కారముల ప్రాచుర్యము, ఇత్యాదిముఖ్యకారణములు, సంతాననిగ్రహమును దుడుప

యోగముగావించునవై యున్నవని సిద్ధము. ఇంతేకాదు. నే డీసాధనములు పరోక్షముగా విషయవాసనాసమృద్ధికారక ములే. యగుచున్నవి. మాతృపదమునకు ప్రధానశత్రువు లును, స్త్రీపురుషుల శిష్టవీర్యనాశకములును నగు నీసాధన ములే 'సంతాననిగ్రహ'మగుచో "ప్రాయఃసమాపన్నవిపత్తి కాలే ధియోఽపిపుంసాం మలినాభవన్తి" యనుటకంటె నేమియుననజాలము, ఇక:—

## ఆశ్రమవ్యవస్థా కౌశలము

చూతము, బాలుడు, 25 సం॥ వరకు గుత్సితవాసనలు లేని ఋషికులమునందు, శాంతవాతావరణమున జక్కగా బెరుగును. శుక్రరక్షణ కితరసాధములన్నిటికంటె జ్ఞాన యజ్ఞము (స్వాధ్యాయము) పరమోత్కృష్టసాధనము. భుక్తా న్నము రసాసృఙ్మాంసాది ధాతువులుగ బరిణమించుచు, సప్తను శ్రేణియందు శుక్రరూపమున బరిణమించును, ఈశుక్రసో మహోమమునకు, లేదా, వినిర్గమమునకు నాహవనీయకుండ రూపద్వారములు మూడు. (1) యోషిదగ్ని (శోణితాగ్ని (2) ప్రాణాగ్ని (శరీరస్థవైశ్వానరాగ్ని) (3) జ్ఞానాగ్ని (బుద్ధి రూపసౌరసావిత్రాగ్ని). ఇందు, మొదటి యగ్నియందు, హోతకు బ్రజోత్పత్తిలాభము. అతడధోరేతసుడనబడును.

రెండవయగ్నియందు హోతకు శరీరపుష్టిలాభము. అతనిని తిర్యగ్రేతసుడందురు. మూడవయగ్నియందుహోతకు

జ్ఞానవృద్ధి. యతనిని ఊర్ధ్వరేతసుడందురు. ఇందు మొదటి రెండుమార్గములం గట్టివేయగా ననరుద్ధమగు శుక్రము 'ఓజస్సు'రూపమున బరిణమించును. బ్రహ్మచారి కిదిమూల ప్రతిష్ఠ. ఆయోజోత్తరావస్థ సౌమ్యమనస్సు. ఇట్లు:—శుక్ర తృతీయావస్థారూపమగుమనస్సు జ్ఞానశక్తిమయవిజ్ఞాన (బుద్ధి) సహాయమున జ్ఞానాగ్నియం దాహుతమగుచుండును. మరొక మార్గమున శుక్రక్షయమగుచో నోజస్సు ఇంచుమించు నశించును. మానసవికాసముతగ్గి, జ్ఞానయజ్ఞ మసంభవ మగును. కనుకనే ఈబ్రహ్మ (జ్ఞాన) చర్యాశ్రమమున శుక్రరక్షకు విశేషమహత్త్వ మీయబడినది. ఇందువలననే జ్ఞానచర్యకు వాచకమగు బ్రహ్మచర్యమున కర్థము శుక్ర రక్షణద్యోతకముగ నైనది. వస్తుతః, బ్రహ్మచర్యమునకు జ్ఞానచర్య యనియర్థము. ఇట్లిరువదియైదేండ్లు గడువగా పూర్ణయువకుడు గార్హస్థ్యము బ్రవేశించి యథాశాస్త్రముగ దాంపత్యభావనము ననుగమించుచు, నియతకర్మలను సమ యానుకూలముగ జేయుచు, అకర్మ-వికర్మమూలక దుర్వా సనలనుండి తప్పించుకొనుచు, పురంధ్రిలాసమాప్త్యనంతర మరణ్యానుగామి యగును. ఇట్లు జీవనయాత్ర గడపుచో సంతతినిగ్రహమున కవసరపడు దోషముల కవకాశమే యుండదుగదా!

వనానుగమనమున నీతవస్వి యాత్మపరిశుద్ధిపూర్వక మగు నాలవయాశ్రమమున కధికారమునొందును. ఈ నాలవ

యాశ్రమము జక్కగా ననుష్ఠించుచో నాత్మజ్ఞానము పూర్ణముగ నుదయించును. ఇతని యాత్మ శాంతిలక్షణ నిరతిశయానందనిలీనమగును. తపశ్చర్యయందు జ్ఞానఫలకామనయున్నది. ఇందు సర్వకర్మఫలత్యాగమున్నది. ప్రకారాంతరముగ:— గార్హస్థ్యమున గామ్యకర్మల ప్రాధాన్యమున్నది. వానప్రస్థమున కామన (జ్ఞానకామన) యున్నది. ఈసన్న్యాసమునందు 'జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే' యన్నట్లు సంపూర్ణకర్మలు (కామ్యకర్మలు – కామనారూప మానసికకర్మలు,) నష్టమగుచున్నవి.

శిఖా – సూత్రాదిపరిగ్రహము కామ్యకర్మఫలసూచకము, కర్మజనితానుశయము కిట్టము – మలము – ధూమము, దీనిపరిచయమునకే వానప్రస్థాశ్రమ పర్యంతము శిఖాసూత్రాదిపరిగ్రహవ్యవస్థ యున్నది. సన్న్యాసపథమున ప్రజ్వలితమగు జ్ఞానాగ్నికర్మసంస్కారములను నిశ్శేషముగా వింపగా "అహికంచుకవత్" అవి వానియంతటనవియే విడచిపోవును. ఈస్థితివ్యక్తీకరించుటకే యీతురీయాశ్రమమునందు శిఖాదిపరిగ్రహ పరిత్యాగము గావింపబడుచున్నది. ఈవిధముగ నుత్తరవయస్సున, వానప్రస్థ – సన్న్యాసములచే జ్ఞానశక్తి వికాసము నొందినవా డీశ్వరీయజ్ఞానవిభూతికి పాత్రుడగును. జ్ఞానాశ్రమము చరితార్థమగును. ఇదే కృతకృత్యత, జన్మసాఫల్యము, పురుషార్థసిద్ధి. చతురాశ్రమ్య మిందుకే స్థాపింపబడినది.

# ఆశ్రమప్రతిష్ఠాశాస్త్ర, విభాగము

(1) బ్రహ్మచర్యమున, సంహితయు, (2) గార్హస్థ్యమునవిధియు, (3) వానప్రస్థమున నారణ్యకము, (4) సన్యాసమున నుపనిషత్తును, ప్రధాన ప్రతిష్ఠలు.

| ఆశ్రమము | వయస్సు | చర్య | రూపము | ప్రతిష్ఠ | ఎందుకు సం॥ | |
|---|---|---|---|---|---|---|
| బ్రహచర్య | 1_25 | కర్మోపయుక జ్ఞాన | సాధన | సంహిత | యోగ్యతా సంపాదన | కర్మాశ్రమ |
| గార్హస్థ్య | 26_50 | జ్ఞానసహకృత కర్మ | సాధ్య | విధి | కర్మ | |
| వానప్రస్థ | 51_75 | జ్ఞానోపయుక కర్మ | సాధన | ఆరణ్యక | ఉపాసన | జ్ఞానాశ్రమ |
| సన్యాస | 76_100 | కామవిరహిత జ్ఞాన | సాధ్య | ఉపనిషత్ | జ్ఞాన | |

ఈవ్యవస్థ శూద్రవర్గమునకు లేదంటిమి. ద్విజవర్గపరిచర్యామాత్రమున నువలబ్ధభక్తిబల ప్రభావమున నేప్రయాసయు లేకుండనే. వారు ముక్తులగుదురు. ఈవ్యవస్థయందు కేవలము శాస్త్రమే శరణము. ద్విజాతులందు భక్తులై (అనయనములు - భాగముకలవారు) తదనుగ్రహమున వారివలెనే వీరును ముక్తులగుదురు. లోకమునందు:- నిర్ధనుడు ధనికునాశ్రయించియు, అతడు రాజునంటిబట్టియు, అతడు సామ్రాట్టునండగాగొనియు, అతడు, నీతినాధారముగా బెట్టుకొనియు, సురక్షితులగునట్లో, ఆధ్యాత్మికముగ, శిరోబాహూరువులు తత్తన్నియమముల చేనియంత్రితములై యుండ వానికన్నిట బరిచారకములు పాదములు. పై వాని స్వరూపరక్షణపూర్వకముగ స్వస్వరూపరక్షణనొందునట్లో ఈవిషయ

మున నూహింపవలయును. ఇదే భారతీయాశ్రమవ్యవస్థాపహాలి కర్తవ్యము. వర్ణవ్యవస్థకు దీనికిగలసంబంధమిూవరకే యెఱింగితిమి, కదా? ఈ రెంటిరహస్యము, మహత్త్వము:—

ఎఱుగనివారు

విశ్వామిత్ర, వశిష్ఠ, కశ్య, పాత్రి, మరీచి, భృగ్వాంగిరో-జమదగ్ని-కపిల-కణాదవ్యాప-జైమిన్యాద్యతీతానాగతజ్ఞ విదిత వేదితవ్య మహర్షిలోక లోకోత్తర విద్యాబలము (జ్ఞానబలము)ను, వివస్వ-దిక్ష్వాకు-భరత-జనక-కురు హరిశ్చంద్ర-శిబి-రఘు-మాంధా-తాది క్షత్రియపురుషపుంగవుల పరాక్రమమును, భలందనాదవైశ్య మహాభాగుల యర్థబలమును, ధర్మవ్యాధాది-శూద్రమహానుభావుల సేవాబలమును, వినియు, వినుచుండియు, నిదియంతయు నసంభవమనుకొను పాశ్చాత్యులకు వెనుక తాళము వేయు భారతీయులేమనుకొన్న ననుకొందురుగాక! అతీతభారత. మిూరెండు వ్యవస్థల యాధారముననే సర్వక్షేత్రములందు నుచ్చాసన ప్రాప్తినొందియున్నది. నేడైన బుద్ధిర్నిర్మాణకాంక్షులగువారీక్షుణ్ణము సహజప్రకృతిసిద్ధమునగు సనాతనమార్గము మూలమని యాశ్రయింపకున్నంతవరకు విశ్వశాంతి వేయిప్రయత్నములచేనైన నసంభవమని యెంతత్వరలో గ్రహించిన నంత మేలు. పరమేశ్వరు డట్టి బుద్ధిప్రదానముగావించుగాక! "ధియోయోనః ప్రచోదయాత్"

ఓమ్ తత్సత్

ఇతిశ్రీ......

ఆశ్రమవ్యవస్థా విజ్ఞానమ్

ఓమ్

నమః పురుషోత్తమాయ.

# సంస్కార విజ్ఞానము

వర్ణాశ్రమవ్యవస్థలు రెండును ప్రకృతిసిద్ధములు. రాష్ట్ర - వ్యక్తివికాసముల కీరెండు నత్యావశ్యకములు. ఇట్టి స్థిరములగు వ్యవస్థలేల చెడినవి ? సంస్కారలోపము. ఇందువలన మొదలు చెడకయీవ్యవస్థలు బీజరూపమున నక్షుణ్ణముగ నుండుననుట నిస్సందిగ్ధమే. ముందు నట్లేయుండును. అయినను కుసంస్కారప్రవేశమునను, కావలసినసంస్కారము లోపించుటయు, నామమాత్రమునకున్నను గతానుగతి కాంధశ్రద్ధావిశేషముననో విధిలేక చేయవలసివచ్చెనే యను దుర్విమర్శాగర్భితాగతిక విశ్వాసముననో, దేశ కాలాది నియమశూన్యములై దురుపయుక్తము లగుచుండుటచేతను, నేటివిపర్యయము పొడకట్టుచున్నది. ఇట్టిపరాభవప్రాప్తికి బ్రహ్మబలము సుప్తమైయుండుట ముఖ్యకారణము. అదియు సంస్కారవశముననే. అందుచే జ్ఞానబలము ముకుళితమైనది. అంతర్ధానమేయైనది. దానితో నితరవర్ణము లుచ్ఛృంఖలములై ప్రాకృతిక - కృత్రిమసంస్కారములను ధ్వంసము గావించుకొనుచున్నవి. గతభారతేతిహాసములందు నిట్టి విప్లవము లెన్నియో మారులు తటస్థించుటయు, బ్రహ్మబలము

జాగృతినందగనే మరలనంతయు తిన్నబడుటయు నైనట్లు-నహుష, వేనాదులచరిత్రలు ఋజువుచేయుచున్నవి.

బ్రహ్మ(జ్ఞాన)బలముతో క్షత్ర(క్రియా)బలము పతనమగుటతోడనే విట్ఛూద్రబలముల ప్రభుత్వముఏర్పడుటయు, వర్ణవిపర్యయము సిద్ధించును. సర్వానుశాసక బ్రహ్మబల మాబలములచే ననుశాసితమగును. పథప్రదర్శకులు పథానుగాములు, అనుగాములు దర్శకులు నగుదురు. ఇదంతయు సంస్కారలోపము. సామాజికవర్ణవ్యవస్థయు, వైయక్తికమగు నాశ్రమవ్యవస్థయు, సంస్కారముపై నాధారపడియుండును. అదిలేనినాడు బీజరూప వీర్యమువికసింపదు. అసంస్కృతబీజము మొలకెత్తదుకదా! ఇక విరుద్ధసంస్కారమువలన ప్రాకృతికవీర్యమే దూపితమైపోవును. అందుచే విరుద్ధధర్మానుగమననే సిద్ధించును. వృక్షాంతరమున కంటుగట్టిన వృక్షముయొక్క స్థితి మన ననుభవములోనున్నదే. సంస్కారములు; (1) దోషమార్జనము, (2) అతిశయాధానము, (3) హీనాంగపూర్తి యని మూడువిధములు. గీతావిజ్ఞాపరిచయమందలి సంస్కారనిర్వచనము నొకమారు చూడనలయును. వీనివివరణము చర్వితచర్వణమని యిట మానెదము.

పూర్వపక్షము :— ప్రస్తుత మనోవిజ్ఞానముంబట్టి యెవనికి నేకర్మయందిచ్ఛయుండునో వాని నాకర్మయందు నియమించిన, వాడందు మంచిప్రతిభను చూపగలడు. అట్లుగాక

దానిని నియంత్రితముంగావించి నూతనక్షేత్ర ప్రవేశము సేయించుచో వానికర్మయందు వికసింపదు, సఫలముగాదు. అదియునుగాక నూతనప్రియత్వము మానవునిసహజగుణము, "ప్రాతరోత"యను సామెతకలదుగదా! "స్వస్యచ ప్రియమాత్మనః," అనిధర్మలక్షము. 'నాత్మానమవసాదయేత్' అని భగవంతుడును, స్వేచ్ఛానుకూలకర్మ యుపాదేయ మని సూచించెను. ఇట్టిస్థితిలో, రుచికిభిన్నముగా సంస్కారమనుపేర నియంత్రణలను గావించుట మానవవికాసమునకు నిరోధకము నిరర్థకము, గాదా?

సమాధానము:—యుక్తిసుందరముగనే యున్నది. ఈ విపరీతరుచిమూలము సంస్కారలోపము, సంగ, శిక్షా, న్నాదికుసంస్కార దోషప్రవేశము, ననియు, సంస్కృత దంపతులకుబుట్టిన వాడెన్నడు విపరీతేచ్ఛలకు బాల్పడడనియు, యీవరకే యనుకొన్నమాట మరచుటచే యీవాదముద్భవించినది. పైజూపిన యాగంతుకదోషవశమున నొకవేళ విపరీతేచ్ఛపుట్టుగాక! అస్థిరము, తాత్కాలికము, దోషయుక్తపరేచ్ఛాజనితము నగు నాయిచ్ఛతో గావించుకర్మ సఫలతనొందదు సరిగదా, అప్పుడప్పుడు, ప్రాకృతికమగు స్వేచ్ఛ దానిని నిరోధించుచుండుటయు, "విధిలేక యీకర్మ చేయవలసి వచ్చుచున్న"దని యగతికుడై పశ్చాత్తప్తుడగుటయు కలుగుచుండును. ఈ ప్రాకృతికేచ్ఛానిరోధముం గూర్చియే భగవంతుడు, 'ప్రకృతింయాంతి భూతానినిగ్రహః

ః కరిష్యతి' 'కరిష్యస్యవశోఽపితత్' ఇత్యాదిగా వచించెను.

స్వేచ్ఛ, స్వభావము, స్వరుచి, స్వప్రకృతి యనునీ సమానార్థకభావములకు స్వవీర్యగత ధర్మమనియే పరిభాష. విపరీతేచ్ఛయగునపుడు అది యాగంతుకపరేచ్ఛ. భయావహపరధర్మము, నని గుర్తింపనలయును. దానిచే మేఘముచే సూర్యునట్లు స్వాభావికవీర్యధర్మ మావృతమగును. కశాఘాతమునకు వెరచి గుఱ్ఱము తౌతుయొక్కయిచ్ఛంబట్టి నడువవలసివచ్చునట్లు స్వాభావిక స్వధర్మేచ్ఛ లేకున్నను బలవంతమగు నీపరేచ్ఛంబట్టి యింద్రియాశ్వములు పరధర్మముల వంకకు బ్రవృత్తము లగును.

"యతతోహ్యపికౌంతేయ పురుషస్యవిపశ్చితః
ఇంద్రియాణిప్రమాథీని హరన్తిప్రసభంమనః"
అనిచ్ఛన్నపివార్ష్ణేయ బలాదివనియోజితః"

పరధర్మాక్రాంతు డెన్నడు నితరవృత్తులందు సఫలత నొందజాలడు. కొలదియపవాదస్థలముల నటుంచినచో నీ హీనకాలమందైనను, ఈచిహ్నములు తొలగలేదు. నేటికిని విద్యాక్షేత్రమున బ్రాహ్మణునకు, పౌరుషక్షేత్రమున క్షత్రియునకు, విత్తక్షేత్రమున వైశ్యునకు, శిల్పకళాదిక్షేత్రమున శూద్రునకు, వేరున్నది. పరధర్మప్రకృతుల యుభయ భ్రష్టతయు జూచుచున్నాము. ఇందుహీనస్థితికి పరధర్మాశ్రయము ముఖ్యహేతువు. అది స్వరుచియనుకొనుట వాదిపొరపాటు. అది యాగంతుక శిక్షాన్నకాలముల త్రిదోషసన్నిపాతగుణము. చూతము:-వాతపిత్తకఫములువికృతి

నొందిన విషయములు కాగా, స్థూలత్రిదోషములు పుట్టును. ఇక :—శిక్షాదోషమున సూక్ష్మవాతధాతువు కుపితముకాగా వాతావరణము చెడును. అన్నదోషమున సూక్ష్మశ్లేష్మ ధాతువు కుపితముకాగా మనశ్శుద్ధి పాడగును. ఈరీతిచే కుపిత మగు కాలాగ్ని సూక్ష్మపిత్తధాతు ప్రకోపమునకు గారణమగును. ఈదోషత్రయాక్రాంత సమాజము పరేచ్ఛ లనే స్వేచ్ఛలుగా నెంచి తదనుగమనము గావించెనా, నాశము నకు సిద్ధమగును. సన్నిపాతరోగికి కలుగు నన్నాద్యపథ్యేచ్ఛ వైద్యుడు నియంత్రితముగావించి చికిత్సగావించిన, గాలాంత రమున నారోగ్యము గాంచుట చూచుచున్నాము. సమాజ విషయముగూడ నిట్లే యోచింపవలయును. వర్ణసంకరేచ్ఛలు దోషములవేగాని వర్ణములవికావని యెఱుంగుటమంచిది.

ఎవడైన వర్ణధర్మవిరుద్ధరుచి కలిగియున్నచో నది ధర్మ(కర్మ)మూల మనుకోరాదు. అర్జునున కిట్టి భ్రాంతి జనించి నప్పుడు భగవానుడే ప్రకృతిసిద్ధ వర్ణధర్మప్రతిపాదన పూర్వ కముగ స్వధర్మము నుద్ఘాటించు వృత్తమేకదా భగవద్గీత ? పరేచ్ఛాజనితమగు నాగంతుక దోషమునకు కొంతకాలము లొంగినను చివరకు తన ప్రకృతికి రావలసినదే. తనవర్ణాను బంధి స్వభావవిరుద్ధముగ మనుజుడు ప్రవర్తింపజాలడు. ఈ గీతావచనమున నవలోకింపుడు.

"కుతస్త్వాకశ్మలమిదం విషమేసముపస్థితం
అనార్యజుష్టమస్వర్గ్యం అకీర్తికరమర్జున !

క్లైబ్యంమాస్మగమః పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రంహృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠపరంతప
"యదహంకారమాశ్రిత్య నయోత్స్యఇతిమన్యసే
మిథ్యైషవ్యవసాయస్తే ప్రకృతిస్త్వాంనియోక్ష్యతి,
స్వభావజేనకౌన్తేయ! నిబద్ధః స్వేనకర్మణా,
కర్తుంనేచ్ఛసియన్మోహాత్ కరిష్యస్యవశోపిసః

కనుక నిట్టిపృథగ్వ్యవస్థయేసంస్కార లోపములవలన జేతునో అట్టి సంస్కారస్వరూపముం బరిచయము జేసి కొందము :—

## సంస్కారస్వరూపము మనుష్యుడు-దోషములు

"గుణదోషమయంసర్వం స్రష్టాసృజతికౌతుకీ" అన్నట్లు :— ప్రకృతి దేవిచే నుత్పన్నములగు పదార్థములెల్ల దేవ ప్రాణమూల గుణసంపత్తితోడను, అసుర ప్రాణమూల దోష సంపత్తితోడను, గూడియుండును. పొలమునబండిన ధాన్యము నందలిదోషములను శుద్ధిగావించుకొని యుపయోగించుకొందుముగదా! మనుష్యునింతే. ప్రకృతిమండలమం దతడొక యవయవవిశేషము. కనుక గుణదోషసమన్వయ మనివార్యము. స్వాభావికవర్ణవీర్యము, ప్రకృతి వికృతిసిద్ధ దోషావృతమై యున్నంతవరకు వికాసముండదు. కనుక నాదోషమార్జనకై సంస్కారమావశ్యకము. మనుష్యుడన నేమి ? అతనియం దేమిదోషములుండును ? చూతము.

జీవాత్మ యీశ్వర ప్రజాపతియంశ. ప్రజాపతిశబ్ద మందు ప్రజా[1] - తత్పతి[2] - సంబంధసూత్రము[3] నను మూడు భావములుండును ప్రజాసంబంధముననే యతడు ప్రజాపతి.[1] అతనికి ప్రజకు[2] మధ్యగల సంబధసూత్రముననే[2] సంబంధ మవిచ్ఛిన్నముగ నుండును. ఈమూడుగలసి ప్రాజాపత్య సంస్థ. ప్రజపశువు. ప్రజాపతిపశుపతి. సంబంధసూత్రము పాశము. ఈ మూటిసమన్వితరూపము ప్రజాపతి. పశుపతి యాత్మ, ఇదిముఖ్యము. పాశమాత్మయొక్క ప్రాణము. ఈదృష్టితో నాత్మ - ప్రాణ - పశుసమష్టిని ప్రజాపతియన వచ్చును. (1) ఆత్మ మనఃప్రధానము, లేక జ్ఞానప్రధానము. (2) ప్రాణరూపపాశము, ప్రాణప్రధానము, లేక క్రియాప్రధానము. (3) పశువు, వాక్ప్రధానము, లేక అర్థ ప్రధానము. మరల (1) పశువర్గమాధిభౌతిక, ప్రపంచము. (2) పాశవర్గ మాధిదైవిక ప్రపంచము. (3) ఆత్మవర్గమాధ్యాత్మిక ప్రపంచము. ఈమూడుగలసి 'తదిదంసర్వమ్.

ఇంకను, ఈమూడువిభాగములును వైదికవిజ్ఞానభాష యందు, ఉక్థము, అర్క - అశితి - యనుపేరులం బ్రసిద్ధములు, ఆత్మఉక్థము. (2) ప్రాణము అర్క. (మూలబింబ రశ్మిలు) (3) పశువు అశితి. (రశ్మిపరిగృహీతమగునన్నము) ఇందు క్థప్రాణములు ఘనిష్ఠసంబంధముగలవి. సూర్యుడు - రశ్మిలువలె తాదాత్మ్యములు, మూడవదగునశితికి అర్క

యు, దానికి ఆత్మయు, ప్రతిష్ఠలు. కనుక నాత్మ, 'ప్రతిష్ఠా నాం ప్రతిష్ఠ', 'సర్వప్రతిష్ఠ', 'సర్వాలంబనము'నైయున్నది.

'బ్రహ్మస్యసర్వస్య ప్రతిష్ఠా' యనట్లు సప్తపురుష పురుషకృతిమూర్తియగు సుక్థాత్మ; బ్రహ్మయు, అర్కాత్మక ప్రాణము దేవతయు, అశితిరూపపశుభాగము, భూతము నై యున్నవి. ఈమూటిసమష్టియు నీశ్వర ప్రజాపతి. అస్మదాది జీవాత్మ లాతనియంశలు. ఇచ్చట నొకవిషయము జ్ఞప్తియం దుంచవలెను. ఏమన :—"విశుద్ధము, నిర్గుణము, సర్వవ్యాప కము, నగు బ్రహ్మపదార్థ మీ త్రికళము, సాంజనము, సగుణము, మాయావచ్ఛిన్నమునగు ప్రజాపతికంటె సర్వథా పృథగ్భూతము. దానికిసంస్కారమర్యాదతో నేమియు సం బంధములేదు. అయ్యది సంస్కృతాసంస్కృతములం దంతట సమానరూపము. అట్టితురీయము, అవ్యవహార్యము, ప్రపం చోపశమము, అమాత్రలక్షణమునగు నమృతధరాతలమున బ్రపంచప్రవర్తకము, మాత్రాలక్షణము, అమృతమృత్యు మయము, త్రికలము సోపాధికమునగు నీశ్వర ప్రజాపతి ప్రతి ష్ఠితమైయున్నది." ఈప్రజాపతియే మనసర్వస్వము.

"ప్రజాపతేనత్వదేతాన్యన్యో విశ్వారూపాణిపరితాబభూవ యత్కా మాస్తేజుహుమః తన్నోఅస్తువయం, స్యామ పతయోరయీణాం "ప్రజా పతిస్త్వేవేదంసర్వం యదిదంకించ"

పశుపతి ఆత్మా మనోమయ జ్ఞానప్రధాన ఉక్థమ్ అధ్యాత్మ బ్రహ్మ
పాశము ప్రాణము ప్రాణమయ క్రియాప్రధాన అర్కః అధిదైవత దేవ
పశువు పశువు వాఙ్మయ అర్థప్రధాన ఆశితి అధిభూత భూత

ఇట్లు 'ఆత్మప్రాణపశుసమష్టిత్వమ్ ప్రజాపతిత్వం' అనులక్షణముగల ప్రజాపతియంశల మగు మనయందును మూడుపర్వము లుండును. ఎట్లన :- మొదట ఆత్మ-శరీరము, అని రెండుభాగము లందరు నెరిగినవే. ఈరెంటికి సంబంధము కూర్చునది దేవత యందురు. ఇది దేహళీదీపన్యాయమున నాత్మకు శరీరమునకు గూడ జెందియుండును. కనుకనే శరీర మునకాత్మ - దేవతల-తోడను, ఆత్మకు, దేవతాశరీరముల తోడను సంబంధ ముండుచున్నది,

(1) పృథివ్యాది పంచభూతసమష్టి శరీరము, (2) వాక్ప్రాణాదిపంచేంద్రియ సమష్టి దేవత. (3) ప్రజ్ఞాన, విజ్ఞాన, మహ, దవ్యక్తయుక్త, వైశ్వానర, తైజస, ప్రాజ్ఞకృత మూర్తి ప్రాణాత్మ బ్రహ్మ. మరియు (1) పంచభూత ప్రతిష్ఠవాగగ్ని (2) పంచదేవప్రాణప్రతిష్ఠ ప్రజ్ఞానమనస్సు (3) దీనికి హృదయస్థవిజ్ఞానాత్మయు, దానికి మహానాత్మయు, దానికవ్యక్తాత్మయు, ఈయన్నిటికి కర్మభోక్తయగు ప్రాణాత్మయు ప్రతిష్ఠలు. ఇంకను:- (1) భూతయుక్త వాగగ్ని ప్రపంచము స్థూలశరీరము. (2) మనోయుక్త దేవ (ఇంద్రియ) ప్రపంచము సూక్ష్మశరీరము. దీనినేసత్త్వమందురు. (3) ప్రజ్ఞానాదిసహకృత ప్రాణాత్మ కారణశరీరము. ఇదే ఆత్మ యందురు. ఇట్లీ మూటిసంబంధమునను 'ఆత్మాసత్వంశరీరంచ త్రయమేత త్త్రిదండవత్' అన్నది చరితార్థమగుచున్నది. ధర్మశాస్త్రములు దీనినేసంస్కార్యమన్నవి. వైద్యశాస్త్రము

దీనినే చికిత్సాపురుషు డనియెను. దర్శనశాస్త్రముగూడ జికిత్స్యమిదే యనియెను. ఇక నీమూడుశాస్త్రములకు భేద మెందనగా:- చికిత్సాశాస్త్రమునకు శరీరము, ధర్మశాస్త్ర మునకు సత్త్వము, దర్శనమునకాత్మయు, ముఖ్యలక్ష్యములు, తక్కినవిగౌణములు.

"పురుషోవై ప్రజాపతేః నేదిష్టం" అన్నట్లు పురుషుడు ప్రజాపతికిదగ్గరవాడు. ఏలయన:- 'సహి నేదిష్ఠంపస్పర్శ'. ఇతర ప్రాణులందుకంటే బురుషునందా ప్రజాపతియొక్క (1) విరాట్సంజ్ఞ కాసంజ్ఞపశుభావమునకు వైశ్వానరరూపమునను (2) హిరణ్యగర్భసంజ్ఞ కాంతస్సంజ్ఞ ప్రాణభాగమునకు దైజ సరూపమునను, (3) సర్వజ్ఞ సంజ్ఞకససంజ్ఞాత్మభాగమునకు, ప్రాజ్ఞరూపమునను బూర్ణవికాసము కలిగెను. కనుక నేదిష్ఠు డనవచ్చును. అట్టిపురుషుని బ్రహ్మ - దేవతా - భూతములను మూడుభాగములును, మున్నను కొన్న విధమున గుణదోష యుక్తములై యుండుట సహజము. కనుక పురుషుని పురు షత్వవికాసమునకు ఈమూడుపర్వముల సంస్కారములు నావశ్యకములే. (1) భూతసంస్కారముచే శరీరము, (2) దేవసంస్కారముచే దేవభాగము, (3) బ్రహ్మసంస్కార ముచే బ్రహ్మభాగము, నిర్దోషము లగును. ఇందు మొదటి దగు భూతసంస్కారము తక్కిన సంస్కారములం దంతర్భావ మని యెంచి ధర్మశాస్త్రములు బ్రాహ్మ - దైవనామక సంస్కార ద్వయమునే ప్రధానముగ నెంచెను. భూతసంస్కారము

గర్భాధానాది సంస్కారములం దంతర్భూత మని. ముందు స్పష్టమగును.

సత్వము (మనస్సు-సూక్ష్మశరీరము) వికృతినొందిన నటు స్థూలశరీరము నిటు కారణశరీరము (బ్రహ్మ) వికృతి నొందును. కనుక స్వవీర్యానుబంధి స్వధర్మము వికసింపక ధర్మకర్మప్రవృత్తి యవరుద్ధమై పోగా నాగంతు కాధర్మాకర్మ ప్రవృత్తులు పెరుగుదలపట్టును. మొత్తమంతయు జెడును. ఈదోషానుగ్రహమున నే నేటి బ్రాహ్మణవర్ణము శూద్రధర్మానుగమనమున, సేవాధర్మమును, అభక్ష్య భక్షణా పేయపానములను యథాకామముగ జేయుచున్నది. యజ్ఞసూత్ర మాడంబరమాత్రమైనది. ఇక స్వధర్మవిముఖులై శూద్రులు యజ్ఞసూత్రమునకై యారాటపడుచున్నారు. ఇవియన్నియు బరేచ్ఛలు. వీనికి నియంత్రణ యావశ్యకము.

బాలుడుత్పథగామియగునాడు మృదుమధురనియంత్రణము గావింపక విడచుచో వాని భవిష్య మంధకార బంధురమై పోవునుగదా! ఇట్టివెల్ల నాత్మేచ్ఛలుగా నెంచి చాలవరకు బొరపడుట తటస్థించుచున్నది. అందువలన ఆహార విహారములందు, శిక్షా ప్రణాళికలందు, సభ్యతాసంఘము లనుకొను వానియందు ఆచారవ్యవహారములందు నుచ్ఛృంఖలవృత్తితో నెన్నోవిధముల పతనముల పాలగుచున్నాము.

"ఇచ్ఛనునిరోధింపరాదు" అను విజ్ఞానానుమోదిత

సిద్ధాంతముతో మాకువిరోధములేదు. కాని, ఆయిచ్ఛ యెట్టిది ? స్వేచ్ఛారూపమున బరేచ్ఛయే వచ్చి తిష్ఠవేసి కొన్నదేమో చూడవలయు''నందుము. యోచింపుడు. ఆరోగ్యమునకు, జీవికకు, హితమితభోజనము రెండుమారు లావశ్యకము. ఇక బ్రస్తుతము వాడుకయందున్న మధ్యేమధ్యే పానీయ భక్ష్యాదుల కేమందుము ? పెక్కేల ? దేవప్రాణానుబంధిని, సాత్వికబుద్ధిప్రధాన యగు నది యాత్మేచ్ఛ, లేదా, స్వేచ్ఛ యనియు, ఆసురప్రాణానుబంధినియు, తామసబుద్ధి ప్రధానము మనోనుగామినియు నగునది పరేచ్ఛయనియు నందుము. ధర్మలక్షణమగు "స్వస్యచ ప్రియమాత్మనః''యను వాక్యమునందు. ఆత్మనః అనుపదమున, దృష్టియుంచుట న్యాయము.

ఆత్మధర్మవిరోధినియగు పరేచ్ఛకు నియంత్రణ మావశ్యకము. ఇక ప్రకృతమనుసరామః :—బ్రాహ్మ - దేవ భాగములు దోషరహితములగుచో బరేచ్ఛయెన్నడు నుదయింపదు. కాని, కౌతుకీస్రష్టయొక్క సృష్టియందు దోషాత్యంతాభావమసంభవమని గుర్తుంచుకొనవలయును. సరి, "ప్రాకృతికదోషములను దూరముగావించుచు, జన్మతఃస్వవీర్యమునందుండులోపములను పూరించుచు ఆగంతుకదోషముల నడ్డుకొనుచు, లభించిన యతిశయమును సురక్షితముగావించు వైజ్ఞానికప్రక్రియ సంస్కారము''.

బ్రహ్మ - దైవభేదమున రెండువిధములగు సంస్కార

ముల ముఖ్యోద్దేశ్యము యథాజాతమనుష్యభావము దివ్య భావముగా బరిణమింపజేయుట. దివ్యభావము "త్రిసత్యా వై దేవాః" యన్నట్లు త్రిసత్యమగుటచే త్రిపర్వముకనుక నీరెండుసంస్కారములును మూడుమూడవాంతరభేదములు గలవి యగుచున్నవి. (1) గర్భసంస్కారములు, (2) అనువ్రతసంస్కారములు, (3) ధర్మశుద్ధిసంస్కారములు. ఇవి మూడును బ్రాహ్మసంస్కారములు. (1) పాకయజ్ఞ సంస్కారములు, (2) హవిర్యజ్ఞసంస్కారములు, (3) సోమయజ్ఞ సంస్కారములు. ఇవిదైవసంస్కారములు. వీనిచే బ్రహ్మ దేవభాగములు నిర్మలములు, పూర్ణములు, సాతిశయములు, నగును. అప్పుడు స్వధర్మానుగామినియగు నాత్మేచ్ఛయే యుద్గమించును. సూర్యునుండి ప్రకాశము లేకుండుట యసంభవము. అట్లే సంస్కృతుడు పరేచ్ఛానుగామియెన్నడు కాజాలడు. వర్ణరక్షావికాసములు కేవలము సంస్కారాధీనములై యున్నవి.

దేనికైన వస్తుత్వముండుగాక, అసంస్కృతమగు-చో నదియనుపయోగ్యము. ఈవాక్యములను జూడుడు:—

"అశ్రోత్రియా, అననువాక్యా, అనగ్నయోవా, శూద్రసమధర్మిణోభవన్తి
"అవ్రతశ్చానధీయానా యత్ర భైక్షచరాద్విజాః" (వసిష్ఠ)
తందేశందండయేద్రాజా, చౌరభక్తప్రదోహిసః

సంస్కారవిశేషమున వజ్రముమెరయును. బొగ్గునకు సంస్కారము లెన్నిచేసినను వట్టిదే. దేని కేది యుచితమో

యట్టిసంస్కారమునే కావింపవలయును. అసంస్కృతవస్తువు దోషయుక్తమయ్యు వస్తుత్వముంగోలుపోదు. ఇట్టిజాతి-సంస్కారవివేకముంబట్టి కేవలజాతిగాని, సంస్కారముగాని యేయతిశయమును సేయజాలవు. కాని రెంటిసమన్వయమునను, వికాసము సంభవమగును. ఆయీవిషయమంతయు, 'ప్రకృతి విశిష్టంచాతుర్వర్ణ్యం, సంస్కారవిశేషాచ్చ' యనుచో నీవరకే చెప్పబడినది.

దౌర్భాగ్యమున నేడీసంస్కారస్వరూపము మఱువబడినది. ఉన్నచోనైనను నామమాత్రమే యనవచ్చును. భోజనకర్మయే సంస్కారకర్మయొక్క స్థానము నాక్రమించియున్నది./ మనుష్యుడస్మృతసంహితుడు కనుక నెంతసావధానముగ నున్నను, తెలియకుండనైన దోషసంభవము స్వాభావికము. ఈయజ్ఞాతదోషము కర్మసంతానమధ్య ప్రవిష్టమై కర్మను 'విరిష్ట' (అంగభంగయుక్త)ముం గావించును. ఈ విరిష్టసంధానమునకు సాంతపననామక ప్రాణాగ్నియే కేవల దేవత. వేదముజదివిన బ్రాహ్మణశరీరమందు విద్యాకర్మల ప్రభావమున నీసాంతపనాగ్ని దేవతవర్ణవీర్యమువలెనే పుట్టుక నుండియు నుండుచుండును. ఇతనికి భోజనముపెట్టిన సాంతపనాగ్నితృప్తినొంది యజ్ఞవిరిష్టసంధానము గావించును. కనుకనే ప్రతికర్మసమాప్తియందును బ్రాహ్మణభోజన కర్మయావశ్యమని ఋషులయాదేశము. కాని నేడాసంస్కారములస్థానము భోజనసంస్కార మాక్రమించియున్నది. అనగా ఎందైనను

యజమానునకు వివాహోపనయనాద్యావశ్యక సంస్కార విశేషచింతకంటె భోజనపు టేర్పాటులందు, నందు బిండి వంటలవిశేషములన మర్చుటయందును నితరములగు నృత్త గీతవాద్యాది విశేషములందు నెక్కువ చింత యగపడు చున్నది. జాతిభోజనభట్టాచార్యులెక్కడ కోపింతురో యను భయమే యెక్కువ. ఇక యాజకులు, విశుద్ధభోజనదక్షిణ లందలి ప్రేమ, తాముగావించుపనియం దగపరుప లేకున్నారు. చివరకు, మన శాస్త్రీయకర్మకలాపమంతయు, భూతము (భ్రాంతికలిగించువస్తువు) వలెనై యేదో యొక నెపమున దప్పించు కొనుటకో, ఇతరవినోదములచే దీని ప్రాధాన్యము దప్పించి యేదోయొకవిధముగ నైన దనిపించుకొనుటకో యోగ్యముగ నున్నది.

అయినచో కర్మమొదలంట మానివేయవచ్చునా ? అందునలన కాలము మిగులును. వ్యయప్రయాసలుతగ్గును. కల్యాణపథములభించును. అన్నచో 'నేతిహోవాచ'. ఈజటిల సమస్యాప్రతిశోధనోపాయము లోకసంగ్రాహకుడగు భగవంతు డిట్లు చెప్పుచున్నాడు.

> "నబుద్ధిభేదంజనయే దజ్ఞానాం, కర్మసంగినాం,
> జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరేత్"

"అయినచో సజ్ఞానపథమునబోవువారికైన బ్రోత్సాహమీయవలయునని యే భగవానుని యభిప్రాయమా ?" అన్నచో రామ! రామ! అట్లెన్నడుగాదు. అజ్ఞానాంధ

కారము దూరముగావించుగీత, యజ్ఞాన ప్రవృత్తిని రక్షింప
నాదేశించుననుకొన్నవాడు ప్రాయశ్చిత్తభాగి కాదగును.
పద్ధతిమంచిదో చెడ్డదో యగుగాక ! సత్కర్మప్రవృత్తిగల
వానిని నొక్కమారుగ సంస్కరింపవలయు ననుకొన్నచో
నతడులక్ష్యచ్యుతుడగును. దోషములేచూపుచో నభ్యాసమే
చెడిపోవును. కనుక శిష్టాచార మెరింగినవాడు, సత్కర్మప్ర
వృత్తికి మచ్చుజూపుచు మెల్లగా పద్ధతులందలి దోషమార్జ
నము గావింపు చుండవలయును. అప్పుడు బుద్ధిభేదమునకు
గాని, అభ్యాసము చెడుటకుగాని, యవసరమే కలుగదు.
"క్షురస్యధారానిశితాదురత్యయా" అన్నది మూలమంత్ర
ముగా బెట్టుకొని సావధానముగ కర్మలోపము గానిపద్ధతిని
సంస్కారము గావింపవలసి యున్నది.

"వర్ణవ్యవస్థకు, సంస్కారములకు నేమిసంబంధ"
మందురా? బ్రహ్మ-దేవసంబంధముం జూతము. బ్రహ్మ
ఉక్థము. దేవతలర్క. ప్రకారాంతరమున ఉక్థమాత్మ, అర్క
ప్రాణము. "యత్రాత్మాతత్ర ప్రాణః, యత్ర వా ప్రాణః
తత్రాత్మా" సంస్కారము, బ్రహ్మస్థానీయమగు నుక్థమగుచో
వర్ణవ్యవస్థ దేవస్థానీయ మగునర్కయగును, బింబములేని
వికాస మసంభవమగునట్లు ఉక్థస్థానీయ సంస్కారములేకుండ
నర్కస్థానీయ వర్ణవికాస మసంభవము. ఈతాదాత్మ్యసంబంధ
దృష్టితో నీసంస్కారములను చాతుర్వర్ణ్యజీవన హేతువు లన్న
నత్యుక్తి కాదు.

సంస్కారమన 'సరిగాజేయుట' అనగా:- (1) వస్తువును దోషరహితము గావించుట, (2) లోపమును పూరించుట (3) గుణమును పెంపొందించుట. మొత్తముపై పరధర్మావరణముందొలగించి ఆత్మశౌర్యమును స్వధర్మముతో సమభావమున బరిణతినొందించుట యనియర్థము. కనుక సంస్కారము అను శబ్దము సార్థక మగుచున్నది.

విత్తనమునందు మొలకెత్తుశక్తి జన్మసిద్ధము. కాని భూమియందుంచి నీటితో దడుపవలయును. అంకురోత్పత్తి లక్షణమగు నుత్పత్తియోగ్యతాసంపాదనకు జలము కారణమగును. కనుక సేచనప్రక్రియ సంస్కారమందురు. విరోధిధర్మాక్రమణ యుండునంతవరకు వస్తుస్వరూపమునందు విషమతయుండును. అంతవరకు బదార్థముండియు దనయోగ్యతావికాసవంచితముగ నుండును. విత్తనమునకు విరుద్ధధర్మము రుద్రవాయు వందురు. జల మంకురోత్పత్తిగావింపదు. అందుకు ప్రతిబంధక మగు రుద్రవాయువును శిథిలము గావించును. ఆపై నందుకుసహాయక మగు శివవాయు వుద్బుద్ధముకాగా నంకురము దానియంత నదే వెలువడును. చాకలి, వస్త్రముం దెలుపుసేయడు. వస్త్రమునకు దెలుపుసహజమే. అతడు క్షారాదికమున దానిమాలిన్యమును మాత్రము తొలగించును. వాయు ప్రవాహము సూర్యుని ప్రకాశముంబుట్టింపదు. అందుకావరణముగనున్న మేఘములం దోలివేయును. అందుచే స్వతఃసిద్ధప్రకాశము దృష్టివిషయమగును. ఇట్లే

బ్రాహ్మ-దైవసంస్కారములును బ్రాహ్మణత్వాది ధర్మో త్పాదకములు కావు. వీర్యాత్మకములగు నీధర్మములు ప్రకృతిసిద్ధములు శాశ్వతములునై యున్నవి. తత్ప్రతిబంధక దోషనివారణమే సంస్కారములపని, అందువలన వాని యోగ్యత వికసించును.

సంస్కృతయోగ్యత తెలివితేటలంబట్టి సంస్కృతవస్తు యోగ్యతయందు తరతమభేద ముండుచుండుట లోకమందు చూచున్నామన్నది జ్ఞప్తియం దుంచవలయును. ఈయభిప్రాయముతోడనే దేవయజనసంపత్తి (యజ్ఞభూమి) మీమాంసం జేయుచు, భగవంతుడు యాజ్ఞ్యవల్క్యుడు మొదట, ఉత్తమము, సమము, ప్రాక్ప్రవణమో, ఉదక్ప్రవణమో అగు భూమియు, నుత్తమములు, బవిత్రములునగు యజ్ఞద్రవ్యములు, మొదలగు నవి దేవయజనసంపత్తని చెప్పెను, చివరకు:- "యజ్ఞసంస్కృతయగు ఋత్విజు డుత్తముడగుచో యజమానున కతడే దేవయజనసంపత్తియగును. ఏలయన, నతడు విద్వాంసుడగుచో నన్నిసంపత్తులును లభించును. అతడయోగ్యుడగుచో నంతసామగ్రియు, నిరర్థకము." అని సిద్ధాంతముచేసెను. "ఋత్విజో హైవ దేవయజనమ్ యే బ్రాహ్మణాః, శుశ్రువాంసః, అనూచానాః, విద్వాంసః, యాజయన్తి, సైవ అహ్వాలా, ఏతన్నేదిష్ఠమాం ఇవమన్యామహే" (శత)

ప్రకృతియందుబుట్టిన ప్రతిపదార్థమునకును మూడు

సంస్కారములుగావించియే మన ముపయోగించుకొనుచుం దుము. ధర్మశాస్త్ర పరిభాషంబట్టి యవి యిట్లందురు:—

| | | | |
|---|---|---|---|
| 1 దోషమార్జకములు | శోధకములు | వీనిచే | దోషమార్జనము |
| 2 అతిశయాధాయకములు | విశేషకములు | వీనిచే | అతిశయాధానము |
| 3 హీనాంగపూరకములు | భావకములు | వీనిచే | హీనాంగపూర్తి |

ఈ సంస్కారత్రయముచే సంస్కృతమగు వస్తువో, వ్యక్తియో, కృతకృత్యమగును. వీనిస్వరూపములను క్రమముగా జూతము :—

సంస్కారములు, బ్రాహ్మ - దైవభేదమున రెండు విధములనుకొంటిమి. ఇందు బ్రతియొకటియు పైవిధమున మూడుమూడు విధములగును. ఈయవాంతరముల కింకను బ్రత్యవాంతరము లనేకభేదము లగును. అన్నిటిమొత్తము నలువదిరెండగును.

ఇవి శ్రౌతములు, స్మార్తములు నని రెండువిధములు. ఇందు శ్రౌతము లిరువదియొకటి. స్మార్తములిరువదియొకటి. బ్రాహ్మసంస్కారములను స్మార్తములనియు, దైవసంస్కారములను శ్రౌతములనియు, నందురు. మొదట యథాక్రమముగ స్మార్తసంస్కారములుకాగా బిమ్మట శ్రౌతసంస్కారాధికారప్రాప్తి కల్గును. కనుక మొదటివానినే మొదట జూతము. ఇవి గర్భసంస్కారములెనిమిది. (2) అనువ్రతసంస్కారములెనిమిది (3) ధర్మశుద్ధిసంస్కారములైదు. అని మొత్త మిరువదియొకటియే కాని, యిందు ధర్మశుద్ధిసంస్కా

రములైదును, దైవసంస్కారమూల ప్రతిష్ఠలగుటచే వీనిని వానియందంతర్భావములుగ నెంచుచో నీస్మార్తసంస్కారములు చివరకు బదునారగును, కనుక వీనికిషోడశసంస్కారములని ప్రసిద్ధి. ఇందు మొదటియెనిమిది గర్భసంస్కారములు నంతర్బహిర్భేదమున దోషమార్జకములై శోధకములగుచున్నవి. తరువాతి యను వ్రతసంస్కారములెనిమిదియు, నతిశయాధాయకములగుచు, విశేషకములగుచున్నవి. ఇక చివరివగు ధర్మశుద్ధిసంస్కారములైదును హీనాంగపూరకములై భావకములగుచున్నవి.

ఇందు:— శోధకములు, తండ్రివలనను. విశేషకములాచార్యునివలనను, భావకములు స్వయంకృతములుగ, సంపన్నములగును. ఈ మూడువిధముల సంస్కారములచే ద్విజాతివాని బ్రహ్మభాగమన్నివిధముల సుసంస్కృతమై యొప్పును, ఈపరిలేఖంగమసింపుడు :—

| | | | | |
|---|---|---|---|---|
| 1 గర్భాధానము<br>2 పుంసవనము<br>3 సీమాంతోన్నయనము<br>4 జాతకర్మ<br>5 నామకరణము<br>6 నిష్క్రమణము<br>7 అన్నప్రాశనము<br>8 చౌలకర్మ | బహిర్గర్భములు అంతర్గర్భములు | గర్భసంస్కారములు. పితృకర్తృకములు శోధకములు, దోషమార్జనము: బ్రహ్మభాగ | 1 కర్ణవేధ<br>2 ఉపనయనము<br>3 వ్రతాదేశము<br>4 వేదస్వాధ్యాయము<br>5 కేశాంతము<br>6 స్నానము<br>7 వివాహము<br>8 అగ్నిపరిగ్రహము | అనువర్తిత సంస్కారములు, ఆచార్యకర్తృకములు, విశేషకాః బ్రహ్మభాగము నతిశయాధానము, |

(1) శరీర (2) ద్రవ్య (3) అఘ (4) ఏనస్ (5) భావ శుద్ధిసంస్కారములైదును, స్వకర్తృకములు. భావకములు బ్రహ్మభాగమున, హీనాంగపూర్తిగావించును. ఈవిషయమున:—

"గర్భాధానంపుంసవనమ్, సీమంతో,జాతకర్మచ,
నామక్రియా,విష్క్రమో, న్నప్రాశనంచౌలకర్మచ,
కర్ణవేధో,వ్రతాదేశో, వేదస్వాధ్యాయనిత్యతా,
కేశాంతః, స్నాన,ముద్వాహో వివాహాగ్నిపరిగ్రహః
త్రేతాగ్నిసంగ్రిహశ్చేతి సంస్కారాఃషోడశఃస్మృతా॥" (స్మృతి)

"సంస్కారాన్ కారయేద్ధీమాన్ క్రుణుతాన్యైః సురోభవేత్
(అగ్నిపురా)

"బ్రిహ్మక్షతిరియవిట్ శూద్రాః వర్ణాస్త్వాద్యాత్రయోద్విజాః
నిషేకాద్యాఃశ్మశానాంతాః తేషాంవైమంత్రిత క్రియాః"
(యాజ్ఞవల్క్యః)

"వైదికైఃకర్మభిఃపుణ్యైః నిషేకాదిద్విజన్మనాం,
కార్యఃశరీరసంస్కారః పావనః ప్రేత్యచేహచ.

"గార్భైర్హోమైఃజాతకర్మ చౌడమౌంజీనిబంధనైః
బైజికంగార్భికంచైనో, ద్విజానామపమృజ్యతే" ఇత్యాదులు
చూడవలయును.

ఈ సంస్కారములకు మూలము శ్రుతియందును, ఇతికర్తవ్యతస్మార్తగ్రంథములందు నున్నందున వీనిని స్మార్తసంస్కారములందురు. వీనికి బిమ్మట దైవసంస్కారములు, జరుగును. బ్రాహ్మసంస్కారములచే సంస్కృతమగు బ్రహ్మన త్మయనుకొంటిమి. ఇదే కారణశరీరము. ఇదే భూతాత్మ

కర్మానుసారము తత్తజ్జాతి, (యోని), ఆయువు, భోగములు వీని కనుగామియై తత్తదుత్తమామలోకములందు సంచరించున దిదియే. పుణ్యాపాప, సుఖదుఃఖ, శుభాశుభ, సదసత్, సామాన్యవిశేషాది ద్వంద్వములకు ప్రధానాధికారి యీభూతాత్మయే. ఇది వైశ్వానర-తైజస-ప్రాజ్ఞ-సమష్టిరూపము.

ఈభూతాత్మ ప్రజ్ఞానాత్మతోఁగూడి యుండును. అనగా మనయీ సంస్కార ప్రకరణమునకు జెందిన బ్రహ్మ, వైశ్వానర - తైజస - ప్రాజ్ఞయుక్త ప్రజ్ఞానాత్మ యని భావింపవలయును. దీనినే భూతాత్మయందురు. ఏలయన:- వాసనారూపమున నీసంస్కారములను గ్రహించు గ్రాహకుడు లేకున్న నీసంస్కారము లన్నియు వ్యర్థములేకదా! ఇక నధ్యాత్మసంస్థయందు, వాసనాసంస్కారమునకు కేవలగ్రాహకము ప్రజ్ఞానాత్మయే. (చాంద్రమనస్సు) కనుక తద్విశిష్టభూతాత్మయే సంస్కారగ్రాహకము కాగలదు.

పార్థివరసము 'ఇరా' యందురు. ప్రజ్ఞానబ్రహ్మయందు చాంద్రసోమము తోఁబాటుగ, వైశ్వానర, తైజస, ప్రాజ్ఞలక్షణ పార్థివభూతాత్మ సహయోగమున పార్థివ మగు నిరారసమునకును ప్రధానతయుండును. కనుకనే మన యీ ప్రజ్ఞానమనస్సు పార్థివభూతములవంకకు బోవుచుండును. ఈయిరారససంబంధముననే భూతాత్మయుక్త ప్రజ్ఞానబ్రహ్మ 'ఇరామయపురుషు' డనబడును. దేవతలకు ప్రియమగు పరోక్షభాషయందు 'హిరణ్మయపురుషు' డందురు.

"స వాఏషవిజ్ఞానాత్మా ప్రజ్ఞానాత్మనాసంపరిష్వక్తః" అన్న ట్లీయిరామయ లేక హిరణ్మయప్రజ్ఞానాత్మ (మనస్సు) సౌరవిజ్ఞానాత్మ (బుద్ధి)తో నిత్యము సంపరిష్వక్తమై యుండును. ప్రజ్ఞాన మొకయద్దమువంటి వీధ్ర (Pure; clear) ధరాతలము. దీనిపై బ్రతిబింబితరూపమున విజ్ఞానాత్మ ప్రతిష్ఠితమైయుండును. విజ్ఞానసత్తకుమూలకారణము ప్రజ్ఞానసత్తయే. ఇందువలన నిందలి సదసద్వృత్తింబట్టి తత్ప్రతిష్ఠితమగు విజ్ఞానమువొక్క (బుద్ధియొక్క) స్థితియు వృత్తియు నుండునని తేలుచున్నది. దోషయుక్తమనస్సు బౌద్ధవిచారమలినతకును కారణమగుచుండునని సర్వజనవిదితమే. కనుక విజ్ఞానశోధనకు ముందుగ బ్రజ్ఞానశోధన కావలసియుండును.

"హిరణ్యయేన సవితారథేనా దేవోయాతి భువనాని పశ్యన్" అన్నట్లు సౌరతేజముహిరణ్మయ మని స్పష్టము. ప్రజ్ఞానాత్మ, చంద్రునివలనను, పార్థివమగు నిరారసమువలనను, తన స్వరూపసంపాదనగావించుననుచో విజ్ఞానాత్మ సౌరహిరణ్మయతేజప్రత్యంశ యనవలయును. కనుక ప్రజ్ఞానమునవలె విజ్ఞానమును హిరణ్మయపురుషు డనవచ్చును. ఇందు భేదమేమన:- ప్రజ్ఞానాత్మ ఇరామయుడగుటచే మాటవరుసకు హిరణ్మయము. విజ్ఞానాత్మ వాస్తవిక సౌరహిరణ్మయతేజోంశమగుటచే యథార్థముగ హిరణ్మయము. అది యిరామయమగుటచే హిరణ్మయము. ఇది హిరణ్మయమగుటచే హిరణ్మయము.

"ఇరామయ ప్రజ్ఞానహిరణ్మయుడు విజ్ఞానస్వరూపము గుర్తించి జీవనయాత్రానిర్వాహము గావించుచో ననగా:- మనస్సుబుద్ధి కనుగామియై యసంగభావమున గర్మ ప్రవృత్తమగుచో హిరణ్మయవిజ్ఞాన ప్రసాదమున, పార్థివేరామయబాధనము తెగిపోగా, శరీర త్యాగానంతరము,హిరణ్మయ విజ్ఞానసాయుజ్యమున దాను పరలోకమున ననగా నాదిత్యలోకమున హిరణ్మయుడై పోవును," అని యిచటగుర్తింపవలయును. ప్రజ్ఞానబ్రహ్మయొక్క యూపార్థివమగు నన్నరసమయ స్వరూపముంజెప్పు నీయైతరేయారణ్యకవచనముంది లకింపుడు.

"అథాతో రేతసః సృష్టిః, ప్రజాపతే రేతో దేవాః, దేవానాం రేతో వర్షం, వర్షస్య రేతో ఓషధయః, ఓషధీనాం రేతోఽన్నం, అన్నస్య రేతో రేతః, రేతసో రేతః ప్రజాః, ప్రజానాం రేతో హృదయం, హృదయస్య రేతో మనః,మనసో రేతో వాక్, వాచో రేతఃకర్మ. తదిదం కర్మకృతమయం, పురుషో బ్రహ్మలోకః, సఇరామయః, యద్ధిఇరామయః, తస్మాద్ధిరణ్మయః, హిరణ్మయోహవా అముష్మిన్ లోకేసంభవతి, హిరణ్మయః సర్వేభ్యోదదృశే యఏవంవేద.

జ్ఞానజనితసంస్కారముభావన, కర్మజనితసంస్కారము వాసన; దార్శనికమతమున సంస్కారమునకీదేయర్థము గ్రహింపబడినది. ఇందువాసన స్నేహప్రధానమై (సోమగుణకమగు,) ప్రజ్ఞానమనస్సునను జెందినది. భావన తేజః ప్రధా

న్నమై (సావిత్రాగ్ని గుణకమగు) విజ్ఞానాత్మకు (బుద్ధికి) జెందినది. అనగా:- వాసనమనః ప్రధానము, భావనబుద్ధి ప్రధానము,నని ఫలితార్థము. ప్రజ్ఞానము మానుషభావో త్తేజకము. విజ్ఞానము దేవభావ ప్రేరకము. కనుక "భావమిచ్ఛన్తి దేవతాః" అని చెప్పబడినది.

ఇంతకును:- శరీరసంస్థయందలి బ్రహ్మ - దేవభావములందు, పార్థివభూతాత్మయుక్త ప్రజ్ఞానము బ్రహ్మపదార్థమనియు, సౌర ప్రాణదేవ ప్రధానమగు విజ్ఞానము దేవపదార్థమనియు, దేలినది. ఇందువలన నీరెండును సంస్కార్యములు, పార్థివ ప్రజ్ఞాన బ్రహ్మపై సౌరవిజ్ఞానము ప్రతిష్ఠితమగుటచే మొదట బ్రజ్ఞానాత్మకసంస్కారమావశ్యక మగుచున్నది. సూర్యుడు త్రయీఘనుడు, యజ్ఞమూర్తి, యగుటచే యజ్ఞసంస్కారము దేవసంస్కార మగును. ఈసంస్కారములకు మూలము నితికర్తవ్యతయు, శ్రౌతసూత్ర, బ్రాహ్మణ గ్రంథములం దుంకుటచే వీనిని శ్రౌతసంస్కారములందురు. ఇవియు నొక్కొకటి యేడేసివిధములచొప్పున (1) పాకయజ్ఞములు. (2) హావిర్యజ్ఞములు, (3) సోమయజ్ఞములు. నని మూడువిధములు. మొత్తమిరువదియొకటి. ఈవచనములం జూడుడు.

...... పాకయజ్ఞాశ్చసప్తతే.

అష్టకా[1]పార్వణశ్రాద్ధం,[2] శ్రావణ్యా[3]గ్రయణీ[4]తిచ

చైత్రీ[5]చాశ్వయుజీ[6] (స్థాలీపాక[7]);సప్తహవిర్యజ్ఞాంశ్చతాన్ శ్రుణు,

1-8 2-9 3-10 4-11
ఆధానంచాగ్నిహోత్రంచ దర్శో వైపౌర్ణమాసకః
5-12 6-13 7-14
చాతుర్మాస్యం పశుబంధః సౌత్రామణిరథాపరః
1-15
సోమసంస్థాః సప్తశుభ్రాః, అగ్నిష్టోమః క్రతూత్తమః
2-16 3-17 4-18 5-19
అత్యగ్నిష్టోమ ఉక్థశ్చ షోడశీ వాజపేయకః
6:20 7:21
అతిరాత్రా ప్తోర్యామశ్చ సహస్రేశాఃసవాఇమే: (అగ్నిపురాణము)
ఇవియన్నియు స్వకర్తృకములు:-

ఇందు (1) పాకయజ్ఞములేడును శోధకములు, దేవభాగమందలి దోషమార్జనముగావించును. (2) హావిర్యజ్ఞములేడును, విశేషకములు, దేవభాగమందతిశయము నాధానముగావించును. (3) సోమయజ్ఞములేడును, భావకములు, దేవభాగమునందు హీనాంగపూర్తిగావించును.

నివేదనము

ఇక, నీసంస్కారములందు బ్రాహ్మసంస్కారములేయేసమయములం దేయేవిధముగ నాచరింపవలయు ? నన్నవిషయము లాయా సూత్ర - పద్ధతి గ్రంథములందు విశేషించియున్నవి. కనుక నట్టివిషయములంగూర్చి యిందు బిష్టపేషణస్సేయక స్థాలీపులాకన్యాయమున వీనియుపపత్తులను జూతము. శ్రద్ధావిశ్వాసపూర్వకముగ నివియెల్ల నాచరించు మహానుభావుల కొకనమస్కారము. వారికొరకిట్టివ్రాతయనావశ్యకము. వ్యర్థకాలయాపనము. ఇక నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్తమాగాధయేత్తను కోటిలోనివారి కెదియుక్కార మే లేదు

కదా! వారికిదుర్మార్గముగనుండియే యొకప్రణామము. పోగా మిగిలిన సంశయాళువుల కిందుకొంచెము లాభముండు నని యాశ. ఇట్టిభారతీయధర్మము, ఆదర్శము, సభ్యత, సంస్కృతి మొదలగునవి కేవలము విజ్ఞాన శూన్యములు, గ్రామ్యకల్పనలు, ప్రాచీనుల మస్తిష్కమునందలి నిరాధారకల్పనావృక్ష కల్పిత ప్రసూనము, లనుకొనువారివ్రాతంజూచి, భారతీయ ధర్మవిషయమున:—

"నాకారణంహి శాస్త్రే_స్తి ధర్మఃసూక్ష్మోపిజాజలే
కారణాద్ధర్మ మన్విచ్ఛన్ సలోకానాప్నుతేశుభాన్"

అనుకొన్నచో ధన్యుడను: ఇక ప్రకృత మనుసరామః.

## శోధకములగు గర్భసంస్కారము లెనిమిదింటిలో గర్భాధానము

మాతాపితలరజో - వీర్య (శోణిత - శుక్ర)ములందుండు యోషా - వృషామిథునభావ (దాంపత్య)మున నపత్యము (సంతానము) గర్భమునకు వచ్చును. శుక్రశోణితములందుండు ప్రాణాత్మక వృషాయోషాతత్త్వములు స్వయముగ బ్రహ్మరూపములు వీర్యాత్మకములునై యున్నవి. ప్రాకృతికములునాగంతుకములునగు కొన్నిదోషములచే నీ బ్రహ్మభాన మావృతమగును. ఆదోషమార్జనమున కీగర్భాధానాది చౌలాంత మెనిమిదిగర్భసంస్కారములు కావింప

బడును. అపత్యముంగోరి పతి, ఋతుస్నాతయగు పత్నిం
గూడు నెడ నీసంస్కారముగావింపబడును. గర్భాధానకాలీన
మగుట నిది గర్భాధానమందురు. ఔపపాతికజీవాత్మయొక్క
మూడుజన్మలలో నిది మొదటిజన్మ.

మాతృగర్భాశయ ప్రవేశపూర్వము ప్రాణి పితృ
శుక్రగర్భమున నుండును, సర్వాంగశరీరమునందు శరీరా
కారమున వ్యాప్తమైయుండు నీశుక్ర మాగ్నేయఘర్షణచే
ద్రుతమై యోషిదగ్నియందు సిక్తముకాగా జాయాగర్భీ
భూతమగును. ఇది మొదటిజన్మ. అయ్యది స్త్రీయొక్క
యాత్మకు, శరీరమున కంగమువలె దొమ్మిదిమాసములవరకు
సురక్షితముగనుండి పిమ్మట 'ఏవయాంసురుత్' ప్రత్యాఘాత
మున శిశురూపమున భూమియందవతరించుట రెండవజన్మ. అ
నంతరమాయుర్భోగపర్యంతము శుభాశుభకర్మల ననుభవించి
యథాసమయమున బ్రాణి భూశయనము గావించి క్రవ్యా
దాగ్ని (శ్మశానాగ్ని) క్రోడ గతుడై పరలోకార్థ మంగుష్ఠ
మాత్ర నవీనశరీరధారణము చేయుట మూడవజన్మ. ఈవృ
త్తాంత మీయైతరేయవచనమున జూడుడు.

“పురుషే హవా అయమాదితో గర్భో భవతి, యదేతద్రేతః తదేత
త్సర్వేభ్యోంగేభ్యః తేజః సంభూతమాత్మన్యేవాత్మానంబిభర్తి తద్యదా స్త్రి
యాం సించతి అథైతజ్జ యతి తదస్య ప్రథమంజన్మ. తత్ స్త్రియా ఆత్మభూ
యంగచ్ఛతి, యథా స్వమంగం, తస్మాదేనాంనహినస్తి, సాస్యైతమాత్మా
నమత్రగతం భావయతి సాభావయిత్రీ భావయితవ్యా తం స్త్రీగర్భంబిభర్తి
సోగ్ర ఏవకుమారంజన్మనోగ్రేధి భావయతి సయత్ కుమారం జన్మనోగ్రేధి

భావయతి. ఆత్మానమేవతద్భావయతి ఏషాంలోకానాంసంతత్యా ఏవంసంత తాహీమేలోకాః తదస్యద్వితీయం జన్మ సోఽస్యాయామాత్మా పుణ్యేభ్యఃకర్మ భ్యః ప్రతిధీయతే అథాస్యాయమితర ఆత్మాకృతకృత్యోవయోగతఃప్రైతి సఇతః ప్రయన్నేవపునర్జాయతే తదస్యతృతీయంజన్మ తదుక్తమృషిణా:-

"గర్భేనుసన్నన్వేషామవేదమహం దేవానాంజనిమానివిశ్వా
శతంమాపుర ఆయసీరరక్షన్నధః శ్యేనోజవసానిరదీయమ్"

గర్భాధానమునకు గారణము పితృశుక్రాహుతియే. కాని తదాహుత్యవహితోత్తరకాలమునుండియు, గర్భరక్ష, పుష్టి, మొదలగువానిభారము కశ్యపప్రజాపతి వహించును. కనుకనే శ్రుతి "కశ్యపాత్ సకలంజగత్ - 'తస్మాదాహుః సర్వాః ప్రజాఃకాశ్యప్యః'' అనియెను. కశ్యపసంస్థ:-మాతా పితృమిథునకాలీన ఖగోళపరిస్థితింబట్టి తదనురూపముగ నుండు చుండును. మరియు:- దేశ - పాత్ర స్త్రీ అన్నాది వాతా వరణముంబట్టికూడ కశ్యపసంస్థయందు బరివర్తనమగుచుండును అందొకపుడు దేవభావము నొకపుడసురభావము వికసితము గనుండును. దానిస్థితింబట్టి యాయాసమయములం దుత్పన్న మగు గర్భము తదనురూప గుణదోషసమన్విత మగుచుండును.

దధి, మధు, ఘృతాత్మకము, త్రైలోక్యవ్యాపకము అర్ధఖగోళవ్యాప్తము, 'బుధ్న' తుల్యము, (కుండయొక్క అడుగుభాగమువంటిది) ఉపరిభాగముచే వర్తులమునగు సౌర ప్రాణమండలమే, లోకపశ్యకమై (ద్రష్టయై) కశ్యపనామ మున నొప్పుచున్నది. 'కశ్యపః పశ్యకోభవతి' అన్నట్లు - 'పశ్యక' శబ్దము వర్ణవిపర్యయమున 'కశ్యప' యైనది, మరియు

కశ్యప (కూర్మము) ఆకృతిగే పశ్యకాత్మక కశ్యప ప్రజాపతి యాకృతియు గనుక గశ్యపుడనుట యన్వర్థమే. ఈ శ్రుతిం జూడుడు:—

"సయత్ కూర్మో నామ, ఏతద్వై రూపంకృత్వా, ప్రజాపతిః ప్రజా అసృజత। యదసృజత అకరోత్తత్। యదకరోత్ తస్మాత్కూర్మః। కశ్యపో వై కూర్మః। తస్మాదాహుః - సర్వాః ప్రజాః కాశ్యప్యః - ఇతి సయః సకూర్మః; అసౌ స ఆదిత్యః. (శత)

ఈప్రాకృతిక కశ్యపసంస్థయాధారమున:—ద్విజావర్గము తనసవర్ణస్త్రీయందు బ్రహ్మక్షత్రాదివీర్యభేదభిన్న శుక్రాహుతినీయనుండుటకు ముందుగనే ప్రక్రియావిశేషయుక్తమగు నన్వర్థమంత్రశక్తిప్రభావముచే:— శుక్రగతబ్రహ్మక్షత్రాది వీర్యములను, కశ్యపసంస్థద్వారా వచ్చు ప్రాకృతికదోషాక్రమణలనుండి రక్షించి స్వస్వరూపమున సురక్షితములుగావించుటకు, నైజ్ఞానికులగుమహర్షులీగర్భాధాన సంస్కారమును విహితముగావించిరి. మరియు :—

వీర్యాత్మకగర్భము తోమ్మిదిమాసములు గర్భమందుండవలయును. ఆకాలమందు, పూర్వోక్తదోషములేకాక దేశసంబంధిదోషముల యాక్రమణముకూడ ననివార్యము. తల్లితిన్నయన్నముంబట్టియో, ఆమెయొనరించు సాంగత్యవిశేషములంబట్టియో, ఆమెకుదయించునూహలంబట్టియో, ఆయా సదసద్భావములుకూడ నీగర్భముపై బడకుండజాలవు. దోషాక్రమణము ప్రాబల్యమువహించుచో, సంచితకర్మతా

రతమ్యమున వీర్యభావము నిర్బలమగుచో, ప్రసవమునకు బూర్వమే దానిస్వశక్తి యభిభూతమైపోవును. ఇట్టి యాగంతుకదోషములను నిరోధించుటకు, శక్తిప్రవేశలక్షణము, లేదా బలాధానలక్షణముగల, యీగర్భాధానసంస్కారము మొదటనే యావశ్యకముగా నెంచబడినది. ఇంకను:—

“ప్రజాతంతుంమావ్యవచ్ఛేత్సీః” అనునాదేశముంబట్టి గృహస్థునకు బితృఋణవిమోచనార్థము, తప్పక ప్రజావర్గసంతతివ్యాపనకై యపత్యోత్పాదన గావింపవలయును. పరతః ప్రమాణభూత పురాణస్మృత్యాదులేకాక స్వయముగ శ్రుతియు, బుత్రోత్పాదనావశ్యకతంగూర్చి మానవప్రజాధ్యానము నాకర్షించుచున్నవిధ మీయైతరేయతచనములు, సూచించుచున్నవి:—

> “హరిశ్చంద్రోహ[1] వైధస ఐక్ష్వాకో రాజా పుత్రఆస।
> తస్యహశతంజాయాబభూవుః, తాసుపుత్రంనలేభే,
> తస్యహపర్వతనారదౌ గృహఊషతుః సహ, నారదంపప్రచ్ఛ:—
> “యంన్విమంపుత్రమిచ్ఛన్తి యేవిజానంతియేచన
> కింస్విత్ పుత్రేణవిందతే? తన్మఆచక్ష్వనారద!” ఇతి

సఏకయా పృష్టోదశభిః ప్రత్యువాచ:—

> 1. ఋణమస్మిన్ సన్నయత్యమృతత్వంచగచ్ఛతి
> పితాపుత్రస్యజాతస్య పశ్యేచ్చేజ్జీవతోముఖం॥
>
> 2. యావన్తఃపృథివ్యాంభోగాః[2] యావన్తోజాతవేదసి[3]
> యావన్తో[4] అప్సుప్రాణినాం, భూయాన్ పుత్రేపితుస్తతః

3. శశ్వత్ పుత్రేణపితరో[5] త్యాయన్ బహులంతమః
ఆత్మాహిజజ్ఞఆత్మనః సఇరావత్యతితారిణీ

4. కిమ్నుమలం[6]? కిమజినం[7]? కిముశ్మశ్రూణి[8]? కింతపః[9]?
పుత్రంబ్రహ్మణ! ఇచ్ఛధ్వం, సవైలోకో వదావదః

5. అన్నంహప్రాణః[10], శరణంహవాసో, రూపంహిరణ్యాం, పశవో, వివాహః
సఖాహజాయా, కృపణంహదుహితా, జ్యోతిర్హపుత్రః పరమే వ్యోమన్.

6. పతిర్జాయాంప్రవిశతి[1] గర్భోభూత్వా సమాతరమ్
తస్యాంపునర్నవో భూత్వాదశమే మాసిజాయతే.

7. తజ్జాయాజాయాభవతి[2] యదస్యాంజాయతేపునః
ఆభూతిరేషా భూతిర్బీజమేతన్నిధీయతే॥

8. దేవాశ్చైతామృషయశ్చ[3] తేజః సమభరన్మహత్
దేవామనుష్యానబ్రువన్ ఏషా, వోజననీపునః

9. నాపుత్రస్యలోకోస్తి[4]; ఇతితత్ సర్వేపశవోవిదుః
తస్మాత్తుపుత్రోమాతరం స్వసారం, చాధిరోహతి

10. ఏషపంథాఉరుగాయః[5] సుశేవోయంపుత్రిణ ఆక్రమన్తేవిశోకాః
తంపశ్యన్తిపశవోవయాంసిచ, తస్మాత్తేమాత్రాపిమిధునీభవన్తి

ఇతిహాస్మాఅఖ్యాయ అథైనమువాచ, వరుణంరాజానముపధావ, పుత్రోమేజాయతాం, తేనత్వాయజా ఇతిః- (ఐబ్రా) 33-2.

---

1. వేధసునురాజుకొడుకు 2. సస్య-నివాసాది 3. అగ్నిహోత్ర-పచనాది 4. స్నానపానాది 5. శనికష్టానుగత, తమోబహుళవైతరణీతరణము 6. గార్హస్థ్యము, 7. బ్రహ్మచర్యము, 8. వానప్రస్థము, 9. సన్యాసము 10. అన్నాదులాసుఖకారణములు, పుత్రుడుజ్యోతి, కన్యకష్టమూలమనియే చెప్పబడినది. కన్యాపితృత్వంఖలు కష్టమూలంగదా!

వీర్యాహుతి నిరర్థకమగుటయు గలదు. అందుకు గారణములు చాలగలవు. వానిని ముందు దెలియగలము. ఆదోషములకు జికిత్సలునుగలవు. అం దీగర్భాధాన సంస్కారముకూడ నొకవిధముగ జికిత్సాకర్మయందుము. తండ్రి దగుశుక్రముసౌమ్యము, తల్లిదగు శోణితమాగ్నేయము, వృషాయోషలగు నీరెంటికి దాంపత్యము. శుక్రమందలిపుంభ్రూణము వృషాప్రాణాత్మకము; శోణితమందలి స్త్రీభ్రూణము, యోషాప్రాణాత్మకము, మరియు, పుంభ్రూణ మాగ్నేయము, దీనిబాహ్యావరణరూపశుక్రము సౌమ్యము; స్త్రీభ్రూణము సౌమ్యము దీనిబాహ్యావరణరూపశోణిత మాగ్నేయము; ఈ రెంటిదాంపత్యముచే గర్భస్థితికలుగును.

శోణితమందు శుక్రాహుతికాగా రెండుభ్రూణములందును అన్నఅన్నాదభావము జాగృతినొందును. ఈప్రతిస్పర్థయందు జయించిన భ్రూణముంబట్టి సంతానము స్త్రీయో, పురుషుడో యగును. సమానములగుచో నపుంసకాపత్యము

1. పతితనరూపమునబతి, రేతోరూపమున గర్భముగా బరిణతి నొందునపుడు పుత్రుడు "ఆత్మా వైజాయతే పుత్రః" "ఆత్మా వై పుత్రనామాసి" శ్రుతి:—పత్నియు, తనరూపమునబతికి బత్నియు, పతిరేతోరూపగర్భరూపముంబట్టి మాతయు, నగును. 2. జనించుట కనువగుభూమి ఆభూమిజాయా శబ్దమునకుదగినది. 3. దేవతలు ఋషులు తమతేజము స్త్రీయందుంచి ఈమె మీకుదల్లియనిరి. 4. పశువులు సంతతికొరకు తల్లిని, సోదరిని గూడు చున్నవి. 5. పుత్రులుగలవారు విశోకము బ్రశంసితమగు లోకమునొందుదురు. పశుపక్ష్యాదులకు నీవిషయము దెలియును, ఇదిమార్గము.

కల్గును. సౌమ్య స్త్రీ భ్రూణ ప్రాబల్యము, శోణితలక్షణాగ్నే యార్తవ ప్రభూత మాత్రపైనను, ఆగ్నేయపుంభ్రూణ ప్రాబల్యము శుక్రలక్షణసౌమ్య రేతోధిక్యముపైనను, నాధారపడి యుండును. కనుక నే భిషగ్వారులిట్లనిరి.

1. రక్తేనకన్యామధికేనపుత్రం శుక్రేణ, తేనద్వివిధీకృతేన
బీజేనకన్యాంచసుతంచసూతే యథాస్వబీజాన్యతరాధికేన (చరక, శా॥).

2. అధిక్యే రేతసః పుంసః కన్యాస్యాదార్తవాధికే
నపుంసకంతయోస్సామ్యే యథేచ్ఛాపారమేశ్వరీ (భావప్రకాశము)

ఈ రెండు భ్రూణములం దేయొకటి మూర్ఛితమైనను మిధునక్రియవ్యర్థమై గర్భాధానముగాదు. అపత్యప్రతిబంధకములం దిది మొదటిదోషము, (2) రెండవది గ్రహదోషము. ఖస్వస్తికవశమెందిన లగ్నమున కొకనియతవ్యవస్థకలదు. దీని యాధారమున జన్మకుండలీద్వాదశభావములు యథాక్రముగ ప్రతిష్ఠితములై యుండును. ఇందు పంచమభావము కుక్షిస్థానమగును. అందలి గ్రహముగు, ప్రసవాత్మక ప్రాణవాయు పుత్రో నంతర్యామసంబధములేని వగుచో గర్భాధానము కాదు. (3) మూడవది పితృదోషము. పురుషునిశుక్రమందేసిమిదివిధముల పితృప్రాణము లుండును. పితృప్రాణము సౌమ్యము, సోమముచాంద్రము, చంద్రుడన్నాధిష్ఠాత. భుక్తాన్నము శుక్రరూపమున బరిణమించును. ఏనాడిచే చాంద్రరసమగుసోమము, అన్నముద్వారా శుక్రస్వరూప సమర్పకమగునో ఆనాడి శ్రద్ధానాడి యని ప్రసిద్ధము. ఈ

శ్రద్ధానాడీద్వారముననే చాంద్ర - సౌమ్యపితృప్రాణము, శుక్రమందు ప్రతిష్ఠిత మగును. ఆపితృప్రాణసంబంధముననే శుక్రమందుండు పుంభ్రూణము జాగృతినొందును. అది (పితృప్రాణము) మూర్ఛితమగుచో సంతతికలుగదు. దీనికి జికిత్స శ్రాద్ధకర్మ. దీనివిజ్ఞానము మరొకచో జూడనగును. (4) నాల్గవది సర్పదోషము. కర్మసర్పములు దేవసర్పములు నని సర్పములందు రెండుభేదములు. కర్మవశమున సర్ప యోనింబుట్టినవి కర్మసర్పములు. ఏప్రాణదేవత సర్పశరీరము లంధరించి యాధికారికకర్మపూర్తికొరకు నియుక్తమగునో, అయ్యవి దేవసర్పములు. అజ్ఞానముననెవ్వడైన దేవసర్పముం జంపినచో నేతత్సంబద్ధ ఖగోళీయ నాక్షత్రిక ప్రాణము కుపితమై సంతానసహయోగి నాక్షత్రికరసములను దూషితములు గావించి వంశోచ్ఛేదమునకు గారణమగును. సువర్ణమయ సర్పప్రతిమాదానపూర్వకముగ నీదోషమునకు బ్రాయశ్చిత్తముకలదు. (5) అయిదవది నాడీదోషము, అశ్విన్యాదిరేవతీ పర్యంత మిరువదియేడు నక్షత్రములను నొక్కొక్కటికి తొమ్మిదితొమ్మిదిచొప్పున మూడుసంస్థలుగ భాగములు గావింపగా నాదిమధ్యాంతభేదములచే మూడునాడులగును. వంశవిస్తారమునకు నాడీసామ్య మావశ్యకముగా నెంచబడినది. (6) ఆరవది కర్మదోషము. (7) వ్యాధిదోషము ఏడవది. (8) ఎనిమిదవది అతివ్యవాయదోషము. వీనియందేదోషమున్నను, గర్భాధానముకుదురదు. ఈగర్భాధాన

సంస్కారము ప్రధానముగ శుక్రదోష ప్రతిబంధకము. ఆయుర్వేదమునే *కౌషధీప్రయోగములచే గర్భాధానమునకనేకోపాయములను జెప్పినను, దానితోఁబాటు గర్భగత ద్విజాతి వీర్యములందు, వర్ణోచితబలముల యాధానము కేవలము వైదికగర్భాధాన సంస్కారముపైననే యాధారపడియున్నది. కనుకనే యీచికిత్సాసంస్కారము ధార్మికసంస్కారమైపోయినది. ఓషధీప్రయోగముతోఁబాటగు మంత్రప్రయోగమే బలాధానమునకు ముఖ్యహేతువు.

స్థూలశరీరచికిత్సతోఁ బ్రధానసంబంధముగల మన యాయుర్వేదముకూడ తన త్రివృద్భావకారణమున నీశ్రౌతస్మార్తసంస్కారముల యావశ్యకత నాదేశించినది. చరకశారీరస్థాన జాతిసూత్రీయాధ్యాయమునం జూడుడు :—

1. *పిప్పల్యశ్శృంగబేరశ్చ మరీచః కేసరంతథా సమంఘృతేనపాతవ్యం వంధ్యాపిలభతేసుతం
2. వటవృక్షోద్భవాఞ్ఛృంగాన్ గోఘృతేనసమాంశకాన్ ఋతుకాలేపి బేద్యాత్తు నియతపుత్రిణీభవేత్
3. క్వాథేనహయగంధాయాః సాధితంసఘృతంపయః ఋతుస్నాతాబలాపీత్వా గర్భంధత్తేనసంశయః
4. బీజానిమాతులుంగస్య దుగ్ధస్విన్నానిసర్పిషా సగర్భాంతానికుర్వన్తి పానాద్వంధ్యామపిస్త్రియం,
5. గోఘృతేనసహానాగకేసరం, శ్లక్ష్ణచూర్ణితమృతౌనితంబినీ గవ్యదుగ్ధనిరతాపిబేద్ధియా, సాతదాతిశయమేవవీరసూః

ఇత్యాదులనేకయున్నవి.

స్త్రీపురుషులండకోశములుగలవారు. ఇరువురును లింగములుకలవారే. 'పులింగముబహిర్ముఖము, స్త్రీలింగము తన్ముఖము. ఇంతేభేదము, వీనియందేదైన దోషవశమున శిథిలత (నిరీర్యత) యేర్పడుచో గర్భాధానము కాదు. ఈ దోష'మామ్రమంజరి' (మామిడిపూత) నివారించును. వసంతమున నామ్రమంజరీరసప్రయోగమున గర్భాధానమగును. అదిమహావృష్యము. ఇందుశుక్రోత్తేజన మధుభాగ మధికముగగలదు. కనుక నిదివాజీకరణద్రవ్యములం దంగీకృతమయ్యెను. వసంతర్తువునందు, సూర్యరశ్మిలనుండి భరణీ నక్షత్రద్వారమున (ప్రాణరూప) మధువృష్టికల్గును. కనుక చైత్రవైశాఖములును మధుమాథవములందురు. ఈమధు వామ్రమంజరియందు విశేషముగ సంచితమగును. అందువలన బలాధానముకాగా, గర్భాధానయోగ్యత సిద్ధించును.

రెండవది శ్వేతవర్ణ - బృహతీకంటకారికామూలము. (తెల్లవాకుడు) కోశమునందు దీనికి, కాసఘ్ని, నిదిగ్ధికా, స్పృహి, వ్యాఘ్రీ, బృహతీ, ప్రచోదిని, దుఃస్పర్శ, అనాక్రాంతా, భంటాకీ, సింహి, ధావనికా, చిత్రఫలా, ఇత్యాది నామములుకలవు. దానివేరురసము వైదిక - గర్భాధాన సంస్కారమున గ్రహింపబడినది. ఇందు పచ్చనిపూవులది తెల్లనిపూవులది యని రెండుతెగలుకలవు. వీనిలో 'శుక్లాసా గర్భదాచ' అని తెల్లది గ్రాహ్యము. పుష్యనక్షత్రమున నిందు పుష్టికరమగు పూషాప్రాణము ప్రవేశించును, కనుక

నానక్షత్రము కలదినమున దీని వేరుగ్రహింపవలయును. 'ఇయమోషధీత్రాయమాణా' ఇత్యాది మంత్రముం జెప్పుచు, భర్త పత్నీదక్షిణనాసాపుటమున దీనిరసము నాహుతిసేయ వలయును. ఈవచనముంజూడుడు :—

"న్యాయదిగర్భంనదధీత, సింహ్యా, శ్వేతపుష్ప్యా, ఉపోష్య, పుష్యేణ మూలముత్పాట్య, చతుర్థేహనిస్నాతాయాం, నిశాయాం, పిష్ట్వాదక్షిణ స్యాం, నాసికాయాం ఆసించతి." ఇయమోషధీత్రాయమాణా సహమానా సరస్వతీ అత్యాఅహం బృహత్యాః పుత్రఃపితురివ నామజగ్రభత్

పా॥ గృ॥ సూ॥ 1.13.

గర్భాధానాది సంస్కారములు మూలమంత్రములు వేదమునందె చూడవలయును. అథర్వ : 51.251.

## 2. పుంసవనము

ఈశబ్దమే యుపపత్తిని జెప్పుచున్నది. "పుమాన్ సూయతేయేనకర్మణా తదిదంపుంసవనమ్" ఈచమత్కార పూర్ణ సంస్కారకర్మ గర్భగతకన్యాచిహ్నములను పుత్ర చిహ్నములుగ, (ప్రకృతినియమమును) మార్చివేయును. కనుక పుంసవనము. పూర్వసంస్కారమున "ఆధిక్యే రేతసః పుసః" అన్నట్లు శోణితభాగప్రాబల్యమున గన్యకలుగునని చెప్పబడినది. ప్రథమమున గన్యయుద్భవించుచో వంశవితానం కాదు. కనుకనదియమంగళమనుకొను వైదికదృష్టి యావిప్రతి పత్తినుండి తప్పించుకొనుట కీసంస్కారము నావశ్యకముగ నెంచెను.

గర్భాధానకాలము మొదలు 2,3 నెలలవరకు, స్త్రీ పుంభ్రూణప్రతిస్పర్ధ సాగుచుండును. అంతవరకు గర్భస్పందనము కాదు. ఇరువురి యోధుల పోరాటమందు జయించినవాడు గర్వమున నిల్చి యొడలువిరచుకొనుచు నిలువబడునట్లు మూడవమాసమునకు బిదప జయించిన భ్రూణము స్పందన క్రియ కారభించును. కావలసినచిహ్నవికాస మయ్యెనని యీస్పందనము సూచించును. ఇక పరివర్తనమసంభవము. కనుక స్పందనకుబూర్వమే యీసంస్కారము విహితమైనది (చతుర్థేమాసిస్థిరత్వమాపద్యతేగర్భః (చరక)

పుత్రచిహ్నములకు బలమిచ్చుట యీకర్మయుద్దేశ్యము. అందులకు, గర్భవతికి:- శుక్రసజాతీయములు, శుక్రవర్ధకములు, సౌమ్యభావప్రధానములు నగు పదార్థము లీయవలయును. న్యగ్రోధశుంగ, కుశ, సోమ, దుర్వాదులీసౌమ్యభావముగలవి. | పారమేష్ఠ్యాపోపరిధింబ్రవేశించి యంతవరకు నాజలమును దేజోమయముగావించు సూర్యరశ్మిమండలాంతిమ పరిధికిజెందిన వేననామక తేజోమయసౌమ్యాపస్సునుండి దర్భయుత్పన్నమైనది. | ఈపవిత్రసోమభావమువలననే దర్భవిశేషపవిత్రముగ నెంచబడెను. సోమవల్లిసోమమయత్వము స్ఫుటనే. దూర్వము సోమభావయుక్తము, వటవృక్షమందు ముకుళితాకారపత్రపూర్వభూతావయవములు వటశుంగములు. వగరురుచికలవి. ఇవియు సౌమ్యములు.

పారస్కరుడు దుర్వావిధానము జెప్పుచున్నను, "అ

ధాశ్మై మండాలాగారచ్ఛాయాయాం, దక్షిణస్యాంనాసికాయాం, అజీతాం (దూర్వాం) ఓషధింన స్తఃకరోతి" (ఆశ్వ॥ గృహ్యాసూ) అను నాశ్వలాయనసూత్రంబముట్టి దూర్వయు గ్రహింపవచ్చును. ఇంతేకాక యాశ్వలాయనుఁడు, మాష, యవలతోడి దధిపానమును విధించెను. చూడుడు:—'ఉపది నాధీయాత్ - తృతీయేగర్భమాసే, తిష్యేణోపోషితాయాః సరూపవత్సయా, గోర్దధని, ద్వాద్వామాషౌ, యవంచ దధి ప్రసృతేన ప్రాశయేత్' మాషబలాధాయకము. యవసౌమ్యము. దధియింద్ర ప్రియమగు సాన్నాయ్యద్రవ్యము. కనుక సోమప్రధానము. చివరకివి యన్నియు పుంభ్రూణమునకు బలము, వృద్ధియు, గూర్చునవి.

దక్షిణభాగ మగ్నిప్రధానము, పుంభావాత్మకము. ఈకర్మయందు గావలసిదదియే, కనుక దక్షిణనాపుటమున నోషధీసేచనము విధించుట న్యాయ్యముగదా! పునర్వసు పుష్యనక్షత్రములందు గర్భవతిని స్నానముగావించి స్వచ్ఛ వస్త్రధారణంజేయించి, వటశుంగమును మర్దించి దక్షిణనాసాపుటమున "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే" "అద్భ్యః సంభృతః పృధివ్యైరసాచ్చ" అనురెండు మంత్రములనుజెప్పి తద్రసముం బిండవలయును. ఈసూత్రము జూడుడు:—

"అధ పుంసవనమ్, పురాస్పందత ఇతిమాసేద్వితీయే, తృతీయేవా, యదహఃపుంసానక్షత్రేణ, చంద్రమాయుజ్యేత, తదహరుపవాస్య, ఆప్లావ్య అహతేవాససీపరిధాప్య, న్యగ్రోధావరోహాన్ శుంగాంశ్చ, నిశాయాముద పేషంపిష్ట్వాపూర్వవదాసేచనం, 'హిరణ్యగర్భః' 'అద్భ్యఃసంభృత' ఇత్యేతాభ్యాం, కుశకంటకం, సోమాంశుంచైకే" (పార॥ గృ॥ సూ॥ 1—14)

## 3. సీమంతోన్నయనము

సీమంతకరణము, ఫలస్నపనముననియు, దీనికి పేరులు "సీమంతశ్శకథ్యతే స్త్రీణాం, కేశమధ్యేతుపద్ధతిః" అనుసారము పాపటనేర్పరచుట. "సీమానం అంతతి – బధ్నాతి" యని నిర్వచనము. సీమంతస్థానమగు కపాలస్థానమున శంకు మొదలగువాని ప్రయోగముండును కనుక, సీమంతకరణము, సీమంతోన్నయనము, అందురు.

గర్భపాతమాపుటకు, అందుకు హేతువగు నింద్రవిద్యుద్విక్షేపణశక్తి నుపశమింపజేయుటకు, ఈసంస్కారమావశ్యకము. దీని యుపపత్తి నెరుంగుటకు గాయత్రీ ఛందస్స్వరూపముం గొంచె మెరుంగవలయును. "ఏతద్ధసౌపర్ణకమాఖ్యానమాఖ్యానవిద ఆచక్షతే" అన్నట్లు యైతరేయోపవర్ణిత మగు నీ సౌపర్ణకాద్రవేయాఖ్యానమున "మొదట నన్ని ఛందస్సులు చతురక్షరములే" యని స్పష్టముచేయబడినట్లు, "చతురక్షరాహివాఅగ్రే సర్వాణిఛందాంస్యాసుః" ఇత్యాది నిగమవచనముల చేతను స్పష్టము. ఆయాఖ్యానమునందు గాయత్రి – త్రిష్టుప్ – జగతి – యను నీమూడు ఛందస్సులును స్పష్టము సేయబడినవి. ఎట్లన:—

దేవతలయజ్ఞకర్మ సిద్ధికొరకు మూడవ లోకమందలి పారమేష్ఠ్యసోమముం దెచ్చుటకు (తృతీయస్యాం వైఇతోదివిసోమఆసీత్ తంగా యత్రీ అచ్ఛావతత్) పృథివీలోకమునుండి

మొదట చతురక్షరజగతి వెళ్లగా, నచ్చటి సోమరక్షకులగు గంధర్వులాజగతి (అక్షరస్థానీయములగు) మూడుచరణము లను ఖండించిరి. దానితోఁ నసమర్థయై జగతియొంటివాదముతోఁ దిరిగివచ్చెను. పిదప జతురక్షర త్రిష్టుప్ వెళ్లగా నదియు నొక చరణముంబోఁగొట్టుకొని మూడుపాదములతోఁ దిరిగివచ్చెను. చివరకు దేవతలవలన లభించు, 'ఏతిచ ప్రేతిచ' యను బలము తోఁగూడి చతురక్షగాయత్రి సుపర్ణ (గరుడపక్షి) రూపముం దాల్చి మిక్కిలి వేగమున నెగిరి సోమము నేకాక గంధర్వఖండిత ములగు, జగతీ త్రిష్టుప్పులమూడు నొకటి చరణములను గూడ (3-1) గొనవచ్చెను.

జగతియొక్క మూడుచరణములతోఁడను త్రిష్టుపు యొక్క యొకచరణముతోఁడను, గాయత్రి యష్టాక్షర యయ్యెను. గాయత్రి సఫలమనోరథయగుటవిని, తమపాద ములంగూడ దెచ్చెనని యెరింగి, మూడుపాదముల త్రిష్టుప్పు, యొకపాదముగల జగతియు, గాయత్రింజేరి నమ్రభావమున మాపాదములు మాకీయవలయునని కోరగా, నది "దూరము నుండి సంపాదించి తెచ్చిన వీనిని తిరిగియీయజాలను మీకిష్ట మగుచో నాతోఁగలసియుండుఁడు" అనియెను, అవియునట్లే కావించెను, ఇందువలన:- గాయత్రి 8 + త్రిష్టుప్ 3 అక్షర ములుగలియగా త్రిష్టుప్ 11 అక్షరములు గలదియు, గాయత్రి 8 + త్రిష్టుప్ + 3 + జగతి 1 అక్షరములుకలియగా జగతి 12 అక్షరములుగలదియు నైనవి. ఇట్లు మొదటజతురక్షర

ములుకలవిగనుండు గాయత్రి మొదలగునవి సోమాపహరణ ప్రభావమువలనను, గాయత్రియనుగ్రహమునను, 8-11-12 అక్షరములందు బరిణతములైనవి. ఇయ్యది సౌపర్ణాఖ్యాన సంగ్రహము.

దీనిమౌలికరహస్యము మరొకచోజూడవచ్చును. ప్రకృతమేమన:- "గాయత్రీ ఛందము నాలుగక్షరములుగలది" యనియు నెంచబడిన దనుటయే. మరియు, ఖగోలీయములగు సప్తాహోరాత్రవృత్తముల పరిభాషంబట్టి, సప్తదేవచ్ఛందానువర్తి గాయత్రీఛందము ఆరక్షరములుకలదిగను నెంచబడెను. షడక్షరగాయత్రి నాల్గుచరణముల మొత్తము నిరువదినాల్గక్షరములు కాగా దీనిని చతుష్పదాగాయత్రీ యందురు. ఇంకను:- పార్థివాష్టవసు సంబంధమునను, ఆపఃఫేనాద్యష్టపార్థివావయవసంబంధమునను, బృథివీ లోకాధిష్ఠాత్రిగాయత్రి అష్టాక్షరగను నెంచబడినది. పై యాంఖ్యాము నిదే వల్లడించెను. దీనింబట్టి "అష్టాక్షరా వై గాయత్రీ గాయత్రమగ్నేశ్ఛందః" ఇత్యాదినిగమవచనములు వెలసియున్నవి. ఇరువదినాలుగక్షరములుగలది పాదమునకష్టాక్షరముల చొప్పున 'త్రిపదాగాయత్రీ' యగును. ఇంతకు:- గాయత్రి చతురక్షర, షడక్షర, అష్టాక్షర, యనుమూడురూపయలు గల దని తేలినది. ప్రస్తుత మీరూపచర్చ యటుంచి యింకొకయాఖ్యానముం జూతము.

ఇంద్రుడువృత్రునిపై వజ్రమువిసరి, 'యొకవేళనది

లక్ష్యచ్యుతమగుచో నతడుమరలనాపైబడు"నను భయమున బరుగిడి యొకగుప్తమగుచోట దాగెను. వృత్రాసురుడు చచ్చెను. దేవతలింద్రునివెదుకజొచ్చిరి. ఇందుకొఱకు దేవతలందగ్నియు, ఋషులందుహిరణ్యస్తూపుడను ఛందస్సులందు బృహతియు నరిగిరి. ఇందగ్నియింద్రునింబట్టికొనియెను. ఒక రాత్రి యందగ్నితో నింద్రుడుతిరిగి దేవమండలిలోనికి వచ్చెను. దేవతలానాటితిథి కమావాస్యయని పేరిడి వారిపూర్తి కొఱకును, "ఐంద్రాగ్నద్వాదశకపాల పురోడాశము" సంపన్నముగావించిరి. (శత 1-6-41)

ఈయాఖ్యానమున బ్రస్తుతము, ఇంద్రాగ్నులు ఘనిష్ఠ సంబంధముగలవారని తేలును. శ్రుతియు "యథాజ్ఞాతిభ్యాం వా, సఖిభ్యాంవా, సహగతాభ్యాం" అనివీరుభయులును, అభిన్నమిత్రులు, సజాతిబంధులు నన్నది. అగ్నియున్నచో నింద్రుడుతప్పకయుండును. సహరక్షాయను నసురదూత యగ్నిగాక, దేవదూతయగుదివ్యాగ్ని తప్పక యింద్రసంపద్యుక్తమై యుండును. ఏలయన:అగ్ని గాయత్రీ ఛందస్సు గలది. ఇంద్రవికాసమునకు మూలాధారముగాయత్రీ ఛందము

ప్రాణోప్రజ్ఞాత్మా యోవైప్రజ్ఞా, సప్రాణఃయఃప్రాణః సాప్రజ్ఞా, సహహ్యేతావస్మిన్ శరీరేవసతః, సహోత్క్రామతః, తం మాం ఆయురమృత మిత్యుపాస్స్వ" (కౌషీ-ఉప 3-2-2) ఇత్యాదులంబట్టి, గాయత్రచ్ఛందస్సుగల ప్రాణాగ్నియు, ఆయుస్స్వరూపాధిష్ఠాతయగు ప్రజ్ఞా నమూర్తీంద్రుడును

అవినాభూతులు. ప్రజ్ఞానేంద్రుడు చిల్లక్షణభూతాత్మ. వీనినే మనము పూర్వము 'సంస్కారగ్రహణయోగ్యబ్రహ్మ'యను కొంటిమి. ఇతనినే 'చేతనషష్ఠాఃధాతవః పురుషస్స్మృతః'' (చరకశరీర)అని చేతనాపురుషుడనిరి. కేనోపనిషత్తు ఈయాత్మేంద్రునే విద్యుల్లక్షణుడన్నది. మనస్సు ఇటునటు ననుధావనసేయుట, శరీరావయవములందు స్ఫురణము, ఉన్మేషనిమేషములు, మొదలగున వీయాత్మలక్షణ సౌమ్య-విద్యు-దింద్రమహిమలు. "తస్మాదాహ ఇంద్రో బ్రహ్మేతి (కౌషీ) విద్యుద్బ్రహ్మేత్యాహుః విద్యుద్ధ్యేవ బ్రహ్మ (శత14-8-7-1) 'స్తనయిత్నురేవేంద్రః' (శత॥ ఇత్యాదులంబట్టి యింద్రుడు బ్రహ్మ- సౌమ్యవిద్యుద్రూపుడు, గాయత్రచ్ఛందాగ్నిసంబంధముగలవాడు.

చిత్యాగ్నిచయనమున గర్భస్వరూపము సంపన్నమగును. అగ్నిగాయత్రిచ్ఛందము. గాయత్రికి పూర్వోక్త సౌపర్ణాఖ్యానముంబట్టి 4-6-8 యను నీమూడు విశ్రామభూములున్నవి. కనుక తదగ్ని:— 4-6-8 మాసములందు వికసిల్లుట యనివార్యము. దానితో తత్సహయోగియగు నింద్రవిద్యుత్తుయొక్క సంస్ఫురణలక్షణ వికాసముకూడ ననివార్యమే. నాలవమాసమున జతురక్షరగాయత్రియొక్కయు, ఆరవమాసమున షడక్షరగాయత్రియొక్కయు, ఏనిమిదవ మాసమున నష్టాక్షరగాయత్రియొక్కయు, సంబాధమున నింద్రవిద్యుత్స్వాభావికవిక్షేపణ - స్ఫురణలును ప్రాబల్యమునొంద

గలవు. ఛందోమాత్రాతారతమ్యమున బ్రబలమగు నింద్ర శక్తి తనవిక్షేపశక్తికారణమున గర్భపాత హేతువగుచుండుట పరిపాటిలోనిది. ఈమూడవస్థలందు బలహీనమగు గర్భము జీవింపజాలదు. సప్తమమాసపతిత గర్భమెట్లో బ్రదుకవచ్చును గాని, 4-6-8 మాసములందు, బతితమగుగర్భ మెన్నడును జీవింపజాలదు. ఈ యాశంకానివారణ కీసంస్కారము విహిత మైనది. పైమూటిలో నేదోయొక సమయమున నీసంస్కారము గావించుచో నింద్రవిద్యుత్తుశాంతమగును. గర్భపాత శంకయుండదు. ఈఛందోవిజ్ఞానముంబట్టి భారతీయవైజ్ఞానిక లీసంస్కారమునకు 4-6-8 మాసము లుపయుక్తములనిరి. చూడుడు:—

(1) చతుర్థేమాసి, షష్ఠే-అష్టమేవా గోభిల-గృహ్యా-సూ-
(2) చతుర్థేగర్భమాసే సీమంతోన్నయనమ్, ఆశ్వ-గృహ్యాసూ
(3) ప్రథమేగర్భమాసే-షష్ఠే-అష్టమేవా-పార-గృహ్యా-సూ

ఇట్లు ఛందోమాత్రల భిన్నాధారములపై సూత్రకారులు నిశ్చయించిరి. కాని, ఆయుర్వేదముతో వీనింబోల్చినచో నెనిమిదవ మాసమిందుకు దగినదిగాదోచును. ఎట్లన:-

భుక్తాన్నము:— (1) సప్తధాతువులు, (2) ఓజస్సు (3) శుక్రము, అని, స్థూల-సూక్ష్మ-సుసూక్ష్మ భేదములచే మూడవస్థలనొందుచున్నది. (1) అన్నగతస్థూలపార్థివ భాగము స్థూలసప్తధాతురూపమున బరిణతమగును. (2) సూక్ష్మవాయవ్యప్రాణమోజోరూపముగను, (3) సుసూక్ష్మ

చాంద్రసోమము, మనోరూపమునను బరిణవనుగును. ఇందు మధ్యస్థమగు నోజస్సు వాయవ్యము. ఇక "ఇంద్రతురీయాః గ్రహాఃగృహ్యాన్తే" యన్నట్లు వాయు వింద్రయుక్త మై యుండును. కనుక నోజస్సునైంద్రము, వాయవ్యము, నన వచ్చును. వాయుసహయోగమున నింద్రవాయువుల కభేద మును జెప్పవచ్చును. "అయంవావఇంద్రోయోయంపవతే" (శత 14) "యోవై వాయుఃసఇంద్ర-సవాయుః" (శత 4) "ఇంద్రోమరుద్భిః (వ్యద్రవత్) (శత 3) ఇత్యాదులచే నీవిష యముస్పష్టమే. ఇంతకును:-

ఓజస్సుఇంద్రుడు. అష్టమమాసమం దింద్రసహయోగి యగ్ని దేవత యష్టాక్షరగాయత్రీఛందః పరిపూర్ణతచే బూర్ణ సమృద్ధముగ నుండును. ఇక అగ్ని వాయువు, ఇంద్రుడు, ఈమూడును దేవతలును గ్రమముగ విశకలన, గతి, విక్షేపణ, ధర్మయుక్తులు. కనుక నీయెనిమిదవమాసమందు, గర్భపాత మునకు శంకింపవలసియుండును. కారణమేమన:- ప్రవృద్ధ మగునోజస్సు (ఇంద్రుడు) మాతనుండి గర్భమునకు, గర్భము నుండి మాతవంకకు, దిరుగుచుండును. కనుక నీమాసమనిష్ట కరము. కనుక నేగర్భిణికెదుట "నీకిప్పు డెనిమిదవనెల" యని చెప్పరాదని భిషగ్వరులనిరి. చూడుడు:-

"అష్టమేమాసిగర్భశ్చమాతృతః. గర్భతశ్చమాతా, రసవాహినీభిఃసం వాహినీభిః. ముహుర్ముహురోజః, పరస్పరత ఆదదతే, గర్భస్యాసంపూర్ణ త్వాత్ ; తస్మాత్తదాగర్భిణీ, ముహుర్ముహుర్ముదాయుక్తాభవతి, ముహుర్ము హుశ్చగ్లానా. తథాగర్భః తస్మాత్తదాగర్భస్యజన్మ వ్యాపత్తిమ,ద్భవత్యో

జసో నవస్థితత్వాత్; తంచైవమభిసమీక్ష్య - అష్టమంమాసం, అగణయ్య
మిత్యాచక్షతేకుశలాః" (చ. క శారీ)

అగణయ్యమితి:- సంగణనయా, గర్భిణ్యాం ప్రతిపాదనీయం, యదిహి
గర్భిణీగణ్యమానమష్టమమాసం, గర్భజన్మవ్యాపత్తికరం, శుక్రిణియాత్
తతోభీతాశ్యాత్ తద్భయాచ్చ గర్భస్యపాతక్షోభాత్, వ్యాపత్స్యాత్
ఇతిభావః (చక్రపాణి)

నాలుగు, ఆరు, మాసములం దింద్రవిద్యుద్వికాస మంతపూర్ణముగా నుండదు. అష్టాక్షరగాయత్రి ఛందఃపూర్ణ వికాసముతో నెనిమిదవ నెలయందు గర్భగతి చేతన (ఇంద్రుడు) సర్వాంగీణ మగును. మరియు నతనికి సమానబలప్రేరక వాయు సహయోగముకూడ ప్రాప్తమగును. ఇంద్రాగ్నులతలె ఇంద్ర వాయువులు, సమస్యాగ్రహములుగ నెంచబడినవనిము న్నె యనుకొంటిమి. ప్రతివాయువునందును నాల్గవంతు ఇంద్ర విద్యుత్తుతప్పక యుండును. వాయువును, గతిధర్మముగలదే. ఇంద్రుడును విక్షేపకుడగుచు తదనురూపుడే, కనుక నితనిని గూడ వాయుసహయోగియందురు. ఇక:-(1) నాభానేదిష్ట (2) వాలఖిల్య (3) వృషాకపి (4) ఏవయామరుత్ ఈనాల్గు ప్రాణములు సహచారులు. కనుక నేకీభవించియేగర్భస్వరూప నిష్పత్తికారణము లగుచున్నవి. ఇందు ఏవయామరుత్ అను నది ప్రసవవాయువు. వాస్తవమేమన:-

శరీరనిష్పత్తికి:- రేతస్సు - ప్రాణము-ఆత్మ-ప్రతిష్ఠ- యనునీనాలుగుపకరణము లుండవలయును. ఇందు 'నాభానే దిష్ఠ' రేతోమయతత్త్వము. దీనిసహయోగముచే రేతస్సు

యోనియందు సిక్తమగును. దానిని వాలఖిల్యనామక ప్రాణ విశేషములు వికృతముగావించును అనగా:- మస్తక, కంఠ, హస్త, వక్ష, జఠరకటిపాదాంగుల్యాది ప్రత్యంగనిర్మాణమునకై రేతోద్రవ్యమును విభజించుటవీనిపని. ఆపై (ఐతరేయమందనుక్తము, అవ్యత్రఉక్తము.) త్వష్టయను ప్రాణ విశేష మావిభక్త రేతోంశల నాయాయంగరూపముల నొందించునదని 'త్వష్టారూపాణిపింశతు' 'త్వష్టావై రేతఃసిక్తంవికరోతి' 'త్వష్టారూపాణాంరూపకృద్రూపపతిః' ఇత్యాదులవలన దెలియనగును. త్వష్టస్వయముగా సంగనిర్మితిగావింపదు కాని, యాకారమును నిర్మించుట దీనిపని. (మూసనేర్పరచును) ఆకారరూపమున కిది యధిష్ఠాత. ఇక నీయాకారములను బూర్తిగావించుట లోమత్వగస్థిమజ్జాదులతో వీనినినింపుట. వృషాకపినామముగల యింద్రునికార్యము. పిదప 'అత్రి' యనబడునట్టియు, వాఙ్మయము, ధామచ్ఛదము, పారదర్శకతాప్రతిబంధకము, నగునట్టియు, 'ఏవయామరుత్తను వాయవ్యప్రాణము అంగకాఠిన్యముంగలిగించి ప్రతిష్ఠాహేతువగుచున్నది. అంతవరకు గర్భముస్వప్రతిష్ఠలేక మాతృప్రతిష్ఠపై నాధారపడియుండును కనుక గర్భాశయమును విడచిపెట్టదు. తొమ్మిదవమాసమున నిది కలుగగనే విడువజూచును, అప్పుడేవయామరుత్సహయోగమున దీని ప్రయత్నముసఫలమగును. ఈవచనములను బరిశీలింపుడు "ఏవయామరుతాఏతద్వై కరోతి, తేనేదంసర్వమేతద్వై కృతమేతి యదిదంకించ"-

"రేతోవై నాభానేదిష్టః, రేత స్తత్ సించతి, స రేతో వికారీ భవతి, ప్రాణావై వాలఖిల్యాః, ప్రాణానేవాస్యతత్కల్పయతి, ఆత్మావై వృషాకపిః, ఆత్మానమేవాస్య తత్కల్పయతీ, ప్రతిష్ఠావా ఏవయామరుత్, ప్రతిష్ఠామేవాస్యతత్కల్పయతి, తాన్యేతానిసహచరాణీత్యాచక్షతే నాభానేదిష్టం వాలఖిల్యాం, వృషాకపిమేవయామరుతమ్, తానిసహాసంశేత్ : (ఐ॥ బ్రా॥)

1. నాభానేదిష్టః - రేతోధిష్ఠాత 2. వాలఖిల్యాః - ప్రాణాధినాయకాః (ఇంద్రియ) 3. త్వష్టా - రూపప్రవర్తకః 4. వృషాకపి - ఆత్మపరివర్తకః 5. ఏవయామరుత్ ప్రతిష్ఠాపకః, (ఇతిగర్భస్వరూపనిష్పాదకాః)

ఏవయామరుత్తువాయువు. ఇంద్రుడితని సహయోగి. అష్టమమాసమున నింద్రునకుబూర్ణ వికాసము. ఈస్థితిలో నింద్రుడీయేవయామరుత్తునకు బలమిచ్చినచో గర్భచ్యుతి యగును. అది తల్లికి-బిడ్డకు-హానిగూర్చును. కారణమేమన:- అష్టాక్షరపూర్ణ గాయత్రీసహయోగముచే బలవత్తరమగు నింద్ర విద్యుత్తు అష్టమమాసమందు, శిశుపోషణావసర రసాగమన ద్వారమగు నాళమునుండి గర్భమునకు గర్భమునుండినాళమునకు మిగులవేగముగ చంక్రమించుచుండును. అప్పుడు గర్భపాతావకాశముకలుగును. ఇంద్రవిద్యుత్తుమాతృనాళమందున్నచో తల్లిబ్రతుకును. ఆత్మప్రతిష్ఠాశూన్యమగు గర్భము నష్టమగును. అటుగాక, యది గర్భమందున్నచో గర్భము సురక్షితమగును తల్లికిగండముతప్పదు. ఇక సమానాక్రమణ ముండుచో మాతాశిశువులువ్యాధిగ్రస్తులగుదురు. ఇట్లు ఎనిమిదవ నెల యన్నివిధముల ననిష్టకాలము. కనుక దానికి బ్రతిరోధముకానలయును. అట్టిసీమంత మెనిమిదవమాసమందే యుపయుక్తమగును. ఈసుశ్రుత శారీరవచనముంజూడుడు:-

"అష్టమే(మాసి) అస్థి రోధవతి, ఓజఃస్థతి, జాతశ్చేన్నజీవేత్ నీరోజఃస్యాన్నైః, ఋతత్వాచ్చ"

ఇక:- మంత్రశక్తిసహాయమున గర్భిణి కింద్ర విరోధులును, స్పర్శమాత్రముననే బహిర్ముఖమగు నాయింద్రశక్తి నంతర్ముఖముగావించునవియు నగు పదార్థమూలసహాయోగము గూర్పవలయును. ఇంద్రుడుదివ్యప్రాణదేవత, సౌరతత్త్వము; ఇక ప్రబలమగునాసురప్రాణమాత్రమించుచో నితని స్వాభావికమగు నోజన్ను (విద్యుత్తు) శాంతించును. లోహము (ఇనుము)నం దీయాసురప్రాణము కావలసినంతయున్నది. కనుకనే లోహ మపవిత్రధాతు వనిరి. లోహనిర్మితమగు మంగలి కత్తిస్పర్శ లేకుండ 'నాందనద్వారముం దప్పించుటకు గేశాంత స్థానమునందు శిఖయుంచుట కాదేశింపబడినది. ఈయాసుర ప్రాణమింతకంటె నధికముగాగలది యేదుపంనిముల్లు(శలలీ). ఘుణాక్షరన్యాయముననో, ఒకదుష్టుని చేష్టవలననో ఇంటియందు శలలియుండుచో నాయిల్లు కేశముల కాకరమగునని నేటికిని బెద్దలెఱుంగుదురు.

ఇంద్రవిద్యుత్ప్రవేశద్వారము కేశాంతము. దీనినుపనిషత్తులందు దృతిః-'నాందనద్వార'మనిరి. ఆయుఃప్రదాతయు ఆత్మలక్షణము, చిన్మూర్తియు, నగుపీయింద్రవిద్యుత్తు ఈ యోనిద్వారమున (బ్రహ్మరంధ్రమునుండి సూర్యకేంద్రము వరకు వితతమగు సుషుమ్నాలక్షణ మహాపథముద్వారా) ఒక నిమేషమున (తనకు బ్రభమమగు నింద్రప్రాణఘన సూర్య

నుండి) మూడుమారులు వచ్చుచుబోవుచునుండును. ఈబృహ దారణ్యకవచనముజూడుడు.

"అణుఃపంథావితతఃపురాణో మాంస్పృష్టోఅనువిత్తోమయైవ
తేనధీరాఃఅపియంతి బ్రహ్మవిదః స్వర్గలోకమితఊర్ధ్వంవిముక్తాః
తస్మిన్ శుక్లనీలమాహుః పింగళంహరితంలోహితంచ
ఏషపంథాబ్రహ్మణాహానువిత్తః తేనైతి బ్రహ్మవిత్ పుణ్యకృత్తైజసశ్చ॥"

సూర్యుడేస్వర్గలోకము, ఈదృష్టితోనింద్రలక్షణమగు నాత్మ లేదా, ఆత్మలక్షణముగలయింద్రుడు ప్రతిక్షణమున్ను స్వర్గము (సూర్యు)నుండి శరీరమునకును శరీరమునుండిస్వర్గము నకును, గమనాగమనములుగావించుచుండును. ఈవచనముం జూడుడు:-

"అహరహర్వా ఏషయజ్ఞఃతాయతే, అహరహఃసంతిష్ఠతే, అహర హరేనంస్వర్గస్యలోకస్య గత్త్యైయుంక్తే, అహరహరేనేనస్వర్గంలోకంగచ్ఛతి, తస్మాదహరహరేవయుంజాత్, అహరహర్విముంచేత్" (శత 9)

లోహక్షురికచే క్షౌరకర్మగావింపబడును. లోహ మా సుర ప్రాణప్రధాన మనుకొంటిమికదా! ఇంద్రగమనాగమన రూప, కేశాంతోపలక్షిత, బ్రహ్మరంధ్రమును దీనిస్పర్శ నుండి తప్పింపవై కేశాంతస్థానమువ శిఖయుంచు టావశ్యక మగుచున్నది. ఇది హిందూత్వమునకావశ్యకమగు విజ్ఞానసిద్ధ కర్మగాని కల్పితచిహ్నముకాదని దివ్యభావము సురక్షితము గావించుకొని యనుభవించువారెఱుంగుదురు. అందుకు వ్యతి రేకులు శిఖాశూన్యత గౌరవదాయక మనుకొందురుగాక!

సీమాంతసంస్కారమునకు గావలసిన ద్రవ్యములు,

పద్ధతి, గ్రంథములందున్నవి చూడవలయును. ప్రస్తుతమందు కొన్నిటి యుపపత్తులుమాత్రమే కనుగొందము. సటాలు గ్రప్స, ఉదుంబరము, దర్భపింజులీ, త్రైణీశలలీ, వీరతరశంకు, పూర్ణచాత్ర, ఈ ప్రధానద్రవ్యసహాయోగమున నీసంస్కారము జరుగును. ఉదుంబరవృక్షముయొక్క పచ్చికాయలు రెండుగాని యంతకెక్కువగగాని కలగుత్తి ఆకులతోగూడినది, సటాలుగ్రప్సోదుంబరమను పదమునకర్థము, (సటాలు=శలాటు=పచ్చిది) ఇదిగర్భరక్షకముగ వైద్యులునంగీకరించిరి. ఈవచనములనుజూడుడు:—

"శతామధుర్కాకాశ్మర్య్యః శాలితండులచూర్ణకమ్
ఉదుంబరశిఫాక్వాథః పీతోగర్భఃసురక్షితః
పతంతం స్తంభయేదర్భం కులాలకరమృత్తికా
మధుచ్ఛాగీపయఃపీతా తథాశ్వేతాపరాజితా॥

పిడికెడుపచ్చిదర్భలకట్ట దర్భపింజులీ; జ్యోతిరూప జరాయువేష్టిత వేననామక తేజోమయోఽ ప్త్వ సంజనితమగుటచే దర్భకు గర్భరక్షణధర్మమున్నది. మూడుచారలు (నలుపు తెలుపు) ముల్లు (ఏమపంది వెండ్రుక) త్రైణీశలలి. బాణపు మొన వీరతరశంకు. ఇక నూలువడుకుట కుపయోగించు కదురు (తక్కు)పూర్ణచాత్ర; వీనినన్నిటిని నేకముగా గట్టి పత్నీలలాటమునుండి కేశాంతమువరకు విధ్యుక్తమంత్రముతో స్పర్శగావింపవలయును. భర్తయీపనిసేయునపుడు వీణాగాథులు, సోమస్తుతిరూప సామగానముగావింతురు. సోమమంద్ర ప్రియము. మరియు ధ్వనివాక్కు ఇంద్రుని ప్రాతిస్విక

రూపము. ఒక, క్రుద్ధుడు మత్తుడు నగువాడు సర్వప్రియ పదార్థముల యాతిథ్యమున సంతుష్టుడై శాంతినొందునట్లు ఇంద్రుడీసోమధర్మములచేతను, స్తోత్రధ్వనివాగ్రూప స్వస్వరూప ప్రాప్తివలనను, శాంతుడగును. పూర్వము:- కేశపద్ధతి సీమితముగావించునది యగుట నిదిసీమంత మనుకొంటిమి. ఇప్పుడు గర్భముకూడ సీమితమగుచున్నది కనుక నీకర్మ సీమంత మనదగును. 'కేశోన్నిద్విధాకరోతిభర్తా'యన్నదే యీకర్మయొక్క ముఖ్యాంగము. ఇంద్రవిద్యుత్తును శాంతింపజేయుటయే దీనికి ఫలము. ఇక నీ సూత్రకారవచనముంజూడుడు:—

"అథసీమంతోన్నయనమ్, పుంసవనవత్ ప్రథమగర్భేమాసేషష్ఠే. అష్టమేవా, తిలముద్గమిశ్రం, స్థాలీపాకంశ్రపయిత్వా, ప్రజాపతేర్హుత్వా, పశ్చాదగ్నేర్భద్రపీఠే- ఉపవిష్టాయా, యుగ్మేనసటాలుగ్రప్సేన నౌదుంబరేణ, త్రిభిశ్చదర్భపింజూలైః, త్రైణ్యాశలల్యా, వీరతరశంకునా, పూర్ణచాత్రేణచ, సీమంతమూర్ధ్వంవినయతి, భూర్భువఃస్వరితి, ప్రతిమావ్యాహృతిభిర్వా, త్రివృతమాబధ్నాతి 'అయమూర్జావతోవృక్ష ఊర్జీవఫలినీభవ' ఇతి అథాహ - వీణాగాథినౌరాజానం (సోమం) సంగాయేతాం, యోవాప్యన్యోవీరతర ఇతి. (పారస్కర గృహ్యసూ 1-15)

# 4 జాతకర్మ

దీనికిబూర్వము సుఖప్రసవముకొరకు 'సోష్యంతి' యను నొక సంస్కార మున్నది. కాలమయ్యును ప్రసవమాలస్యమగుస్థితిలో నిది కావింపబడును. కామ్యమగుట నిది షోడశసంస్కారముల లెక్కకు జేరలేదు. మంత్రపూతజలము గర్భిణిపై జల్లుట దీని యితికర్తవ్యత. గోభిలునిమతానుసారమిందు సోష్యన్తీహోమముకూడ కలదు. చూడుడు:—

"అథసోష్యన్తీహోమః ప్రతిష్ఠితేవస్త్రా పరిస్తీర్యాగ్నిమాజ్యాహుతీ జుహోతి 'యాతిరశ్చీ త్యేతయర్చా; విపశ్చిత్ పుచ్ఛమభవదితిచ పుమానయం జనిష్యగే కామామేతి నామధేయంగృహ్ణాతి యత్తద్గుహ్యమేవభవతి' గో గృసూ 2-7.

అష్టమమాసమున గావించు సీమంతసంస్కారముచే ఆత్మలక్షణము, విక్షేపణధర్మము, గల యింద్రునిగతి యవరుద్ధ మగుటలో నాత్యంతికనిరోధమగుచో సమయమయ్యు నతడు గర్భమును విడువడు. ఆపట్టువిడచుటకై యింద్రుడిందు బ్రార్థితుడగును. *తన్మంత్రప్రభావమున నింద్రుని విక్షేప శక్తి బలమగును. అంతట నేవయూమరుత్సహయోగమున జక్కగా ప్రసవమగును. పారస్కరుడు వేరుమంత్రములతో నీకర్మజెప్పినను రెండు నవిరోధులే. ఈపారస్కరపద్ధతిని జూడుడు:— "సోష్యన్తీమద్భిరభ్యుక్షతి † ఏజతుదశమాస్య

* యథావాతఃపుష్కరిణీం, సమింగయతి సర్వతః
ఏవాతేగర్భఏజతు, సహావైతుజరాయుణా,
ఇంద్రస్యాయంవ్రజస్కృతః సార్గలః సపరిశ్రియః
తమింద్రనిర్జహి, గర్భేణ, సాపరాంసహ
యథావాతోయథావనం, యథాసముద్రఏజతి,
ఏవాత్వందశమాస్య సహావేహిజరాయుణా.
దశమాసాన్ఛయానః కుమారోఅధిమాతరి,
నిరైతుజీవోఅక్షతో జీవోజీవన్త్యాధి

† ఏజతుదశమాస్యోగర్భో జరాయుణాసహా,
యథాయంవాయురేజతి యథాసముద్రఏజతి
ఏవాయం దశమాస్యో అస్రజ్జరాయుణాసహ -యజు సం॥ 8-28.

ఇతి 'ప్రాగ్యస్యైత' ఇతి, అథావరాపతనమ్, అవైతుపృశ్నిశేవలం, శునేజరాయ్వత్తవే, నైవమాంసేన పీవరీం, నకస్మింశ్చనాయతమవజరాయు పద్యతామ్"........దీనికిబిమ్మట జాతకర్మ. పుట్టినతరువాత జేయబడునదగుట నిది జాతకర్మ యనదగును. కర్మ భోక్తయగు ప్రాణిగర్భాశయమునదొమ్మిది మాసములుండి భౌతిజగత్సంసర్గమునకువచ్చెను. ఇకనిందు, రాగద్వేషాదిధర్మోపేత మానవసమాజమున జీవితము గడపుచు నపుడపుడుసంభవించు సుఖదుఃఖవ్యాధి శోకాద్యుచ్చావచభావములకు బాత్రుడై సదసత్ప్రవృత్త్యనుగామి కావలసి యుండును. వానిని సహించుటకు జాలినంత బలముండవలయును. దానికి మేధప్రతిష్ఠ. బుద్ధిబలమున కదిమూలము. ఆక్రమణరక్షకు ముఖ్యసాధనము. బుద్ధిఘనుడగునార్యుడే మేధాగుణక విజ్ఞానమును బ్రసాదించును. మరియుదీర్ఘాయు వొకటియుండవలయును. ఈరెంటినిగోరి చేయునదే జాతకర్మ.

నాళచ్ఛేదమునకు మొదటనే ఈరెండుకర్మలు దండ్రిచే సంపన్నములగును. సువర్ణము,మధువు,ఘృతము, ఈమూడు ద్రవ్యము లిందు కావశ్యకములు. సువర్ణము, తేజోమయ సౌరతత్త్వప్రతికృతి, బుద్ధిగుణకము. మధువుశుక్రవర్ధకము, రక్షకము, మేధాజనకము. ఘృతము తేజోగుణప్రవర్తకము. సువర్ణఖండముచే మధుఘృతములు మంత్రపూర్వకముగ నుత్పన్నశిశునకు ప్రాశనసేయుట మేధాజననకర్మ.

ఆయువునకు శరీరాగ్ని ప్రధానరక్షకము. అగ్నిసత్త దక్షిణభాగమునందు బ్రధానముగ నుండును. కనుక శిశువు యొక్క దక్షిణకర్ణమందు, లేదా,నాభిస్థానమందు, మంత్ర ప్రయోగముచేనాయుర్బల మాధానము సేయబడును. ఇదే ఆయుష్యకర్మ. అగ్నియేగాక:– సోముడు, బ్రహ్మ, దేవతలు, ఋషులు, పితరులు, విష్ణువు, దిక్కులు, ప్రాణాపానవ్యానోదానములు, ఋతువులు మొదలగు ప్రాకృతికపర్వములన్నియు నాయుర్ధర్మరక్షకములే. కనుక తత్తద్దేవతాకములగు నాయామంత్రములద్వారా ఆయుర్బలము లాధానముగావింపబడును. అదిఅంతయు బద్ధతిగ్రంథములందు జూడవలయును. మరియు:—

రక్షావిధియను నొకయవాంతరసంస్కారముకూడ నీజాతకర్మయందే యంతర్భావముగ నెంచబడినది. వారివారిదేశప్రాంతీయాచారములననుసరించి కావించునీకార్యము లింటబెద్దలందరకు నిప్పటికి వాడుకయందున్నవి. ఆయుర్వేదమున భగవంతుడుచరకుండుకూడ శారీరస్థానమునం దష్టమాధ్యాయమునందు:— "అథాస్యరక్షాంవిదధ్యాత్ - -అని ప్రారంభించి యెన్నోరక్షావిధులను జెప్పెను. ఇట్టివెల్ల తెలిసినవారినడిగి చక్కగా గమనించుట మంచిది. ఈజాతకర్మ సంస్కారేతికర్తవ్యతంజెప్పు నీసూత్రకారవచనముం జూడుడు:—

"జాతస్యకుమార స్యాచ్ఛిన్నాయాంనాడ్యాం,'మేధాజనాయుష్యే' కరోతి,అనామికయా, సువర్ణాంతర్హితయా, మధుఘృతేప్రాశయతి, .....

అథాయుష్యంకరోమి, నాభ్యాందక్షిణేవాకర్ణేజపతి "అగ్నిరాయుష్మాన్త్స వనస్పతిభిరాయుష్మాన్ స్తేనత్వాయుష్మంతంకరోమి"

అగ్ని, వనస్పతుల (ఫలముల)ద్వారా, సోము, ఓష ధుల (అన్నము)ద్వారా బ్రహ్మ, బ్రాహ్మణులద్వారా, దేవత, లమృతము (ప్రాణము)ద్వారా, ఋషులు వ్రతములద్వారా, పితరులు,స్వధాద్వారా,యజ్ఞపురుషుడు, దక్షిణద్వారా, సము ద్రము,నదులద్వారా స్వస్వరూపాయూరక్షజేయసమర్థులు కనుక తత్తదాయుస్సాధక విశిష్ట తత్తద్దేవతలద్వారా ఆయుః కామన గావింపబడినది. బృహదారణ్యకమందీ సంస్కార విధానమున విశేషమున్నది. అయిననువిరోధములేదు. ఆప స్తంబుడుగొంతవిశేషించెను. ఉపపత్తి యంతటను సమా నమే. పద్ధతు లందందే చూడవలయును.

## 5. నామకరణము

విజ్ఞానమునుబట్టి నామ మాత్మ కొక గ్రహము. ఐహి కాముష్మికవ్యవహారములన్నియు దీనిపై నాధారపడియున్న వి. వస్తుమాత్రపరిగ్రహమున నామము 'గ్రహ' మని పేరొందెను. (శత॥ గ్రహాపనిషద్బ్రాహ్మణముచూడుడు) సంస్కార్యమని మనమనుకొను నాత్మ,మనః ప్రాణవాక్కులను మూడుపర్వములుగలది. వీనినుండి క్రమముగ:—రూప-కర్మ-నామములు-వికసిల్లెను. రూపకర్మలకు నామముసంగ్రాహ కము. వస్తు నామశ్రవణమాత్రమున తద్రూపకర్మలు రెం

డును లక్ష్యమునంబడును. రూపకర్మసమష్టి అర్థము. నామము పదము. పద – అర్థములసముచ్చయము పదార్థము. అర్థ బ్రహ్మ - శబ్దబ్రహ్మలతాదాత్మ్యము, "ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేనసంబంధః" అను మీమాంసాసూత్రము చెప్పచున్నది. ఇంతేగాదు. సృష్టికాముక ప్రజాపతి నామములను (శబ్దతన్మాత్రలను) మూలముగాం గొనియే అర్థసృష్టియందు సమర్థుడగును. మొదటనామమునుస్మరించి తదనురూపవస్తుసృష్టి కావించును. ఇందుకు "సభూరితివ్యాహరత్ – పృథివ్యభవత్ – ఇత్యాది శ్రుతివచనములు ప్రమాణములు. అవ్యాకృతమగు సర్వసృష్టికి నామమువలన,తదనురూప రూపములవల్లనే వ్యక్తీభావముకల్గెను. ఈవచనముజూపుడు:—

తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్ తన్నామరూపాభ్యామేవవ్యాక్రియత, అసౌనామాయం, ఇదంరూపమితి, తదిదమప్యేతర్హి నామరూపాభ్యామేవ వ్యాక్రియతే అసౌనామాయం, ఇదంరూపమితి: (బృహదారణ్యకము)

నామరూపములతో బ్రజాపతి సర్వపదార్థముల నొక దానియందొక దానినాహుతముగావించి యన్నిటియందును దానాహుతుడయ్యెను. తేహైతే బ్రహ్మణోమహతీ అభ్వే మహతీయక్షే" అన్నట్లు నామరూపములా బ్రహ్మకభ్వాయక్షులు. ప్రపంచమంతయు వీనిచే నియంత్రితమైయున్నది.

"సర్వేసర్వార్థవాచకాః దాక్షీపుత్రస్యపాణినేః" అన్నట్లు అన్నినామములు సన్నియర్థములను వచించును. అనగా:— సర్వమూర్తియగు ప్రజాపతినుండి యుత్పన్నములై,

తదంశరూపములగు సర్వపదార్థములును మాత్రాతారతమ్య మున సర్వధర్మయుక్తములై సర్వమూర్తులేయగును. ప్రతి పదార్థమునందు నన్నితత్త్వములునుకలవు. పుట్టుకనుండియు నేపదార్థమునందేపదార్థమునకు ప్రాధాన్యముండునో, అది, తద్వాదన్యాయమున నాపేరుతో వ్యవహరింపబడును. ఉదా హరణమునకు మనుష్యునందు గవాశ్వాజాశ్వపితృగంధర్వాసు రాది సర్వప్రాణప్రత్యంశలున్నందున నతని నన్ని పేరులబిలువ నైయున్నను, ప్రాధాన్యము పురుషప్రాణమునకుండుటచే నా పేరుననే వ్యవహరింతుము. ప్రాణవిద్యావేత్తయగు మహాను భావుడేపదార్థము నేని యేపదార్థముగనైన బరిణతినొందింప గలడని "బ్రహ్మవిద్యాహవైసర్వం భవిష్యంతోమన్యన్తే" యనువచనమువలన స్పష్టమగుచున్నది. ప్రధానప్రాణముం బట్టి తత్పరిచయపూర్వకముగ వ్యవహారసౌకర్యముకొరకు వైజ్ఞానికులు తత్తన్నామనిర్దేశమావశ్యకముగానెంచి విధిం చిరి. సాంకేతికములు, అనురూపములునగు నీనామములచే తత్తత్సంబద్ధార్థవికాసము కలుగుచుండును. అహర్నిశలొకనిని పశువనిపిలుచుచో నతడుకాలాంతరమున పశుధర్మియేయగు ను. ఇందుకుగారణము నామానుసారార్థపరిగ్రహణమే. కనుక మనకేప్రాణము వికసింపవలయుననియుండునో అట్టినామము తోవ్యవహరించుటమంచిది. నామగ్రహణమున తద్వాచ్యార్థ ముసంగృహీతమగును. పేరునకుతగినపని అనుమాట అంద రెరింగినదే. చూడుడు, పుత్రునినామము శత్రునిదైనచో

తన్నామోచ్చారణముచే తత్సంబద్ధశత్రువునకు పుత్రునందు ఆరోపణప్రాప్తించును. అందుచేఫలితము? పుత్రునకుగూడ శత్రుబుద్ధి యుదయించును. నామసంకీర్తనోపాసనాదులందు నామమునకెంత యేని మహిమయున్నదని అనుభవజ్ఞులకు జెప్ప నక్కరలేదు.

కనుకనే శాస్త్రజ్ఞులు నామవిషయమున విశేషదృష్టి యుంచుట ఆవశ్యకమనిరి. పతంజలిదగు నీయాదేశముం జూడుడు:—

"యాజ్ఞికాః పఠంతేః దశమ్యుత్తరకాలం పుత్రస్యజాతస్యనామ విదధ్యాత్ ఘోషవదాద్యన్తరం తస్థమవ్రద్ధం త్రిపురుషానూక మనరిప్రతిష్ఠితమ్ తద్ధి ప్రతిష్ఠిత తమంభవతి ద్వ్యక్షరం చతురక్షరం వానామకృతంకుర్యాత్ నతద్ధితం ఇతి"

పదిదినములాశౌచము. కనుక పదునొకొండవదినంబున నామకరణము. నామమెట్టిది? యీఅభియుక్తవచనముం జూడుడు:—

"ఆదౌఘోషవదక్షరాన్ యరలవాన్ మధ్యేపునః స్థాపయేత్ అంతేదీర్ఘ విసర్జనీయసహితం నామప్రయుత్నాత్కృతమ్"

నామాదియందు ఘోషవుండవలయును, మధ్యయరలవాదులం దేదైన నుండదగును. చివర దీర్ఘమో విసర్గమో యుండనగును. గతమూడుతరములందలి పురుషులం దేదో యొక నామముతో సంబంధముకలిగి యుండనగును. అది శత్రునామముకారాదు. ఉచ్చారణకు గష్టమిచ్చునంత పొడుగుగా నుండరాదు. రెండు లేక నాలుగక్షరము లుండవలయును. కృదంతమేకాని తద్ధితాంతముండరాదు. అట్టినామము ప్రతిష్ఠితమము.

"హాశశిసంవారాసాదాఘోషాశ్చ" అన్నట్లు హాశ్ ప్రత్యాహారపఠిత హకారాదివర్ణములు ఘోషములు. వీనియం దొకవిధమగు నాదమున్నది అది యోజస్విగ నెంచబడినది. వంశపరంపరానురూపనామమునకు జివరతె త్ద్వర్ణ గుణకర్మ సూచక శర్మవర్మాదులను జేర్చవలయును. స్మార్తగ్రంథ ములందేకాక శ్రుతియందు నీసంస్కారమునకు గొప్పమహాత్వ మంగీకరింపబడినది. చూడుడు.

"భూతపతియగు సంవత్సర ప్రజాపతి యుషయందు రేతస్సేకముగావించెను. ఒకసంవత్సరమందు సిక్తమగు నీరే తస్సు కుమార(అగ్ని)రూపమున బరిణతిగాంచెను. పుట్టగనే కుమారుడేడ్చెను. ఏల? యని ప్రజాపతియడుగ "నాకింత వరకు బేరుపెట్టవైతివి. అనపహతపాప్ముడను. దోషయుక్తు డనై యున్నాను. కనుక నామకరణముగావింపుము." అను టయు బ్రజాపతి తత్తద్గుణకర్మానుసారము క్రమముగ 'రుద్ర,శర్వ,పశుపతి,ఉగ్ర,అశని,భవ, మహాదేవ, ఈశానయ ను నెనమిది పేరులుబెట్టెను స్వయముగ 'కుమార' నామముండ నేయున్నదికదా!*" పిమ్మట శ్రుతియిట్లనుచున్నది:- "తస్మా త్పుత్రస్యజాతస్యనామకుర్యాత్, పాప్మానమేవాస్య తదప హన్తి అపిద్వితీయం తృతీయం, అభిపూర్వమేవాస్య తత్పా ప్మానమపహన్తి (శత).

* తాన్యేతాన్యష్టావగ్నిరూపాణి - కుమారోనవమః, సైషాగ్నేః త్రివృత్తా... అనునట్లు ఒకయగ్ని కెనిమిదిరూపములు, పౌరాణికశివాష్టమూర్తు లివే, వీనిని పుష్పదంతుడు. త్వనుగ్రహస్తుంపోమః ... ఇత్యాదిరూపమున స్తుతించెను.

ఈసూత్రకారవచనములను గమనింపుడు:—

"దశమ్యాముత్థాప్య బ్రాహ్మణాన్ భోజయిత్వా పితా నామకరోతిద్వ్యక్షరం చతురక్షరంవా, ఘోషవదాది అంతరంతస్థం, దీర్ఘాభినిష్ఠానం, కృతంకుర్యాన్నతద్ధితం, అయుజాక్షర మాకారాంతంచస్త్రియైతద్ధితమ్,శర్మ బ్రాహ్మణస్య,వర్మ క్షత్రియస్య, గుప్తేతివైశ్యస్య: (పా।గృ।సూ।)

స్త్రీలనామములందు సంధ్యక్షరములుండరాదు. నక్షత్ర నదీ,వృక్షపక్షి-సర్పనామములుండరాదు. మనువిట్టి పేరులు గల యాడుపిల్లల పెండ్లియాడరా దనెను.

"నర్క్ష వృక్షనదీనామ్నీం, నాంత్యపర్వతనామికాం,
నపక్ష్యహిప్రేష్యనామ్నీం నచభీషణనామికాం॥
అవ్యంగాంగీంసౌమ్యనామ్నీం హంసవారణగామినీం,
తనులోమకేశదశనాం, మృద్వంగీముద్వహేత్ స్త్రియమ్,

చివరకు:- నామ మర్థపరిచాయకము, ఉత్తేజకమును, కనుక యథాశాస్త్రముగ వర్ణానురూప నామసంస్కారము కావలయుననియు, అనురూపనామము స్వరూపకర్మల కుత్తేజక మనియు తాత్పర్యము.

## 6. నిష్క్రమణము

జన్మించినది మొదలు మూడుమాసములవరకు శిశువు నింటినుండి బయటికి గొనిరాగూడదు. అతిసుకుమారావస్థ

యగుటచే బాహ్యసంసర్గమునఁగు శీతవాతాతపాదులచే వ్యాధి గ్రస్తుఁడు గానవకాశము కలుగును. కనుక చతుర్థమాసమున మంచితిథివారనక్షత్రములను జూచుకొని, శిశువును బయటకు గొంపోవుటయే యీ నిష్క్రమణసంస్కారము.

సుకుమారశిశువుపై నాంతరీక్ష్యము, నుభయతఃపరిచ్ఛిన్నము, అమూలము, వాయవ్యము,నగు నాస్త్రరాక్షస ప్రాణ సముదాయముయొక్క యాక్రమణము వెంటనే కలుగవచ్చును. అందువలన దివ్యబలము దూషిత మగును. ఆయుర్వేద మునూడ వివిధమాసములందు కలుగు భూతబాధలను వచించి తన్నిరోధోపాయములను విశదీకరించెను. బాహ్యసంసర్గమున గలుగు దృష్టిద్వారా శిశువునందు గుణదోషాధాన మగుట సహజము. ఈదృష్టిదోషమునుండియు, ప్రాకృతి కాసు రాక్రమణమునుండియు, రక్షించుటకు నింటియందు 'రక్షావిధి' కర్మవలె బయటికిఁబోవునపుడు నీనిష్క్రమణ సంస్కారము రక్షగావించును.

సూర్యుఁడాత్మకు బ్రతిష్ఠ. ఆసుర ప్రాణ విఘాతకుఁడు, చక్షురింద్రియమును దోషరహితముగావించును. కనుక నీ సౌరదివ్యభానముకొరకు ముందు మంత్రపూర్వకముగ శిశువునకు సూర్యుం జూపవలయును. ఈసూత్రకారవచనము జూడుడు. "చతుర్థేమాసినిష్క్రమణికా, సూర్యముదీక్షయతి 'తచ్చక్షుర్దేవహితంపురస్తాచ్ఛుక్రముచ్చరత్. పశ్యేమశరదశ్శతం' ఇత్యాది.

# 7 అన్నప్రాశనము

గర్భాశయముననున్నంతకాలము శిశువునకు మాతృభుక్తాన్నముచే పోషణజరుగును, పిమ్మట తల్లి స్తన్యపానమున బెరుగును. కాని, ఎంతకాలము? చివర కన్నబ్రహ్మోపాసన గావింపవలయును. జీవనమున కది ముఖ్యసాధనము. 6,8,9, 10,12 నెలలందెపుడైన మాతాశిశువుల స్వాస్థ్యముంబట్టి (తల్లి పాలు చాలినంతయున్నచో బాధలేదుకనుక) యన్నప్రాశన సేయవచ్చును. కన్యయగుచో 5,7 మాసములందు చేయవచ్చును. ప్రమాణవచనములు స్మృతులందు చూడవచ్చును.

అన్నమర్యాదంబట్టి వర్ణస్వరూపరక్షయుండు నని వర్ణవిజ్ఞానమం దనుకొంటిమి. కనుక ననురూపాన్నప్రాశన సంస్కారము గావించు టుచితము. మంత్రపూర్వకముగ సువర్ణ,రజతాది ఖండసహాయమున బ్రాశనకావింపవలయును. అందువలన నీసంస్కారమంతర్యామసంబంధము నొంది ముందుగూడ ననురూపాన్నప్రాశనరుచినే కల్గించును. అసదన్నప్రవృత్తిం దగ్గించును. అన్నియన్నములందు నన్నిగుణములు నుండవు కనుక తత్తద్వర్ణోచి తాన్నప్రాశనమే యుక్తము.

కామ్యవిషయకముగా సూత్రకారులు కొన్నివిశేషములను వచించియున్నట్లు

'అజమన్నాద్యకామః, తైత్తిరంబ్రహ్మవర్చసకామః' (ఆ।గృ।సూ।) ఇత్యాదులవలనను ఈక్రిందివచనమువలనను దెలియగలదు. షష్ఠేమాసేన్నప్రాశనమ్, స్థాలీపాకంశ్రపయిత్వాజ్యభాగావిష్ట్వాజ్యాహుతీర్జుహోతి, దేవీం

వాచం - - ధేనుర్వాగస్మానుపసుష్టైతుస్వాహా ఇతి వాఽణోఽణోఽథ ఇతి చద్వితీయం, స్థాలీపాకస్యజుహోతి ప్రాణేనాన్నమశీయస్వాహా, అపానేన గంధానశీయస్వాహా, చక్షుషారూపాణ్యశీయస్వాహా, శ్రోత్రేణయశోఽశీయ స్వాహా, ప్రాశనాంతేసర్వాన్రసాన్ సర్వమన్నమేకతఉద్ధృత్య, అథైనం ప్రాశయేత్, తూష్ణీం, హంతేతివా, ‘హంతకారంమనుష్యాః ఇతి శ్రుతేః,— భారద్వాజ్యా మాంసేనవాక్ప్రసారకామస్య, కపింజలమాంసేనాన్నాద్య కామస్య, మత్స్యైర్జవనకామస్య, కృకషాయా ఆయుష్కామస్య, ఆట్యా బ్రహ్మవర్చసకామస్య, సర్వైః సర్వకామస్య, అన్నపర్యాయనా, తతో బ్రాహ్మణభోజనమన్నపర్యాయనా, తతో బ్రాహ్మణభోజనమ్ పా।గృ।సూ।

# 8. చూడాకరణము

కేశఖండన మిందు ప్రధానాంగము. చూడ శిఖా, కేశపాశీ, జూటికా, జుటికా, ఇత్యాదులు పర్యాయపదములు. దివ్యభావవికాస మీకర్మఫలము. కేశలోమము లగ్నిమలములు. శారీరకవైశ్వానరాగ్ని తన జాఠరాగ్నిరూపమున జతుర్విధాన్నపరిపాకముగావించు నందువలన రస - మలము లేర్పడగా, మల మధోద్వారమున బోవును. ఇకయుచ్ఛిష్టమగు కిట్టభాగము రోమకూపములనుండి వెలువడును. కంటిపుసి, చొంగ, స్వేదము, నాసామలము, కక్షమలము, కేశలోమములు, మొదలగునవి శరీరాగ్నికి కిట్టములు. ఇందు కేశలోమములు క్రమముగ నోషధి-వనస్పతిమలములు. ఈ శ్రుతివచనము జూడుడు.

యత్రాస్యపురుషస్యమృతస్య అగ్నింవాగప్యేతి, వాతం ప్రాణః, చక్షు రాదిత్యం మనశ్చంద్రం దిశశ్శ్రోత్రం, పృథివీంశరీరం, ఆకాశంఆత్మా, ఓష ధీర్లోమాని, వనస్పతీన్ కేశాః, అప్సులోహితంచ రేతశ్చనిధీయతే" (బృహ)

అన్న మోషధి-వనస్పతి భేదమున రెండుభాగములు. (1) సోమ ప్రధాన యవగోధూమాద్యన్న మోషధినామము నను (2) అగ్ని ప్రధానములగు ఆమ్రాదిఫలములు వనస్పతి నామమునను ప్రసిద్ధములు. ఈవిషయముఅగ్నిసోమ తార తమ్యముంబట్టి యేర్పడు ప్రాధాన్యాప్రాధాన్యముంబట్టి చెప్పి నదే కాని రెంటియందును రెండుధర్మములు నుండును. (1) ఓషధుల సౌమ్యమలము లోమరూపమునను, వనస్పతుల యాగ్నేయమలము కేశరూపమునను, బరిణతినొందును. దగ్ధ రుధిరాత్మకములగు రెండుమలములును రోమకూపములనుండి వెలువడి, యాంతరిక్ష్యరూక్షవాయు (రుద్రవాయు)వుయొక్క యాక్రమణముచే రోమకూపములను వచ్చి ఘనరూపమున బరిణతములగును. ఏలయన:- ఈమలభాగము విశుద్ధశరీరా గ్నిచే నివారితమై 'వార'శబ్దవాచ్యమగును. 'వార' శబ్దము నివారితభావమును సూచించును. ఇక నందలిరకారము తన కభేదమగు లకారరూపము నొందగా (రలయోరభేదః) వాల శబ్దమేర్పడి 'వెంట్రుక' యను నర్థమిచ్చుచున్నది.

అగ్నివిష్ఠయేవాల(కేశ)ము కనుకనే ఇందగ్నినిరోధక శక్తి యుండునని 'రోమశమగుజంతువునకు జలితక్కువగ నుండు' నన్న యనుభవముంబట్టి తెలియనగును కాణమేర

మన మలభాగావరణము నైపున కగ్ని యరుగదు. శరీర తాపము యథామాత్రముగ సురక్షితమైయుండును. లోమ నిర్మిత కంబళము వస్తుతః సర్వథా శీతలము. అయినను శీత నివృత్తికి దీనిని గప్పికొందుము. ఇందువలన నగ్నినిర్గమన మవరుద్ధ మగును, లేదా, బహిర్ముఖవృత్తి యంతర్ముఖ మగును. భస్మమందు నిదే గుణముకలదు. అదియు నగ్ని మలమే కదా! భస్మోద్ధూళనవలన శీతమునివారితమగును. జననమరణాశౌచములవలనబుట్టు నశుచిభావమునకు కేశము లతో, (మలసజాతీయతచే) ఘనిష్ఠసంబంధముకలదు. కనుక నాశౌచనివృత్తికాలమున ముండన మవశ్యమగుచున్నది. లోమభాగము సౌమ్యములగు నోషధులసంబంధము గలదగు టచే స్వీయసోమగుణ ప్రభావముచే నశుచిసంసర్గ దూరముగ నుండును. కనుక లోమముండనము కావింపబడదు. కను బొమలు, కర్ణములు, ఉపస్థ మొదలగునవి వైశ్వానరాగ్ని నిర్గమద్వారములై యశుచిభావరహితములై యుండును.కనుక దీనికిని ముండనవిధిలేదు. మలభాగము ప్రధానముగ జ్ఞాన మూలక శిరోయంత్రముం బట్టుకొనును. కనుక శిరోముండ నము ముఖ్యముగ నెంచబడినది. ఇంద్ర ప్రాణరక్షణార్థమగు శిఖారక్షణము, ముండమందు నపవాద మనుకొనవచ్చును,

ఇంతకుజెప్పవలసినదేమన:- గర్భకాలము మొదల్కొంత వరకు బెదిగిన కేశములకు వపనము జరుగవలయును. తరు వాతగూడ యథాకాలమున క్షౌరకర్మ జరుగుచునేయుండును

కాని ఈ ప్రథమముండనమున కింత ప్రాముఖ్యమీ కేశము లంత ర్యామములగుటయే. అట్టి వీని ప్రథమఖండనముచే శరీరాగ్ని నిర్గమమార్గమునొంది యధికపరిమాణమున వెడలి బాలుని ప్రాణమునకు, నాయుస్సూత్రమునకు శిథిలతను దేవచ్చును. (కొందరుశిశువులు కేశఖండనకు బిమ్మటచిక్కి రోగగ్రస్తు లగుట చూచుచున్నాము.) తద్దోషపరిహారార్థము, మంత్ర బలపూర్వకముగనే యీ ప్రథమక్షౌరసంస్కారము కావింప బడుచున్నది. దీని కగ్నిరక్షణయే ప్రధానఫలమని పద్ధతి ప్రకరణములందలి మంత్రములే తెలియబరచును.

పుట్టినయేడాదిలోనో, మూడవయేటనో ఈసంస్కారము జరుగును. కులధర్మముంబట్టి యేడుసంవత్సరములలోపల నెప్పుడైన జేయనగునని సూత్రకారులెంచియున్నారు. ఉప నయనకాలముగూడ దీనికి వికల్పసమయముగ నెంచబడినది. కారణమేమన:- ఉపనయనము కానంతవరకు ద్విజాతిశూద్ర సధర్మము. దివ్యములగు యజ్ఞకర్మలయందనధికృతము.

"ప్రాగుపనయనాత్ కామచార - వాద - భక్ష్యాః నిత్యంమద్యం, బ్రాహ్మణోనుపనీతో పివర్జయేత్:" (గౌతమః)

కులాచారానుసారముగనే చౌలసంస్కారముజరుగును.

చూడుడు:—

తత్రి కాలస్తావత్ - ప్రథమే, ద్వితీయే, తృతీయే, పంచమే, సప్తమే వావర్షే గతతృతీయభాగే, అగతత్రిభాగే,వా, ఉపనీత్యాసహవా, యథాకు లాచారం చౌలంకార్యం, (గదాధరః)

ఏగోత్రర్షి పరంపరయం దేశిఖాధారణపద్ధతి ప్రచలితమైయున్నదో దానింబట్టి చూడాసంస్కారము గావింపనగును. ఆయీవిషయము లీవచనములవలన గొంత తెలియనగును.

"తత్ర కేశానాం శేషకరణం, శిఖారక్షణం, స్థాపనం, యథామంగళం, యన్యకులే యథా ప్రసిద్ధం, తస్యత్రైవ శిఖాస్థాపనంకార్యం. అత్ర కారికాయాం,

కేశ శేషంతతఃకుర్యాత్ యస్మిన్ గోత్రేయథోచితమ్.
వాసిష్ఠాదక్షిణేభాగే ఉభయతాత్రికశ్యపాః
శిఖాంకుర్వన్త్యాంగిరసః శిఖాభిఃపంచభిర్యుతాః
పరితఃకేశపంక్త్యావా, ముండాశ్చభృగవోమతాః
కుర్వన్త్యన్యేశిఖామాత్రి మంగళార్థమిహాక్వచిత్ (కారికా)

దక్షిణతః కంబుజవసిష్ఠానాం, ఉభయతో త్రికశ్యపానాం, ముండా భృగవః పంచచూడాఅంగిరసః, వాజసనేయినామేకా, మంగళార్థంశిఖినోన్యాః ఇతి (లౌగాక్షిః)

శుభదినమున బాలునిస్నాతుంజేసి శుభ్రవస్త్రధారణంజేయించి తల్లియొడినుంచికొని యగ్నికిపశ్చిమభాగమున గూర్చుండును. చల్లనినీటియందు వేడినీటిని గలిపి యాయనుష్ణశీతజలమునందు నవనీతపిండమో, ఘృతమో, లేక దధియో వైచి యానీటితో కుట్టివానిశిరస్సునందలి దక్షిణభాగ కేశములను తండ్రి "సవిత్రాప్రసూతా దైవ్యాఆపఉన్దన్తుతేతనూం,దీర్ఘాయుత్వాయవర్చసే" యనుమంత్రముచే దడిపి త్రేణీశలవిచేదువ్వును, పిదపనాపితుడు కేశవపనముగావించును. (శలలీవిషయము సీమంతమునవివృతమైనది.)

"సాంవత్సరికస్యచూడాకరణమ్, తృతీయేవాప్రతిహతే, బ్రాహ్మణాన్ భోజయిత్వా, మాతాకుమారమాదాయఆప్లావ్య, అహతేవాససీపరిధాప్యఅంకేఆదాయ, పశ్చాదగ్నేరుపవిశతి" (ఇత్యాది పారస్కరః)

ఈయాపస్తంబసూత్రములనుగూడ గమనింపుడు:—

జన్మనోధితృతీయేవర్షే - చౌలంపునర్వసో్వః (3) బ్రాహ్మణానాం భోజనముపాయన (ఉపనయన)వత్ (4) సీమంతవదగ్నేరుపసమాధానాది (5) అపరేణాగ్నింప్రాంచ ముపవేశ్యత్రేణ్యాశలల్యా త్రిభిఃదర్భపుంజీలైః, శలాలుగ్లప్సేనేతి, తూష్ణీంకేశాన్ వినీయ, యధర్షి శిఖానిదధాతి, (6) యథా వైపాకులధర్మఃస్యాత్ (ఇత్యాది)

ఇంతటితో నెనిమిదిగర్భసంస్కారములైనవి. ఇందు, మూడంతర్గర్భములు. పిమ్మటియైదును బహిర్గర్భములు. ఒక కొంపను బాగుసేయవలయుచో నెన్నిమారులో యెన్నివిధములుగనో శుద్ధిపర్చవలసియుండునుగదా! సంస్కారముల పౌనఃపున్యవిషయమునగూడ నింతే యని యెంచవలయును. ఈవచనమునాలోకింపుడు:—

"గర్భాధానవదుపేతః బ్రహ్మగర్భంసందధాతిః పుంసవనాత్ పుంసీకరోతి; ఫలస్నపనాత్ మాతా పితృజంపాప్మానమపోహతి; రేతోరక్తగర్భోపఘాతః పంచగుణః; జాతకర్మణాప్రధమమపోహతి, నామకరణేనద్వితీయం ప్రాశనేనతృతీయం, చూడాకరణేనచతుర్థం, స్నానేనపంచమం, ఏతైరష్టభిః సంస్కారైః గర్భోపఘాతాత్ పూతోభవతి" (హారీతః)

దోషమార్జకములగు నీగర్భసంస్కారములు గానిచో నతిశయాధాయకములుగ బిమ్మటగావింపబోవు ననువ్రత సంస్కారములు పనిసేయవు. మలినయుక్తవస్త్రమునకు రంగు అంటుకొనుటయందు పని జరుగదుకదా! గర్భసంస్కారములకు కేవలము దోషమార్జనమేపని.

“ఏవ మేనఃశమంయాతి బీజగర్భసముద్భవమ్” (యాజ్ఞ్యవల్క్య)

“చిత్రకర్మయథా నేకై రాగైరున్మీల్యతేశనైః
బ్రాహ్మణ్యమపితద్వత్ స్యాత్ సంస్కారైర్విధిపూర్వకైః,”
(అంగిరాః)

“గార్భైర్హోమైఃజాతకర్మ చూడామౌంజీనిబంధనైః
బైజికంగార్భికంచైనో ద్విజానామపమృజ్యతే॥” (మనుః)

ఆవియేకాక, సోష్యన్తీకర్మ, మౌంజీబంధనము, ఖట్వారోహణము, దుగ్ధపానము, తాంబూలభక్షణము, చంద్రదర్శనము, ఉపవేశనము, ఇత్యాద్యవాంతర సంస్కారములుకూడ గావింపబడును. అవి ఆయాగ్రంధములందు జూడనగును.

ప్రకృతియందలి యేపర్వామునందును విషమతయుండక పూర్ణముగనుండవలయునను నుద్దేశ్యముతో బరమకారుణికులగు మహర్షులు పరీక్షాపూర్వకముగ ననుభూతములగు విషయముల నాయావర్ణధర్మవికాసముకొరకు మనయెదుటబెట్టిన యీశాస్త్రసంస్కారములందు కొన్నిటిపేరులే మనమెరుగకుంటి మన్నచో నత్యుక్తికానప్పుడు శ్రౌతసంస్కారముల మాట యడుగనక్కరయేలేదు. ఈపట్టున నీశ్లోకముజ్ఞప్తికి వచ్చుచున్నది:—

“కోనువ్యాసః? కఃకసమనుః? కోన్వసౌయాజ్ఞవల్క్యః?
యైరుద్ఘుష్టంహితమసకృదస్మానుపిత్రేవపుత్రే,
పశ్యామస్తాన్నిరుపధికృపాసాగరాన్ లోకబంధూన్
పశ్యామోఽస్మాన్ నిరుపధితమః క్ష్మాధరాన్ బ్రహ్మబంధూన్”

# విశేషకములగు - అనువ్రతసంస్కారములు(8)

అందు

## 1 కర్ణవేధ

స్మృతిసూత్రకారులుకొంద రీసంస్కారవిధియు, నతి కర్తవ్యతయు జెప్పకున్నను కొందరుచెప్పిరి. శ్రోత్రేంద్రియమునం దతిశయాధానముగావించుట యిందు ముఖ్యమగుటచే నిది యనువ్రతసంస్కారములందు గణింపబడినది.

అన్నియింద్రియములతోడను మనసు బనియున్నను, చక్షుఃశ్రోత్రములు ప్రధానములుగ నెంచబడినవి. ఈరెండే కాక యాత్మవర్గమందు వైశ్వానరతైజసప్రాజ్ఞసమష్టిరూపభూతాత్మతో నిత్యయుక్తము, శుక్రశోణితానుగృహీతము, నగు సౌమ్యప్రజ్ఞానమనస్సుకూడ ప్రధానస్థానముకలదైయున్నది. దీనినే యీసంస్కారప్రకరణమునందు 'బ్రహ్మ' యంటిమి. సంకల్పము, దృష్టి,శ్రుతి యీమూటిప్రభావము మన జీవనముపై బడును. ఈమూటివలను శుభమును కాం క్షింతుము. పూర్వోక్తబ్రాహ్మసంస్కారములం దేడింటివలన ప్రజ్ఞానబ్రహ్మయందు ప్రధానముగ దివ్యసంస్కారగ్రహణ యోగ్యత కల్గుచున్నది. సూర్యావేక్షణ యను నిష్క్రమణ సంస్కారమువలన చక్షురింద్రియమునందు శుభదృష్టిసంస్కార యోగ్యత కలుగుచున్నది. ఇక శ్రోత్రేంద్రియము మిగులు

చున్నది. దానియోగ్యతసిద్ధించుట . కీకర్ణ వేధసంస్కారము జరుగును. భద్రశ్రవణప్రవృత్తికల్గుట దీనిముఖ్యోద్దేశ్యమని 'భద్రంకర్ణేభిః' ఇత్యాది పద్ధతిగృహీత మంత్రవర్ణనలచేతనే స్పష్టపడుచున్నది.

కర్ణశిరా వేధవలన కలుగుఫల మాయుర్వేదము చెప్ప వలయును. ఒకటిమాత్రము చెప్పవచ్చును "కర్ణ వేధవలన శిరోయంత్రసంబద్ధ జ్ఞానవాహినీనాడులు (స్నాయుతంతువులు) ప్రదీప్తములగును. అందువలన బ్రజ్ఞానజ్ఞానము ప్రదీపించి శ్రుతిధర్మగ్రహణమునందు బలవత్తరమగును." మరొకటి "సూర్యరశ్మిలు స్వాభావికజ్ఞానశక్తి ప్రభావమున, శిరోయం త్రమున స్నాయుతంతువులద్వారా జ్ఞానప్రసాదముగావింపు చుండును. సూర్యరశ్మి కీశిరోయంత్రమునం దవారపారీణ సంబంధము నేర్పరచుచో నిందధికబలమున కవకాశముండును. దీనిపై "నేద్విజాతివానికర్ణ రంధ్రమునుండి రవిచ్ఛాయ యవారపారీణము కాదో అతనింజూచి పుణ్యసంఘము వెనుకకు దిరిగిపోవును" అని ధర్మభీరుత్వ ముత్పన్నముగావింపబడినది. ఇట్టివానికి శ్రాద్ధమునందు భోజనము పెట్టరాదు. ఈవచనము లను జూడుడు:—

"కర్ణరంధ్రే రవిచ్ఛాయా, నవిశేదగ్రజన్మనః
తందృష్ట్వావిలయంయాంతి పుణ్యౌఘాశ్చపునఃపునః,
అంగుష్ఠమాత్రసుషిరా ! కర్ణానభవతోయది
తస్మైశ్రాద్ధంనదాతవ్యం, దత్తంచేదాసురంభవేత్"

ఆయా సంస్కారములందలి మంత్రము లచింత్యశక్తి గలవి కాని నిరర్థకములుకావు. ప్రకృతిగుప్తరహస్యవేత్తలగు మహర్షులచే విహితములగు కర్మల తాత్త్వికరహస్యము పూర్ణముగా నెరుంగుట యసంభవము. అంతమాత్రముననవి యప్రమాణము లనుకొనజాలము. స్థాలీపులాకన్యాయానుగమనమున, విజ్ఞాతరహస్యకర్మలంబట్టి యవిజ్ఞాతరహస్యమైనను ప్రతికర్మయందు నొకయలౌకికరహస్య మున్నదనుకొనుట యభ్యుదయనిశ్శ్రేయసహేతువు.

ఇక నీసంస్కారముయొక్క పద్ధతియేమన:- మూడవ, లేక అయిదవవత్సరమున మంచిముహూర్తమునందు గుఱ్ఱనికి మధురపదార్థము తిననిచ్చి పూర్వాభిముఖుంగావించి దక్షిణకర్ణమందు 'భద్రంకర్ణేభిః'' ఇత్యాదులను, వామకర్ణమందు: 'వక్ష్యన్తీవేదా' ఇత్యాదులను చెప్పుచు ఈక్రిందజెప్పబడిన శ్లోకానుసార శలాకలతో వేధనగావింపవలయును.

''సౌవర్ణీంరాజపుత్రస్య రాజతీవిప్రవైశ్యయోః
శూద్రస్యచాయసీసూచీ మధ్యమాష్టాంగులాత్మికా, (మదనరత్నం)

సూత్రము:— కర్ణవేధోవర్షేతృతీయే, పంచమేవా, పుష్యేందుచిత్రహరిరేవతీషుపూర్వాహ్ణే కుమారస్యమధురందత్వా, పూర్వాభిముఖాయోపవిశ్యాయ, దక్షిణంకర్ణమభిమంత్రయతే ;'భద్రంకర్ణేభిః' ఇతిసవ్యం 'వక్ష్యన్తీవేదా, ఇతిచ,అథభింద్యాత్, తతోబ్రాహ్మణభోజనమ్.

## 2 ఉపనయనము

శ్రౌతస్మార్తానుష్ఠానమూలభిత్తియగు నీసంస్కారమునకీయను వ్రతసంస్కారములం దెంతయో మహత్వమున్నది.

ఇవి లేనిచో ద్విజుని ద్విజత్వమువికసింపదు. దీని ప్రభావముచే వరచ్ఛందమునుండి వెడలినద్విజవర్గము, గాయత్ర్యాది స్వ-స్వఛందోయుక్తమగును. ఇంతవరకు జన్మదాత్రియగుమాత, మాతగను, రేతోధయుఁడు తండ్రి తండ్రిగ నుందురు. ఈ దాంపత్యభావమునుండి మొదటిదగు భౌతికజన్మకలిగినది. ఇక ఉపనయనానంతరము, సావిత్రిమాతయు, నాచార్యుడుపితయు, నగుదురు, ఇందువలన ద్వితీయమగు దివ్యప్రాణాత్మకజన్మ లభించుచున్నది. సావిత్రీక్షేత్రమందు మంత్రాత్మక బీజ (శుక్ర)ముయొక్క యాహుతివలన రెండవజన్మ యేర్పడుటచే 'ద్విజ' నామము సార్థకమై యజ్ఞాధికారము సిద్ధించును. ఇదే బ్రహ్మచర్యమను మొదటియాశ్రమము. అంతవరకు గుఱ్ఱ వాడు శూద్రునట్లవ్యవహార్యుడే.

వేదాధ్యనాదికముకొరకు బాలుడు గురుకులమున కాచార్యునొద్దకు గొంపోబడును కనుక నిదియుపనయనము "ఉప=గురోఃసమీపే వేదాధ్యయనార్థం నీయతేయేనకర్మణా తదుపనయనం,"

"గృహ్యోక్తకర్మణాయేన సమీపంనీయతేగురోః
బాలోవేదాయతద్యోగాత్ బాలస్యోపనయంవిదుః"

"ఆచార్యస్యఉపసమీపేమాణవకస్యనయం ఉపనయన శబ్దేనోచ్యతే(గదాధరః) మరియు:— "అగ్నేఃసమీపేనయనం" "సావిత్ర్యాఃసమీపేనయనం" అనికూడ నిర్వచింప వచ్చును. ఇందు ద్విజులకుగంఠమునందు 'యజ్ఞోపవీతము'

అనబడు 'యజ్ఞసూత్రము'ను వేయుదురు. కనుక నాయీ కారణములంబట్టి దీనిని ఉపనయనము, యజ్ఞోపవీతసంస్కారము, ఆచార్యకరణము, అనియు నందురు. ప్రస్తుతము పద్ధతింగూర్చి చెప్పదగినదిలేదు. ఉపపత్తింగూర్చియే విచారణ సేయుదము. అందుకు ప్రధానపర్వములివి:— (1) ఉపనయనము వర్ణక్రమముగ 8, 11, 12, వర్షములందే యేలజరుగవలయును? (2) శూద్రున కుపనయన మేలలేదు ! (3) యజ్ఞసూత్రమునకు బ్రకృతితో నేమిసంబంధము ! (4) అందలితంతు నియంత్రణ మేల !

(1) ఇందు మొదటి ప్రశ్నయందలి వర్షసంఖ్యకు బ్రధాన కారణము ఛందస్సు. ఆయాఛందస్సులవికాస మాయాసంవత్సరములం దగును. దానినిబట్టి ఆయావర్ణానురూప వీర్యవికాసమునగును; కనుక నట్లు వర్షనియమము గావింపబడినది. ఆయీ, వర్ణ - ఛందో-వీర్యవిషయము లన్నియు వర్ణవ్యవస్థావిజ్ఞానమునందు నివృతములగుటచే మరలనిందు జర్వితచర్వణము సేయబనిలేదు. ఛందోయుక్తవీర్యవికాసము కలుగునపుడే సావిత్రీసంస్కారముగావించుట యావశ్యకము. అందుచే వీర్యముసీమితమై సురక్షిత మగును. కాలాతిక్రమణ మగుచో, ఛందోమర్యాదచెడి, ఛందోఛందితప్రాణదేవతల సంస్కారగ్రహణయోగ్యత చెడును. ఎంతచెడినను, ఈయోగ్యతలోగొన్నియంశములు అనగా:— ప్రతిఛందస్సునందును 2-2 చరణములువరకు నెల్లెట్లో మిగిలియుండును కనుక నే

చివరకు బ్రాహ్మణునకు 16, క్షత్రియునకు 22, వైశ్యునకు 24, వత్సరము లుపనయనకాలావధులుగ నెంచబడినవి, అష్టాక్షర - ఏకాదశాక్షర - గాయత్రీ, త్రిష్టుప్ జగతీఛంద ముల రెండు - రెండుచరణముల సమాప్తి క్రమముగ 16, 22, 24వత్సరములం దగును. కాలాతిక్రమణమగుచో ద్విజుడు పతితసావిత్రీకుడై 'వ్రాత్యుడు' నాబడును. అప్పుడు యజ్ఞోప వీతాధికారము వేదాధ్యయనాధికారము, ఇతరశాస్త్రీయవ్యవ హారాధికారము, లేకుండ శూద్రసము డగును. ఈవచనము లను బరిశీలింపుడు.

1 అష్టవర్షం బ్రాహ్మణముపనేయాద్, గర్భాష్టమేవా, ఏకాదశ వర్షంరాజన్యం, ద్వాదశవర్షంవైశ్యం, యథామంగళంవాసర్వేషాం (పా.గృ॥సూ)

(2) ఆషోడశాద్వర్షాత్ బ్రాహ్మణస్యనాతీతః కాలోభరతి, ఆద్వా వింశాద్రాజన్యస్య, ఆచతుర్వింశాద్వైశ్యస్య, అతఊర్ధ్వంపతితసావిత్రీకాభ వన్తి నైనానుపనయేయుః, నాధ్యాపయేయుః, నయాజయేయుః, నచైభిర్వ్యవ హరేయుః, కాలాతిక్రమేనియుతవత్, త్రిపురుషంపతితసావిత్రీకాణామప త్యే సంస్కారోనాధ్యాపనమ్: (పా॥ గృ॥ సూ.)

వర్షనియమమేకాక ఋతునియముకూడ నిందు గ్రాహ్య ము. ఆయాఋతువులం దాయాఛందోవచ్ఛిన్న దేవతా ప్రాణ ముల వికాసముండును. ఆధ్యాత్మిక మగు దేవసంపత్తికి వర్ష నియమమువలె నాధిదైవిక (ప్రాకృతిక) ప్రాణసంపత్తికి ఋతు నియతియు నుండవలసినదే. ఆయా ప్రాకృతిక ఋతువులం దుపనయనముగావించుచో ప్రకృతికూడ, వికృతిరూపాధ్యా

త్మిక ప్రాణదేవతావికాసమునందు బలాధానముగావించును.
ఈవచనములవలోకింపదగినవి:—

(1) వసంతే బ్రాహ్మణముపనయీత, గ్రీష్మే రాజన్యం శరది వైశ్యం (శ్రుతి)
( ) "విప్రం వసంతే, క్షితిపం నిదాఘే, వైశ్యం ఘనాంతే, ప్రతిసంవిదధ్యాత్
మాఘాదిశుక్లాన్తిక పంచమాసాః, సాధారణా వా సకలద్విజానామ్."

ఇచ్చటనొకవిషయము, మఱువరాదు:– ఏమన:—
ప్రకృతింబట్టి వర్షఋతువే విశ్వేదేవయుక్తమై విడ్వర్ణాను
గామియగుటచే వైశ్యవర్ణమునకగ్న్యాధానకాలమయ్యె నిందు
ఆషాఢశుక్లైకాదశి మొదలు కార్తికశుక్లైకాదశివరకు, ప్రాణ
దేవతలుసుప్తులై యుందురు కనుక నాకాల ముపనయనమున
కగ్రాహ్యముగ నెంచిరి. ఇంతకు జెప్పునదేమన, ప్రాకృతి
కాధ్యాత్మికఛందోయుక్త దేవతాసంపత్తుల కళలంబట్టియే,
వర్షనియమ ఋతునియము లేర్పడినవి కనుక నవియుపకారక
ములు, మాన్యములు, ననియే.

(2) శూద్రున కుపనయన మేలలేదు? అను రెండవ
ప్రశ్నకు సమాధానము వర్ణవ్యవస్థావిజ్ఞానమునందే గతార్థ
మయినది. అయినను ప్రకరణసంగతికొరకు కించుకచూతము.
ఛందోయుక్త దేవతా ప్రాణములకు సంస్కారముండును.
శూద్రునందేదియు లేనపుడు సంస్కారమెవరికి? జన్మచేజాతి
పక్షపాతులగువారికి జెప్పనక్కరలేదు, కాని, యభినివేశమున
'గర్మచేజాతి'యనువారిచేగూడ వారి కల్పితసంస్కారవిధులం
బట్టి పరోక్షముగానైనను ఈపక్షమేస్వీకరింపబడిన దని స్పష్ట

ము కాగలదు. సంస్కారవిధానపరిజ్ఞానమునకు శాస్త్రముశరణ్య మగునపుడు ఇతికర్తవ్యతా విధానమునకుగూడ నదే శరణ్యముగ నొప్పికొనవలయును గదా! శాస్త్రము పైనిజూపిన విధమున వర్ణ,వర్ష,ఋతునియమముం జెప్పియున్నది. అందువలన శూద్రు డసంస్కార్యుడని సిద్ధమగుచున్నది. ఆయా నియములంబట్టి జాతిసంబంధము జన్మమునకు జెందిన దేయనుట కూడ తేటపడుచున్నది. కర్మతో జాతికిసంబంధమున్నచో 'అష్టమేవర్షే'యను వచనమున కర్థమేయుండదు. ఎట్లన:— ఈసంస్కారానంతరము ద్విజాతివాడు ద్విజుడనబడును. బాల్యావస్థయందు ద్విజనిబంధనకర్మ యవికసితమైయుండును. 'గర్భాష్టమే'ష్విత్యాది సిద్ధాంతముంబట్టి ద్విజసంతతి జన్మతఃద్విజాతియే యగుచున్నది. ఈవిషయమీావరకు వివృతమైనది. ఇంతకును జెప్పదలచినది:— అఛందస్కుడు,అదేవుడు,నగు శూద్రునకు, సంస్కార మగ్రాహ్య మనియే. కాని, ఉపనయనమునకు ముందగు తొమ్మిదిసంస్కారములును యథాసమయమునందు శూద్రునకును అమంత్రకములుగ జరుపవచ్చునని గుర్తుంచుకొనవలయును. ఏలయన:— మంత్రమునకు దివ్యప్రాణముతో సంబంధము గలదు. అనుపనీతుడగు శూద్రుడు ప్రకృతిచేతనే వేదాధికారములేనివాడు. ఇక మంత్రవర్జిత దేవతాసంస్కార గ్రహణయోగ్యత లేనపుడు మంత్రప్రయోగోపయోగ మేమి? ''అట్లయిచో మంత్రరహితసంస్కారమునకు మహత్వమే''మందురా? వినుడు:— సంస్కారసృష్టి

కోణములు రెండు (1) సంస్కారములందలి భౌతిక ద్రవ్యగ్రహణముచే గర్భాదుల, భూతభాగరక్షయు, బుష్టియు నభిప్రేతములు. ఇకమంత్రములు, తత్తత్ ప్రాణతత్త్వరక్షా-పుష్టులకు గారణములు. దివ్యప్రాణమునందే కాని, భూతభాగ మందరకును సమానము. కనుక భూతాత్మకములగు తొమ్మిది సంస్కారములును శూద్రునకును గావలయును. ఈవచనములను పరిశీలింపుడు:—

(1) గాయత్ర్యాబ్రాహ్మణం, నిరవర్తయత్, త్రిష్టుభారాజన్యం, జగత్యావైశ్యం, నకేనచిచ్ఛందసా, శూద్రంనిరవర్తయత్, (శ్రుతి)

(2) అమంత్రికాతుకార్యేయం, స్త్రీణామావృదశేషతః సంస్కారార్థంశరీరస్యయథాకాలంయథాక్రమం

(3) శూద్రోప్యేవంవిధః కార్యః వినామంత్రేణసంస్కృతః, నకేనచిత్ సమసృజత్ ఛందసాతంప్రజాపతిః (యమః)

(4) శూద్రోపివర్ణఃచతుర్థోపివర్ణత్వాద్ధర్మమర్హతి, వేదమంత్రాస్వధాస్వాహావషట్కారాదిభిర్వినా॥ (బ్రహ్మపురా)

(5) 'వివాహమాత్రంసంస్కారం, శూద్రోపిలభతాంసదా' అత్రసదసచ్ఛూద్రవిషయత్వేనవ్యవస్థా. సచ్ఛూద్రస్యద్వాదశ, అసచ్ఛూద్రస్యవివాహమాత్రం, ఏతేచతూష్ణీంకార్యాః, (గదాధరః)

(6) యమబ్రహ్మపురాణవచనాభ్యాం, శూద్రస్యగర్భాధాన - పుంసవన - సీమంతజాతకర్మ - నామధేయ - నిష్క్రమణ - అన్నప్రాశన - చూడాకరణవివాహాంతాః, నవసంస్కారా, విహితాః స్తేచతూష్ణీం, ఇతరేషాం నివృత్తిః, (హరిహరః)

(౩-4) ఇకయజ్ఞసూత్రముంగూర్చిన మూడునాల్గు ప్రశ్నలను జూతము. ఇందుకు మొదటయజ్ఞపదార్థస్వరూపముం జూడవలయును. ఉపవీతధారియగు యజ్ఞప్రజాపతి ననుకరించు నతనిద్విజసంతతి యజ్ఞసూత్రమును ధరించు టావశ్యకమని యెంచి యున్నది. ఆయజ్ఞప్రజాపతి తనత్రివృద్భావకారణముచే ఆధిదైవికాధిభౌతికాధ్యాత్మికయజ్ఞ భేదమున మూడు సంస్థలందు విభక్తుడై యున్నాడు.

మౌలికతత్త్వము బ్రహ్మ; యౌగికతత్త్వముయజ్ఞము; అందురు. బ్రహ్మలక్షణమౌలికతత్త్వముల యోగ మంతర్యామ - బహిర్యామ సంబంధమున రెండువిధముల నగుచుండును. ఏతత్త్వయోగయుక్తపదార్థములం దేవిధమయినయపూర్వమును బుట్టక యుక్తపదార్థములు రెండును స్వస్వరూపమున నే సురక్షితములుగనుండునో, అట్టి బహిర్యామలక్షణ తత్త్వయోగము యోగమని వ్యవహారము. ఇక నంతర్యామ లక్షణ చితిసంబంధకారణమున రెండుతత్త్వములు గ్రంధిబంధనబద్ధములై తమపూర్వరూపములను విడచి యపూర్వ - నవీనరూపమునొందుచో ఆతత్త్వయోగము యాగమనివ్యవహారము. ఇదేయజ్ఞమనియు బేర్కొందురు. ఇది:- సురాకారముబొగ్గుకలియగ నేర్పడు నపూర్వరూపమువంటి దని యెరుంగదగును.

విశ్వసృష్టి, బ్రహ్మ(మౌలికతత్త్వము)నుండి యయ్యెను. కాని, యజ్ఞముద్వారా, అనగా తత్త్వముల రాసాయనిక

మిశ్రణముద్వారమున నయ్యెను. యజ్ఞరూపయోగసంబంధ ముగబరిణతుడై ప్రజాపతి, ప్రజాసృష్టివితాన మందు సమర్థుడగుచున్నాడని ముందు తెలియగలదు. ఇంతకు:—'ఫిజిక్సు' మౌలికతత్త్వములగు బ్రహ్మయనియు, ఈమౌలికతత్త్వరాసాయనికమిశ్రణసంబంధముగల 'కెమిస్ట్రీ'యజ్ఞమనియు, ఫిజిక్సు, కెమిస్ట్రీకాధారమనియు నన్నచో నేటినవీనశిక్షితులు గ్రహింపగలరు.

మౌలికతత్త్వ మిశ్రణలక్షణ యజ్ఞస్వరూపసమర్పక బ్రహ్మభావ (తత్త్వ)ములు సంఖ్యయందెన్నియున్నను. భారతీయవైజ్ఞానికు లాయన్నిటిని విశ్వసృష్టి దృష్టితో రెండు తత్త్వములందే యంతర్భూతములుగ నెంచిరి. విశ్వస్వరూప సంపాదకములగు నారెండుతత్త్వములును, క్రమముగ: నగ్ని-సోమము లనబడు తేజ - స్నేహములు. ఇందు, (1) అగ్ని వికాసధర్మముగలది దాహకము. (2) సోమము సంకోచ ధర్మముగలది దాహ్యము. ఈ రెండిటిసమన్వయమునను జనించు నపూర్వరూపము యజ్ఞము. దీనియుత్పత్తిసోమాహుతిపై నాధారపడియున్నందున నాహుతికర్మను యజ్ఞమందురు. ఈవిధముగ 'అగ్నౌసోమాహుతిర్యజ్ఞః' 'అగ్నౌసోమాహుత్యాడుత్పన్నో౽తిశయోయజ్ఞః' అనునీయజ్ఞలక్షణములు రెండును నిర్దుష్టములె యనవచ్చును.

అగ్నిసోమబ్రహ్మ (మౌలికతత్త్వ) సమన్వయమున నుత్పన్నమగు నీయజ్ఞపదార్థము తనసంస్థలచే మూడుభాగ

ములై మూఁడులోకములకు ప్రభువగుచున్నది. కారణమే మన:- యజ్ఞస్వరూపసమర్పక మగు నగ్నిసోమయుగ్మము స్వయముగ మూఁడుసంస్థలందు విభక్తము. ఇవి క్రమముగ సౌర-పార్థివ-ప్రజాసంస్థ లని వ్యవహరింపవచ్చును. ఇందు మొదటిదగు సౌరసంస్థనుజూతము.

సహస్రాంశువగు సూర్యు డగ్నిపిండము. ఇదే సావిత్రాగ్నియనియు, చయనపరిభాషలో ఆదిత్యాగ్నియనియు నందురు. అగ్ని సహజముగ నన్నాదము. కనుక స్వస్వరూపరక్ష కాన్నాహుతిని గోరుచుండును. అందువలన నిం దవశ్యమన్న సోమ మాహుతమగుచుండు నని యెంచవలయును. ఈ సంతతసోమధారాగమనమున సృష్ట్యాదినుండి నేటివరకు దన యంశములను సృష్టిప్రక్రియయందు వ్యయపరచుచున్నను సౌరాగ్ని న్యూనముగాక యెప్పటియట్ల యుండుచున్నది. ఇదియెరింగినఋషులు సూర్యునగ్నిహోత్రమనిరి. 'సూర్యో హవాఅగ్నిహోత్రమ్' (శత). ఈయాహుతిక్రమము లేనినాడు యజ్ఞప్రక్రియ యుచ్ఛిన్నమగును. సౌరాగ్ని నిశ్శేషమగును. అంతటితో సృష్టికాలోపలక్షిత పుణ్యాహకాలము* విలీనమై ప్రళయకాలోపలక్షిత రాత్రికాలసామ్రాజ్యమేర్పడును.

---

* బ్రాహ్మంపుణ్యమహర్యచ్చ, సృష్ట్యర్థాపదనకారణమ్
వేదవృక్షోద్భవంనిత్యం, తత్పుణ్యాహం బ్రువన్తునః

"తృతీయస్యాంవై ఇతోదివిసోమఆసీత్" అన్నట్లు తృతీయమగు ద్యులోక ముపలక్షణముగ గల సూర్యునకు బరముగ నుండుటవలన 'పరమేష్ఠి'యనబడు విష్ణులోకము నందు 'బ్రహ్మణస్పతి'యను పవిత్రసోమమున్నది. సీమంత సంస్కార ప్రకరణమున జెప్పిన సోమాపహరణ వృత్తాంత మందలిసోమమిదే. సావిత్ర్యాగ్నియం దిది నిరంతర మాహుత మగుచుండుటవలన నగ్నిషోమాత్మకసంవత్సరము జన్మించును. ఇచ్చట నొకటిమాత్రము మరువరానిది. ఏమన:-సూర్యుడు స్వాయముగ సత్యాగ్ని,సత్యసోమాత్మకుడు. సంవత్సరస్వరూప మన్ననో, ఋతాగ్ని-ఋతసోమ సమన్వయమున సంపన్న మగును. అగ్నిషోమాత్మక సూర్యునుండి ప్రవర్గ్యరూపమున వెడలునట్టి, కేంద్రశూన్యము (కనుకనే) ఋతరూపమునగు నగ్ని-సోమముల యుద్గ్రాభ-నిగ్రాభములచే (హెచ్చు-తగ్గులచే) వసంతాది షడృతువుల యుత్పత్తియగును! ఋతాగ్ని యందు ఋతసోమాహుతివలన నుత్పన్నమగుటచే ఋతువని వ్యవహారము. వేదములందేకాక తదుపబృంహకములగు పురాణములందు గూడ నీవిషయకమగు విశదనిరూపణ యున్నది. చూడుడు:—

(1) సత్యమాత్రాత్మికామేవ తతోఽన్యాంజగృహేతనుం
పితృవన్మన్యమానస్య పితరస్తస్యజజ్ఞిరే
ఉత్ససర్జపితౄన్ సృష్ట్వా తతస్తామపివిభుః (విష్ణువు)

(2) ఋతమగ్నిస్తుయః ప్రోక్తః సతుసంవత్సరోమతః
జజ్ఞిరేఋతవస్తస్మాత్ ఋతుభ్యశ్చార్తవస్తథా
ఆర్తవాహ్యానుమాసాఖ్యాః పితరో*హ్యానుసూనవః
ఋతుఃపితామహోమాసాః ఆర్తశ్చాస్యసూనవః
ప్రపితామహోస్తువై దేవాః పంచాబ్దాః బ్రహ్మణఃసుతాః
(వాయువు)

(3) ప్రజాపతిఃస్మృతోయస్తు సతుసంవత్సరోమతః
సంవత్సరఃస్మృతోహ్యగ్నిః ఋతమిత్యుచ్యతేబుధైః
ఋతాత్తుఋతవోదేవాః జజ్ఞిరేఋతవస్తుతే
మాతాస్త్రార్తవాఃజ్ఞేయాః ఋతోరేతేభవన్సుతాః (ఆదిత్యపు)

ఋతువులందు, వసంతగ్రీష్మవర్షములు ఋతాగ్నిప్రధానములు. శరద్ధేమంతశిశిరములు ఋతసోమప్రధానములు. ఈ క్రిందినిర్వచనములు గమనింపదగును.

(1) యస్మిన్కాలేగ్నికణాః పదార్థేషువసంతఃభవన్తిసకాలోవసంతః
(2) యస్మిన్కాలేతిశయోగ్నిః పదార్థాన్గృహ్ణాతిసకాలోగ్రీష్మః నితరాం దహత్యగ్నిఃయస్మిన్ కాలేపదార్థాన్సకాలోనిదాఘః ఇతివా.
(3) యస్మిన్కాలేగ్నిర్వర్షీయాన్ (ప్రవృద్ధః-అతిశయేనోరూ) భవతి సకాలోవర్షా.
(4) యస్మిన్కాలేగ్నికణాః శీర్ణాభవన్తి (సోమకణాశ్చప్రవృద్ధాఃభవన్తి) సకాలఃశరత్
(5) యస్మిన్కాలేగ్నికణాహీనతాంగతాఃభవన్తి (సోమకణాశ్చపరికృద్ధతరాభవన్తి) సకాలోహేమంతః
(6) పునఃపునరతిశయేనయస్మిన్కాలేగ్నికణాః శీర్ణాఃభవన్తి (సోమకణాశ్చ ప్రవృద్ధతమాభవన్తి) సకాలఃశిశిరః

---

* ఋతుపితృతత్త్వము, మరొకచో జూడవలయును.

ప్రాణాత్మక దేవతలగ్ని ప్రధానులు. కనుక నగ్ని ప్రధానములగు మొదటిమూడుఋతువులును దేవప్రాణాత్మికలు, ఇక: ప్రాణాత్మకపితరులు సోమప్రధానులు కనుక చివరి మూడుఋతువులు సోమప్రధానము లగుటచే పితృప్రాణాత్మకలు. ఈవచనములనుజూడదగును,

(1) వసంతో, గ్రీష్మో, వర్షాః, తేదేవాఃఋతవః, శరద్ధేమంతశ్శిశిరః, తేపితరోఋతవః, (2) యఏవాపూర్వ్యతేర్ధమాసః, సదేవాః (3) యోపక్షీయతేసపితరః, (4) అహరేవదేవాః - రాత్రిఃపితరః (5) పునరహ్నః- పూర్వాహ్ణోదేవాః, అపరాహ్ణః పితరః (6) తేవాఏతేఋతవః దేవాః పితరః (శత):

ఉత్తరదిక్కునుండిదక్షిణమునకు నిరంతరము బ్రసరించు వాయవ్యఋతసోమము, దక్షిణమునుండి యుత్తరమునకు బ్రసరించు వాయవ్యఋతాగ్నియందు, ఆహుతియగుచుండుటచే ఋతూత్పత్తియగుచున్నది. షడృతుమూర్తియగు ఋతాగ్ని సోమమండలమే సంవత్సరయజ్ఞము. సౌరసంస్థాత్మకమగు నిది మొదటిదగు దేవప్రపథా నాధిదైవికయజ్ఞము. ఇందు తన ఋతుపర్వములచే ఋతుకాలమందు, అయాపదార్థముల నుత్పన్నము గావించుచుండును,

ఇక రెండవదగు నాధిభౌతికయజ్ఞము. ఇది పృథివికి సంబంధముగలది. "ఏషాంవైభూతానాంపృథివీరసః" అన్నట్లు పార్థివజగత్తు భూతప్రధానము. కనుక పార్థివయజ్ఞమాధిభౌతికయజ్ఞ మనవచ్చును. ఇందు సంవత్సరప్రజాపతి, స్వాయ

ముగ రేతోధా; సంవత్సరాగ్నిమయ ప్రాజాపత్యాంశము రేతస్సు. ఇట్లే పార్థివమగు నుషానామకాగ్ని యోని. ఇందు రేతస్సేకమగును, అందువలన అష్టమూర్తియగు కుమారాగ్ని యుత్పన్న మగును. ఈ శ్రుతిం జూడుడు:—

"అభూద్వా ఇయం ప్రతిష్ఠా - ఇతి, తద్భూమిరభవత్, తామప్రథయత్ సా - పృథివ్యభవత్ । తస్యామస్యాం ప్రతిష్ఠాయాం, భూతానిచ, భూతానాంచ పతిః సంవత్సరాయాదీక్షన్త । భూతానాంపతిర్గృహపతిరాసీత్. ఉషాః పత్నీ తద్యాని, తానిభూతాని ఋతవస్తే । అథయః సభూతానాంపతిః సంవత్సరః సః । అథయాసా - ఉషాః పత్నీ, ఔషసీసా. తానీమానిభూతానిచ, భూతానాంచ పతిః, సంవత్సరే - ఉషసి రేతోసించత్ । స - సంవత్సరే కుమారోజాయత"
(శత)

తన యవాంతరవిచిత్రరూపములం బరిణతమగు నీకుమారాగ్నియే, పిమ్మటచిత్రాగ్నియని పేరొంది, చాంద్రసోమ సహయోగమున నోషధివనస్పతి - ధాతూపధాతు - రసోపరస - విషోపవిష - పశుపక్షి - మనుష్యసరన్నృపాది - పార్థివ భౌతికసృష్టి కుపాదాన మగుచున్నది. ఈసృష్టియందలి నైచిత్ర్యమున కీచిత్రాగ్నియే మూలకారణము. చివరకు:- పార్థివాగ్ని - చాంద్రసోమయజనమున బార్థివాధిభౌతిక యజ్ఞస్వరూప నిష్పత్తియైనది. ఇదే భూతప్రజకు మూల మగు నుపాదానము.

మరి:-మూడవదగు నాధ్యాత్మికయజ్ఞము సర్వవిదితమే. మాతాపితలదాంపత్యభావమున నీయజ్ఞస్వరూపము సంపన్న

మగును. మాతృశోణిత మాగ్నేయము. పితృశుక్రము సౌమ్యము. ఈరెంటియుజననమున నాధ్యాత్మిక యజ్ఞాతిశయ ముత్పన్నమగును. ఇందువలన నస్మదాదిప్రజాస్వరూపనిష్పత్తి యగును, ఇట్లు బ్రహ్మతత్త్వము (అగ్ని-సోమతత్త్వము)మూడు భాగములై క్రమముగ సౌర,పార్థివ,జనభావ ప్రభువై మూడు రూపములం బరిణతమగుచున్నది. ఇదే త్రిధావిభక్తమగు నీ ప్రాజాపత్య యజ్ఞముయొక్క యిష్టకామప్రదాత్మత్వము.

"సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వాపురోవాచప్రజాపతిః,
అనేనప్రసవిష్యధ్వమేషవో స్త్విష్టకామధుక్" (గీత)

| యజ్ఞము | అగ్ని - సోమములు | | ఇందు చేఉత్పత్తియగునవి. |
|---|---|---|---|
| ఆధిదైవికము | సౌరసావిత్రాగ్ని<br>పారమేష్ఠ్యసోమము | — | దేవతలు. |
| ఆధిభౌతికము, | పార్థివకుమారాగ్ని<br>చాంద్రసోమము | — | భూతములు. |
| ఆధ్యాత్మికము | శోణితాగ్ని<br>శుక్రసోమము | — | ప్రజలు. |

## ప్ర జా తం తు వి తా న ము.

## "అగ్నీషోమాత్మకంజగత్"

ఇట్లు త్రిధావిభక్త నిత్యసిద్ధప్రాకృతికయజ్ఞముం బట్టియే, ఋషులు,వైధయజ్ఞము నావిష్కరింపజేసిరి. ప్రాకృతిక

యజ్ఞపర్వములంబట్టి దీనికిని అహోరాత్ర,దర్శపౌర్ణమాస, చాతుర్మాస్య పశుబంధ, సంవత్సర,రాజసూయ, వాజపేయ, చయన,అశ్వమేధధర్మయాగాద్యనేకావాంతర భేదములుకలవు వానియితికర్తవ్యత బ్రాహ్మణములందు విస్తరముగ నిరూపింప బడినది. ఈవైధయజ్ఞవిద్య భారతవర్షమూలప్రతిష్ఠ; గౌర వము. పదార్థవిద్యమరిచుటచే నేడిట్టిసర్వోపకారిణి, సర్వవిధ ఫలదాత్రి యగుయజ్ఞవిద్య బాలక్రీడోపమితమై అభ్యుదయ మునకుబదులు ప్రత్యవాయమునకు గారణమయ్యె నని తెలి సినవారి కంతర్వేదన కల్గించును.

ఇంతటితోయజ్ఞస్వరూపపరిచయమైనది. ఇక యజ్ఞ పురుషున కుత్తమాంగశోభను బెంచునట్టి సూత్రముంగూర్చి యన్వేషింతము. దానిపరిజ్ఞానము పైజెప్పిన సంవత్సరయజ్ఞ స్వరూప పరిజ్ఞానముపై నాధారపడియున్నది. సౌరసంవత్సర మండలమునే జ్యోతిషపరిభాషంబట్టి ఖగోళమందుము. వైదిక పరిభాషంబట్టి యీసంవత్సరచక్రము. అగ్న్యాత్మకసంవత్స రము. (2) కాలాత్మకసంవత్సరము. నని రెండువిధములు. ఇందు మొదటిదిముఖ్యము, రెండవదిగౌణము. సాంవత్సరి కాగ్నిభుక్తికాలము సంవత్సర మనదొడగిరి. గాని వస్తుతక 'సర్వం త్సరతి' యనువ్యుత్పత్తిచే, పరిభ్రమణశీలమగు నగ్ని యే సర్వత్సరము, అదిపరోక్షభాషంబట్టి సంవత్సరమైన దని శతపథమున (11+6-12) గలదు. మన మారెండుసంవత్సర

ములును విచారింతము. అగ్నిగర్భిత-కాలాత్మకమగు నీసంవ
త్సర చక్రస్వరూప మిట్లుండును.

| క్రాంతివృత్తముంబట్టి | | విషువద్వృత్తమునుంబట్టి | |
|---|---|---|---|
| 60 ప్రతివికళలు | 1 వికళ | 6 శ్వాసప్రాణములు | 1 పలము,విఘడియ |
| 60 వికళలు | 1 కళ | 60 విఘడియలు | 1 ఘడియ |
| 60 కళలు | 1 అంశ | 60 ఘడియలు | 1 అహోరాత్రము |
| 60 అంశలు | 1 రాశి | 30 అహోరాత్రములు | 1 మాసము |
| 12 రాసులు | 1 భగణము | 12 మాసములు | 1 సంవత్సరము |
| అంశలు 360×60 కళలు = 21600 | | శ్వాస 6×60 విఘడియలు×60 ఘడియలు = 2160శ్వాసలు = అహోరాత్రము | |

ఈరెంటిని పోల్చిచూచినచో గ్రాంతివృత్తమందలి యొకకళ విషువద్వృత్తమందలి యొకశ్వాసప్రమాణముతో సమమని తేలును. కారణము స్పష్టమే, ఎట్లన:- ఖగోళీయ చక్రమందు 360 అంశలుండును. ప్రతియంశయందు నరువదేసికళలచొప్పున 21600 కళలగును,గదా. ఈలెక్కంబట్టి 360 యంశలుగల క్రాంతివృత్తమందలి యేకాంశరూపమగు నొకయహోరాత్రమునందు 21600 శ్వాసలగును. ఈశ్వాస ప్రాణములు మనలను ప్రతిదినమును సౌరసంవత్సరచక్రముతో గలుపుచుండును.

"షట్శతానిదివారాత్రౌ సహస్రాంత్యేకవింశతిః
హంసహంసేతిహంసేతి జీవోజపతినిత్యశః"

ఇంకొకదృష్టితో నీసంవత్సరచక్రమునకు నేడువివర్తములుగలవు. గాసిని క్రమముగ, యుగము,సంవత్సరము,

అయనము, మాసము, పక్షము, అహోరాత్రము, ముహూర్తము, అనియందురు. ఇందు యుగములు 5. సంవత్సరము 1. అయనములు 2. మాసములు 12. పక్షములు 24. అహోరాత్రములు 360. ముహూర్తములు 10800. ఖగోళమందు పూర్వముచూపిన 360 యంశలలో 48 యంశలందే మన యీసంవత్సరచక్రస్వరూపము ప్రతిష్ఠితమైయున్నది. సుప్రసిద్ధవిషువద్వృత్తముచే దీని విభాజనము జరుగుచున్నది. మధ్యాకాశస్థమై పూర్వాపరవృత్తమనబడు విషువద్వృత్తము నుండి 90 యంశలపై నుత్తరధ్రువమున్నది. 90 యంశలపై దక్షిణధ్రువమున్నది. రెంటిపరిమాణము 180 యంశలు, ఖగోళాధఃప్రదేశమునింతే యనుకొన్నచో మొత్తము 360 అంశలు. ఇందు 48 యంశలే సంవత్సరచక్రస్వరూప సంపాదకములు. మధ్యస్థవిషువద్వృత్తమునుండి 24 అంశలుత్తరము. 24 అంశలుదక్షిణము. మొత్తము 48 అంశలు. వీనిపరిసరమునకు జెందిన యీమార్గమే, పితృత్రిలోకింబట్టి భూలోకమనబడును. లేదా:- పార్థివసృష్టిసంబంధము దీనితోకలదు,కనుక నిందువలన గూడ నీఖగోళాంశమును భూలోకమనవచ్చును. ఉత్తరగోళపు 24 యంశల నిందుగలుపుచో, 90 యంశలపై నుండు ధ్రువమువరకు, 66 యంశలు మిగిలియుండును. ఇట్లు ఈ 66 అంశలే విషువద్దక్షిణగోళమందు మిగిలియుండును. ఉత్తరభాగపు 66 నకు క్రమముగ 42-24 యిట్లు భాగించుచో 42నకు దగ్గరదంతరిక్షలోక మందురు. ఇదే దేవయాన

మార్గము. ఇక ధ్రువానుగతమగు 24అంశలపరిసరము ద్యులోకము. ఆత్మగతిసంబంధముగల దేవస్వర్గమిదే. ఇట్లే దక్షిణ భాగపు 24 అంశలపరిసరము శనికక్షానుగమనమువలన నధోలోక మని ప్రసిద్ధము. ఈవిధముగ 180 యంశలుగల యర్ధ ఖగోళమందు, విషువద్వృత్తమును మూలప్రతిష్ఠగనెంచి (48)+(42*24)+(42+24)=(180) ఇట్లు 5 విభాగములగును. ఇవిక్రమముగ (1) భూలోకము (2) దేవయానము (3) దేవస్వర్గము (4) పితృయాణము, (5) అధోలోకము, అని పేరొందెను.

మరియు:— విష్వద్వృత్తము ప్రతిష్ఠగా నెంచిన, 48 యంశలుగల,మధ్యభాగములోపల నారుపూర్వాపరవృత్తి ము లగును. ఎట్లన, విషుపద్వృత్తమున నుత్తరపువైపున 12,8,4,వ అంశలపైన మూడు, దక్షిణమున 12,8,4వ యంశలపై మూడును, అగును. ఇక,మధ్యది విషువద్వృత్తమనబడు నట్లు దక్షిణస్థమగు 4వ యంశవృత్తము మకరరాశిసంబంధమున మకరవృత్తమనియు, ఉత్తరస్థమగు 4వ యంశవృత్తము, కర్కరాశిసంబంధమున గర్కవృత్తమనియు, జెప్పబడినది. దక్షిణగోళాంతిమపరిధి కేంద్రస్థమగు మకరవృత్త ముత్తరాయణకాలమునకు, ఉత్తరగోళాంతిమపరిధి కేంద్రస్థమగు కర్కవృత్తము, దక్షిణాయనకాలమునకు నుపక్రమస్థానములు. అనగా నుత్తరాయణారంభము దక్షిణగోళమునుండియు, సమాప్తియుత్తరగోళమునందును, దక్షిణాయనారంభ ముత్త

రగోళమునుండియు, సమాప్తి దక్షిణగోళమునందు న గు చున్నవి.

మొత్తమీయేడు వృత్తములే వైదికపరిభాషయందు క్రమముగదక్షిణమునుండి యుత్తరమునకు, (1) గాయత్రి (2) ఉష్ణిక్కు (3) అనుష్టుప్పు, (4) బృహతి (5) పంక్తి (6) త్రిష్టుప్పు, (7) జగతియను పేరులతో వ్యవహరింపబడినవి. ఇందు మధ్యదియగు విషువద్వృత్తము బృహతియనియు, దివ్యాశ్వపరిభాషంబట్టి 'ఐతశ'యనియు, నందురు. దీనింగూర్చి ఐతశప్రలాప నామక యజ్ఞకర్మయున్నది. దానివివరణము యజ్ఞ గ్రంథములందు జూడనగును. ప్రకృతమేమనః-

ఈయేడువృత్తములే - లేదా - ఛందస్సులే 360 పగళ్లు 360 రాత్రులుగల 760 అహోరాత్రములకు జనకములు. కనుక వీనినహోరాత్రవృత్తములనియు బిలుతురు. ఇవి ఛందోవిజ్ఞానముంబట్టి చరణమునకు 6,7,8,9,10,11,12, అక్షరములుచొప్పున నాల్గుచరణములకు నొక్కొక్కటి 24,28,32,36,40,44,48, అక్షరములుగలవగును.

చూడుడు:— ఇందుసమానాంశసంబంధముంబట్టి (1) గాయత్రిజగతి (2) ఉష్ణిక్ త్రిష్టప్ (?) అనుష్టుప్పంక్తిఅని యిట్లు మూడుయుగ్మములగును. ప్రతిజంటకు అక్షరములు 72 చొ॥ నుండును. మధ్యనున్నబృహతియొక్కటియు, పాంక్త సంవత్సరయజ్ఞముద్వారా, పంచధా 72-72, సంఖ్యలందు బరిణ

మించి సర్వఛందోవితానమూలప్రతిష్ఠ యగుచున్నది. "బార్హతో వై సంవత్సరః" అన్నట్లు బృహతీఛందోవచ్ఛిన్న సౌరప్రాణమండలమే సంవత్సరము, ఒకసంవత్సరయజ్ఞమునే 72, 72, అహోరాత్రముల లెక్కనుబట్టి 360 అహోరాత్రములకు పంచఋతువులుండును. పంచచితివిజ్ఞానానుసారము, పంచ (72 కాలాత్మక)ఋతువులకుజనరకు 72పై బర్యవసానమగును. ఈ 72 పూర్ణభావఅనగా శూన్యభావసమన్వయమున 720గా బరిణతమగుచున్నది, 360 అహస్సులు 30 రాత్రులు మొత్తము సంవత్సరచక్రమున 720 పర్వము లగుచున్నది. ఈవిషయ మెంతయో విస్తరింపనలసియున్నను మరొకచోవివరింపబడుట వలన, ప్రస్తుతము చర్వితచర్వణమగునని విరమించెదము. కాని చెప్పదలచినదేమన:— రెండురెండుచొప్పున గలసి యుగ్మఛందస్సులు, ద్వాసప్తతిభావపరిణతిగాంచుచో మధ్యస్థ బృహతియొకటే స్వయముగ దనప్రాణవ్యాప్తివలన ద్వాసప్తతిభావాత్మక మగుచున్నదనియే.

తక్కినయారుఛందస్సుల కీనవాక్షరబృతిమూలప్రతిష్ఠ యనుకొంటిమి, దీనివితానమువలననే మిగిలినఛందస్సులకు వితానమబ్బినదన్నను అతిశయోక్తి కాదు. మధ్యప్రాణాత్మకము ముఖ్యము నగుఛందస్సుఇదే. ఇదే 720 అహోరాత్రములకు విభాజకమై యహోరాత్రవృత్త మనబడుచున్నది. ఇదేఖస్వస్తిక, అధఃస్వస్తిక, ఉదయబిందు, అస్తబిందు, అను నాల్గుభావములకు మూలము. ఇదే తనఋజుభావముంబట్టి

సంవత్సరమునందు, రెండుదినముల సమానాహోరాత్రము లకు ప్రవర్తకమగుచున్నది. దీనిధర్మములే యితర 6 ఛందము లకు సంక్రమించుచున్నవి. దీనిసంబంధముననే తక్కినమూడు యుగ్మములును 720 విభక్తులతోఁగూడుచున్నవి. కుటిలమార్గానుగాములగుటచే నహోరాత్రములను చిన్నవిగ బెద్ద విగ జేయు నారుఛందస్సులంమును, దీనిధర్మముల నమనము (గమనము)జరుగుచున్నదీ.

బృహతినవాత్సరము, దీనికి 9.9. చొప్పున 4 సంస్థలు, కనుక 90, 90, చొప్పుననాల్గుభాగములు,గనై 360 యంశ లగును ఇవేఅహోరాత్రస్వరూపసమర్పకములు, 'అహ్నం విభక్తయోరాత్రయః' అన్నట్లు అహర్విభాజకములు, సోమ ప్రాణమయములు 360 రాత్రులు, మొత్తము 720 అహో రాత్రవృత్తములగును. ఇట్లుబృహతి తనయక్షరమహిమచే నహోరాత్రములకు నధ్యక్షమగుచున్నది.

"సూర్యోబృహతీ మధ్యూఢ స్తపతి" 'నైవోదేతా నాస్తమేతా-మధ్యేఏకలఏవస్థాతా' ఇత్యాదిశ్రుతివచనములం బట్టి సూర్యుడీబృహత్కేంద్రమందున్నాడు ఈబృహతికి బూర్వాపరసీమాద్వయమునొరసికొనుచు విషువత్తునకుత్తరమున 24వ దక్షిణమున 24వ యంశలను స్పృశించుచు నుండు తిర్యగ్వృత్తము, క్రాంతివృత్త మందురు, ఈవృత్తముపై బృథివి తనయక్షపరిభ్రమణమున దైనందినగతికధిష్టాత్రియై సాంవత్స

రికగతి గావించుచున్నది. 24 అంశలయుచ్చావచభావములం బట్టియే యీవృత్తముతిర్యక్కగసున్నది. అందువలన రాత్రిం బగళ్లయందు హెచ్చుతగ్గులు కల్గుచున్నవి.

విషువద్వృత్తముయొక్క ప్రతియొకబిందువునుండియు నుత్తరధ్రువము, 90 యంశములపైనున్నది కనుక దీనిని 'విషువద్వృత్తీయపృష్ఠీకేంద్ర' నామమున బిలుతురు. ఇట్లు క్రాంతివృత్తముయొక్క ప్రతియొకబిందువునుండియు 90యంశలపై 'కదంబ'మున్నది కనుక దీనిని 'క్రాంతివృత్తీయపృష్ఠీకేంద్ర' నామమునబిలుతురు. విషువత్క్రాంతివృత్తముల యంతర మిరువదినాలుగంశలు. కనుక తత్పృష్ఠీకేంద్రరూప ధ్రువకదంబముల యంతరము 24 అంశలే. 24 అంశలవ్యాసార్ధము నుండి ధ్రువబిందువు ఈకదంబమునకు నలువైపుల బరిక్రమణముసేయుచున్నది. ఇట్లు, ధ్రువునియీపరిక్రమము 25000 వర్షములలో బూర్ణమగును. ధ్రువునకువిషువత్తుతో సంబంధము, ధ్రువముపరిభ్రమణశీలము, కనుక బార్ధివవిషువత్తును, మార్పునొందుచుండును. ఈపరివర్తన 'మయనపరివర్తన'మందురు. ఈ క్రాంతివృత్తము తన త్రికేంద్రభావకారణమున దీర్ఘవృత్తమై యున్నది. దీని స్వరూపనిష్పత్తి మూడుకేంద్రములవలననే యగును. మరియు నీక్రాంతివృత్త మజరము (అపరివర్తనీయము) - అనర్వా (అశిథిలము) నైయున్నది. ఇదే యాహిరణ్మయ(ఆగ్నేయ)రథమున కొకచక్రము (ఈ రథరూపసంవత్సరాగ్ని 48 అంశలపరిసరమునందు వ్యాప్తమై

యున్నది)పూర్వోక్తసప్తఛందస్సులే యీరథమును వహించు సప్తాశ్వములు. విష్వద్వృత్త మనునేకాశ్వమే తనధర్మము లను తక్కినయీరుఛందములందు నమనము గావింపుచు, నేను రూపములను ధరించుచున్నదను విషయ మీావగిఁజెప్పబడినది.

ఈవిధముగనగ్నిమండలరూపరథము, క్రాంతివృత్త రూపరథచక్రము, పూర్వాపరవృత్తసప్తకరూప సప్తాశ్వము లు, అనునీ భావములతోఁగూడి యీసంవత్సర ప్రజాపతి రోద సీత్రైలోక్యమును తనపై బ్రతిష్ఠించియుంచెను. ఉత్తరా యణ,దక్షిణాయణ,విషువత్తులు,అను నీమూఁడు నితనికి బ్రధాన పర్వములు. సంవత్స ప్రజాపతియొక్క యీరహస్యస్వరూప ముం బ్రతిపాదించు నీశ్రుతివచనముంజూడుడు:-

"సప్తయుంజన్తిరథ మేకచక్రమ్, ఏకోఽశ్వోవహతిసప్తనా మా, త్రినాభిచక్రమజరమనర్వం, యత్రేమావిశ్వాభువ నానితస్థుః" ఋక్ 1-1642.2

ఘనతేజోమయ (సావిత్రాగ్నిమయ) సూర్యహిరణ్మ యరథవివేచనసంగ్రహమిది. ఈరథముననుండి శ్రీసూర్యభగ వానుడు,(దృష్టిమండలముంబట్టి) త్రైలోక్యపరిక్రమణగావింపు చున్నాడు. సంవత్సరయజ్ఞాధిష్ఠాతయగు నీయంశుమాలి తన సహస్రరశ్మిలచే విశ్వపాలనపోషణములు గావింపుచున్నాఁడు.

వేదశాస్త్రము సాంకేతికభాషయందుజెప్పిన ప్రాకృ తికతత్త్వములను బురాణశాస్త్రము విస్పష్టభాషలోఁజెప్పినది. ఈపై విషయమున నీక్రిందివచనముల నవలోకించినచో బురా

ణముల యుపాదేయత శంకించువారు ప్రాయశ్చిత్తభాగులని యంగీకరింపవలసియుండును, చూడుడు:—

(1) నక్షత్రగ్రహసోమానాం ప్రతిష్ఠాయోనిరేవచ
ఋక్షచంద్రగ్రహాఃసర్వే విజ్ఞేయాఃసూర్యసంభవాః

( ) నక్షత్రాధిపతిస్సోమః, గ్రహరాజోదివాకరః
శేషాఃపంచగ్రహాఃజ్ఞేయాః ఈశ్వరాఃకామరూపిణః

(వాయుపు 50 అధ్యా)

(8) ఆదిత్యమూలమఖిలం, త్రైలోక్యంనాత్రసంశయః
భవత్యస్యజగత్కృత్స్నం సదేవాసురమానుషం,

(4) రుద్రేంద్రోపేంద్ర చంద్రాణాం, విప్రేంద్రాః!త్రిదివౌకసాం
ద్యుతిద్యుతిమతాంకృత్స్నా యత్తేజఃసార్వలౌకికమ్,

(5) సర్వాత్మాసర్వలోకేశో మూలంపరమదైవతం,
తతఃసంజాయతేసర్వం తత్రచైవప్రలీయతే

(6) భావాభావౌహిలోకానాం, ఆదిత్యాన్నిస్సృతౌపురా,
జగత్ జ్ఞేయోగ్రహోవిప్రా! దీప్తిమాన్సుగ్రహోరవిః

(7) యత్రగచ్ఛన్తినిధనం, జాయంతేచపునఃపునః
క్షణాముహూర్తాదివసాః నిశాపక్షాశ్చకృత్స్నశః

(8) మాసాస్సంవత్సరాశ్చైవ ఋతవోబ్దయుగానిచ
సఏవకాలాగ్నిశ్చ ద్వాదశాత్మాప్రజాపతిః
తపత్యేషద్విజశ్రేష్ఠాః త్రైలోక్యంసచరాచరం వాయుపు 53 అధ్యా

(11) సూర్య*ఏవతువృష్టీనాం స్రష్టాసముపదిశ్యతే
ధ్రువేణావేష్టితఃసూర్యఃతాభ్యాంవృష్టిః ప్రవర్తతే
ధ్రువేణావేష్టితోవాయుః వృష్టింసంహరతేపునః

(12) అతఃసూర్యరథస్యాస్య సన్నివేశంనిబోధత!
సంస్థితేనైకచక్రేణ, పంచారేణ,త్రినాభినా॥

(13) హిరణ్మయేన*భగవాన్ పర్వణాతుమహౌజసా,
సప్తవర్త్మాంధకారేణ, షట్త్రింశాకాశైకనేమినా,
చక్రేణభాస్వతాసూర్యః స్యందనేనప్రసర్పతి

(14) దశయోజనసాహస్రోవిస్తారాయామతఃస్మృతః
ద్విగుణోస్యరథోపస్థాత్ ఈషాదండప్రమాణతః

(15) సతస్యబ్రహ్మణాసృష్టః రథోహ్యర్థవశేనతు,
అసంగఃకాంచనోదివ్యోయుక్తః పరమగైఃహయైః

(16) ఛందోభిఃవాజిరూపైస్తు యతఃశుక్రఃతతఃస్థిరః
వరుణస్యందనస్యైహలక్షణైః సదృశస్తుసః.

(17) తేనాసౌసర్పతివ్యోమ్ని భాస్వతాతుదివాకరః
అథేమానితుసూర్యస్య ప్రత్యంగాని రథస్యతు.
సంవత్సరావయవైః కల్పితానియథాక్రమమ్,

(18) అహస్తునాభిఃసూర్యస్య ఏకచక్రఃసవైస్మృతః
అరాఃపంచర్తవఃతస్య-నేమిఃషడ్ఋతవఃస్మృతాః,

(19) రథనీడఃస్మృతోహ్యబ్దః, అయనేకూబరావుభౌ
ముహూర్తాఃబంధురాస్తస్య శమ్యాతస్యకలాఃస్మృతాః,

(20) తస్యకాష్ఠాఃస్మృతాఘోణా, ఈషాదండక్షణాస్తువై
నిమేషాశ్చానుకర్షోస్య ఈషాచాస్యలవాఃస్మృతాః

---

*అగ్నిర్వాఇతోవృష్టిముదీరయతి, మరుతఃసృష్టాన్నన్తి, యదాఖల్వసావాదిత్యోన్యఙ్ రశ్మిభిఃపర్యేతి. అథవర్షతి(శ్రుతి) ఆదిత్యాజ్జాయతే వృష్టిః(స్మృతి)

†వాయుర్త్వావృష్ట్యాఈశే: (శ్రుతి)

*ఆకృష్ణేనరజసావర్తమానోనివేశయన్నమృతం మర్త్యంచ, హిరణ్మయేనః విశారథేనదేవోయాతిభువనానిపశ్యన్.

(21) రాత్రిర్వరూథోధర్మోస్య ధ్వజఊర్ధ్వస్సముచ్ఛ్రితః
యుగాక్షకోటీతేతస్య అర్థకామావుభౌస్మృతౌ,

(22) సప్తాశ్వరూపచ్ఛందాంసి వహన్తేవామతోధురం,
గాయత్రీచైవత్రిష్టుప్చ అనుష్టుబ్జగతీతథా

(23) పంక్తిశ్చబృహతీచైవ ఉష్ణిక్చైవతుసప్తమం,
అక్షేచక్రంనిబద్ధంతు, ధ్రువేత్వక్షఃసమర్పితః

(24) సహచక్రోభ్రమత్యక్షః సహాక్షోభ్రమతిధ్రువః
అక్షఃసహైవచక్రేణభ్రమతే సౌధ్రువేరితః

(25) ఏవమర్థవశాత్తస్య సన్నివేశోరథస్యతు,
తథాసంయోగభాగేన సంసిద్ధోభాస్వరోరథః
తేనాసౌతరణిర్దేవః, తరసాసర్పతేదివి.

(వాయుపు 51 అధ్యా)

(26) ఇత్యేషఏకచక్రేణ సూర్యస్తూర్ణంరథేనతు,
భద్రైస్తైఃఅక్షతైరశ్వైః సర్పతేసౌదివిక్షయే,

(27) అహోరాత్రాద్రథేనాసౌ, ఏకచక్రేణతుభ్రమన్
సప్తద్వీపసముద్రాంతం, సప్తభిఃసప్తభిర్హయైః

(29) ఛందోభిరశ్వరూపైస్తైః యతశ్చక్రంతతస్థితైః
కామరూపైఃసకృద్యుక్తైః అమితైస్తైఃమనోజవైః

(30) ప్రథితైర్వచోభిరగ్ర్యైః స్తూయమానోమహర్షిభిః
సేవ్యతేగీతనృత్యైశ్చగంధర్వైరప్సరోగణైః
పతంగఃపతగైరశ్వైః భ్రమమాణోదివస్పతిః

(వాయుపు 52 అధ్యా)

(31) సూర్యాచంద్రమసోర్దివ్యే మండలేభాస్వరేఖగే
జలతేజోమయేశుక్లే వృత్తకుంభనిభేశుభే

(32) ఘనతోయాత్మకంతత్ర మండలంశశినస్స్మృతం,
ఘనతేజోమయంశుక్లం మండలంభాస్కరస్యతు

(83) విశన్తిసర్వదేవాస్తు స్థానాన్యేతానిసర్వశః
మన్వంతరేషుసర్వేషు ఋక్షసూర్యగ్రహాశ్రమాః॥ (53 అధ్యా)

ఇంతేకాక యీసంవత్సరమండలమందు, మఱి యేడు కక్ష్యావృత్తములుండును. నాడీవృత్తమునే కక్ష్యావృత్తమం దురు. వీనింగూర్చి 'సప్తస్వసారః' అనుశబ్దము ప్రయుక్త మైనది. బుధ-శుక్ర-చంద్రులు-మూవురు నంతర్గ్రహములు. మంగళ-బృహస్పతి-శనులు మూవురును బహిర్గ్రహములు. ఈరెండువిభాగములనడుమ బృధివియున్నది. బుధాదు లగు గ్రహములకు భృగ్వంగిరులు ప్రతిష్ఠగనెంచిరి. భృగువునకు ఆపః-వాయు-సోమయని మూడురూపములు. అంగిరునకు:- అగ్ని-యమ-ఆదిత్యులను మూడురూపములు. బుధుడు:- భార్గవశివవాయురూపుడు. శుక్రుడు:- భార్గవాపోమయుడు. చంద్రుడు:- భార్గవసోమమయుడు. మంగళు డాంగిరసాగ్ని మయుడు. బృహస్పతి:- ఆంగిరసాదిత్యమయుడు. శని:-ఆంగి రసయమవాయుప్రధానుడు. సూర్యుని బుధుడుపరిక్రమించు ను. అతనితరువాత శుక్రుడు, తదనంతరము, సచంద్రపృధివి, దానికిబిదపమంగళుడు, వానికిదరువాత బృహస్పతి, యతనికి బిమ్మటశని, పరిక్రమింతురు. అన్నిటికిజివరనక్షత్రమండల ము. ఈవివర్తములందు సూర్యుడు, పృధివియు, సంవత్సర స్వరూపమునం దంతర్భుక్తులు. ఇక నేడువృత్తములు మిగులు చున్నది. ఇవే సప్తనాడీవృత్తములు. దీనికివరుసగ:-సుషు మ్నా, హరికేశ-విశ్వకర్మా, విశ్వశ్రవా-సంయద్వసు-అర్వా గ్వసు-స్వరాట్ అని పేరులు. నాడ్యాత్మకములగు నీయేడు ప్రా ణములును సూర్యునుండి వెడలి బుధాదిగ్రహములతో గూడు ను. కనుక వీనిని'సూర్యస్వస'లందురు. ఈమార్గములద్వారా

సూర్య-గ్రహ-ప్రాణముల పరస్పరగమనాగమనములు జరుగును. పూర్వోక్తసప్తపూర్వాపరవృత్తములు, చక్రవహనముగావించునట్లు సప్తనాడీవృత్తములు నీవాహనకర్మ గావించుచున్నవి. మరియు:-సుప్రసిద్ధములగు సూర్యునిసప్తరశ్ములు నీకర్మ కనుగాములగుచున్నవి. ఈసప్తరశ్ములనే 'సప్తగా' యందురు. ఇట్లు కక్ష్యా(నాడీ)వృత్తములేదు, *పూర్వాపర వృత్తములేదు, రశ్మిలేదు, ఈయిరువదియొక్క పర్వములచే సంవత్సరయజ్ఞస్వరూపము సిద్ధమగుచున్నది. ఈరహస్యమున కీక్రిందివచనము ప్రమాణము.

"ఇమంరథమధియేసప్తతస్థుః, సప్తచక్రం, సప్తవహన్త్యశ్వాః
సప్తస్వసారో అభిసంనవంతే యత్రగవాం నిహితాసప్తనామ.

(ఋక్ 1.164.8)

విస్తరమస్యావమీయసూక్తమందు జూడనగు. అందు అగ్న్యాత్మక, కాలాత్మకసంవత్సర పరిజ్ఞానము చెప్పబడినది.

---

* తేషాంశ్రేష్ఠాపునః సప్తరశ్మయోగ్రహయోనయః
1 సుషుమ్నా, 2 హరికేశశ్చ, 8 విశ్వకర్మాతథైవచ
4 విశ్వశ్రవాఃపునశ్చాన్యః, 5 సంయద్వసురతఃపరమ్,
6 అర్వావసుఃపునశ్చాన్యః, 7 స్వరాడన్యఃప్రకీర్తితః
సుషుమ్నఃసూర్యరశ్మిస్తు క్షీణాంశశినమేధయత్
తిర్యగూర్ధ్వప్రచారోసౌ సుషుమ్నఃపరికీర్తితః
హరికేశఃపురస్త్వాద్యః ఋక్షయోనిఃప్రకీర్తితా
దక్షిణేవిశ్వకర్మాతు, రశ్మిర్వర్ధయతేబుధం
విశ్వశ్రవాస్తుయఃపశ్చాత్ శుక్రయోనిః స్మృతోబుధైః
సంయద్వసుస్తుయోరశ్మిః సాయోనిర్లోహితస్యతు,
షష్ఠస్త్వర్వావసురశ్మిః యోనిస్తుసబృహస్పతేః
శనైశ్చరంపునశ్చాపిరశ్మి రాప్యాయతేస్వరాట్
ఏవంసూర్యప్రభావేణ గ్రహనక్షత్రతారకాః
వర్ధన్తేవిదితాఃసర్వాః విశ్వంచేవంపునర్జగత్ (వాయుపు)

(1) 7 శని, వాయు, యమవాయురాంగిరసః } బహిర్గ్రహములు,
6 బృహస్పతి, ఆదిత్య ఆంగిరసః
5 మంగళ, అగ్ని ,, — భూమి
4 పృధివి, అగ్ని ,,
3 చంద్ర, సోమ భార్గవః } అంతర్గ్రహములు,
2 శుక్ర, ఆప ,,
1 బుధ, వాయు శివవాయుర్భార్గవః
సూర్యః అగ్ని అంగిరసః ప్రతిష్ఠ

(2) 1 విశ్వకర్మ — బుధనాడి
2 విశ్వశ్రవ — శుక్రనాడి
3 సుషుమ్న — చంద్ర, పృధివి, నాడి *
4 సంయద్వసు — మంగళనాడి
5 అర్వాగ్వసు — బృహస్పతినాడి
6 స్వరాట్ — శనినాడి
7 హరికేశః — నక్షత్రనాడి

మరియు:- 12 మాసములు, 5 ఋతువులు, * 3 లోకములు, సూర్యుడు. ఈదృష్టితోఁగూడ సంవత్సరయజ్ఞపురుషున కిరువదియొక్క యయతవములుగ నెంచబడినవి. పురుషయజ్ఞమున కివేప్రతిష్ఠ కనుక బురుషయజ్ఞమునకును, శిరః ప్రాణాదిగ నిరువదియొక పర్వములే యుండును. ఈ ప్రాకృతికయజ్ఞాధారమున నగు వైధయజ్ఞవితానమున, "ప్రకృతివద్వికృతిఃకర్తవ్యా" యనునాదేశానుసారము, ప్రణీతేధ్మాదిగ 21 పర్వములేయుండును. ఈయజ్ఞముల వివరణము మరొకచోఁ జూచుకొందము. ప్రకరణసంగతి కింతు పరిలేఖలం ప్రదర్శింతుము.

*పృథివిసంబంధముననదే అదితి- చంద్రుసంబంధముననదే సుషుమ్న

ఆధిదైవికయజ్ఞముంబట్టి; ఆధ్యాత్మికయజ్ఞము దానింబట్టి

వైధయజ్ఞము:—

| | | | | |
|---|---|---|---|---|
| 1 | 1 | శిరస్సు | ప్రణీతాః | |
| 2 | 2 | ప్రాణము | ఇధ్మః | |
| 3 | 3 | అనూకము | సామిధేన్యః | పూర్వాంగ |
| 4 | 4 | వాఙ్మనస్సులు | అఘారౌ | కర్మలు 6 |
| 5 | 5 | పంచశీర్షణ్యప్రాణములు | పంచప్రయాజాః | (1) |
| 6 | 6 | చక్షుషీ | ఆజ్యభాగౌ | |
| 7 | 1 | దక్షిణార్ధము | ఆగ్నేయపురోడాశము | ఆవాపప్ర |
| 8 | 2 | హృదయము | ఉపాంశుయాజః | ధానకర్మ |
| 9 | 3 | ఉత్తరార్ధము | అగ్నీషోమీయపురోడాశః | లు 3 |
| 10 | 1 | ఉత్తరార్ధము | సాన్నాయ్యము | (2) |
| 11 | 2 | అంతరాంసము | స్విష్టకృత్ | |
| 12 | 3 | విపుయంత్రము | ప్రాశిత్రమ్ | |
| 13 | 4 | ఉదరము | ఇడా | |
| 14 | 5 | అధస్తనప్రాణములు 3 | త్రయోనుయాజాః | ఉత్తరాంగ |
| 15 | 6 | దక్షిణబాహువు | సూక్తవాకః | కర్మలు 12 |
| 16 | 7 | వామబాహువు | శంయువాకః | (3) |
| 17 | 1 | రెండుఊరువులు | | |
| 18 | 2 | | చత్వారః పత్నీ | |
| 19 | 3 | అష్ఠీవంతములు 2 | సంయాజాః | |
| 20 | 4* | | | 6+3+ |
| 21 | 1 | పాదములు | సమష్టియజుస్సు | 12=21 |

*పూర్వము ఋతువులారంటిమి, పాంక్తమగు యజ్ఞ పర్వపంచకముంబట్టి 'హేమంతశిశిరయోః సమాసేన' అనుశ్రౌతవచనముంబట్టి శిశిరవసంతము లొకటిగనెంచి 72,72, దినములుగల 5 ఋతువులంగీకరింపబడినవి. ప్రతి ఋతువు, 16-40-16 చొ॥ త్రిపర్వము: ప్రాతస్సవనీయ 16 దినములు బాల్యావస్థ మాధ్యందినసవనీయ 40 దినములు యువావస్థ సాయం సవనీయ 16 దినములు, వృద్ధావస్థ: ఈవివరము అన్యత్రస్పష్టము.

ఇందుకుసమర్థకములుగ నీవచనములను జూడవచ్చును:-

(1) శిరోహవాఏతద్యజ్ఞస్యయత్ప్రణీతాః (2) ప్రాణఏవాస్యఇధ్మః (3) అనూకమేవాస్యసామిధేన్యః (4) మనశ్చైవాస్యవాక్చ అఘారౌ (5) ఇమఏవాస్య తేశీర్షణ్యాః పంచప్రాణాః-పంచప్రయాజాః (6) చక్షుషీ-ఆజ్యభాగౌ (7) అయమేవాస్యదక్షిణోర్ధఃఅగ్నేయఃపురోడాశః (8) హృదయమేవాస్య ఉపాంశుయాజః (9) అయమేవాస్యఉత్తరోర్ధః అగ్నీషోమీయః పురోడాశః (10) ఐంద్రింసాన్నాయ్యం (11) అంతరాంసమేవాస్యస్విష్టకృత్ (12) విషంప్రాశిత్రిమ్ (13) ఉదరమేవాస్యఇడా (14) అవాంచఃత్రయః ప్రాణాఏవత్రయోనుయాజాః (15) బాహూఏవాస్య సూక్తవాకః (16) బాహూఏవాస్యశంయువాకః 17,18,19,20 శత సోపై ప్రతిష్ఠాఊరూద్వౌ, అష్టీవంతౌద్వౌ-చత్వారఃపత్నీసంయాజాః (21) పాదావేవాస్యసమిష్టియజుః

"తాఏకవింశతిరాహుతయః ద్వౌఅఘారౌ, పంచప్రయాజాః ద్వౌ ఆజ్యభాగౌ, అగ్నేయఃపురోడాశః, తద్దశ అగ్నీషోమీయఉపాంశుయాజః, అగ్నీషోమీయఃపురోడాశః, అగ్నిస్విష్టకృత్,ఇడా, త్రియోనుయాజాః, సూక్తవాకశ్చ, శమ్యోర్వాకశ్చ అథయదేవాదఃపత్నీః సంయాజేషుసంప్రగృహ్ణాతి సమిష్టయజుశ్చ, తాఏకవింశతిరాహుతయః, ద్వాదశవైమాసాః సంవత్సరస్య, పంచఋతవః, త్రియోలోకాః, తద్వింశతిః ఏషఏవఏకవింశః యఏషతపతి సైషాగతిః, ఏషాప్రతిష్ఠా తదేతాంగతిం, ఏతాం ప్రతిష్ఠాంగచ్ఛతి.

(శత 11.2 6 10-11)

ఇంతకు:- సంవత్సరమునందు మూడుపర్వములు ప్రధానములని తేలును. ఇయ్యవిక్రాంతివృత్తసంబంధముకలవి. అట్టి త్రిపర్వముల నీక్రిందిపరిలేఖయందు జూడవచ్చును. ఈయంతకు బృహతియందలిసూర్యుడు మూలప్రతిష్ఠ:—

సంవత్సరయజ్ఞ ప్రధానసంపత్తి పర్వత్రయపరిశేషః—

| 1 | 2 | 3 |
|---|---|---|
| దక్షిణాయనము. | ఉత్తరాయణము. | విషువః |
| ప్రాతస్సవనమ్. | మాధ్యందినసవనమ్. | సాయంసవనమ్. |
| గాయత్రీ. | త్రిష్టుప్. | జగతి. |
| అగ్నిదేవతా. | ఇంద్రదేవతా. | విశ్వేదేవదేవతా. |
| బ్రహ్మవీర్యమ్. | క్షత్రవీర్యమ్. | విడ్వీర్యమ్. |
| పృథివీలోకము. | అంతరిక్షలోకము. | ద్యులోకము. |
| జ్ఞానశక్తి. | క్రియాశక్తి. | అర్థశక్తి. |
| చత్వారఆత్మా. | దక్షిణఃపక్షః | ఉత్తరఃపక్షః |
| (విషువః) | (దక్షిణః) | (ఉత్తరః) |

"సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్" ఇత్యాదులంబట్టి సంవత్సరయజ్ఞాధిష్ఠాతయగు సూర్యభగవానుడు చంద్రసహయోగముననే యథాపూర్వసృష్టిరచనయందు సమర్థుడగును. కనుక సౌరసంవత్సరయజ్ఞస్వరూప విచారణసేయుమనము చాంద్రధర్మములనుగూడ విచారింపవలయును. మరియు, చాంద్రధర్మయుక్త సౌరసంవత్సరమునే సంవత్సరయజ్ఞపూర్ణస్వరూపమని యంగీకరింపవలయును.

పృథివీపరిభ్రమణవృత్తమును క్రాంతివృత్తమన్నట్లు—ఏకతృప్తావృత్తముపై చంద్రుడు పృథివికి నలువైపుల దిరుగుచు సంవత్సరయజ్ఞముతో సంబంధపడుచున్నాడో ఆచంద్రపరిభ్రమణవృత్తమును దక్షవృత్తమందురు. సూర్యునకగ్నిమయ

(హిరణ్మయ)రథమందు క్రాంతివృత్తమను నొకచక్ర మున్న ట్లు, చంద్రరథమందును, దక్షవృత్తమను నొకచక్రము కలదు. మూడుమార్గములను చక్రములుగ నెంచుచో చంద్ర రథమునకు మూడుచక్రములగును. కనుక పురాణములందు అటనటజంద్రరథము త్రిచక్ర మనియుగలదు. మార్గములను చక్రము లనుకొన్నపిదప నాడీవృత్తములనువలె దక్షవృత్త మశ్వము లనవచ్చును. ఇదిలక్ష్యమందుంచుకొనియే 9 స్థాన మందు 10 అశ్వములనియంగీకరించిరి. ఈవిషయము ముందు స్పష్టపడును. సూర్యమండలమున మూడుపర్వములున్నట్లే చంద్రమండలమందును మార్గాత్మక పర్వత్రయముగలదు. అశ్వములందుమాత్రమే భేదము. సూర్యరథమును సప్తఛందో రూపాశ్వములు వహించును. చంద్రరథమును నాడీవృత్తోప లక్షిత నవాశ్వములు వహించును. ఆయీవిషయములను సంగ్రహింతము:—

అశ్విన్యాది 27 నక్షత్రములు, గ్రహములు, మొద లగునవి 48 అంశలుగల పరిసరమునందున్నవి. కనుక సౌర సంవత్సరమువీని కధిపతియందురు. ఈసంవత్సరచక్రమందలి గ్రహనక్షత్రాదుల మార్గములు ఛందోనువర్తులగునుచ్చావ చభావములం బట్టి మూడుభాగములుగ నెంచిరి. ఖగోళీయ మగు సాంవత్సరికగ్రహనక్షత్రమండలము నుత్తర-మధ్యమ- దక్షిణభేదమున మూడుభాగములుసేయుదు. దృశ్యమండల ముంబట్టి దక్షిణమందలి గ్రహనక్షత్రసంఖ్యచిన్నది. మధ్యది

పెద్దది. ఉత్తమందలి దన్నిటికంటెపెద్దది. ఈసాదృశ్యముం గొని యీమార్గముల నుత్తరమునుండి క్రమముగ ఐరావత మార్గము జరద్గవమార్గము, వైశ్వానరమార్గము, అని పేరులు పెట్టిరి ఏనుగు-ఎద్దు మేక వీనికిగల యుచ్చావచభావ మిం దర యనగును.

ఈమూడును సంవత్సరరూప నగరమునకు రాజమార్గములు, రాజమార్గమునకు సందులవలె నీరాజమార్గమందు నొక్కొక్కదానికి 3 చొప్పున వీధులుకలవు. ఇయ్యవి నాక్షత్రిక సర్పమునకు జెందినవి. అశ్విన్యాది 27 నక్షత్రములున్న క్రమ ముంబట్టి నాక్షత్రికమండలము సర్పాకారమగును. మరియు, నీమూడుమార్గములును ఖగోళీయ సంవత్సర చక్రమునందు మూడుఖండములు. ప్రతిఖండమునందు 9, 9, చొప్పున నక్షత్రములు భుక్తములగును. ఒక్కొక్కవీధియందు అశ్వి న్యాదిగ మూడుమూడునక్షత్రము లంతర్భుక్తము లగును. ఇట్లు మూడుమార్గములందు 9 వీధులు, అందు 27 నక్షత్ర ములు నుపభుక్తములు. ఈవిషయ మీవ్యాసవచనములు స్పష్టీకరించును.

"సర్వగ్రహాణాంత్రీణ్యేవ స్థానానిద్విజసత్తమ!
స్థానంజరద్గవంమధ్యే; తథైరావతముత్తరమ్(మమ్)
వైశ్వానరందక్షిణతః నిర్దిష్టమిహతత్త్వతః
అశ్వినీకృత్తికాయామ్యా 'నాగవీధీతిశబ్దితా
రోహిణ్యార్ద్రామృగశిరా, గజవీధీత్యభిధీయతే
పుష్యాశ్లేషాతథాదిత్యా వీధీచైరావతీస్మృతా
ఏతాస్తువీథయస్తిస్ర ఉత్తరోమార్గఉచ్యతే

తథాద్వేచార్యః ఫాల్గునా మఘాచైవార్షభీమతా
హస్తచిత్రాతథాస్వాతి గోవీధీతిచశబ్దితా
జ్యేష్ఠావిశాఖానురాధా వీధీజారద్గవీమతా
ఏతాస్తువీధయస్తిస్రః మధ్యమోమార్గఉచ్యతే
(మూల)పూర్వాషాఢోత్తరాషాఢా సాజవీధశ్శభిశబ్దితా
శ్రవణంచధనిష్టాచ మార్గీ శతభిషక్ తథా
వైశ్వానరీభాద్రపదే రేవతీచైవకీర్తితా.
ఏతాస్తువీధయస్తిస్త్రో దక్షిణోమార్గఉచ్యతే (వాయుపు)

నవవీధాత్మకములు, త్రిమార్గపరిభుక్తములు, నగునీ 27 నక్షత్రములకు (1) అశ్విన్యాది పూర్వాభాద్రాంతము (2) భరణ్యాద్యుత్తర-భాద్రాంతము. (3)కృత్తికాది రేవత్యంతము, మూడునాడులుండును, ఇవిజ్యోతిశ్శాస్త్రమందు, క్రమముగ ఆది-మధ్య-అంత-నాడులని ప్రసిద్ధములు. ఈ నాడీసంబంధము ననే పురాణములందు, నాడీసర్ప, నాక్షత్రిక సర్పశబ్దములు చెప్పబడినవి. ఈయెమటి పరిలేఖంజూడుడు:—

| | | | | |
|---|---|---|---|---|
| అశ్విని | భరణి | కృత్తిక | నాగవీధి 1 | [illegible] |
| ఆర్ద్రి | మృగశిర | రోహిణి | గజవీధి 2 | |
| పునర్వసు | పుష్యమి | ఆశ్లేష | ఐరావతీవీధి 3 | |
| ఉత్తరఫల్గుని | పూర్వఫల్గుని | మఘా | ఆర్షభీవీధీ 4 | [illegible] |
| హస్త | చిత్త | స్వాతి | గోవీధి 5 | |
| జ్యేష్ఠ | అనూరాధ | విశాఖ | జారద్గవీవీధి 6 | |
| మూల | పూర్వాషాఢ | ఉత్తరాషాఢ | అజవీధి 7 | [illegible] |
| శతభిషక్ | ధనిష్ట | శ్రవణం | మార్గీవీధి 8 | |
| పూర్వాభాద్ర | ఉత్తరాభాద్ర | రేవతి | వైశ్వానరీవీధి 9 | |
| ఆదినాడి | మధ్యనాడి | అంతనాడి | | |
| 1 | 2 | 3 | | |

పూర్వాపరార్ధఖగోళమును 180 అంశలవిభాగముం జేయుచు, 48 యంశలసంవత్సరచక్రమున నుత్తరదక్షిణములందు 42, 42, అంశలందు దేవ-పితృయానమార్గములని చూపితిమి. ఉత్తరమున జిట్టచివరిదినాగవీథి, దక్షిణమునజిట్టచివరిది వైశ్వానరవీథి. ఈరెండువీథులకావలివైపున నే యీరెండు మార్గములు నని యీపురాణవచనము లెరుకపరచును.

(1) ఉత్తరంయదగస్త్యస్య అజవీథ్యాశ్చదక్షిణం,
పితృయాణఃసవైపంథా వైశ్వానరపథాద్బహిః
(2) నాగవీథ్యుత్తరంయచ్చ సప్తర్షిభ్యశ్చదక్షిణం
ఉత్తరఃసవితుఃపంథా దేవయానస్తుసస్మృతః
వాయుపు 50 అధ్యా

త్రిమార్గపరిభుక్తములగు నీతొమ్మిదివీథులందలి నక్షత్రములకు నధిపతియగుట నుడుపతియను ఘనతోయాత్మకుడగు చంద్రుడు తనదక్షవృత్తముపై బరిక్రమించుచున్నాడు. సూర్యరథ మగ్నిమయము, చంద్రరథము సోమమయము. మూడుమార్గములు మూడుచక్రము లనుకొన్నచో చంద్రరథము మూడుచక్రములుకలది. వీథులన తొమ్మిదియశ్వములు. దక్షవృత్తమనున దొకయశ్వము. మొత్తమీచంద్రరథమునకు బదియశ్వములు.

"ఘనతోయాత్మకం తత్రమండలంశశినః స్మృతమ్
"తరణికిరణసంగాదేవపానీయపిండః దినికరదిశిచంచచ్చంద్రికాభిఃచకాస్తి"

అన్నట్లు ఘనతోయాత్మకుడగు నీచాంద్రరథస్వరూపముం జూపునీసూత్రవచనములవలోకింపుడు:—

(1) వీథ్యాశ్రయాణిచరతి నక్షత్రాణితథాశశీ
హ్రాసవృద్ధీతథైవాస్య రశ్మీనాంసూర్యవత్ స్మృతే
శతారైశ్చత్రిభిఃచక్రైః యుక్తఃశుక్లైర్హయోత్తమైః
దశభిస్త్వకృశైఃదివ్యైః అసంగైస్తైర్మనోజవైః
సకృద్యుక్తైరథేతస్మిన్ వహంతేచాయుగక్షయాత్
సంగృహీతోరథేతస్మిన్ శ్వేతచక్షుఃశ్రవాస్తువై
అశ్వాస్తమేకవర్ణాస్తే వహంతేశంఖవర్చసమ్
పయుశ్చ[1], త్రిమనాశ్చైవ[2], వృషో[3], రాజీవలో[4]హయః[5]
అశ్వో[6]వామ[7]తురణ్యశ్చ హంసో[8]వ్యోమీ[9]మృగ[10]స్తథా
ఇత్యేతేనామభిస్సర్వే దశచంద్రమసోహయాః
ఏతేచంద్రమసందేవం, వహంతిదివసక్షయాత్
దేవైఃపరివృతఃసోమః పితృభిశ్చైవగచ్ఛతి
సోమస్యశుక్లపక్షాదౌ భాస్కరేపురతఃస్థితే

వాయుపు 53అధ్యా

వీథ్యాశ్రయాణిచరతి నక్షత్రాణినిశాకరః
త్రిచక్రోభయతోశ్వశ్చ విజ్ఞేయస్తస్యవైరథః

(లింగపు 65)

చాంద్ర మండలావచ్ఛిన్న సౌరసంవత్సరమండలమే యజ్ఞప్రజాపతి. ఈసంవత్సరప్రజాపతియొక్క యజ్ఞమునుసీమితముగ నుంచునట్టి చంద్రాత్మకసూత్రమే యితనికుపవీతము. దీనిచేనా ప్రజాపతి యజ్ఞోపవీతియై యున్నాడు. ఈయజ్ఞసూ

త్రమున నుత్తరదక్షిణవిషువత్కాలభేదముచే యజ్ఞోపవీత, ప్రాచీనావీత,నివీతము,లని మూడుస్థితులుండును. ఇందు మొదటిదానికి దేవభావముతోడను, రెండవదానికిపితృభావముతోడను, మూడవదానికిమనుష్యభావముతోడను, సంబంధము. ఖగోళపరిస్థితింజూచినచో నీయవస్థలు స్పష్టపడును. ఉత్తరాయణరూపమగు నుత్తరపక్షము, దక్షిణాయనరూప దక్షిణపక్షము, విషువద్రూపమధ్యభాగము, ఈమూడుభాగములచే త్రిపర్వరూపియగు సంవత్సర ప్రజాపతి తనవిరాడ్రూపమున త్రైలోక్యవ్యాప్తుడగుచున్నాడు. ఎట్లన:—

✓సహస్రశీర్షలక్షణ సర్వజ్ఞరూపమున ద్యులోకమునందును, సహస్రాక్షలక్షణ హిరణ్యగర్భరూపమున నంతరిక్షమునందును, సహస్రపాల్లక్షణ వైశ్వానరరూపమున బృథివియందును, వ్యాప్తుడై నిలువబడియున్నాడు. (సహస్రపాల్లక్షణ పాదభాగమగుభూమియందు) ఈవిషయములు 'సహస్రశీర్షాపురుషః' ఇత్యాదిమంత్రములు చెప్పుచున్నవిగదా!

వైజ్ఞానికమహర్షులీయననే 'మహాసుపర్ణ'డని పేర్కొనిరి. త్రైలోక్యవ్యాపకుడు, మహాసుపర్ణాత్మకుడు,నగు నీప్రజాపతికి దక్షిణాయనబిందువు దక్షిణ(కుడి)స్కంధము, ఉత్తరాయణబిందువుత్తర(ఎడమ)స్కంధము, మధ్యదగువిషువద్భాగమువక్షము, కేంద్రస్థసూర్యుడుమస్తకము, అంతరిక్షము హృదయము, త్రివృత్ స్థానీయగాయత్రమండల ముదరము, భూమిపాదప్రతిష్ఠ.

“అథవా హా ఏష మహాన్ సుపర్ణ ఏవ సంవత్సరః అథ యాన్ పురస్తాద్విషువ
తః షణ్మాసానుపయన్తి, సోన్యతరః పక్షః, అథ యాన్ షడుపరిష్టాత్ సోన్యత
రః, ఆత్మా విషువాన్ ఇత్యాది (శత (12-2-3-) చూడుడు

ఈస్వరూపము నెదుటనుంచికొని యుపవీతసంబంధి
విశేషభావవిచారణ సేయవలసియున్నది.

ఉత్తరాయణ మాగ్నేయప్రాణప్రధానులగు దేవతల
కాలము. ఈదేవస్థితికి జెందినసంవత్సర ప్రజాపతి యజ్ఞసూత్ర
ము, దక్షిణపువైపునకు, అనగా:- దక్షిణాయనబిందూపలక్షిత
గాయత్రీ ఛందమువంకకు వంగి, యతని వామస్కంధమునం
దుండును. ఇది దేవతలయజనకాలము, కనుక వామస్కంధస్థి
తమగు నీయుపవీతమును యజ్ఞోపవీత మనవచ్చును. దానిని
ధరించిన ప్రజాపతిని యజ్ఞోపవీతి యనవచ్చును. పృథివియు
త్తరాయణకాలానుగ మనము సేయునపుడు దక్షిణభాగమెత్త
గను, వామభాగము క్రిందుగనుండును. దీనింబట్టి సౌరసంవ
త్సరదక్షిణభాగము క్రిందుగను వామభాగ మెత్తుగనుండు
ను. ఇదే ప్రజాపతి యజ్ఞోపవీతత్వము.

దక్షిణాయనము సౌమ్యప్రాణప్రధానులగు పితరుల
కాలము. ఈపితృస్థితికి జెందిన సంవత్సర ప్రజాపతి యజ్ఞసూత్ర
ము త్తరపువైపున కనగా:- ఉత్తరాయణబిందూపలక్షితజగతీ
ఛందస్సువంకకు,నతమై యతనిదక్షిణస్కంధమం దుండును.
ఇది పితరులకు స్వధాకాలము. కనుక దక్షిణస్కంధస్థితమగు
నీసూత్రము, ప్రాచీనవీతమనియు దానింధరించు ప్రజాపతిని

ప్రాచీనావీతి యనియు ననవచ్చును. పృథివి,దక్షిణాయనకా లానుగమనము సేయునపుడు వామభాగ మెత్తుగను, దక్షిణ భాగము క్రిందుగనుండును. పృథివియొక్క యుత్తరాయణము సూర్యునిదక్షిణాయనము, పృథివియొక్కదక్షిణాయనము సూర్యునియుత్తరాయణము, అగుటకూడ నీపరిస్థితికి జెందినదే. దీనింబట్టిసౌరసంవత్సర వామభాగ మెత్తుగను,దక్షిణభాగము క్రిందుగను నగును. ప్రజాపతియొక్క ప్రాచీనావీతత్వమిదే.

పృథివిమధ్యదగు విషువద్వృత్తము మీదను రాగా 'క్రాంతిసంపాత' మనబడు నాసమయమందు హెచ్చుతగ్గులు లేక వర్తుల సమభావమేర్పడును. ఈసమభావముచే విషువత్సంపాతావసరమున సమానాహోరాత్రములగును. ఈవిషువద్వృత్తమునకు మానుషభావసంబంధ ముండుటచే యీనివీతభావము మానుషభావోపయిక మనిచెప్పబడినది.

ప్రజాపతియుత్తరభాగము దేవసృష్టికి,దక్షిణభాగము పితృసృష్టికి, మధ్యభాగము పార్థివసృష్టికి, ప్రవర్తకములు. మధ్యదగు విషువద్వృత్తమే, అనగానర్థవిషువద్వృత్తమే,మన పాంచభౌతిక శరీరమందు మేరుదండము. (వెన్నెముక). మిగిలిన యర్థభాగము నరసృష్టికి, అర్థభాగము నారీసృష్టికి,ప్రవర్తకములు. ఈవిషయము వివాహసంస్కారమున విస్తరింపబడును. మధ్యస్థ మేరుదండ ముంబట్టి శరీరదక్షిణభాగము దక్షిణగోళము, ఉత్తరభాగ ముత్తరగోళము. మేరుదండము విషువద్వృత్తమేగదా!

సౌర ప్రాణవ్యాప్తి (పరమక్రాంతి) యిటునటు 24 అం శలవరకు చూపబడినది. ఈయంశలందు వ్యాప్తములగు (నా సంఖ్యయేకల) ప్రాణములంబట్టియే, మన ప్రక్కటెముకలు నిర్మింపబడినవి కనుక నివియు నిరువదినాలుగే, పరమక్రాంతి వరకు వచ్చినభూమి యిటునటువంగిపోవును కనుక ప్రక్క టెముకలును మేరుదండసంలగ్నములై చరమసీమకుజేరి యిటు నటు వంగిపోవుచున్నవి. ఇట్లు 'యథాండేతథాపిండాండే' యన్న దన్నివిధములను సార్థకమగుచున్నది.

స్వీయపరిస్థితినిగూడ విశ్లేషించవలయును. ఎట్లన :— కుడితొడభూమిపై నిడి, యెడమతొడనెత్తి, సూత్రమును వామస్కంధమున ధరించినచో, యజ్ఞోపవీతియనియు, వామ జంఘభూమిపై నిడి, దక్షిణజంఘనెత్తి,సూత్రమును దక్షిణ స్కంధమందు ధరించినచో, ప్రాచీనవీతియనియు, గొంతు గూర్చుండి సూత్రము పేగునలె వ్రేలాడవైచికొన్నచో నివీతి యనియు, ననిపించుకొందురు. ఇందు మొదటిది దేవభావము తోడను, రెండవదిపితృభావముతోడను, మూడవదియథా జాత,లౌకికసామాన్య మనుష్యభావముతోడను సంబంధించిన స్థితులు. ఇచటనొకవిషయము:— దేవప్రాణవికాసహీనులను ద్విజాతివారు సాధారణముగ యజ్ఞసూత్రధారణయే నిరర్థక కర్మ యనుకొందురు. ఒకవేళతలిదండ్రుల యాగ్రహమున వీరిమెడలో యజ్ఞసూత్రము తగులుకొన్నను, ఈపురుషపుంగ వులు దానిని నివీతభావపరిణతిగావించి తమ మానుషభావపరి చితి గావింపుచున్నారు.

కానిండు:— ప్రకృతము మనము ప్రజాపతియొక్క సూత్రవిచారణ గావింపవలసియున్నది. ప్రజాపతియొక్క మూడుభావములే సూత్రముయొక్క మూడుస్థితులు. ఈ భావత్రయముచేనతఁడు, దేవ-పితృ-మనుష్యులను యజ్ఞాదుల ద్వారా పాలించుచున్నాడు. ఈశ్రుతివచనముల నవలోకింపుము.

"ప్రజాపతిర్వై భూతాన్యుపాసీదన్, ప్రజావై భూతాని, విధేహి, యథాజీవామ ఇతి(తతో దేవా *యజ్ఞోపవీతినోభూత్వాదక్షిణం జాన్వాచ్య ఉపాసీదన్ తానబ్రవీత్ యజ్ఞో వోన్నం, అమృతత్వంవః,

ఊర్గ్వః, సూర్యోవో జ్యోతిఃఇతి । అథైనంపితరః ప్రాచీనావీతినః, సవ్యంజాన్వాచ్య, ఉపాసీదన్ । తానబ్రవీత్-మాసిమాసివోశనం, స్వధావః మనోజవోవః, చంద్రమావో జ్యోతిః, ఇతి । అథైనంమనుష్యాః ప్రావృతాఃఉపస్థంకృత్వోపాసీదన్। తానబ్రవీత్ సాయంప్రాతర్వోశనం, ప్రజావః, మృత్యుర్వః అగ్నిర్వోజ్యోతిః ఇతి॥ (శత 2-4)

ఇంతటితో బహిరంగచర్చయైనది. ఇకయజ్ఞసూత్రముంగూర్చి మీమాంససేయుదము. దానిస్వరూపపరిచయము కొఱకే సౌర-చాంద్ర-రథస్వరూపములు చెప్పవలసివచ్చెను. యజ్ఞసూత్రమందలి పర్వములతో ప్రాజాపత్యసూత్రపర్వములం బోల్చిచూతము. సూత్రనిర్మాణవిధికి జెందిన యీ యాప్తవచనములను ముందుబరిశీలింపుడు:—

---

*నివీతంమనుష్యాణాం, ప్రాచీనావీతంపితౄణాం, ఉపవీతందేవానాం

"ఘచాదీ శేశంచిసూత్రం సంహతాంగులిమూలకే
ఆవేష్ట్యషణ్ణవత్యాతత్ త్రిగుణీకృత్యయత్నతః
అబ్లింగకై స్త్రిభిస్సమ్యక్ ప్రిక్షాళ్యోర్ధ్వవృతంచతత్
అప్రదక్షిణమావృత్య సావిత్ర్యాత్రిగుణీకృతమ్
అథఃప్రదక్షిణవృతం, సమంస్యాన్నవసూత్రివమ్
శిరావేష్ట్యదృఢంబద్ధ్వా హరిబ్రహ్మేశ్వరాన్నమేత్
"యజ్ఞోపవీతంపరమ" ఇతిమంత్రేణధారయేత్
సూత్రంసలోమకంచేత్స్యాత్ తతఃకృత్వావిలోమకం
సావిత్ర్యాందశకృత్వోద్భిః మంత్రితాభిఃతదుక్షయేత్
విచ్ఛిన్నంవాప్యధోయాతం, భుక్త్వానిర్మితముత్సృజేత్

యజ్ఞోపవీతమందు (1) యజ్ఞోపవీతము. (2) అవాంతరసూత్రములు మూడు. (3) అవాంతర తరసూత్రములు తొమ్మిది. (4) అవాంతరతమసూత్రములు ఇరువదియేడు. (5) తొంబదియారంగుళములు పరిమాణము. ఇట్లు అయిదు సంపత్తులుగలవు.

సంవత్సర ప్రజాపతిని సీమితముగావించు క్రాంతివృత్త మొకసూత్రము. క్రాంతివృత్తసంబద్ధమగు నుత్తరదక్షిణవిషువద్భాగము, ఉత్తరదక్షిణమధ్యమార్గము, ఆది-అంత-మధ్య నాడులు, ఈమూడుపర్వములు నీయొకసూత్రమున కవాంతర సూత్రత్రయము. నాగవీథ్యాది పూర్వోక్తనవవీథులు నవాంతరతరములగు తొమ్మిదిసూత్రములు. ప్రతివీథియందుగల 3-3 నక్షత్రములును ప్రతియవాంతరతరసూత్రమందలి 3-3 అవాంతరతమ సూత్రములు మొత్తము 27 అగుచున్నవి. ఉద్గీథోం

శారమూ ర్తియగు సూర్యుడు బ్రహ్మగ్రంథిలేదా, బ్రహ్మ పాశము, ఇకనయనాదివీర్యాంత భావములకుజెందిన 96 అవ యవములే యంగుళిసంపద.

క్రాంతివృత్తాత్మక సంవత్సర ప్రజాపతియొక్క యజ్ఞ సూత్రము అయనాదివీర్యాంతము నగు 96 భావములతో, ఛందస్సు మొదలు సంవత్సరాంతముగ నగు 96 భావములతో *తిథ్యాదిమాసాంతముగల 96 భావములతో యుక్తమైయుం డును. అనుగమభావమునకు జెందిన యీ 96 భావముల యుత్పత్తి యీ ప్రజాపతికిజెందినది.

విస్తరభయమున వివేచనసేయజాలక ఆయానామము లనుమాత్రము జూపెదము:—

| | | | | | |
|---|---|---|---|---|---|
| అయనములు | 2 | ఛందస్సులు | 7 | తిథులు | 15 |
| విషువత్ | 1 | లోకములు | 7 | వారములు | 7 |
| ఋతువులు | 6 | ఋషులు | 7 | నక్షత్రములు | 28 |
| మాసములు | 12 | పితరులు | 7 | తత్త్వములు | 24 |
| పక్షములు | 24 | రశ్మిలు | 7 | వేదములు | 4 |
| నక్షత్రములు | 27 | గ్రహములు | 7 | గుణములు | 3 |
| వేదములు | 3 | నరకములు | 7 | కాలములు | 3 |
| లోకములు | 3 | దేవస్వర్గములు | 7 | మాసములు | 12 |
| దేవతలు | 3 | ద్వీపములు | 7 | | 96 |

* తిథివారంచనక్షత్రం, తత్త్వంవేదాగుణత్రయం,
కాలత్రియంచమాసశ్చ బ్రహ్మసూత్రంహిషణ్ణవ.

| | | | |
|---|---|---|---|
| ఛందములు | 3 | సముద్రములు | 7 |
| సవనములు | 3 | అర్చులు | 7 |
| మార్గములు | 3 | వాయువులు | 7 |
| నాడులు | 3 | పాతాళములు | 7 |
| వీర్యములు | 3 | భూతములు | 5 |
| అంగుళులు | 96 | సంవత్సరములు | 96 |

ఇంతటితో యజ్ఞోపవీత, ప్రాచీనావీతాదులేల? ఇత్యాది ప్రశ్నలు గతార్థములైనట్లే. ఆధిదైవికస్థితింబట్టియే ఆధ్యాత్మికవిధానమేర్పడినది. అట్లుండిననేనాఫల్యము. అదియెరుంగనినాడంతయునక్రమము, వ్యర్థము,నగును. ఆధిదైవికాధ్యాత్మికములుపోలికకు ఛందస్సంపత్తి కెక్కువమహిమయున్నది. భౌతికవిజ్ఞానముంజూడుడు. దాని నియమోపనియమము లన్నియుఛందస్సంపత్తి యుక్తములు. విద్యుత్ స్తంభముల సమసామ్ముఖ్యము విద్యుత్సంచారమున కెట్లుకారణమగుచున్నదో చెప్పనక్కరలేదుగదా! వైర్లెస్ టెలిగ్రాఫీరహస్యమెరిగినవారి కీ,విద్యుత్ స్తంభ సమసామ్ముఖ్యమాత్రముననే పనియంతయుజరుగుచున్నదనియు, నిటునటువచ్చుచుబోవుచుండు వార్తలకు ప్రత్యక్షస్వరూపమేమియుగనబడుటలేదనియు, దెలియును. ఇదే మనఛందస్సంపత్తి. దీనికిమూలప్రతిష్ఠ యథర్వాసూత్రము. వైదికతత్త్వరహస్యము తెరుగక

మన మీమాత్రమునకే యాశ్చర్యచకితుల మగుచున్నాము. మనపూర్వులేమి చెప్పిరో విందము:——

"సోబ్రవీత్ - పతంజలంకావ్యం, యాజ్ఞికాంశ్చ, వేత్థనుత్వం కావ్య, తత్సూత్రం? యస్మిన్ అయంచలోకః, పరశ్చలోకః, సంధృబ్ధానిభవన్తి?" ఇతి - సోబ్రవీత్ పతంజలః 'నాహంతద్భగవన్ వేద' ఇతిసోబ్రవీత్ - పతంజలంకావ్యం యాజ్ఞికాంశ్చ "యోవైతత్ కాప్య! సూత్రంవిద్యాత్! తంచాంతర్యామిణం, సబ్రహ్మవిత్, సలోకవిత్ సదేవవిత్, సయజ్ఞవిత్, సభూతవిత్, సఆత్మవిత్, ససర్వవిత్" ఇతి - తేభ్యోబ్రవీత్ - । తదహంవేద తచ్చేత్త్వంయాజ్ఞవల్క్య! సూత్రమవిద్వాంసః, తంచాంతర్యామిణం, బ్రహ్మగవీరుదజసే, మూర్ధాతేవిపతిష్యతి, ఇతి । వేదవాఅహం గౌతమ! తత్ సూత్రం, తంచాంతర్యామిణం, । వాయుర్వైగౌతమ! తత్ సూత్రం వాయునావై గౌతమ! తత్సూత్రేణ - అయంచలోకః పరశ్చలోకః సర్వాణిచభూతాని సంధృబ్ధానిభవన్తి । తస్మాద్వైగౌతమ! పురుషంప్రేతమాహుః వ్యస్రంసిషత - అస్యాంగాని - ఇతి, వాయునాహిగౌతమ! సూత్రేణసంధృబ్ధాని భవన్తి - ఇతి. (బృహ)

ఈయాఖ్యానముచే ఈవాయుసూత్రసామ్రాజ్య మీలోకమందేకాక పరలోకమందుగూడ గలదని తెలియుచున్నది. దీనిచేనీలోకభూత-భౌతికపదార్థములతోడనేకాక, పరలోకగత ప్రేతాత్మలతోడను, గ్రహనక్షత్రాది ప్రాకృతిక పదార్థములతోడను, గూడఛందోమర్యాదయొక్క యాధారమున సంబంధముగుదుర్చుకొనవచ్చును. దీనిద్వారా మనము భూమియందెయుండియు, ఛందస్సు - ఋషి - దేవత - ఉదా

త్తానుదాత్తాదిస్వరలహరి - మొదలగు భావములతోడి మంత్ర శక్తివలన నాప్రాకృతికతత్త్వముల సమసామ్యముఖ్యప్రాప్తిగా వించుకొని, యాదివ్యశక్తులను మనయధ్యాత్మమందు బ్రతిష్ఠ గావించుకొనుచో నిట్టివానియందేయాశ్చర్యమునుండదు. వాతరశ్మల యీవ్యాపకసంబంధమునుగూర్చి పురాణ మిట్లు చెప్పుచున్నది.

"ఏతేవాహాఃగ్రహాణాంవై మయాప్రోక్తారథాః సహ
సర్వేధ్రువనిబద్ధాస్తే, ప్రబద్ధావాతరశ్మిభిః

ఏతేవైభ్రామ్యమాణాస్తు యథాయోగంభ్రమన్తివై
వాయవ్యాభిరదృశ్యాభిః ప్రబద్ధావాతరశ్మిభిః

పరిభ్రమన్తితద్బద్ధాః చంద్రసూర్యగ్రహాదివి
భ్రమంతమనుగచ్ఛన్తి ధ్రువంతేజ్యోతిషాంగణాః

యథానద్యుదకేనౌస్తు సలిలేనసహోహ్యతే
తథాదేవాలయాహ్యతే ఉహ్యంతేవాతరశ్మిభిః

యావత్యశ్చైవతారాస్తు తావంతోవాతరశ్మయః
సర్వాధ్రువనిబద్ధాస్తా భ్రమన్తోభ్రామయంతితం (ధ్రువం)

తైలపీడాకరంచక్రం భ్రమద్భామయతేయథా
తథాభ్రమన్తిజ్యోతీంషి వాతబద్ధానిసర్వశః

అలాతచక్రవద్యాన్తి వాతచక్రేరితానితు
యస్మాజ్జ్యోతీంషివహతే ప్రవహంస్తేనసస్మృతః.

(వాయుపు 53 అధ్యా)

అధర్యాత్మకమగు నీవాయవ్యసూత్రముపైననే తం త్రశాస్త్రోక్తములగు నాకర్షణాది ప్రయోగము లాధారపడి యున్నవి. ధరించినవస్త్రములు కేశ,నఖములు మొదలగు వానియందనుశయరూపముననుండు నధర్యాధారమునగూడ దాంత్రికప్రయోగములువిహితములైయున్నవి. ఈసూత్రముయొక్క సంసర్గముననే యాశౌచాది సంబంధము సాపిండ్యులందు వ్యాప్తమగును. ఈసూత్రమే,చాంద్రశ్రద్ధానాడీద్వారమున బితృతృప్తికి గారణమగుచున్నది. ఈసూత్రముచే సౌరరశ్మిలద్వారా, దేవయజనకర్మ సంపన్నమగును. ఆధ్యాత్మికజగత్తు నాధిభౌతికసాధనములద్వారా, ఆధిదైవికజగత్తుతో గలుపున దీసూత్రమే. కనుక యజ్ఞపరిభాషయందు 'వాయురధ్వర్యుః'అని వాయువుయాజ్యకర్మసంచాలకు డగు నధ్వర్యుడనిరి. ఈసూత్రముయొక్క సమసామ్యుఖ్యోపలబ్ధికొరకే, స్వచ్ఛందులను ప్రాకృతికఛందములతో నేకీభవింపజేయుటకే, తద్ద్వారా ఆయాప్రాకృతికశక్తుల నధ్యాత్మమందాధానము సేయుటకే, యజ్ఞసూత్రముపవీత ప్రాచీనావీతాది భావములం బరిణతముగావింపబడుచుండును.

ఆధిదైవికసంవత్సరయజ్ఞమువలన బ్రజోత్పత్తియగునని ఈవరకెరింగితిమి. ఇచటనొకవిషయముగుర్తింపదగును:— యజ్ఞసూత్రధారిప్రజాపతి నాభిప్రదేశావచ్ఛిన్నోత్తమాం

గమువలన బ్రాహ్మణాదివర్ణత్రయము జనించెను. ఇక నధమాంగస్థానీయ భూపిండోపలక్షిత పూషచే శూద్ర ముత్పన్నమయినది. ఇట్లే అదృశ్యఖగోళాత్మక చాంద్ర ప్రాణమువలన నుత్పన్నయయినస్త్రీయు, ప్రజాపతి యజ్ఞాంగవంచితమైయున్నది. కనుక స్త్రీశూద్రులుసూత్రవంచితులైరి. ఆధ్యాత్మిక జగత్తున శిరస్సుబ్రాహ్మణస్థానీయము. వక్షముక్షత్రస్థానీయము, ఉదరమువైశ్యస్థానీయము. ఇట్లుద్విజమర్యాదనాభివరకే కనుక యజ్ఞసూత్రము పరిమాణముకూడ నంతవరకే. నాభిక్రిందకు యజ్ఞసూత్రముండరాదు.

"స్తనాదూర్ధ్వమధోనాభే ర్నహిధార్యంకథంచన"

యజ్ఞసూత్ర బ్రహ్మగ్రంథి సాక్షాత్తుగసూర్యప్రకృతి. అతడుప్రణవమూర్తి. త్రైలోక్యవికాసహేతువు. చరాచరప్రతిష్ఠ, ప్రణవబ్రహ్మలక్షణ,సంవత్సరమూర్తి సూర్య ప్రజాపతి అఖిలలోకమూలకుడైనట్లు, యజ్ఞసూత్రధారియగు బ్రాహ్మణుని చేతియందు సంపూర్ణవిశ్వనియతిసూత్ర ముండుచున్నది. అధిదైవికాదిప్రపంచత్రయ విజ్ఞాత,యజ్ఞోపవీతి బ్రాహ్మణుడు,ప్రపంచమునకు ముఖ్యరక్షకుడు రక్షాసూత్రమే, యజ్ఞసూత్రము. మంత్రశక్తితో దీనిని మ్రెడలోవేయుచు, ద్విజబాలకునందు బలము, తేజము,ఆయువు,ఆధానము గావింపబడుచున్నది. ఈమంత్రముంజూడుడు.

"యజ్ఞోపవీతంపరమంపవిత్రం, ప్రజాపతేర్యత్సహజంపురస్తాత్
ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచశుభ్రం, యజ్ఞోపవీతంబలమస్తుతేజః"

సంవత్సర ప్రజాపతికిసహజమగు యజ్ఞోపవీతము నిజముగ ననాది. దీనివిధ్యుక్తగ్రహణమున నిది ద్విజవీర్యప్రతిష్ఠాపక మగును. జగన్మాత,అధిష్ఠాత్రియగు సావిత్రియాధానమే యీయుపనయనసంస్కారముఖ్యోద్దేశ్యము. ఇది వేదమాత, కనుక నిది తమ బ్రహ్మభాగ ప్రతిష్ఠితముకానంతవరకు, ద్విజులకు వేదాధ్యయనాధికారములేదు. ప్రాకృతిక వేదమూలక యజ్ఞాది శ్రౌతకర్మాధికారములేదు. కనుక నిది సంస్కారములందు గొప్పమహిమగలది.

సంవత్సర ప్రజాపతి క్రాంతివృత్తాదిలక్షణ, గాయత్రీ ఛందోలక్షణ, బ్రహ్మగ్రంధిలక్షణ, నవసూత్రాత్మక, యజ్ఞసూత్రయుక్తుడై వేదముద్వారా యజ్ఞ–దేవ–భూత–ధర్మాది సృష్టుల నాచరింపగల్గెను. కనుక మొదటసావిత్రియాధానమున ద్విజునకును తత్ప్రతికృతిరూప యజ్ఞసూత్రయుక్తితో యజ్ఞోపవీతి గావలసియున్నది. దానిచే స్వకీయ గాయత్ర్యాది ఛందోఛందితుడై (సీమితుడై) సావిత్రీసంస్కారమునకు దగిన క్షేత్రముగ కాగా మంత్రదీక్షలభించును. యజ్ఞసూత్రము మెడలోవేయునపుడు సంకేతరూపమున నతనిబ్రహ్మభాగమున కీయాదేశములభించును. ఏమన ''నేడునీవునీఛందముం బట్టి వికసిల్లి ద్విజుడవగుచున్నావు. ఈసూత్రమందలి పర్వములన్నిటిని గాపాడుము, అందుచే,విశ్వరక్షణయగును, దానిని గావించుటనీపని''.

పిమ్మట గొన్నినియమము లాదేశింపబడును వానిని

యథావిధి,యథాకాల, యథామంత్రానుగమనమున సేయు ద్విజుడు "బ్రాహ్మణో బ్రాహ్మలౌకికమ్" చరితార్థముగావించును. ఏనియమము లేక మెడలోసూత్రము దగిలించుకొన్న సూత్రమున నేమియులేదు. ఈవిషయము ప్రతాదేశమను రాబోవు ప్రకరణమున జూడదగును.

ఇంతేకాక యజ్ఞోపవీతముంగూర్చి అనేకోపపత్తులున్నవి. అన్నియు సంధ్యావిజ్ఞానమందు జూచుకొనవచ్చును. విస్తరభయమున బ్రస్తుతమువిరమించి యొకమాట చెప్పెదము. "సంశయముండవచ్చును, ప్రశ్నించుటమంచిదే, తర్కమవసరమే. అవితీరువరకుత్పథమునబోక మహర్షులయాదేశప్రకారము-పెద్దలయాచరణంబట్టి పోవుచుండవలయును. కర్మపరిత్యాగము సేయకున్నచో హేతువెప్పుడైన దెలియును. ఉపపత్తినెరింగియు నాచరణ లేనిచో వ్యర్థము. ఉపపత్తినెరుగకున్నను ఆచరణవిడువకున్నచో సాఫల్యముతప్పదు. ఆచరణప్రధానము గాని, యెరిగిన నెరుగకున్న వస్తురూపమొకే తీరున నుండునుగదా!"

ఇక,అతిప్రశ్న-కుతర్కముచిడుచుట మేలు. నిత్యసంశయమున్నచో 'సంశయాత్మావినశ్యతి' అన్నభగవద్వచనముండనేయున్నది. పదేపదే తర్కవాదముననుగమించుచో నంతర్జగత్తు శూన్యభావమునొందగా సంశయవాదియైపోవు పనియెరుంగుటమంచిది.

మంత్రశక్తియుక్తమగు యజ్ఞసూత్రము పవిత్రమనుట నిర్వివాదము. మలమూత్రము లపవిత్రములగుటచే దదుత్సర్జనకాలమున దీని కధోభాగసంసర్గము కూడ దనియూర్ధ్వమున, సురక్షితభాగమున నుంచుట కాదేశింపబడినది. దృష్టఫలముండగాన దృష్టఫలకల్పన ద్రావిడప్రాణాయామముగదా! ఇట్లుండ 'జెవిదగిలింపనేల?' యని యొకసందియము. 'అట్టియెడ గంఠమునకు జుట్టుకొనరాదా? చిలుకకొయ్యకు దగిల్చిపోయి వచ్చినపిదప మరలనై చికోరాదా?' అని యేమేమోచర్చలు ఈశ్లోకముజూడుడు:—

"సదోపవీతినాభావ్యం, సదాబద్ధశిఖేనతు
విశిఖోవ్యుపవీతశ్చ యత్కరోతినతత్కృతమ్ః (కాత్యాయనః)

ప్రశ్నాతిమర్యాదవలదు. ప్రాకృతిక మనుకొన్న యజ్ఞోపవీతము, ఒకప్పుడు విడిచియుండదగినదికాదని బుద్ధిమంతు లీవరకెయెరింగియుందురు. కంఠమునకుజుట్టియుంచుట నివీతోపలక్షణ మానుషభావమునకు జెందినది. ఈకారణములన్నిటికంటె మహత్త్వపూర్ణమగు సజాతీయసంబంధకారణము గలదు. వినుడు:— వాక్ప్రాణచక్షుశ్శ్రోత్రమనస్సులు పంచేంద్రియములు. దార్శనికులయింద్రియము లిందంతర్భావములు. అగ్నినుండి వాగింద్రియము(ముఖము), వాయువునుండి ప్రాణేంద్రియము,(నాసిక) ఆదిత్యునుండిచక్షురింద్రియము, భాస్వర-సాయతన-చాంద్రసోమమునుండి యింద్రి

యమనస్సు, నిరాయతన, సర్వాదిక్ప్రతిష్ఠిత, దిక్సోమనామక పవిత్రసోమమునుండి శ్రోత్రేంద్రియము, నిర్మింపబడెను. ఈ శ్రుతింజూడుడు:—

"అగ్నిర్వాగ్భూత్వాముఖంప్రావిశత్, వాయుః ప్రాణోభూత్వానాసికేప్రావిశత్, ఆదిత్యఃచక్షుర్భూత్వాక్షిణిప్రావిశత్ - దిశఃశ్రోత్రంభూత్వా కర్ణౌప్రావిశత్-చంద్రమామనోభూత్వాహృదయం ప్రావిశత్ (ఐతరేయో)

ఆయా ప్రాణదేవతలనుండిపుట్టిన ఆయాయింద్రియముల నుండి ఆయాదివ్య ప్రాణములు సూక్ష్మరూపమున నిత్యముగ వచ్చుచుబోవుచునుండును. ఇట్లు పవిత్రసోమమయ శ్రోత్రేంద్రియగోళకములనుండియు బవిత్ర సౌమ్య ప్రాణగమనాగమనములు సిద్ధమగును. అసచ్ఛబ్దశ్రవణమున నీయింద్రియ ప్రాణ పవిత్రధర్మ మభిభూతముకాగా, దీనివలన శబ్దసంస్కారగ్రాహక మగు మనస్సుయొక్క సంకల్పముకూడ జెడిపోవును. దానితోగూడినబుద్ధియు దూషితమగును. కనుకనే యితరుల రక్షణకొరకు మంగళవాక్కుచ్చరింపవలయునను నాదేశము వలెనే తనసంకల్పములను బవిత్రములుగానుంచుకొనుట కస చ్ఛబ్దశ్రవణనిషేధమును గావింపబడినది.

పురుషునివామాంగముసోమప్రధానము. దక్షిణాంగ మగ్నిప్రధానము; ఇందుసోమ మగ్నిగర్భమందున్నది. అగ్నిసోమమూర్తి-యజ్ఞోపవీత-సంవత్సరప్రజాపతియొక్క స్థితియు నింతే. పారమేష్ఠ్యసోమాహుతిని లోగొని సంవత్సరచక్రము

స్వరూపమున నిల్చియున్నది. కనుక వామదక్షిణములలో దక్షిణకర్ణమే, సంవత్సర ప్రజాపతియొక్క క్రాంతివృత్తావచ్ఛిన్న సాంవత్సరికయజ్ఞసూత్రమునకు ప్రధానరూపమున సజాతీయముగ నెంచబడును. సౌమ్యప్రాణప్రధానమేకాక యాగ్నేయముకూడనగుటచే నదే మిగులబవిత్రము, సర్వదేవావాసభూమియు నై యున్నది. కనుక దీనినిగాంగేయతీర్థమనిరి. కార్యారంభమునకుబూర్వము యథాసంభవముగ దత్తన్నిమిత్తములందు దక్షిణకర్ణస్పర్శ ధర్మశాస్త్రములందు విహితమైనది. అవరవర్ణీయుడగుశిల్పి కార్యారంభపూర్వము కర్ణస్పర్శసేయుట యెరుంగుదుము. ఈవచనములవధరింపుడు.

> "నిమిత్తేష్వేనసర్వేషు దక్షిణంశ్రవణంస్పృశేత్
> ఆదిత్యావసవోరుద్రాః వాయురగ్నిశ్చధర్మరాట్
> విప్రస్యదక్షిణేకర్ణే నిత్యంతిష్ఠన్తిహై యతః (బృహస్పతి)

> "ప్రభాసాదీనితీర్థాని గంగాద్యాఃసరితస్తథా
> విప్రస్యదక్షిణేకర్ణే వసంతీతిమనోర్మతమ్. (పరాశరః)

కనుకనే "పవిత్రందక్షిణేకర్ణేకృత్వా విణ్మూత్రముత్సృజేత్" (హారీతః)అని యాదేశింపబడినది. ఇదియుపనయన సంస్కారోపపత్తి. ఇతికర్తవ్యతాపద్ధతులు వారివారిగృహ్యగ్రంథముందే చూచుకొనగలరు. ఇయ్యది ఆచార్యకర్తృకము ఆచార్యలక్షణమిది:—

> "ఉపనీయతుయఃశిష్యం వేదమధ్యాపయేద్ద్విజః
> సకల్పంసరహస్యంచత మాచార్యంప్రచక్షతే (మనుః)

అధ్యాపనము బ్రాహ్మణునియధికారములోనిపని. కనుక నాచార్యవిషయమున స్మృతులందు.

"పితాపితామహోభ్రాతా జ్ఞాతయోగోత్రజాగ్రిజాః
ఉపాయనేధికారీస్యాత్ పూర్వాభావేపరఃపరః
పితైవోపనయేత్పుత్రిం తదభావేపితుఃపితా,
తదభావేపితుర్భ్రాతా, తదభావేతుసోదరః"

అని చెప్పబడినచోట గ్రహణమర్యాదంబట్టి బ్రాహ్మణవర్ణమునే గ్రహింపవలయును. ఇతరవర్ణముల సంస్కారము కులపురోహితునివలన సంపన్నమగును.

శుభలగ్నమునునిర్ణయించుకొని, యుపనేత, నిర్విఘ్నముగ గర్మసమాప్తికొరకు, సాంతపనాగ్నిమూర్తులగు బ్రాహ్మణులకు భోజనముసేయించి వటునకు ముండనముసేయించి స్నానముగావించినపిదప మంత్రోపదేష్టయగు నాచార్యుసేవయందు సంస్కారార్థ ముపస్థితుంజేయగా నావటువు నగ్నిపశ్చిమభాగమున, దనకుదక్షిణభాగమున గూరుచుండబెట్టి ముందుగ నాచార్యుడతనిచే 'బ్రహ్మచర్యమాగామి' యని పల్కించును. తరువాత ప్రాఙ్ముఖుడై యున్నవటువు 'బ్రహ్మచార్యసాని' యనిపల్కును.

పూర్వదిక్కు దేవతలది. దేవతావికాస భూమిసూర్యుడు. అతడు త్రయీవేదఘనుడు. త్రయీవేదము బ్రహ్మ. దానికి జెందినచర్య (ఆచరణ, అనుగమనము) బ్రహ్మచర్యము. అది

కలవాడు బ్రహ్మచారి. కనుక బ్రహ్మాత్మకసూర్యునిదగు పూర్వదిక్కున కభిముఖుడై యిట్లుసంకల్పించును.

ఈసంస్కారమునందు తత్తద్వర్ణ భేదములంబట్టి గ్రహించు నజినమేఖలాదిపదార్థము లాయావర్ణవీర్యప్రతిష్ఠలై మంత్రశక్తులచే విశేషమహత్త్వములుగలవై యుండును. ఆయావిషయములు వర్ణవిజ్ఞానమునందు సూచింపబడినవి. ప్రతిపదార్థమునందును ఛందోమర్యాదంబట్టి ప్రాకృతికవీర్యములసమావేశ ముండును. అవిమనయాధ్యాత్మికసంస్థయం దంతర్యామసంబంధమునొందుచుండును. ఇతికర్తవ్యతను సరిగా ననుగమింపవలయును. అందులకాయాగ్రంధముల నవలోకింపవలయు నని యీావరకే చెప్పితిమి.

## 3 వ్రతాదేశము

యజ్ఞోపవీత సంస్కారమం దంతబల తేజోవీర్యాదుల యాధానశక్తియున్నచో, సూత్రధారులగు నేటిద్విజాతి యధికాంశము, నిర్బలముని స్తేజమునిర్వీర్యమునై యున్న ట్లున్న దెందువలన ? ఈ ప్రశ్నకు సమాధానమీా వ్రతాదేశసంస్కారము. యథావిధిగ యజ్ఞోపవీతసంస్కామయినపిదప నాచార్యుడు యజ్ఞానుబంధియగు సావిత్రీసంస్కారము ధృఢమూలముగావించు కొన్నినియమము లాదేశించును. బ్రహ్మచారి

వానినిబాలింపనిచో, వానిసావిత్రీసంస్కారము కొలదికాలములోపలనే విలుప్తమైపోవును.

బ్రహ్మచర్యాశ్రమసమాప్తిగావించి గృహస్థాశ్రమమున బ్రవేశించు యువకుడు స్నాతకు డనబడును. ఇందు మూడుభేదములు. ఈవచనముంజూడుడు:—

"త్రియఃస్నాతకాఃభవన్తి-విద్యాస్నాతకః, వ్రతస్నాతకః - విద్యావ్రతస్నాతకః ఇతి। (1) సమాప్య వేదం,అసమాప్యవ్రతం, యఃసమావర్తతేస విద్యాస్నాతకః (2) సమాప్యవ్రతం, అసమాప్య వేదం, యఃసమావర్తతే - సవ్రతస్నాతకః (3) ఉభయంసమాప్యయః సమావర్తతే సవిద్యావ్రతస్నాతకః (పా గృ। సూ।)

విద్యనుసురక్షితముగానుంచునదే యీవ్రతాదేశ సంస్కారము వాగ్విసర్జనానంతరమే యితనికాచార్యు డాదేశించును:—

(1) బ్రహ్మచార్యసి, (2) అపోశానకర్మకురు, (3) దివామాస్వాప్సీః (4) ఆచార్యాధీనో వేదమధీష్వ

ఇంతేకాక, ధర్మగ్రంథములం దెన్నోవిధులున్నవి. ఉదాహరణమునకు గొన్నిమాత్రమిటనుదాహరింతుము.

"భూమౌశయనమ్, అక్షారలవణాశనమ్, దండధారణమ్, అగ్నిపరిచరణం, గురుశుశ్రూషా, భిక్షాచర్యా—సాయంప్రాతరోభ్జనార్థం, భోజనసన్నిధానేవారద్వయం వా భైక్షచరణం, అనింద్యేబ్రాహ్మణగృహే, భైక్షం గుర్వాజ్ఞయా భోజనవిధినాభుంజానః, మధుమాంస, మజ్జనో,పర్యాసన-స్త్రీగమన, అనృత-అదత్తదానానివర్జయేత్"

"మధుమాంసాంజనోచ్ఛిష్ట ముక్తస్త్రీప్రాణిహింసనమ్,
భాస్కరాలోకనాశ్లీల, పరివాదాదివర్జయేత్"

"పర్యుషిత, తాంబూల, దంతధావన, వసాధికా, దివాస్వాప - ఛత్ర - పాదుకా - గంధ - మాల్య - ఉద్వర్తన - అనువేపన - జలక్రీడా, ద్యూత - నృత్య - గీత - వాద్యా - లాపాంశ్చవర్జయేత్.

ఈయన్నింటియందు బ్రతిదానికి నేదోయొక గుప్త రహస్యమున్నది. అన్నిటిని జెప్పబూనుట కిది యదనుకాదు. ఉదాహరణార్థము "భాస్కరాలోకనాశ్లీల పరివాదాదివర్జయేత్" అనునాదేశమునందు సూర్యదర్శననిషేధమున్నది. కేవలమీయొక్కదానియుపపత్తింజూతము:— ఈయనువచన నుంబరికింపుడు:—

"నేక్షేతోద్యంతమాదిత్యం, నాస్తంయంతంకదాచన,
నోపసృష్టం,నవారిస్థం,నమధ్యనభసోగతం॥ (మనువు)ఏమి?

ప్రాతఃకాలమున మనము పూర్వక్షితిజముపైనను, సాయంకాలమున పశ్చిమక్షితిజముపైనను, సూర్యునిజూతుము గాని, యపుడటసూర్యుడులేడు. మరేమన: గల్పితసూర్యుడు కలడు. దృశ్యస్థితింబట్టి పృథివిచుట్టు సూర్యుడుదిరుగుననుకొని యోచింపుడు. భూపిండమునకునలువైపుల 'భూభా'యనబడు నొకవాయుస్తరయున్నది. అయ్యదిపార్థివాప్యానురప్రాణయుక్తమై తమోమయమైయున్నది. దీనికి స్వాభావికముగ రాత్రిభాగమందు వికాసముండును. సూర్యమూలయగు బుద్ధియొక్కదివ్యచేష్టల నావరించుట దానిముఖ్యకార్యము. ఇందు

వలన మనయీహా,(చేష్ట)మందమగును, కనుక రాత్రియం దాలస్య - నిద్రా-తంద్రాదు లావిర్భవించుచుండును. కనుక నాభూభాంతర్గత వాయవ్యప్రాణములకు మందేహాసురులని పేరు. పురాణములందు మందేహాసురులు సూర్యునాక్రమింతురనియు, నందుకు బ్రతిరోధముగ బ్రాహ్మణులు,తమసంధ్యాకర్మయం దంజలిరూప వజ్ర ప్రహారముగావింతురనియు, నసురులునష్టమగుదురనియు, వర్ణింపబడినది (వాయుపు 50)

ఆధిదైవికసూర్యుడు ఖగోళీయసూర్యుడు. ఆధ్యాత్మికసూర్యుడుబుద్ధి. ఇరువురునుమందేహాసు రాక్రాంతులగుదురు. పారమేష్ఠ్యసోమాహుతివలన సంపన్నమగు ప్రాకృతికాగ్నిహోత్రముచే, గాయత్ర తేజప్రదీప్తిచే నాధిదైవికసూర్యునెదుటదిరుగు మందేహాసురులునశింతురు. ఇక:— గాయత్రీమంత్రోపాసనచే మంత్రపూతాంజలిచే సాయంప్రాతస్సమయములందగు జరామర్యసత్ర మను నగ్నిహోత్రముచే ద్విజాతియొక్క బుద్ధిసూర్యునాక్రమించు మం దే హా సు రు లు నశింతురు.

ఋతపదార్థముతో నేవస్తువునేని కూర్చినచో దానిని పొడుగుకలదానివలె జూపుట యాఋతస్వభావము, నీరుఋతము. అందొకకఱ్ఱయుంచుచో నీటియందుగల యాకఱ్ఱయొక్క భాగము పొడుగుగాగనబడును. ఇచ్చట 'భూభా'యనునది ఋతము. సంధ్యలందుక్షితిజములం దగపడుసూర్యుడు, వస్తుతః భూకేంద్రసధస్థస్థిత సూర్యరశ్మిలు, ఆభూభాయందు బాధ

వుగా ప్రతిఫలింపగా బుక్తత్త్వముంబట్టి యేర్పడు నవీన సూర్యస్వరూపమగును. దానిని మనముచూతుము. ఈకల్పిత సూర్యు డాసుర ప్రాణయుక్తుడు. తద్రశ్మిలు దివ్యభావమును మలినపరచును. కనుక "నేక్షేతోద్యంతమాదిత్యం, నాస్తం యంతంకదాచన" అనియాదేశము.

రాహుగ్రస్తసూర్యుడు నిక్లే తమోమయాసుర ప్రాణ యుక్తుడు. దృష్టిసూత్రముంబట్టి మలినరశ్మిలు బుద్ధింజెడ గొట్టును. కనుక నట్టివానింజూడరాదు. ఈమలినరశ్మిసంసర్గ దోషనివారణగావించి యుపయుక్త పదార్థరక్షణజేసికొనుటకు గ్రహణకాలమందు సౌమ్యవిద్యుద్యుక్త పవిత్రదర్భల నుప యోగింతుము. (చూడుడు దర్భోత్పత్తిరహస్యము ప్రకీర్ణ విజ్ఞానము,)

నీరువరుణ దేవతాకము. వరుణుడింద్ర విరోధి ప్రాణము. ఇంద్ర ప్రాణమాత్మానుగామి. కనుక వరుణప్రాణమయ జల ప్రతిబింబితవారుణసూర్యదర్శనము నిషిద్ధము. ఇక మధ్యా కాశస్థసూర్యుడు పూర్ణక్షేత్రమున బ్రదీప్తుడు కనుక నతని జూచుచో దృష్టిమాంద్యదోషము సంభవమనుట స్పష్టమే. ఇట్లుశ్లోకము నుత్తరార్థము చరితార్థ మగుచున్నది. ఇట్టియా దేశయుక్తవ్రతానుపాలనమున నుపనయసంస్కారాహిత సా విత్రీసంస్కార మెంతయోపుష్పితము, పల్లవితము,నై దృఢ మూలమైశోభిల్లును.

# 4 వేదస్వాధ్యాయము

బ్రాహ్మ - దైవసంస్కారము లన్నిటిని సఫలములు గావించునదిదే. ఇదిలేకయెల్లసంస్కారములు నున్న నవి, నిరర్థకములు. ఇంతయేల? ఈసంస్కారములేనిచో స్వకర్తృకములగు దైవ(శ్రౌత)సంస్కారముల కధికారమేలేదు. కనుకనే మన్వాదులు వేదశూన్యబ్రాహ్మణుడు శూద్రసము డనిరి. మనువుదృష్టియం దిది బ్రాహ్మణునిపరమపురుషార్థము. ఇదే తపస్సు. ఇదే బ్రాహ్మణ్యము. మన్వాదిస్మృతులం దీవిషయమున నెంతయో వ్రాయబడియున్నది. అందుగొన్ని యుదాహరించెదము:—

"యథా కాష్ఠమయో హస్తీ యథాచర్మమయోమృగః
యశ్చవిప్రోఽనధీయానః త్రయస్తేనామబిభ్రతి
యథాషండోఽఫలః స్త్రీషు యథాగౌర్గవిచాఫలా
యథాచాజ్ఞేఽఫలందానం, తథావిప్రో నృచోఽఫలః
తపోవిశేషైర్వివిధైః వ్రతైశ్చవిధిచోదితైః
వేదఃకృత్స్నోఽధిగంతవ్యః సరహస్యోద్విజన్మనా
వేదమేవసదాభ్యస్యేత్ తపస్తప్స్యన్ ద్విజోత్తమః
వేదాభ్యాసోహివిప్రస్య తపఃపరమిహోచ్యతే
ఆహైవసనఖాగ్రేభ్యః పరమంతప్యతేతపః
యః*స్రగ్వ్యపిద్విజోఽధీతే స్వాధ్యాయంశక్తితోఽన్వహం
యోఽనధీత్యద్విజోవేదా నన్యత్రకురుతేశ్రమం
సజీవన్నేవశూద్రత్వ మాశుగచ్ఛతిసాన్వయః

---

* బ్రహ్మచారికిస్రగాది నిషేమున్నది. ఈవాక్యము స్వాధ్యాయ ప్రాముఖ్యము చెప్పుచున్నది.

ఉపనయనము, సావిత్ర్యుపదేశము, వ్రతాదేశము, వేదస్వాధ్యాయము, ఈనాల్గును ఘనిష్ఠసంబంధముగలవి. ఇందుపనయనము సావిత్ర్యుపదేశము నొకటిగనైయున్నవి. ఇక మిగిలిన రెండుసంస్కారములును స్వతంత్రములు. ఈనాల్గింటిని సంగ్రహించి స్మృతియిట్లు చెప్పెను.

"ఉపనీయగురుఃశిష్యం, మహావ్యాహృతిపూర్వకమ్,
వేదమధ్యాపయేదేనం శౌచాచారాంశ్చశిక్షయేత్"

ఉపనయనమునకుబిదప మంచిముహూర్తము జూచి వేదారంభనిమిత్తకాభ్యుదయ శ్రాద్ధముగావించి, పంచభూసంస్కారపూర్వకముగ లౌకికాగ్నిస్థాపించి యాచార్యుడు యథావిధిగ నుపనీతశిష్యునకు, వేదమునారంభింపజేయును. అయ్యది ఋగ్వేదమగుచో "పృథివ్యైస్వాహా, అగ్నయేస్వాహా, యని రెండాజ్యాహుతులిచ్చి పిదప బ్రహ్మణే- ఛందోభ్యః- ఇత్యాదిగ దొమ్మిదియాహుతులిచ్చును. యజుర్వేద మగుచో 'అంతరిక్షాయస్వాహా, వాయవేస్వాహా, యనియు, సామవేద మగుచో 'దివేస్వాహా, సూర్యాయస్వాహా, యనియు, అథర్వ వేదమగుచో 'దిగ్భ్యఃస్వాహా, చంద్రమసేస్వాహా'అనియు, ప్రధానములుగ నుండును. ఇది ఇతికర్తవ్యతాసంక్షేపము.

తానధ్యయనముజేయదలచుకొన్న శబ్దమయ వేదమునకభిన్నమగుమాలి కాపౌరుషేయ వేదసంస్కారయుక్తడగుట

బ్రహ్మచారి కవసరము. వేదనిరుక్తి మరొకచోవిస్తరింపబడి నది. యజ్ఞోపవీతియగు సంవత్సర ప్రజాపతికి లోకములు, దిక్కులు,నని ప్రధానపర్వములురెండు. ఇందు పృథివి,అంత రిక్షము, ద్యులోకము,నని లోకములుమూడు దిక్కులు ప్రసిద్ధ ములేకదా! ఇట్లు మొత్తమునాల్గుపర్వములు. కాగా వీని కధిష్ఠాతృదేవతలు వరుసగ అగ్ని-వాయు-ఆదిత్య-చంద్రులు నలువురు. వీరునలువురు ప్రాణదేవతలును వరుసగ ఋగ్యజు స్సామాథర్వణతత్త్వాత్మకమాలిక వేదచతుష్టయముతో గూడి యుందురు. వీరిని తనయధ్యాత్మమం దాధానముగావించుట చేతనే వేదసంస్కార మాహితమగును. అందుపైజదివినశబ్దా త్మకవేదసాఫల్యము లభించును. కనుక స్వాధ్యాయకర్మారం భమున నీమాలిక దేవమయ వేదసంస్కారము కర్తవ్యమైనది.

## 5 కేశాంతము

"షోడశవర్షస్య కేశాంతః" అను పా।గృ।సూత్రముం బట్టి యీసంస్కారము బ్రాహ్మణునకు, 16వ యేటనగును. దీనిని పారస్కరుడుచూడాకర్మయందే చేర్చెను. 'గాంకే శాంతే' అనుసూత్రానుసారము, ఈకర్మాంతమునవాచార్యు నకు గోదక్షిణయీయబడును కనుక దీనిని 'గోదానసంస్కార'

షనియు నందురు. క్షత్రియునకు 22వ యేటను, వైశ్యునకు 24 యేట, నిదివిధింపబడినది. తత్తద్వర్ణ ఛందముల నధికో త్తేజముగావించుటకే యీవర్ష నిర్దేశ మనియెఱుంగవలయును.

ఇతి కర్తవ్యతావిషయమున జూడాకర్మయు నిదియు సమానములైనను, అక్కడక్కడ గొంచెమువిశేషము. ఉష్ణేనవాయవుదకే నేతి"మంత్రమున, కేశాన్ వప"యనుచో 'కేశశ్మశ్రూ వప'యందురు. చూడాకరణమున కేవలము శిరోవపనము, ఇందు ముఖశ్మశ్రుముండనము గూడ నగును. కనుక క్షురపరిహరణమంత్రముయొక్క "యత్ క్షురేణ" యనుమంత్రముచివరిదగు "మాస్యాయుః ప్రమోషీః" యను చోట 'మాస్యాయుః ప్రమోషీర్ముఖం' అనియందురు. ఈసంస్కారానంతరము కేశములను కనుపింపకుండ గోమయమందుంచి గోష్ఠముందో నీటియందో పార వేయుదురు. ఉనయనమందు ముండనము కొన్నిస్థానములందుమాత్రమే. దీనికిబిమ్మట 3-6-12 దినములు, యథాశక్తిగ, లేదా ఒకవర్షము, బ్రహ్మచర్యమాచరింపవలయును. ఈసూత్రము జూడుడు.

---

* పూర్వయుగములందు, ఈసంస్కారమునకు బిమ్మట అనగా 17-18 వత్సరములందును పెండ్లిసేయుచుండిరని తోచదు. అభిమన్యుడుమరణించు నాటికతనిభార్యయుత్తరగర్భవతి అభిమన్యునివయస్సు 16 సంవత్సరములా ?

'ముఖమితిచకేశాంతే। యథామంగళంకేశశేషకరణమ్। అనుగుప్తమేతం, సకేశం, గోమయపిండం, నిధాయగోష్ఠే, పల్వలే, ఉదకాంతేవా, ఆచార్యాయవరందదాతి, గాంకేశాంతే, సంవత్సరం బ్రహ్మచర్యం, *ఆవపనంచకేశాంతే ద్వాదశరాత్రం, షడాత్రం, త్రిరాత్రమంతతః పా॥గృసూ॥

## 6 స్నానము - లేక - సమావర్తనము

దీనిచే సంస్కృతుడగు వానిని స్నాతకుడందురు. ఇది గృహస్థాశ్రమోపక్రమము అందుకొరకు వటుడుతిరిగి గృహమునకు వచ్చును. బ్రహ్మచర్యానుబంధి మేఖలాదండాదులందు పరిత్యజించి గృహస్థానుబంధి వస్త్రోష్ణీషోపానహాదర్పణచ్ఛత్ర, పుష్పచందన, యష్ట్యాదులు, గ్రహింపబడును. ఆచార్యుడు వటుని స్వయముగామంత్రపూర్వకము నీపటికరయుక్తుంజేయును. వేదసమాప్తిగావించి స్నానముసేయువాడు విద్యాస్నాతకుడంటిమి.సమావర్తనకు మొదటిపక్షమిది.'వేదంసమాప్యస్నాయాత్." లేదా బ్రహ్మచర్యపూర్ణావధి 48 సం॥ పూర్తిగావించి స్నానముసేయుట రెండవపక్షము. కాని, మీమాంసావిరుద్ధ మగుట నిదిసర్వధా గౌణము. 'బ్రహ్మచర్యంవాఽష్టాచత్వారింశకమ్.' కొందరాచార్యులు 12 సం॥ల స్వాధ్యాయకాలానంతరమునగూడ సమావర్తన మంగీకరింపుచున్నారు "ద్వావింశకేప్యేకేఇచ్ఛన్తి".

ఈవిషయమున సూత్రకారులుపక్షములు మూడగును (1) సార్ధ = మంత్రబ్రాహ్మణాత్మక వేదాధ్యయనము పూర్తి

గావించి సమావర్తనజేయుటయొకటి (2)షడంగపూర్వకముగ వేదాధ్యయన సమాప్తిగావించి సమావర్తనజేయుట రెండవది "నకల్పమాత్రే" అన్నట్లు కేవలశబ్దమాత్రముగవల్లె వేయుటచే నీసంస్కారాధికారము లభింపదు. (3) పౌరోహిత్యమువృత్తిగాగలవారికి 'కామంతుయాజ్ఞికస్య' అన్నట్లు కేవలముకర్మకాండపద్ధతి జ్ఞానమున్నను పనిజరుగును కనుక నిదిమూడవపక్షము. ఇతికర్తవ్యతవల్లనే యీసంస్కారోపపత్తి తేటపడును. కనుక దానినే చూతము.

ఆచార్యానుజ్ఞాతుడై బ్రహ్మచారి 'ఇతశ్చపూర్వం వేదాహుతిహోమః' అన్నట్లు వేదాహుతిహోమముగావింపవలయను. ఇదివ్రతాదేశవిసర్జన కుపలక్షము. బ్రహ్మచర్యమందు పరిత్యజించిన పదార్థములను భోగములను విధ్యుక్తముగ నిందుస్వీకరించుట యగునని "ఏతదేవవ్రతాదేశవిసర్గేషు" ఇత్యాదులచే స్పష్టమగుచున్నది. హోమానంతరము వస్త్రాదివేష్టిత సమావర్తన (స్నాన) స్థానసమీపమందెయున్న యగ్నికుత్తరపార్శ్వమందు దక్షిణోత్తముగ జలఘటములెనిమిది యుండుచున్నవి. యథావిధిగ దన్నుబేర్కొని యాచార్యునకు బ్రణమిల్లి బ్రహ్మచారిసమిదాధానముజేసి పూర్వపశ్చిమములుగ బరుపబడిన కుశలందుగూర్చుండి ఈక్రిందిమంత్రముంజెప్పుచు బ్రథమఘటముతో జలముగొనుసు. ఈవిధిమంత్రములనవలోకింపుడు:—

"గురుణానుజ్ఞాతః, ఉపసంగృహ్యగురుం, సమిధో భ్యాదాయ, పరిశ్రితస్యోత్తరతః కుశేషుప్రాగగ్రేషుపురస్తాత్ స్థితా్వష్టానా ముదకుంభానాం 'యేప్స్వంతరగ్నయ' ఇత్యేకస్మాదపోగృహీత్వా తేనాభిషించతే 'తేన మామభిషించామి'ఇతి: (పా। గృ। సూ)

"యేఅప్స్వంతిరగ్నయః ప్రవిష్టా గోహ్యా, ఉపగోహ్యో, మయూషో, మనోహా, స్ఖలో,. విరుజ స్తనూదూషు, ఇంద్రియహా, తాన్ విజహామి, యోరోచన స్తమిహగృహ్ణామి, ఇతి.

"అపాంసఘూతౌ విలయనంచ తేజస్సంయోగాత్" అను వైశేషిక సిద్ధాంతముఁబట్టి అగ్నితత్త్వముజలమం దంతర్యామ సంబంధముచే బ్రతిష్ఠితమైయున్నది. 'ధర్త్ర'యనునీతరళాగ్ని ప్రవేశముననే జలముద్రుతమగును. పార్థివాపః ప్రతిష్టాగ్ని గాయత్రీఛందస్సంబంధముచే నెవిమిదివిధములయినను, దివ్యము, పార్థివము,నగు రెండురూపములుగలది. పార్థివగాయత్రాగ్ని సౌరదివ్యసావిత్రాగ్నికి బ్రవర్గ్యము. సౌరాగ్నియే. ప్రవర్గ్యముగనై పృధివియందంతర్యామసంబంధమున బ్రవేశించి, (పార్థివ) అష్టవసుసంబంధమున (పార్థివ) అపఃఫేనమృత్ సికతాద్యష్టానయసంబంధముచేతను. ప్రాతఃసవనీయ,పార్థివాష్టాక్షర గాయత్రీఛందస్సంబంధముచేతను, అష్టావయనమగుచున్నది. ఇదేకుమారాగ్నియనఁబడు నని నామకరణసంస్కారమున జెప్పబడినది. ఇయ్యదియహోరాత్రసంబంధమున రెండురూపములందును. పగటియందే యగ్నికి (అగ్నులకు) మూలరూప సౌరదివ్యసావిత్రాగ్నిసంబంధ ముండును. కనుక నిది దివ్యగుణయుక్తము ఇంద్రభావోపేతము నైయుండును.

పృధివికి రాత్ర్యనుగమనముకలుగగా నీయగ్ని కాసార - దివ్యాగ్నిసంబంధవిచ్యుతికలిగి, పార్థివ 'గర' (విష) భాగ యోగముకల్గును. 'అద్భ్యఃపృధివీ' యన్నట్లు పృధివిజలోద్భూతము. జలమువరుణప్రధామగు నాసురమై దివ్యసంపన్నాశకము, చేత నంబోగొట్టునొకవిధమగువిషము, నై యున్నది. వారుణియగురాత్రియం దీవిషమునకు ప్రాధాన్యముకనుక రాత్రి 'సగరా'నామము నొందెను. ఈగరసంబంధమున అగ్నియు, నాసురభావయుక్తముగనే యుండును. ఇట్టియాసురాగ్ని వారుణజలములచే పూర్వోక్త మంత్రస్థ గోహ్యాద్యష్ట దోషములుకల్గును:—

(1) శరీరముబిగిసికొనిపోవుట గోహ్యాదోషము, (2) శరీరముమంటలుపుట్టుట ఉపగోహ్యాదోషము (3) శోధకలుగుట మయూషదోషము (4) మనస్సునందుత్సాహముశూన్యమగుట మనోహాదోషము (5) మందాగ్నిరోగము అస్ఖలదోషము (6) కీళ్లసంధులందుపోట్లుకల్గుట విరుజదోషము, (7) శరీర దుర్గంధముకల్గుట తనూదూషుదోషము (8) ఇంద్రియవ్యాపారశైథిల్యము ఇంద్రియహాదోషము.

వస్తుతఃఅగ్నినుండియీదోషములుకలుగవు. వీనినగ్ని దూరముసేయును. కాని,యదివారుణాప్యధర్మయుక్తమగుచో నీదోషములకుగారణమగును. కనుక నివి వారుణదోషము లేయందురు. అనగావారుణాగ్ని యీదోషములకు బ్రవర్తక

మని యర్థము. వర్షర్తువునం దీయగ్నికి ప్రాధాన్యముకనుక 'వర్షానుదోషాః కుప్యన్తి' యనిచెప్పబడినది. పైదోషములన్ని యు ముఖ్యముగ వర్షఋతువునందు కలుగును. అట్టిదోష ములుతొలగి దివ్యభావాత్మక - ఐంద్ర - రుచికర - హితకర భావము స్ఫుటత్వమొందవలయునని పూర్వోక్తమంత్ర రహ స్యము. మంత్రశక్తిప్రభావమున నాదోషములుపోయి గుణ ములు ప్రకటములగును. "అచింత్యోహిమణిమంత్రౌషధీనాం ప్రభావః" అట్టిమంత్రపూతజలముంగొని "తేనమామభిషిం చామి, శ్రియై,యశసే, బ్రహ్మణే, బ్రహ్మవర్చసాయ," యని స్నానముసేయును.

వారుణజలమష్టదోషకారకమైనట్లు, దివ్యజలముయశ, శ్రీ; బ్రహ్మబ్రహ్మవర్చస్కారకమగును. అధాత్మసంస్థయం దు, ఆత్మఅనగా:- బ్రహ్మమూర్తియందు సంస్కార్యమగు భూతాత్మ (1) బుద్ధి (2) మనస్సు (3) పాంచభౌతికశరీరము (4)నని నాల్గుప్రధానపర్వములు. (1) బ్రహ్మమూర్తియగు నాత్మయొక్క జ్ఞానవికాసము బ్రహ్మవర్చస్సు (2)బుద్ధివికాసము బ్రహ్మ(వేదము) (3) మనోవైభవముయశస్సు (4) శరీర కాంతి శ్రీదివ్యజలస్నానమున నీనాల్గును నాల్గుగుణములతో నొప్పారునని మంత్రరహస్యము.

గాయత్రసంపత్ప్రాప్తికొరకుంచిన యెనిమిదిఘటముల జలమును గొనునపుడు 'యేఽప్స్వంతరగ్నయః' యను

మంత్రమే కాని యభిషేకమంత్రములు మాత్రము వేరు వేరుగ నుండును. మొదటిమంత్రము మున్నే చెప్పబడినది. మిగిలిన 2, 3, 4, 5 వ అభిషేకములకీ క్రింది మంత్రములు. చివర మూడభిషేకము లూరకే చేయవలయును.

(2) యేనశ్రియమకృణుతాం, యేనాపమృశతాంసురాన్, యేనాక్ష్యావభ్యషించతాం, యద్వాం, తదశ్వినాయశః (ఇతి)

(3) ఆపోహిష్ఠామయోభువః, తానఊర్జేదధాతన, మహేరణాయచక్షసే,

(4) యోవశ్శివతమోరసః తస్యభాజయతేహనః, ఉశతీరివమాతరః,'

(5) తస్మాఅరంగమామవో యస్యక్షయాయజిన్వథఆపోజనయథాచనః,

2వ మంత్రము:–"ఓయశ్వినులార! ఏ(జలీయశక్తి) ప్రభావమునతాము(అభిషేకముచే) దేవతలకు శ్రీగలుగ జేసిరో, దేనిచే సురల నప్రధర్షణీయులగావించిరో, దేనిచే నభిషేకించి నేత్రములను బలముగలవిగ జేసిరో అట్టి తమ జలముచే నేడు నేను స్నానముసేయుచున్నాను.'

సవిత-అశ్వినులు మొదలగువారు 'ప్రాతర్యావాణ దేవతలు, ప్రాతఃకాలప్రకృతిమండల వ్యాప్తదేవప్రాణములం దాగ్నేయప్రాణసూచక, నాసత్య-దస్రనామ కాశ్వినీప్రాణము లెన్నదగినవి. అశ్వినీప్రాణప్రవేశముగలజలము దివ్యభావ ప్రవర్తకమగుటయే కాక, నేత్రముల కెంతో మేలుసేయున దగును. ప్రాతఃకాలపుమంచునీటియం దీయశ్వినీప్రాణవిశేష మున్నది. కనుక దీనిని ముక్కునబీల్చుచో నేత్రజ్యోతి వృద్ధి

గాంచును. విశేషించి, శరత్పూర్ణిమారాత్రి నాటి తుషారజల మైనచో మరింతయుపకారకము. ఆనాడశ్వినీప్రాణఘనాశ్వినీ నక్షత్ర ముండునుగదా! విస్తరభయమున స్థాలీపులాకన్యాయ మవలంబింపబడినది. తక్కినమంత్రముల తాత్వికార్థము పాఠకులూహింపగలరు.

ఇట్లు యథావిధిగస్నానముచేసి బ్రహ్మచారి యీ క్రిందిమంత్రముచే మొదట మేఖలను శిరముపైపునుండితీసి భూమిపైనుంచి, దండమునువిడచును.

"ఉదుత్తమం[1] వరుణ! పాశమస్మ[2]దనాధమం, విమధ్యమం[3]శ్రథాయ, అథావయమాదిత్య! వ్రతేతవానాగసో-అదితయేస్యాను"

ఓవరుణ! పైది, క్రిందిది, మధ్యది, యనగు మాపాశము ములను వదల్చుము, ఓయాదిత్య! పిమ్మట (పాశముక్తులమై నిరపరాధులమగు మేము నీ(యజ్ఞాత్మక) వ్రతమందు, దీనతా రహితులమై యుందుము.

త్రివృన్మేఖలయందుపైని, మధ్య, క్రింద మూడుముళ్లుండును (గ్రంథులు) అవి త్రిబంధనసూచకములు. బ్రహ్మచర్యమున నాచార్యగృహమం దుండు బ్రహ్మచారి తనమూడు శక్తుల (జ్ఞా, కర్మార్థముల)చే సర్వథాపరతంత్రుడై ఆయా నియమపాశబద్ధుడై యుండును. సమావర్తనపర్యంతము వానిని దప్పకయనుగమింపుచు, యాజ్ఞిక శ్రౌత సంస్కారముల కధికారియగును. ఊర్ధ్వలకుజ్ఞానశక్తి మేఖలయొక్క యూర్ధ్వ

బంధనము. మధ్యలక్షణక్రియాశక్తి మధ్యబంధనము. అధో
లక్షణార్థశక్తి యధోబంధనము. ఇవి యన్నియు నాచార్య
సీమకధీనములు. ఆయన చెప్పినది యెరుంగవలెను. (జ్ఞానము)
ఆజ్ఞాపించినది చేయవలయును. (కర్మ) అనుభవించవలెను.
(అర్థ-భోగము) ఈసీమాభావసూచక మీ గ్రంథిత్రయయుత
త్రివృన్మేఖల.

సమావర్తనకుబిదప గృహస్థాశ్రమప్రవేశము. అందు
స్వాతంత్రతకాకావలయును. అదియెట్టిది? ఆదిత్యకర్మానుబంధీ
స్వాతంత్రత. ఇంతవరకు పార్థివవ్రతానుగామిగ నుండెను. ఇక
యజ్ఞ-తపో-దానలక్షణ- విద్యాసముచ్చిత- ఆదిత్యవ్రతాను
గామిగ నుండును, ఆహవనీయాగ్నిరూపాదిత్యో డీతనిశిరో
భాగము. కనుక మేఖలనటుదీయవలయును. "ముందుముందు
చ్ఛృంఖలముగ వర్తింపగోరి యీబంధములం ద్యజించుటలేదు.
నేటివరకు మూలాధారస్థానీయ పార్థివవ్రతములను ప్రధాన
ములుగ జేసికొంటిని. ఇక శిరోభాగోపలక్షితాదిత్యవ్రత
బంధమునం దుండెద నందుకు పూర్వబంధనములవలన బని
సాగదు. కనుక నాదరపూర్వకముగ వీనిం ద్యజించుచున్నా?"
నని భావము.

ఇట్లు మంత్రపూర్వకముగ మేఖలను-ఊరకే దండ-
మృగచర్మములనువిడచి, యపుడే యాదిత్యవ్రతప్రతినజేసి
స్వచ్ఛ-ధౌతవస్త్రధారణజేసి యీమంత్రములచే సూర్యోప
స్థానము గావించును:—

"ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భిరస్థాత్ ప్రాతర్యావభిరస్థాత్
దశసనిరసిదశసనిం, మాకుర్వావిదన్ మాగమయ.

ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భిరస్థాత్ దివాయావభిరస్థాత్
శతసనిరసి శతసనిం, మాకుర్వావిదన్ మాగమయ.

ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భిరస్థాత్ సాయంయావభిరస్థాత్
సహస్రసనిరసి, సహస్రసనిం, మాకుర్వావిదన్ మాగమయ."

ప్రాతస్సవనాది సాయంసవనాంత ముందు సూర్యస్థితి యీమూడుమంత్రములందును వర్ణింపబడినది. ఇంద్ర, ధాతా, భగ, పూషాది 12 ప్రాణములసమష్టి సూర్యుడు. ఇందు అన్నిటి కంటె జ్యేష్ఠము, శ్రేష్ఠము, యజ్ఞసంచాలకము, యజ్ఞపతి, ఆత్మస్వరూపప్రవర్తకము, బృహతిద్వారా ఆయుస్వరూప రక్షకము, ధీభాగముద్వారాబుద్ధి ప్రవర్ధకము, ముఖ్యమునగు నింద్రప్రాణమే సూర్యోపలక్షితము. 'ఇంద్రతురీయాః గ్రహాః గృహన్తే' అనట్లు సూర్యస్థమగు నీయింద్రప్రాణము మరుత్వాన్నామక, సప్తసప్తకాత్మక వాయువిశేషయుక్తమై ప్రార్థివ ప్రజయొక్క యధ్యాత్మసంస్థయందు ప్రవేశించును. వస్తుతః రశ్మిలద్వారా యింద్రప్రాణము త్రైలోక్యవ్యాప్తమగుచున్నదని "దేవంవహన్తి కేతవః దృశేవిశ్వాయసూర్యం" యనువాక్యముచే స్పష్టమగుచున్నది. కాని, కేవలరశ్మిల ద్వారా యింద్రప్రాణము పృథివికరుదెంచుచో సర్వత్రా వ్యాప్తియుండదు. ఏలయన;— సూర్యరశ్మి, సత్యభావము

గలది కనుక ఋజుమార్గానుసారి. కనుక రశ్మిసంధిస్థానము లింద్రవ్యాప్తిశూన్యములుగ నుండును. కాని యంతరిక్ష సంచారి వాయుదేవత లీలోపముం బూరించును. వాయువు ఋతము. కనుక సర్వతోవ్యాప్తికలది. రశ్మిసంధులు వాయు శూన్యములుగ నుండవు. చివరకు :—వాయు వందలి ప్రతి బింబగ్రాహక (వీధ్ర) (రశ్మిగ్రాహక) దిక్సోమ ప్రభావముచే సౌరరశ్ములిటునటు నంతట ప్రతిఫలితము లగును. ఇట్లు మరుత్వాన్వాయుసహయోగముచే ఛిద్రభావయుక్త పవిత్ర రశ్ములచ్ఛిద్ర-పవిత్రములగును. ప్రాతరాది కాలత్రయమున మరుత్సహయోగముచే నింద్రుడు సర్వత్ర-అచ్ఛిద్రరూప మున వ్యాప్తుడగుచున్నాడు. సర్వతోవ్యాప్తి మరుత్వత్సహ యోగమున కొకఫలము. రెండవఫలము 'భ్రాజ తేజ' వికాసము.

✓ వర్చ-భ్రాజ-ద్యుమ్న-సుమ్నాదిభేదముచే తేజమున కనేకజాతులు. (1) జ్ఞానీయతేజము, వర్చస్సు (2) కనులకు మిరుమిట్లుగొల్పు రూపజ్యోతిర్మయతేజస్సు భ్రాజస్సు (3) భూషణోత్పన్న సౌందర్యవిశేషముద్యుమ్నము, (4) కర్మ కౌశలలక్షణచాతుర్యము సుమ్నము. ఇందు (1) వర్చస్సున కగ్నితో (2) భ్రాజస్సునకింద్రునితో, (3) ద్యుమ్నమునకు విశ్వేదేవులతో (4) సుమ్నమునకు పార్థివ పూషాప్రాణ ముతో సంబంధము. కనుకనే (1) అగ్ని ప్రధానుడగు బ్రాహ్మ ణుని ప్రాతిస్వికతేజము, బ్రహ్మవర్చస్సు, (2) ఇంద్రప్ర

ధానక్షత్రియతేజస్సు భ్రాజస్సు (3) రత్నమణిముక్తాసువర్ణాదిభూషణాలంకృత విశ్వేదేవప్రధాన వైశ్యులతేజము ద్యుమ్నము, (4) శిల్పచాతుర్యమునందు నైపుణ్యముగల శూద్రతేజము సుమ్నము అందురు.

మన యీ బ్రహ్మచారికి నేడుగృహస్థసంస్థాశాసనము కొరకు 'భ్రాజ' తేజస్సుకూడ కావలయును. సూర్యస్థితేంద్రదేవత స్వయముగ రూపాధిష్ఠాతయే. (రూపంరూపంమఘవా బోభవీతి). మరియు, వాయుగత సోమసంపర్కముచే నితని రూపజ్యోతి మరింతప్రదీప్తమైనది. ఈప్రదీప్తతేజమే భ్రాజస్సు వాయుస్థితసోమపానముచే భ్రాజమానుడగు నీయింద్రాత్మకసూర్యుని స్తుతించు నీఋషివచనముం జూడుడు:—

"విభ్రాడబృహత్ పిబతు, సోమ్యం, మధ్వాయుర్దధ్యద్యజ్ఞపతావవిహుతమ్, వాతజూతో యో అభిరక్షతి, త్మనా ప్రజాః పుపోష పురుధావిరాజతి" (యజు.సం)

ఈభ్రాజతేజస్సుచే మరుద్గణసహచారియింద్రుడు 'భ్రాజభృష్ణుడగుచున్నాడు. వీరిభ్రాజస్సు త్రైలోక్యమందితర భ్రాజతేజస్సుల నణచివేసినది. వీరికెదురుగ నెవడును జూడజాలడు. దృష్టినిల్పజాలడు. అట్టి యీభ్రాజిష్ణుదేవతలు ప్రాతర్గ్రావాదీతరప్రాణదేవతలతో యుక్తులై త్రైలోక్యప్రతిష్ఠితులై యున్నారు. మంత్రములపూర్వార్ధ మింతటితో గతార్థమైనది.

ప్రతిగృహస్థునకు దనగృహసంస్థను యథావిధిగ నడు పుకొనుటకు, జ్ఞానానుగత బ్రాహ్మబలము, క్రియానుగతక్షత్రబలము, అర్థానుగతవిడ్బలము, (జ్ఞానక్రియార్థశక్తులు) కావలయును. ఈమూడుబలములును భ్రాజిష్ణువు, మరుత్సహచారియు,నగు నింద్రునిచే భిన్నభిన్న దేవతలసహయోగమున, లభించును. (1) అగ్ని-ఉషా-అశ్వినీ-సవిత-యమ-వీరు 'ప్రాతర్యావాణ' దేవతలు. ప్రాతస్సవనోపలక్షిత ప్రాతఃకాలమందింద్రుడు వీరింగూడియే, బ్రహ్మబలప్రదాత యగును. (2) ఛంద-ఋభు-వృషాకపాయీ మొదలగువారు 'సాయంయావాన, దేవతలు. సాయంసవనోపలక్షిత సాయంకాలమందింద్రుడు వీరిసహయోగమున విడ్బలప్రదాతయగును. ఇక మధ్యగతులగు, పృశ్నిమాతా, మరుత్ మొదలగువారి సహయోగమున క్షత్రబలప్రవర్తకుడగును.

మూడుసవనములందును సౌరరశ్మిలవితానము 10, 100, 1000, సంఖ్యలచో వ్యాపనగును. ఈవిషయ మీశావాస్య విజ్ఞానమున గాయత్రీమాత్రిక వేదనిరుక్తియందరయనగును. ఈసంస్థల ఋణ-ధనభావములచే ఋగ్యజుస్సామాథర్వ వేదములకు క్రమముగ 21, 101, 1000, 9, శాఖ లేర్పడుచున్నవి. ఆవివరణము వేదవిజ్ఞానమందు వివృతమైనది. ప్రకృతము:— మూడుమంత్రములచే సూర్యోపస్థానము గావించు, స్నాత

కుడు గృహస్థానుబంధియగు నాదిత్యతేజమును, తన బ్రహ్మ భాగమునం దాధానము సేయును.

పిమ్మట, దధియో, తిలలో ప్రాశనసేయును. అందువలన సూర్యోపస్థానాహితేంద్రసంస్కారము దృఢమూల మగును. ఉపస్థానకర్మచే నింద్ర దేవత యితనియధ్యాత్మసంస్థకరిధిగ నగును. అతిథీకిభోజనాదిసత్కారము మానవధర్మము. ఇకసాన్నాయ్యలక్షణదధియు, తిలలు, నింద్రుని ప్రీతిస్వీకాన్నములై యున్నవి. వరుణప్రతిమూర్చి తేంద్రుని పేరు దధి-తిలలు. ఇందేదో యొకపదార్థము గ్రహింపబడును. ఇంతటితో నొకవిధముగ సమావర్తన సంస్కారము సమాప్తమైనట్లే. పిమ్మటనాచరింపబడు కర్మలెల్ల గృహస్థమర్యాదా సంబంధముగల యాదేశములు. వానియితికర్తవ్యత దృఢమగుట కీసంస్కారమందు జేర్పబడినవి. ఇక బ్రహ్మచారి యాబ్రహ్మచర్యానుగత నియమములనువదలి దంతధావనాది గృహ్యకర్మలందు బ్రవృత్తుడగును.

ప్రాశనానంతరము "దధితిలాన్ వా ప్రాశ్యజటాలోమనఖానిసంహృత్య ఔదుంబరేణ దంతాన్ధావేత" పా।గృ।సూ అన్నట్లు క్షురకర్మచేయించుకొని స్నానానంతర ముదుంబర కాష్ఠమున నీమంత్రముతో దంతధావనముసేయును.

'అన్నాద్యాయ, వ్యూహధ్వం, సోమోరాజాయమాగమత్ సమేముఖం ప్రమార్క్ష్యతే యశసాచభగేనచ.

దంతములార !

అన్నచర్వణప్రక్రియానురూపముగ మీపంక్తిచక్క-గనుండవలయును. ఈసోమరాజిక్కడకు వచ్చియున్నాడు. అతడుముఖమును (దంతములనునోటిని) శుభ్రముగావించి యశో-భగయుక్తము, జేయును. లనియర్థము.

మంత్రముసాధారణము. దంతధావనమున్నుసామాన్య కర్మ. కాని యీకర్మమహత్వ మెంతగొప్పది ? మనము తిన్నయాహారముల యనుశయము మనదంతచ్ఛిద్రములందు జేరి యుండి మనము దంతధావనసేయకున్నచో కాలాంతర మున కీటాణువుల నుత్పన్నముగావింపగా నవి మనయుదరగత ములై యగ్నిమాంద్యాది దోషములకు గారణమగును. కనుక దంతధావనసేయు టవసరమైయున్నది. అందులకు దివ్యవీర్య రక్షణను బ్రధానముగగోరు ద్విజాతికి నేటిదంతధావనసాధన ములెందుకైన బనికివచ్చునా? దోషవర్ధకములుగావా? యని యోచింపవలయును. వీనివలన పండ్లుతెల్లగనుండుగాక ! పవిత్రసోమగుణమేది ? దివ్యభావమునావృతముగావించు రోమ నిర్మిత ధావనోపకరణము. (Brush) అభక్ష్యపదార్థమిశ్రిత చూర్ణాదిధావనద్రవ్యముల మాటయేమి ? శుభ్రతమంచిదే. భూతశుద్ధితో నాత్మభావమును రక్షితముగావలయును. శాస్త్ర ములందు జెప్పబడిన ఖదిర,కదంబాపామార్గాదికాష్ఠములందు గావలసిన యన్నిగుణములు నున్నవి. దివ్యభావముంబట్టి వర్ణ

భేదముననుసరించి దంతకాష్ఠపుగొ_ల్తయందు భేదమున్నది. యీవచనముజూడుడు:—

"ఖాదుంబరేణ *ద్వాదశాంగుళ సమ్మితేన, కనిష్ఠికాగ్రవత్ స్థూలే నదంతాన్ ధావయేద్బ్రాహ్మణః దశాంగుళేనరాజన్యః అష్టాంగుళేవైశ్యః

బ్రాహ్మణుడు బ్రహ్మోపాసకుడు. క్షత్రియుడు తేజోపాసకుడు(జ్యోతి). వైశ్యుడు విశ్వేదేవాత్మకాన్నోపాసకుడు. ఈదృష్టితో జగతిబ్రహ్మ. అదిద్వాదశాక్షర. †కనుక బ్రాహ్మణునకు 12 అంగుళములు. తేజమువిరాట్టు. అదిదశాక్షర. కనుక క్షత్రియులకు 10 అంగుళములు. అనుష్టుప్పువిశ్వేదేవులది. దానికి సప్తాహోరాత్రవిజ్ఞానముంబట్టి యష్టాక్షరములు. కనుక వైశ్యునకు 8అంగుళములు. అనిదంతకాష్టప్రమాణవిధి.

పిదప నంగోద్వర్తనము. మరలమలస్నానము. తరువాత ఈక్రిందిమంత్రముచే ముఖనాసికములందు చందనాద్యనులేపనము.

"ప్రాణాపానౌమేతర్పయ చక్షుర్మేతర్పయ ! శ్రోత్రంమేతర్పయ !

---

* ఉదుంబరేణవాక్సిద్ధిః బదర్యామధురస్వరః
కదంబేనమహాలక్ష్మీః రామేణారోగ్యమేవచ
అపామార్గేసర్వసిద్ధిః బంధూకేచదృఢామతిః
ఆరోగ్యం కర్ణికారేణ కరంజేనరణేజయః

† బ్రహ్మవైజగతీ (గోపథ) ద్వాదశాక్షరాజగతీ (తాండ్య) విరాడ్వైఛందసాంజ్యోతిః (తాండ్య) దశాక్షరావైవిరాట్ (శత) విశ్వేదేవా అనుష్టుభంసమభరన్ (జై।ఉ)

ⓞఉత్సాద్యపునఃస్నాత్వా, అనులేపనం, నాసికయోర్ముఖస్యచోపగృహ్ణీతే "ప్రాణాపానౌ" పా।గృ।సూ.

పిదప ప్రాచీనావీతియై "పితరశ్శుస్ధ్వధ్వమ్" యను మంత్రముంజెప్పుచు, స్నానముచేసినజలమును జేతగొని దక్షిణముగ విసరును. అనంతరము చందనాదులంబూసికొని యీ మంత్ర ముచ్చరించును.

"సుచక్షాఅహమక్షిభ్యాం భూయాసం, సువర్చాముఖేన సుశ్రుత్ కర్ణాభ్యాం, భూయాసం," ఇతి-

ఇట్లేమంత్రపూర్వకముగ వస్త్రధారణము, పుష్పగ్రహణము పుష్పబంధనము, కర్ణాలంకారధారణ ఉష్ణీషధారణము, ఛత్రగ్రహణము, వేణుదండధారణము, ఆదర్శముఖదర్శనము చెప్పులదొడుగికొనుట, మొదలగునవి కావింపబడును. అంతటితో బ్రహ్మచర్యాశ్రమసమాప్తి-గృహస్థధర్మారంభము. ఇక త్రైవర్ణికసంజ్ఞ కలుగును. గృహస్థాశ్రమమందేయే యమములను పాలింపవలయునో, అవియుపదేశింపబడును. అయ్యవి ఆయాధర్మగ్రంథములం దరయనగును.

## 7 వివాహము

ఇది ప్రజాపతికి మొదటిసంస్కారము. దీనిచేసంస్కృతుడై యతడు వేదలోక-ప్రజా-ధర్మసృష్టులందు సమర్థుడయ్యెను. "సఏకాకీన రేమే, తద్వితీయమైచ్ఛత్, పతిశ్చ పత్నీచ" ఇదియతని మొదటికోరిక. గర్భాధానాదులు వివాహమునకు దరువాతివి. కనుక కొన్నిగ్రంథములందిది మొదట

ప్రతిపాదితమైనది. ప్రజాపతితనయర్ధభాగముం బత్నిగఁజేసి కొని యందుగర్భీభూతుఁడయ్యెను. కనుక నిది మొదటి సంస్కారమే.

మనము నీసంస్కారముచే సంస్కృతులమై వేద-లోక-ప్రజా-ధర్మభావచతుష్టయ మందు గృతకృత్యత సంపాదింపగలము. వివాహములేకున్నచో వేదమూలక యజ్ఞకర్మకధికారములేదు. ఇకలోక ప్రతిష్ఠయేది ? ప్రజాసమృద్ధియెట్లు ? ధర్మసంగ్రహమెక్కడ? ఈసంస్కారబలమున తనయధ్యాత్మప్రపంచమును, అధిభూతప్రపంచముద్వారా, అధిదైవతప్రపంచముతో యుక్తముసేయనగును. అదిలేనినాఁడు పురుషుఁడర్ధవృగలుఁడు లేక అర్ధేంద్రుఁడు. పూర్ణపురుషుఁడగు నీశ్వర ప్రజాపతితో సాయుజ్యభావప్రాప్తి నొందుట కీయర్ధేంద్రత పూర్ణేంద్రతగ బరిణతినొందవలసియున్నది. అది పత్నీసంయోగముపై నాధారపడి యున్నది. పత్నియితని యర్ధాకాశముం బూరించి పూర్ణపురుషసమానునిఁ గావించును. కనుకనే మహర్షులిది యావశ్యకతమ సంస్కారమని యెంచిరి.

సామాన్యలౌకిక మానవదృష్టి కిది లౌకికకర్మగ వైషయిక తృప్తిసాధనమాత్రముగ, దోచవచ్చును. కనుక వారి వివాహము, వివాహధర్మ బహిష్కృతము. కాని, యొక యాస్తిక-భారతీయ,ద్విజాతిదృష్టియందు, వివాహ మొకయలౌకిక సంబంధము. ఏతత్సంస్కార సంస్కృతవ్యక్తిద్వయ

శరీరద్వయము వేరగుగాక ఆత్మయొకటే యగుచున్నది. కను కనే లోకాంతరములందు నీదాంపత్యభావ ప్రవాహము సాగు చునే యుండును. 'సహధర్మంచరతామ్' అన్నట్లిది యెన్న డును విచ్ఛిన్నముగావింప నైతిగాని ధార్మికసంస్కారము.

సంవత్సరప్రజాపతి కుపనయనప్రకరణమున ఖగోళ వ్యాప్తియు, గర్భాధానప్రకరణమున గశ్యపసంస్థతో సంబం ధమును, జెప్పి కశ్యపాకారపరిణతినొంది సృష్టిసమర్థుడగు ననియు జెప్పితిమి. సంవత్సరమండలావచ్ఛిన్నము, కశ్యప్రజా పతిని సీమెతుంగావించునదియు, నగు ఖగోళమే, ఇంద్రుని పూర్ణవ్యాప్తిచే పూర్ణేంద్రుడు నాబడును. "సేంద్రాదృతే పవతేధామకించన" అన్నట్లు ఖగోళమంతట నింద్రతత్త్వవ్యా ప్తి యుండును. ఈయింద్ర ప్రాణమునకు, అగ్ని-సోమ-అను రెండుతత్త్వములు. నిత్యసహయోగులు. ఈరెంటిలో నగ్ని సహయోగమున నింద్రాత్మక కశ్యపప్రజాపతి. సూర్యా త్మచే బురుషసృష్టికి, సోమసహయోగమున జంద్రాత్మచే స్త్రీసృష్టికి. హేతువగుచున్నాడు. అగ్నిప్రధానము, సౌరము నగు నర్ధభాగముచే బురుషుడు, సోమప్రధానము, చాంద్రము, నగు నర్ధభాగముచే స్త్రీ, జనించిరి. కనుక పురుషుడాగ్నేయు డు, స్త్రీ సౌమ్య యందురు.

సంవత్సరప్రజాపతి కహోరాత్రములను రెండుపర్వ ములున్నవి. ఈరెంటికి సూర్యచంద్రులతో సంబంధముకలదు. అమాస్యనందు చంద్ర(సోమ)గర్భిత సూర్యసామ్రాజ్యము.

రాత్రియందు సూర్యగర్భిత చంద్రసామ్రాజ్యము. అహస్సు సంవత్సరార్ధభాగము, రాత్రియర్ధభాగము. రెంటిసమన్వయమున నహోరాత్రలక్షణ సంవత్సరచక్రము పూర్ణమైయున్నది. పక్ష-మాస-అయనాదులన్నియు నహోరాత్రపరిప్లవ సంబంధముగలవై యహోరాత్రాత్మకములే యైయున్నవి. కనుక జీవరక్ష, సంవత్సరస్వరూప మహోరాత్రములపైననే పర్యవసించును, ఈవచనములు చూడుడు:—

(1) ఏతేహవై సంవత్సరస్యచక్రే యదహోరాత్రే (ఐతరే) (2) అహోరాత్రాణీష్టకాః (సంవత్సరస్య) (తై॥బ్రా) (3) ఏతావాన్వై సంవత్సరో యదహోరాత్రే (కాషీ) (4) అహర్వైవిష్ణుక్రమాః, రాత్రిర్వాత్సప్రమ్, ఏతద్వాఇదంసర్వంప్రజాపతిః ప్రజనయిష్యంశ్చ, ప్రజనయిత్వా చాహోరాత్రాభ్యాముభయతః పర్యగృహ్ణాత్ (శత).

ఇంతకు వస్తుతత్త్వమేమనగా:- ఋతాగ్ని-ఋతసోమముల, అన్న-అన్నాదాత్మక యజ్ఞసంబంధముచే సంవత్సరస్వరూపము సంపన్నమైనది. అగ్ని తేజము,అహస్సు; సోమము స్నేహము,రాత్రి; ఈరెంటిచే సంవత్సరము వ్యాప్తము. వీనినే యహోరాత్రము లందురు. ఇందు పార్థివప్రజానుబంధి తేజ-స్నేహ తత్త్వోపభుక్తియగుచున్నది. వీనినే శుక్ల-కృష్ణపక్షము లందుము, అందాంతరీక్ష్య ప్రజానుబంధి (పిత్రనుబంధి) తేజస్నేహోపభుక్తి యగుచున్నది. మరి వీనినే ఉత్తరాయణదక్షిణాయనము లందుము. వీనియందు దివ్య (దేవ) ప్రజానుబంధి తేజ-స్నేహోపభుక్తి యగుచున్నది.

మనదృష్టితో షణ్మాసాత్మకమగు నుత్తరాయణకాలము తేజోభావమువలన దివ్యప్రజల కొకపగలు, షణ్మాసాత్మకదక్షిణాయన మొకరాత్రి. ఇట్లే:- శుక్లపక్షము పితరుల కొకపగలు, కృష్ణపక్ష మొకరాత్రి. ఇందువలననే యహోరాత్రములు విచాలులని యంగీకరించిరని యాశ్రమవిజ్ఞానమందు జెప్పబడినది. ఇంతకు దేలినదేమన:- రాత్రిచే స్నేహతత్త్వ ముపలక్షితము. అహస్సుచే తేజస్తత్త్వమభిప్రేతము ఈ రెంటిసమన్వితరూపము సర్వ (సంవ)త్సరమని 'ద్వయం వా ఇదంసర్వం స్నేహశ్చైవతేజశ్చ తదుభయమహోరాత్రాభ్యామాప్తం' అను శాంఖాయన శ్రుతి తెల్లము సేయుచున్నది.

తేజోమయాహఃకాలమందు సౌరాగ్నికి స్నేహమయరాత్రికాలమందు చాంద్రసోమమునకు ప్రధానతకల దనుకొంటిమి. ఇక:- పృథివ్యనుగతము, అగ్నీషోమాత్మకము నగు సంవత్సరీయఖగోళ మీయహోరాత్రసంబంధమున దృశ్యమనియు, నదృశ్యమనియు రెండుభాగము లగును. (1) దినావచ్ఛిన్నము, సౌరాగ్నేయప్రాణప్రధానము, చాంద్రసోమగర్భితము, అర్ధవిషువద్వృత్తయుక్తము, నగు నర్ధసంవత్సరచక్రముదృశ్యము. (2) రాత్ర్యవచ్ఛిన్నము, చాంద్రసౌమ్యప్రాణప్రధానము, సౌరాగ్నిగర్భితము, అర్ధవిషువద్వృత్తముతో యుక్తము, నగు నర్ధసంవత్సరచక్ర మదృశ్యము. మొదటిదానినుండి పురుషసృష్టికల్గినది, రెండవదానినుండి స్త్రీసృష్టికల్గినది.

కనుక తిరోభావ మీ స్త్రీసృష్టికి స్వాభావికధర్మము. ఈవచ నములరయుడు:-

"తిరఇవై వచిచరిషతి" (శత) "గృహావై పత్న్యై ప్రతిష్ఠా" (శత)

పృథివీధర్మమురాత్రివికాసమందును కాని, పగలాపా ర్ధివవివర్తము, సౌరధర్మాక్రాంతమై పోవును. పృథ్వీగార్హ పత్యము. దానియగ్ని 'గృహపతి'యందురు. కనుక స్త్రీ, గృహప్రతిష్ఠ యనిరి. గృహసంస్థను నడపునది కేవల మాడు దియే. లజ్జావినయశీలాది స్వాభావికధర్మయుక్తలగు స్త్రీ లను గమింపదగిన ధర్మములను స్మృతికర్త లిట్లు సంక్షేపించిరి.

(1) భర్తృసమానవ్రతచారిత్వమ్. (2) శ్వశ్రూశ్వశురగురుదేవతా తిథిపూజనమ్ (3) సుసంస్కృతోపస్కరతా. (4) అముక్తహస్తతా. (5) సుగుప్తభాండతా. (6) మంగళాచారతత్పరతా (7) భర్తరిప్రవసితేఅప్రతి కర్మక్రియా. (8) పరగృహేష్వనభిగమనమ్. (9) ద్వారదేశగవాక్షేష్వన వస్థానమ్. (10) బాల్యయౌవనవార్ధకేష్వపిపితృభర్తృపుత్రాధీనతా. (11) మృతేభర్తరిబ్రహ్మచర్యం, తదన్వారోహణంవా.

"నాస్తిస్త్రీణాంపృథగ్యజ్ఞో నవ్రతంనాప్యుపోషితం
పతింశుశ్రూషతేయత్తు తేనస్వర్గేమహీయతే
పత్యౌజీవతియాయోషిత్ ఉపవాసవ్రతంచరేత్
ఆయుఃసాహరతేభర్తుః నరకంచైవగచ్ఛతి
మృతేభర్తరిసాధ్వీస్త్రీ బ్రహ్మచర్యేవ్యవస్థితా
స్వర్గంగచ్ఛత్యపుత్రాపి యథాతేబ్రహ్మచారిణః (విష్ణుస్మృతి)

సూర్యునకు బాహ్యసంస్థతో సంబంధము కనుక తత్ప్ర ధానుడగు పురుషుడు బాహ్యసంస్థాసంచాలకు డనిరి. సౌమ్య

కర్మానుగతయగు స్త్రీ-ఉగ్రకర్మానుగ్గతపురుషుడు వివాహ సూత్రసీమితులు గానంతవర కర్థవృగలులు, అర్థేంద్రులు. "సప్తపురుషపురుషాత్మక చితాగ్నిమయప్రజాపతి, అగ్నీషో మాత్మకము. కనుక స్త్రీపురుషమూర్తియు,నగు తనసంవత్సర స్వరూపమునకు బూర్వ మేకాకిగనుండెను. రమణమునకు ద న్నసమర్థునిగ నెంచి తత్సాధనభూతమగు రెండవదానింగోరి, స్వయముగ దన్నుదాను పతి-పత్నీ రూపముల బరిణతుగా వించికొనెను. కనుకనే ప్రజాపతి యిచ్ఛచే బుట్టిన యతని యీరెండవరూప మర్ధవృగలము. (సగముకోసినభాగము).

"సవైనరేమే, తస్మాదేకాకీనరమతే, సద్వితీయమైచ్ఛత్ సహైతా వానాస, యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ సఇమమేవాత్మానంద్వేధాపా తయత్ తతఃపతిశ్చపత్నీచాభవతాం తస్మాదర్ధవృగలమివస్వఃఇతిహస్మా హయాజ్ఞ్యవల్క్యః (బృహదా)

ఈ శ్రుతితత్త్వార్థ మేమన :—సంవత్సరచంద్రోత్పత్తికి బూర్వము, బ్రహ్మనిశ్వసితనామ కాపౌరుషేయ వేదమూర్తి, సత్యాగ్నిఘన స్వయంభూ ప్రజాపతి సామ్రాజ్యమేకలదు. సృ ష్ట్యనుబంధములగు కామ,తపః,శ్రమభావములచే నీస్వాయం భువ వాగగ్నియందు క్షోభయుదయించెను. అందువలన నం దేకాంశ మబ్రూపమున బరిణతమయ్యెను- గోపథమున నీయ బ్భాగము బ్రహ్మస్వేదము నాబడినది. (గోప 1-1-1) ఇది యీబ్రహ్మ(వాగగ్నికి) రెండవరూపము. ఆరెండురూపముల సమన్వయముచే బ్రహ్మప్రజాపతి మున్నుచెప్పినట్లు సంవత్స

రరూపమున బరిణమించును. వీని యర్ధసంవత్సరము పురుషుడు. అర్ధసంవత్సరము స్త్రీ.

విషువద్వృత్తము గోళము, కాని దీనియర్ధభాగమే పురుషునిలోనికివచ్చును. తక్కినయర్ధము స్త్రీ కు త్పాదకము. ఇట్లు అర్ధాకాశాత్మక పురుషు డర్ధేంద్రుడు. 90, 90, చొప్పున విషువద్వృత్తమునందు నాల్గుపాదములు. కనుక తదవచ్ఛిన్నసంవత్సర ప్రజాపతి చతుష్పాదుడు. రెండుపాదములగ్ని ప్రధానములు. రెండుపాదములు సోమప్రధానములు. కనుక తత్థ్సానీయులగు పురుషుడు-స్త్రీయు వేర్వేరుగ ద్విపాదులే. కలసినగాని చతుష్పాద్బ్రహ్మయొక్క పూర్ణత యుదయింపదు. సంవత్సర ప్రజాపతిస్వయముగ యజ్ఞమూర్తి. పూర్ణాకాశమువల్ల నేయజ్ఞస్వరూపము సంపన్నమగును. కనుక యజ్ఞదీక్షితుడు గాగోరుచో మొదట పత్నీగ్రహణమున దనయర్ధాకాశపూరణము గావించుకొనవలయును. ఈవచనములను జూడుడు:—

(1) అయజ్ఞో వా ఏషయోఽపత్నీకః న ప్రజాః ప్రజాయేరన్ పత్న్యన్వాస్తే। యజ్ఞమేవాకః। ప్రజనాం ప్రజననాయ తై। బ్రా 3-3-1

(2) అథో అర్ధో వా ఏష ఆత్మన, యత్ పత్నీ। యజ్ఞస్యధృత్యా, అశిథిలభావాయ, సుప్రజసస్త్వావయం, సుపత్నీరుపసేదిమేత్యాహ। యజ్ఞమేవతన్మిథునీకరోతి తై। బ్రా 3-3-5

(3) జఘనార్ధో వా ఏష యజ్ఞస్యయత్పత్నీ (శత 1-3-1-12)

(4) అర్థోహవా ఏషఆత్మనో, యజ్జాయా, తస్మాద్యావజ్జాయయాంనవిందతే, నైవతావత్ప్రజాయతే- అసర్వోహితావద్భవతి, అథయదైవజాయాం విందతే అథప్రజాయతే-తర్హి హిసర్వోభవతి, సర్వఏతాంగతింగచ్ఛా నీతి, తస్మాజ్జాయామామంత్రయతే, (శత 5-2-1-10)

(5) మిథునాద్వా అధిప్రజాతిః, యోవైప్రజాయతే-సరాష్ట్రంభవతి, అరాష్ట్రంవైసభవతి, యోనప్రజాయతే. (శత 9-4-1-5)

(6) ఆత్మైవేదమగ్రఆసీత్ ఏకఏవ, సోకామయత జాయామేస్యాత్ అథ ప్రజాయేయ, అథవిత్తంమేస్యాత్-అథకర్మకుర్వీయఇతి, ఏతావాన్వై కామః, నేచ్ఛంశ్చ నాతోభూయో విందేత్, తస్మాదప్యేతర్హ్యేకాకీ కామయతే, జాయామేస్యాత్- అథప్రజాయేయ, అథవిత్తంమేస్యాత్, అథకర్మకుర్వీయ,ఇతి। సయావదప్యేతేషా మేకైకంనప్రాప్నోతి-అకృత్స్నఏవతావన్మన్యతే- తస్యఉకృత్స్నతా, (బృహ).

(7) తస్మాదయమాకాశః స్త్రియాపూర్యతే (బృహదా)

ఇంతకు :—ఏపురుషార్థసిద్ధికొరకు, ద్విజాతికి గర్భాధానాదిసంస్కారములు జరుగుచున్నవో, శాస్త్రోక్తయజ్ఞాది కర్మలను యథాసమయమున ననుగమింపవలసియున్నదో, ఆపురుషార్థ మీవివాహసంస్కారము గాకుండ నెన్నడు సిద్ధింపదు. ఆశ్రమవిజ్ఞాన ప్రకరణమందలి ఈశ్వరీయ విభూతిపరిచ్ఛేదమునంజెప్పినట్లు అధ్యాత్మము నాధిదైవతముతో నేకీభవింపజేయుటయే మానవుని పరమపురుషార్థము. యజ్ఞమువలననే యది సాధ్యముకాగలదు. 'పూర్ణమదః' కొరకు 'పూర్ణమిదం' నిష్పత్తి ప్రతిదశయందు గావలయును. ఇట్లువైయక్తిక పురుషార్థముకొరకు వివాహ మావశ్యకము.

ఇంకను:- దేవ-పితృఋణములు రెండితనిపైనున్నవి. వానిం దొలగించుకొనకుండ గల్యాణమాశించుట యసంభవము. వరుసగయజ్ఞము-ప్రజోత్పాదన,వలన నీఋణములు తొలగును. పత్నీసంబంధములేక యవిసాగవు. కనుక నీసంస్కారమత్యావశ్యకము. ఇతరదేశముల కట్లు కేవలమిది దృష్టఫలముకాక పరలోకసంబంధముకూడ కల్గియున్నందున స్మృత్యాదులందు జెప్పబడిన వివాహకర్మసంబంధ నియమములు తప్పకనుగమింపదగినవే.

ఆర్యప్రజాసర్వస్వమగు వర్ణప్రజల వర్ణధర్మమీ వివాహసంస్కారమునకు జెందిన జాతిగోత్రాదిమర్యాదల యనుగ్రహమున సురక్షిత మగుచున్నది. స్వ-స్వజాత్యనుగత శుద్ధరజోవీర్యసంభూత సంతానమే బల - వీర్యపరాక్రమవర్తి కాజాలి రాష్ట్రాభ్యుదహేతువగు నని వర్ణవిజ్ఞానమందే చెప్పబడినది. ఇక: నిట్టిసంస్కారమును:- సంసర్గదోషజనిత ప్రవాహపతితులై యొకలౌకికకర్మ యనుకొనిఅంతర్జాతీయవివాహ, వివాహవిచ్ఛేదాదులను సమర్థించు మహానుభావు లార్షసంస్కృతికి, సభ్యతకు బరమశత్రువు లనవచ్చును.

ఈసంస్కారవిషయమున కన్యా-వరుల, ఆయుజ్జాతి గోత్రాదులయొక్కయు, ఆయాప్రక్రియా, మంత్ర, పదార్థవిశేషములయొక్కయు నియంత్రణలకన్నిటికి నుపపత్తులన్నియు జెప్పబూనుకొన్నచో నీచోటుచాలదు. కనుక నీప్రకరణ

మిట సమాప్తముగా వింపుచు. శాస్త్రీయేతికర్తవ్యతలే గాక యిందు, మాంగళిక దేశాచార, కులాచారాదులుకూడ గ్రహింపవలసియుండునని 'గ్రామవచనంచకుర్యుః' (పా।గృసూ) "అథఖలూచ్చావచా,జనపదధర్మాః, గ్రామధర్మాశ్చ, తాన్ వివాహే ప్రతీయాత్, (ఆశ్వలాయనగృహ్యసూ) ఇత్యాది సూత్రములను జ్ఞాపకముసేయుచు, శాస్త్రీయసంస్కారస్వరూపమునకు హానివచ్చు రూఢివాదములు మాత్రము త్యాజ్యములేయని విన్నవించుకొను చున్నాము.

# 8 అగ్ని పరిగ్రహము

వివాహమునకుబిమ్మట నీసంస్కారము. ఆత్మయందగ్నినాధానముసేయుట దీనితాత్పర్యము. బ్రహ్మ-దైవభేదమున నాత్మసంస్థ రెండుభాగములు కదా! అగ్నియు పార్థివము-సౌరము నని రెండువిధములు. (1) పార్థివగాయత్రాగ్ని గార్హపత్యాగ్నియందురు. ఇదే భూతాగ్ని - స్మార్తాగ్నియు, ననబడును. (2) సౌరసావిత్రాగ్ని యాహవనీయాగ్ని-దీనినే దేవాగ్ని, శ్రౌతాగ్నియనియు నందురు. కనుకనే ఈయగ్నిపరిగ్రహలక్షణ - అగ్న్యాధానకర్మ, స్మార్తమనియు, శ్రౌతమనియు, రెండువిధము లగును. (1) ఆత్మయొక్క - బ్రహ్మభాగము, స్మార్తాగ్న్యాధానమువలనను, (2) దేవభాగము,

శ్రౌతాగ్న్యాధానమువలనను, సంస్కృతము లగును కనుక మొదటిది స్మార్తగ్రంథములందును, రెండవది శ్రౌతగ్రంథములందును వివృతములైయున్నవి. ఈరెంటికి భేదములను సూచించుటకు మొదటిదాని నావసథ్యాధానమనియు, రెండవదాని నగ్న్యాధానమనియు, వ్యవహరించిరి. మనకు ప్రస్తుత మావసథ్యాధానము విషయము.

ఇంటి కావసథ మని వైదికనామము. ఇంటియందుంచునది కనుకనిది యావసథ్యాగ్న్యాధానము. అనగా గృహ్యాగ్న్యాధానము. "ఆవసథ్యాధానందారకాలే".(పాగృ)అన్నట్లు వివాహమునకు బిదప వివాహాంగభూత చతుర్థీకర్మ కనంతర మీకర్మసేయబడును. 'దాయాద్యకాలేప కేషాం' అని దాయ విభాగానంతరమున గూడ నీకర్మసేయనగు నని కొందరమత మున్నది. ఏలయన నీకర్మతో ద్రవ్యసాపేక్షములగు పంచ మహాయజ్ఞము లాచరింపవలసి యున్నది. అందు భ్రాతృవర్గ ప్రతిబంధముండవచ్చును. కనుక నట్లు ఒకనియమమేర్పడి యుండును. కాని యీనాడు దీనికి ప్రాయశ్చిత్తముగావింప వలసియుండును.

శ్రౌతమగు చతుఃప్రాశ్యోదనకర్మకుగల యితికర్తవ్యతయే దీనికిజెల్లును. "చతుఃప్రాశ్యపచనవత్ సర్వం" అను వచనమున్నది. గృహ్యాగ్ని, భూతసంబంధముగలది. భూతమర్ధసంపద. గార్హస్థ్యకర్మసంచాలనకు ఆధానకర్త కీయర్ధ

సంపత్తి కావలయును. ఇక సర్ధశక్తికధిష్ఠాత వైశ్యుడు. కనుక బహుపశుసంపద్యుక్త వైశ్యగృహమునుండి తెచ్చి యావసథ్యాగ్న్యాధానము సేయనగునని "వైశ్యస్యబహుపశోర్గృహాదగ్నిమాహృత్య" అను సూత్రమువ్యక్తపరుచుచున్నది.

కొందరాచార్యులు "ఈకర్మచతుః ప్రాశ్యబహ్మౌదనమువలె జేయవలెననియున్నది కనుక శ్రౌతమందువలెనిందును. అరణిమంథనమున నగ్నిగ్రహణముసేయవచ్చును" అందురు. పారస్కరుడును "అరణిప్రదానమేకే" యని వికల్పముగా నంగీకరించెను.

బ్రహ్మభాగమునందు శ్రౌతాగ్న్యాధానయోగ్యతం గలిగించుట, యీకర్మకు ముఖ్యప్రయోజనము. పార్థివాగ్నియాధారమున దివ్యాగ్న్యాధానము జరుగును. ఆపార్థివాగ్ని సంగ్రహముకొరకు. అనగా:- అధ్యాత్మసంస్థయందు ప్రకృతిచే ప్రతిష్ఠితమైయున్న పార్థివాగ్నియం దతిశయాధానము గావించుటకు ఈసంస్కార మావశ్యకమైయున్నది.

యజ్ఞాధికారసమర్పకములు, అతిశయాధాయకములు నగునట్టియు,కర్ణవేధాది అగ్నిపరిగ్రహాంతములునగు నీయెనిమిదియువ్రతసంస్కారములువలనను మనుజులు తత్తద్వర్ణాధికృతకర్మలందు ప్రవృత్తులుకాగలరు. వీనిచే ఛందోమర్గా

దావికాసపూర్వక ద్విజత్వావిర్భావముకలుగును. ఈవచనముజూడుడు.

"ఉపనయనాదిభిః వ్రతచర్యాభిః అంతవ్రత్తైశ్చాష్టాభిః-వ్యచ్ఛేదః సమ్మితో బ్రాహ్మణః పరంపాత్రం దేవ-పితౄణాంభవతి, ఛందసాంపారంగచ్ఛతి, ఛందసామాయతనమ్. (హారీతః)

# 3 ధర్మశుద్ధిసంస్కారములు 5.

పూర్వోక్తషోడశసంస్కారములందు మొదటియెనిమిదిటిచే దోషమార్జనము, గడమయెనిమిదిటిచే నతిశయాధానము, కాగా, నాయతిశయరక్షణకీశుద్ధిసంస్కారము లత్యావశ్యకములు. ఇవిలేనిచో సహజముగనాక్రమించు నఘాదిదోషములవలన నాయతిశయలోపముకల్గును. ఈసంస్కారములకు (1) శరీరశుద్ధి (2) ద్రవ్యశుద్ధి (3) ఆఘశుద్ధి (4) మనఃశుద్ధి (5) భావశుద్ధి యని పేరులుగలవు.

తమోగుణప్రధానమగు పాంచభౌతికశరీర మొకమలకోశము. స్వకీయపావనశక్తిచే మలములను పావనముసేయు నాత్మతో నీమలముల కంతర్యామసంబంధ మున్నంతవర కివి యాత్మవిత్తము లగుచు నేహానియుజేయవు. కాని, ఇవి యాత్మమండలసీమాబాహ్యము లగునపు డాత్మకు బ్రవర్గ్యములై-ఆత్మయొక్క పావకశక్తికి వెలియై దోషప్రవర్తకము లగును. అప్పుడు బహిర్యామసంబంధమున శరీరమందుండు నీమలముల

నాత్మదూతయగు మనస్సు పర మాసవ్యాముస బయటికి గొట్టి వేయనెంచును. అట్టి మానసగ్లాని యుదయింపకపూర్వమే యిట్టిమలములను ప్రతిదినము నియతసమయమున బ్రయత్న పూర్వకముగ దొలగించుట కర్తవ్యమైయున్నది. యథాసమయమున లేచి చేయు మలమూత్రపరిత్యాగదంతధావనస్నానాదికర్మలే మొదటిదగు శరీరశుద్ధి సంస్కారము. "కృత్త కేశనఖశ్మశ్రుః శాంతో దాంతః శుచివ్రతః". ఇటనొకటిమరువరాదు. శుద్ధికర్మయందు, దివ్యభావయుక్త పదార్థములు సాధనములుగ గైకొన వలయుంగాని, తళతళబెళుకులం జేకూర్చును గదా యనువాసతో నాసురప్రాణభావయుక్త పదార్థముల నెన్నడు వాడుక సేయరాదు. అందువలన నాత్మదేవతయొక్క దివ్యశక్తి నిర్వీర్యమైపోవును.

ఇక శరీరోపయోగ్యములగు ద్రవ్యముల శుద్ధియావశ్యకము. 'గుణదోషమయంసర్వం' అన్నట్లు భౌతికద్రవ్యములెల్ల దోషయుక్తములునై యున్నవి. ప్రాకృతికము-ఆగంతుకము నని దోషము రెండువిధములు. (1) సత్త్వరజస్తమోగుణభేదముచే నన్నవస్త్రపాత్రాది ద్రవ్యభేదముండును. తత్తద్వర్ణీయులకు, దత్తద్గుణక ప్రాకృతిక ద్రవ్యములే యుపకారకములగును గాని, ప్రకృతివిరుద్ధద్రవ్యము లగుచో బ్రకృతి నస్వస్థముగావించును కనుక నాయావివేకమెరింగి ప్రవర్తించుటమంచిది. (2) ఇకవీనియందైన నాగంతుకదోషము లుండ

వచ్చును. కనుకగృహాసనాన్నవస్త్రశయ్యాదుల శుద్ధిమాచు కొని యుపయోగింపవలయును. శరీర-ద్రవ్యశుద్ధుల ప్రభావము పరంపరగనాత్మకుజెందును. అయినను, వీనికి ప్రధానముగ శరీరముతోడనే సంబంధము కనుక నీరెంటిని స్థూలశరీర సంస్కారకము లందుము.

మూడువది అఘశుద్ధిసంస్కారము. జననమరణములకు జెందినయాశౌచముచే నాత్మవీర్యమం దధర్మ్యాసూత్రద్వారమున నశుచిలక్షణాశౌచదోషము సంక్రమించును. దీనిని 'నఘ' మందురు. శుక్రగతసాపిండ్యభావముచే నాయదృష్టాధర్మ్యా సూత్రముద్వారా ఆశౌచసంబంధిదోషము కుటుంబమంతటికిజెందును. (ఈవిషయమువివరముగమరొకచో జూచుకొందము) ఈదోషమున కాత్మతో ఘనిష్ఠసంబంధము కలదు కనుక దీనిచే నాత్మమలినమగును. దీనిశుద్ధియే, అఘశుద్ధి,యందురు. 'కాలయాపన మీశుద్ధికి ముఖ్యసాధనము. వర్ణానుసార మది 10, 12, ఇట్లు నియతదినముల యనంతర మీయశుచిభావము స్వయముగ దొలగిపోవును. కనుక నిది 'కాలయాప్య' దోషమందురు. ఇదియున్నంతకాలము, దేవపూజ-సంధ్యా-తర్పణ, వివాహ-ఉపనయనాది దివ్యకర్మలు సేయరాదు. శుద్ధ్యనంతరమే యట్టిగృహస్థుడు వ్యవహార్యుడు.

నాల్గవది,పునఃశుద్ధిసంస్కారము :—పైనిజెప్పిన యఘదోషమునకు ప్రకృతివలన ప్రాప్తించు జననమరణావసరములే

హేతువులుకాని మనము కారణులముకాము. ఈయేనోదోష మునందు మనకు హేతుత్వమున్నది. ఎట్లన:- రజస్వలాస్త్రీ స్పర్శజనితదోష మేనస్సు. ఈదోషముగలవా డేనస్వి యని శ్రుతిచెప్పును. అఘదోషి నశుచి-అపవిత్ర శబ్దములచే జెప్పుదురు. ఏనోదోషిని పాపి-ప్రాయశ్చిత్తి యందురు. అఘ మాత్మవీర్యము నావృతముమాత్రము గావించును. ఏనోదోష మాత్మవీర్యమును పతనమునొందజేయును. అఘ మశుచికరము. ఏనస్సుపాతకము, కర్మయోగనిర్వచనమునందు కర్మవర్గీకరణప్రకరణమునం దీశబ్దముల తాత్త్వికస్వరూప మారయవచ్చును.

ప్రతిగృహస్థునియింటియందును (1) చుల్లీ(పొయ్యి) (2) పేషణీ(సన్నికల్లు రుబ్బురోలు) (3) ఉపస్కరము (చీపురు-చేట) (4) కండని(రోలు-రోకలి) (5) ఉదకుంభము (జలపాత్ర-నీటితొట్టె) వీనికడ స్థూసూక్ష్మప్రాణిహింస కవకాశమున్నది. ఈపాపాతిశయముతో నాత్మవీర్యమునకు సంబంధ మనివార్యము. ఏతన్నివారకముగ పంచమహాయజ్ఞవిధానమున్నది. సంధ్యాదికమువలె నివియు నిత్యములని యీ యాశ్వలాయనవచనము చెప్పును.

"మాసికంపార్వణం ప్రోక్తం అశక్తానాంతువార్షికం,
మహాయజ్ఞాస్తునిత్యాస్యు : సంధ్యావద్వాగ్నిహోత్రవత్"

ఆపంచమహాయజ్ఞములకు, (1) భూతయజ్ఞ (2) మను

ష్యయజ్ఞ (3), పితృయజ్ఞ (4) దేవయజ్ఞ (5) బ్రహ్మయజ్ఞ ములని పేరులు.

(1) "అగ్నిముఖా వై దేవాః" 'అగ్నిః సర్వా దేవతాః' ఇత్యాదులచే దేవతులకు ముఖమై సర్వదేవతామూర్తియగు నగ్నిప్రధానముగ గలది పొయ్యి. అగ్నిజ్వాలనమున నగు జీవహింసవలన నధ్యాత్మసంస్థయందు నగ్నిప్రధానమగు దేవభాగమునకు మాలిన్యమువచ్చును. తద్దోషనివృత్తికై దేవయజ్ఞముగావలయును. అన్నపరిపాకముగావించునట్టియు, వైశ్వానరనామమున బ్రసిద్ధమగునట్టియు, నగ్నియందు భోజనమునకుముందు బ్రహ్మ, ప్రజాపతి, గృహ్యా, కశ్యప, అనుమతులకు స్వాహాపూర్వకముగ నైదాహుతులీయవలయును.

(2) భూతాత్మకమగు నన్నసంబంధము కలదగుటచే పేషణి భూతప్రధానము. అందలిజీవహింసచే నధ్యాత్మభూతభాగ మేనస్వి యగును. తద్దోషపరిహారమునకై బలిరూప భూతయజ్ఞవిధాన మేర్పడినది. భూతయజ్ఞమునకు పర్జన్య-జల - పృథివి - ధాతా-విధాతా, వాయు, బ్రహ్మ-అంతరిక్ష-సూర్య-విశ్వేదేవ-ఉషా-భూతానాంపతి. యనునీ యభిమాని దేవతల పండ్రెండుగుర సంబంధముకలదు. కనుక యథాస్థానమునందు నమస్కారమంత్రయుక్తముగ పండ్రెండుబలు లర్పింపవలసిన విధానమున్నది,

(3) స్వచ్ఛగృహముమనుష్యున కావాసయోగ్యము గదా! స్వచ్ఛతంగూర్చునది యుపస్కరము. దానిచేనగుజీవహింస మనుష్యత్వమూల 'మను' ప్రాణమును మలినముగావించును. అందువలన మనువుమనుపత్ని (శ్రద్ధ)యు, ఏనస్వులగుదురు. తద్దోషపరిహారమునకై మనుష్యయజ్ఞవిధి ఎట్లన:- అతిథికన్నముబెట్టిసత్కరించుట, ప్రతిదినముగృహపద్ధతిననుసరించి (తక్కువలోతక్కువ) షోడశగ్రాసపరిమితాన్నము బ్రాహ్మణునకుబెట్టుట. ఇందువలన నన్నగ్రహీత 'మను'భాగము తృప్తము కాగా నాదోషముపోవును.

(4) ఉదకుంభమునకు బితృప్రాణముతో ఘనిష్ఠసంబంధముకలదు. ఎట్లన:- జలము,పారమేష్ఠ్యప్రాణమునకు జెందినదగుటచే సౌమ్యముగదా! పితృప్రాణమునుసౌమ్యమే "ఆయంతునఃపితరఃసోమ్యాసః". ఈజలకర్మయందగు హింసవలన నాధ్యాత్మిక జలశుక్రగత పితృప్రాణ మేనస్వియగును. దాని నివృత్తికొరకు బ్రాచీనావీతియై స్వధాపూర్వకముగ బితరులకు బలినొసగుటయే పితృయజ్ఞము.

(5) కండని, బ్రహ్మభాగమునకుజెందినది. సమిదాధానపూర్వకముగనే బ్రహ్మచర్యానుగమనము గావింపబడుచున్నది. "శేషేవనేషుమాతృషు సంత్వామర్త్తాసఇంధతే" ఇత్యాద్యనుసారము కాష్ఠమందు బ్రసుప్తమగునగ్ని, వేదమూర్తియగు సౌరాగ్నియొక్క ప్రవర్గ్యభాగమే. మర్త్యుడగుమానవుడేనాడు దీనింబ్రజ్వలింపజేయునో అప్పుడే 'ఆది

ద్దేవేషురాజసి' యన్నట్లు దేవలోకము(సూర్యలోకము)నొం దును. బ్రహ్మయగు వేదమునకు, సౌరాగ్నియే ప్రతిష్ఠ కావు ప్రసుప్రాగ్ని యీబ్రహ్మాగ్నిప్రవర్గ్యభాగము. కనుక నిందు జరుగు ప్రాణిహింసచే నధ్యాత్మసంస్థయందలి బ్రహ్మాగ్ని యే నస్వి యగును. ఆదోషముపోవుటకు నియమపూర్వక వేదా ధ్యయనరూప బ్రహ్మయజ్ఞము విధింపబడినది.

ఇంతేకాక మన ముపయోగించుపదార్థములవలన సంభ వించు స్థూల - సూక్ష్మ - సూక్ష్మతర - సూక్ష్మతమ - ప్రాణిహింసచే శరీరమందలి సు స్థూ, క్ష్మ కీ టా ణు వు లు కూడ నిర్బలములగును. అందువలన క్షుత్క్షామాదిభయంకర రోగప్రాప్తియగును. కనుక వేరుగా, నీకీటాణుతృప్తికిగూడ నొకయుపాయ ముండవలయును. మరియు శరీరకీటాణువులకు బలముచేకూరవలయును. ఇంకను: పార్థివప్రాణులనుండియు, అంతరిక్షమునుండు యక్ష - సర్ప - దైత్య - ప్రేత - పిశాచ - ప్రాణాదులనుండియు, మనకు శాంతి లభింపవల యును. అన్నిటి యనుగ్రహముగావలయునుగదా! ఇందు కొకకొన్నికర్మలను గావింపవలయును. వీనిని పితృయజ్ఞము వం దంతర్భావము సేయవచ్చును. "యక్ష్మైతత్తేనిర్ణేజనమ్ ఇదంయక్ష్మణేనమమ" యని వాయవ్యదిక్కునందు యక్ష్మ ప్రవర్తక కీటానునిర్ణేజన జలము విడువబడును. కీటాణుబల ప్రదానముకొరకు గోగ్రాస మీయబడుచున్నది. భిక్షుక- శ్వాన-గాక పిపీలికాదులకు-యథాశక్తిగ నన్నప్రదానము

గావించి ప్రాణివర్గానుగ్రహము సంపాదింపబడుచున్నది. ఈవచనము జూడుడు:—

"పిపీలికా కీటపతంగకాద్యాః బుభుక్షితాః కర్మనిబంధబద్ధాః తృప్త్యర్థమన్నం, హిమయాప్రదత్తం తేషామిదం తేముదితా భవన్తు.

వర్తమానశిక్షితసమాజమీయాదేశములన్నియు నిరర్థకములనుకొనుగాక! ఆస్తికుడగు నొకభారతీయుని కీయాదేశములు భావనాజగత్తునకు జెందినవై (నచాభావయతశ్శాంతిః) పరమోపాదేయములే యగును. శ్రద్ధాపూర్వకముగ జేయబడిన కర్మ యేయతిశయముం బుట్టింపదు? మనపూర్వ–ప్రస్తుతదశలంబట్టిచూచిన యీప్రశ్నకుత్తరములభించును. ఆనాటిమనయాత్మశక్తియేది? ఆతేజము బలపౌరుషములు, స్వస్థత–వీర్యము మొదలగునవేమైనవి? ఈయశాంతికి వాస్తవికకారణములేమి? ఈ భగవద్వచనమును స్మరింపుడు:—

> "యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
> ససిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిం"

ఏమనుకొన్నను, ఏమైనను, ఈవచనములనవలోకింపుడు.

"పంచైవమహాయజ్ఞాః తాన్యేవమహాసత్రాణి-భూతయజ్ఞో మనుష్యయజ్ఞః-పితృయజ్ఞో-దేవయజ్ఞః-బ్రహ్మయజ్ఞ ఇతి అహరహర్భూతేభ్యః బలింహరేత్ - తథైవంభూతయజ్ఞంసమాప్నోతి అహరహర్దద్యాదోదపాత్రాత్ తథైతంమనుష్యయజ్ఞం సమాప్నోతి అహరహః స్వధాకుర్యాదోదపాత్రాత్ తథైతంపితృయజ్ఞం సమాప్నోతి అహరహః స్వాహాకుర్యాదాకాష్ఠాదాకాష్ఠాత్, తథైతందేవయజ్ఞం సమాప్నోతి-అథబ్రహ్మయజ్ఞః :—స్వాధ్యాయో

స్త్రైబ్రహ్మయజ్ఞః-తస్యవాఏతస్య బ్రహ్మయజ్ఞస్య వాగేవజుహూః, మన ఉపభృత్-చక్షుర్ధ్రువా-మేధాస్రువః, సత్యమవభృథః, స్వర్గోలోకోఉదయనమ్। యావంతంహవా ఇమాం పృథివీంవిత్తేన పూర్ణాందదన్‌లోకంజయతి। త్రిస్తావంతంజయతి, భూయాంసం, చాక్షయ్యం, యఏవంవిద్వానహరహః స్వాధ్యాయమధీతే తస్మాత్స్వాధ్యాయోఽధ్యేతవ్యః. (శత॥)

"పంచసూనాగృహస్థస్య ఛుల్లీపేషణ్యుపస్కరః
కండనీచోదకుంభశ్చ బధ్యతేయాస్తువాహయన్

తాసాంక్రమేణసర్వాసాం, నిష్కృత్యర్థంమహర్షిభిః
పంచక్లప్తాః మహాయజ్ఞాః ప్రత్యహంగృహమేధినాం,

అధ్యాపనంబ్రహ్మయజ్ఞః, పితృయజ్ఞస్తుతర్పణం
హోమోదైవః, బలిర్భౌతం, నృయజ్ఞోతిథిపూజనమ్.

(1) దేవయజ్ఞముచే చుల్లీజనితైనోదోషము, (2) భూతయజ్ఞముచే పేషణీజనితైనోదోషము (3) మనుష్యయజ్ఞముచే ఉపస్కరజనితైనోదోషము (4) పితృయజ్ఞముచే ఉదకుంభజనితైనోదోషము (5) బ్రహ్మయజ్ఞముచే కండనీజనితైనోదోషము, నివృత్తినొందునని ఫలితార్థము.

మరియు:—— మనుజుడు జననకాలమునందు ఋషిదేవపితృఋణములంగొని సంసారయాత్రాపథికు డగుచున్నాడు. ఇతనికి (1) ఋషిప్రాణమునుండి జ్ఞానమాత్రయు, (2) పితృప్రాణమునుండి ప్రజామాత్రయు (3) దేవప్రాణమునుండి యజ్ఞమాత్రయు లభించుచున్నది. ఈమూంఋణములు తీర్పకున్నంతవరకు నితడేనస్వియై ముక్తిపథానుగామి కాజాలడు కనుక వీనిందీర్చుకొనుటకు (1) అధ్యాపనము (2)

శ్రాద్ధము- ప్రజోత్పాదన (3) యజ్ఞము, అను మూండుకర్మ లను జేయవలయును.

ఇంతేకాక మనుష్యఋణ మను నాల్గవఋణమొకటి యుండును. ఎట్లన:— మనజీవితకాలమున మనమెన్నియో భోగ్యసామగ్రు లుపయోగించుకొందుము. మనముపుట్టకున్న తమభోగింపకున్న-నవిమరొకని కుపకారకములగును. మరియు మనము మానవసమాజమునందు, జీవితము గడపుదుము. దానివలన మన కెంతోసాయములభించుచున్నది. లౌకిక - పారలౌకిక కర్మలందువలన సాగునుగదా! ఈసాయమునకు మనము సమాజమునకు ఋణపడియుందుము, అదితీరుటకు మనముకూడ సామాజికకార్యములందు పాల్గొనవలయును. అసమర్థుల కన్నదానాదిసేవ లొనర్పవలయును. దీని సాన్నృశంసధర్మ మందురు. ఈవచనములును జూడుడు.

"ఋణంహవైజాయతేయోస్తి। సజాయమానఏవదేవేభ్యః ఋషిభ్యః పితృభ్యః, మనుష్యేభ్యః। సయదేవయజేత। తేనదేవేభ్యః ఋణంజాయతే। యద్దేభ్యః ఏతత్కరోతి। యదేనాన్ యజతే। యదేభ్యోజుహోతి। అధ యదేనాన్వబ్రువీత తేనర్షిభ్యఃఋణంజాయతే తద్ధ్యేభ్యః ఏతత్కరోతి, ఋషీణాంనిధి గోపఇతిహ్యనూచానమాహుః అధయదేవప్రజామిచ్ఛేత తేన పితృభ్యఃఋణంజాయతే యద్భ్యేభ్య ఏతత్కరోతి, యదేషాంసంతతావ్యవచ్ఛిన్నాప్రజాభవతి, అధయదేవవాసయేత, తేనమనుష్యేభ్యః ఋణఃజాయతే తద్భ్యేభ్యః ఏతత్కరోతియదేనాన్ వాసయతే, యదేభ్యోశనందదాతి సయఏతానిసర్వాణికరోతి, సకృతకర్మా-తస్యసర్వమాప్తం సర్వంజితం శత.

ఈవచనముజూడుడు:—

"ద్వివిధఏవసంస్కారోభవతి బ్రాహ్మో - దైవశ్చ-గర్భాధానాది స్నానాంతోబ్రాహ్మః పాకయజ్ఞహవిర్యజ్ఞ సౌమ్యాశ్చేతేదైవః బ్రాహ్మ సంస్కారసంస్కృతః ఋషీణాం సమానతాం సాయుజ్యతాంగచ్ఛతి-దైవీ నోత్తరేణసంస్కారేణాను సంస్కృతః, దేవాసమానతాం, సాయుజ్యతాంగ చ్ఛతి. (హారీతః)

ఇతి: శ్రీ... ... ... ... ... ...
... ... ... ... ... ...

సంస్కారవిజ్ఞానమ్

గ్రంథము,

సంపూర్ణము.

ఓమ్ తత్సత్

—.—

శ్రీ భారతీ ప్రెస్, రాజోలు.